# భారతి

సచిత్ర మాసపత్రిక

సంపాదకుడు

కా. నాగేశ్వరరావు

సంపుటము ౧

భాగము

ఆంధ్రపత్రికా కార్యాలయము-మద్రాసు

౧౯౨౪

# విషయానుక్రమణిక

## చిత్రపటములు







— కాటుకకంటి నీరు చనుకట్టుపయిం బడ నేల యేడ్చెదో, కైటభదైత్యమర్దనుని గాదిలికోడల! యోమదంబ! యో
హాటకగర్భురాణి! నిను నాకటికిం గొనిపోయి యల్ల కర్ణాట కిరాట కీచకుల కమ్మ, త్రిశుద్ధిగ నమ్ము భారతీ!

చిత్రకారులు: శ్రీయుత యస్. కే. వేణుగోపాల్ గారు.




చెన్నపట్టణము, సెప్టెంబరు ౧౯౨౪

సంపుటము ౧. రక్తాక్షి సంవత్సరము భాద్రపదమాసము సంఖ్య ౯.


# ఆంధ్ర కవిత్వ చరిత్రము


భోగరాజు నారాయణమూర్తి గారు


## V

### ఆంధ్రలాక్షణికులు-కవిత్వతత్త్వము

కవిత్వచరిత్రమును వ్రాయుచోఁ గవుల కవిత్వతత్త్వములతోఁ బాటు లాక్షణికుల కావ్యసిద్ధాంతములం గూర్చియుఁ బ్రసంగించుట యత్యావశ్యకము. మన కవితాప్రపంచమున నీలాక్షణికులు పెక్కుశతాబ్దముల నుండియు నాంధ్రరాజులతోడను నాంధ్రకవిరాజులతోడను గవితోద్ధరణభారము వహించి, స్వేచ్ఛావిహారమును గావించుచుండిన కవులను దమశాసనములకు లోఁబరచుకొనిన వారు. లాక్షణికులశాసనములనే మనము లక్షణగ్రంథము లనుచున్నాము. ఈలక్షణగ్రంథములలోఁ గొన్ని కేవలము వ్యాకరణములు. కొన్ని ఛందోగ్రంథములు. కొన్ని యలంకారగ్రంథములు. మఱికొన్ని మిశ్రగ్రంథములు. మొత్తముపై లక్షణగ్రంథము లన్నియు ఛందోవ్యాకరణాలంకార బోధక

ములు. కవులకావ్యములలో నుత్తమమధ్యమాధమనిరూపణమున కీలక్షణగ్రంథములే యాధారములై యున్నవి.

కవులపై గౌరవభావనములు

కావ్యశాస్త్రనిర్ణయమే కాక, కవులంగూర్చియుఁ, గవులకుఁగల మహాత్త్వములను గూర్చియుఁ గవులలోఁ గలతరగతులనుగూర్చి యుఁగూడ లాక్షణికులు తమతమ గ్రంథముల యందు ముచ్చటించుచు వచ్చిరి. విన్నకోట పెద్దన్న కవులపైఁ దనకుఁగల గౌరవభావమును దన కావ్యాలంకారచూడామణియందు నిట్లు వెల్లడించెను:

"వ. వినుతయశంబునం గలుగు విశ్రుతనాకనివాస మయ్యశో, జననము శ్రవ్యకావ్యములసంగతి నొప్పగు శ్రవ్యకావ్యముల్, దనరుఁగవిప్రభావమునఁ దత్కవిసమ్మతి లేనిరాజులే, ఘన విహరింప గవ్విభులు వోయిన బాడ లెఱుంగఁబోలు నే?"

సుకవి మాహాత్మ్యమునుగూర్చి యింత కన్నను విపులముగ నప్పకవి తనలక్షణగ్రంథమునందు వివరించుచున్నాఁడు.

"గీ. నాకుజాతునిచే రఘునాయకుండు,
వ్యాసుచేఁ బాండవులుఁ గాళిదాసుచేత
భోజుఁడుఁ బ్రసిద్ధి నొందిరి భువిని దమగు
నడక లెల్లను గథలుగా నుతులుకతన.

క. ఇమ్మహిని మునులచే పల
సె మ్మనుగావ్యములు "నానృషిః కురుతే కా
వ్య"మ్మను వచనార్థంబుల్
సమ్మతిఁ గవివేళ సుకవిజనులే మౌనుల్."

మ. జననాథాగ్రణి యాత్మరాజ్యమున నిచ్చల్ పూజ్యుఁ డాసీమఁ దా, నిసఁ దాగన్వయుఁ జేయఁ దన్నికడలన్ శ్రేష్ఠుండు విద్వాంసుఁడా, తనికన్నం గవిమేటియా 'సుకవితా యద్యస్తి రాజ్యేన కిం', మ్మను వాక్యంబు నిజంబు దీనిఁ గన్ని కావ్యంబుల్ రచింపం దగున్.

ఆంధ్రలాక్షణికులలోఁ దానే ప్రథమ లాక్షణికుఁడనని చెప్పుకొనినవాఁడును మహాకవియు నగు కేతన గుణదోషనిర్ణయభారమును గవులయందే యుంచుచు సుకవుల కారుణ్యమునే యభిలషించుచున్నాఁడు.

"క. నేరములు కాళిదాస మ
యూరాదులకైనఁ గలుగ నొరులకు లేవే
సారమతులైన సుకవుల
కారుణ్యము కలిమి నేర్పు కవిజనములకున్."

కాని యహోబలుఁడుమాత్ర మిట్లు చెప్ప లేదు. "దోషోఽపిగుణతాం యాతి పండితానా మనుగ్రహాత్" అని యొకచోటను,

"ఉ. తప్పనిచోటఁ దప్పనుచుఁ దప్పనియారస మొంద బోకుఁడీ, తప్పినఁ దప్పుగల్గినను దప్పని సత్కృప మీఱ దిద్దుఁడీ, యొప్పు లొకింతగల్గ మది నుబ్బుఁడు! పండితులార! మీకు నేఁ, దప్పనిశిష్యుఁడన్ గురులఁ దప్పనె శిష్యు నకీర్తి కీర్తియున్."

అని మఱియొకచోటను జెప్పి పండితానుగ్రహమునే యెక్కుడుగా నభిలషించుచున్నాఁడు. లక్షణగ్రంథసందోహమున మహాలక్షణలక్షితమగు కావ్యాలంకారసంగ్రహమును రచించిన సుప్రసిద్ధ లాక్షణికుఁడగు మూర్తికవి తాను లక్షణగ్రంథమును వ్రాయఁ బూనినపుడు

"గీ. ..............అఖిలముని వ
చోనుపమశక్తి భృతపురాణార్థవితతు
లనుఁగుఁ దెనుఁ గనుభవ్యదివ్యాంజనమునఁ
గనుఁగొనఁగఁ జేయు నంధ్రసత్కవులఁ దలఁచి."

అని కవులను స్మరించుచు, వారిమహిమాతిశయములయెడఁ దనకుఁగల గౌరవభావ

మును బ్రకటించెను. ఇట్లే మనయాంధ్రలాక్షణికులెల్లరును గవులపైఁ దమకుఁగల గౌరవాదరణములను దమతమలక్షణగ్రంథములయందుఁ బ్రకటించుచుండుటయేకాక, కొం

### సత్కవిలక్షణనిరూపణము

దఱు 'సత్కవి' యనం దగినవాని కవశ్యముగ నుండఁదగిన లక్షణము లిట్టివని విధించుచున్నారు.

విన్నకోటి-పెద్దన్న :

"క. సమయజ్ఞుఁడు సమచిత్తుఁడు
సమశబ్దార్థప్రయోగచతురుఁడు భావ
క్రమరసపోషణరచనా
కమనీయప్రతిభుఁ డిల సుకవియనఁ బరఁగున్."

అప్పకవి :

"క. ధరణీసురుఁడు ప్రశాంతుఁడు
గురుభక్తుఁడు శుచియుఁ గల్పకుఁడు పూర్వకవీ
శ్వరవాక్ప్రయోగదక్షుఁడు
కరుణామతి యెవ్వఁ డతఁడు కవియనఁ బరఁగున్."

అహోబలపండితుఁడు :

"వ్యా. కవయతే వర్ణయతీతి కవిః సచ,
శ్లో. సత్కులీన శ్శుచి ర్దక్ష శ్ఛందోవ్యాకరణాదివిత్,
ప్రశాంత స్సుభగాకారో దైవజ్ఞశ్చ కవి ర్భవేత్.
ఇత్యాదివచనోక్తగుణసంపన్నః"

సత్కవిలక్షణ నిరూపణమును బైమువ్వురు లాక్షణికులును మూఁడువిధములుగాఁ జెప్పుచున్నారు. సమయజ్ఞతయు, సమచిత్తతయు, సమశబ్దార్థ ప్రయోగచతురతయు, భావక్రమరసపోషణరచనాకమనీయ ప్రతిభయు ననుపెద్దనార్యోక్తలక్షణములన్నియు సుకవుల కత్యావశ్యకము లనుటలో నధిక్షేపముండదు. అంతియేకాక యీలక్షణములలో నెయ్యది లేకున్నను సుకవిపదార్హుఁడు కానేరఁడనియుఁ జెప్పవచ్చును. ఇంక నప్పకవి విధించిన లక్షణములలో ధరణీసురత్వము ప్రధానమైయున్నది. అనఁగా సుకవియగువాఁడు బ్రాహ్మణుఁడే యైయుండవలయునని యప్పకవి నిర్ణయము. ఒకానొక మహనీయునియందుమహాకవిలక్షణము లెంతవిపులముగఁ బ్రకాశించుచుండినను బ్రాహ్మణేతరుఁ డైనచో వానిని గవియనుట యప్పకవి యొప్పుకొనఁడు. ఒప్పుకొనఁడని మనమూహించుటయే కాదు. అతఁడే శ్లోకసందర్భమునఁ దన యభిప్రాయము నిట్లు స్పష్టపఱచుచున్నాఁడు.

"గీ. తపము గల్గిన శయ్యల నొప్పియున్న
నంశూద్రునికావ్యంబు గ్రాహ్యంబుగాదు
పాయసంబైన సంస్కారగపక్వమైనఁ
గాక స్పృష్టంబు హవ్యంబుగానియట్లు."

ఇది హర్షింపఁదగినవాదము గాదు. కావ్యరచన యీశ్వరారాధనమునకొక సాధనమగుచో, పూజ్యులైన విదురాదుల సత్కృతుల మన్నించిన పరమేశ్వరున కిట్టి సంకల్ప మెన్నఁడు నుండదు. ఎలకూచిబాలసరస్వతి మొదలగు కొందఱు లాక్షణికులు వ్రాసిన 'ఆంధ్రశబ్దచింతామణి' వ్యాఖ్యానములలోఁ గానవచ్చుచుండిన 'న శూద్రస్య వచో గ్రాహ్యం శునోచ్ఛిష్టం హవి ర్యథా' అనువాక్యము పైపద్యమునకు మాతృకమై యుండవలయును. అహోబలుఁడు వాడిన 'సత్కులీన శ్శుచిర్దక్ష' యను శ్లోకములో సత్కులీనశబ్దమునకు నేజాతియైనను గౌరవార్హమగు నుత్తమవంశమునఁ బుట్టినవాఁ

డనియే యర్థముగాని కేవలము బ్రాహ్మణుఁడే యనుభావార్థము లేదుకదా! కాని యందలి సుభగాకారత్వము మాత్రము అప్పకవి చెప్పిన ధరణీసురత్వము వంటిదే. కవియగువాఁడు సుందరాకారుఁడై యుండవలయునని విధించుటకంటె నన్యాయము సాహసము నుండదు. అవయవములయందుఁగాని యవయవ సౌందర్యమునందుఁగాని విధివశమున నించుకలోప మున్నవాఁ డెట్టికవిత్వప్రతిభావంతుఁడైనను మనలాక్షణికులు వానిని గవిగాఁ బరిగణింపరుకాఁబోలు! ఇట్టి సందర్భమున నాంగ్ల కవితా ప్రపంచమున సుప్రసిద్ధపురుషుండగు 'అలగ్జాండరుపో' పను మహాకవి యెంతటి యదృష్టవంతుఁడు! ఆంగ్లలాక్షణికులు సైతము సుభగాకారత్వము సుకవిలక్షణములలో నొకటిగా విధించియుండినయెడలఁ బాపము వికారాకారుఁడగు నాతఁ డెంతటి హీనస్థానమునఁ జేర్పఁబడియుండునో యెవరు చెప్పఁగలరు?

ధరణీసురత్వ సుభగాకారత్వము లప్రయోజనము లగుటయే గాక యప్పకవ్యహోబలులు చేర్కొనిన తక్కిన లక్షణములు సర్వజన సామాన్యలక్షణములే కాని, కేవలము కవులకే యుండవలసిన లక్షణములని నిర్ణయించుట కవకాశము లేదు. ప్రశాంతత గురుభక్తి శుచిత్వము కరుణామతి మొదలగు నీగుణములు యోగ్యులగువారి కందఱకు నావశ్యకములే. కవులుకానివారి కివ్వి యనవసరములని చెప్పఁజాలము. ఈలక్షణములుఁ గూడ నున్న యెడలఁ గవికిని వానికావ్యమునకును మఱింత వన్నెకలుగునని చెప్పుటలో నభ్యంతర ముండదు. కాని పెద్దనార్యుఁడు వివరించిన లక్షణములుమాత్రము కవులుకాని వారి కనవసరములు సుకవులగువారి కత్యావశ్యకములు. సమయజ్ఞతగాని సమశబ్దార్థ ప్రయోగచతురతగాని, భావక్రమరసపోషణరచనాప్రతిభగాని యప్పకవ్యహోబల పండితప్రోక్త లక్షణములవలె సామాన్యలక్షణములు గావు. యోగ్యులగు సామాన్యపురుషులయం దివియుండ నవసరములేనివి. సుకవులగువారియం దుండక తప్పనివి.

కవులు-పాండిత్యములు

ఇంతియకాక కవుల కుండవలసిన పాండిత్యప్రతిభాతిశయములనుగూర్చి పెద్దన తన పద్యమునందు నప్పకవ్యహోబలులువలె విపులముగను స్పష్టముగను జేర్కొనియుండ లేదు.

"క. శ్రుతిశాస్త్రేంగపురాణ
ప్రతతియు నితిహాసకావ్యభరతాగమముల్
స్మృతిపంగీతరతికళా
గతుల నలంకృతుల దెలుఁగఁగావలెఁ గవికిన్."

అని యప్పకవియును, కవి ఛందోవ్యాకరణాది విదుఁడును దైవజ్ఞుఁడు నై యుండవలయునని యహోబలుడును నీవిషయములోఁ దమ యభిప్రాయములను స్పష్టముగావించిరి. పెద్దన యీప్రసంగమును దలపెట్టక పోవుటయేకాక, యీశ్రుతిశాస్త్రాంగపురాణేతిహాస భరతాగమాదులన్నియుఁ గేవలము కావ్యోక్తికిమాత్రమే సాధనములుగాని ప్రధానశక్తికిఁ గారణములు గానేరవనియు, నట్టిశక్తియే

వెలిదైనచో నీపాండిత్యాతిశయము లన్నియు నిరుపయోగము లనియు నభిప్రాయపడినట్లుగ నీక్రిందిపద్యములవలనఁ దేటపడుచున్నది:

"క. ఛందోలంకారాదుల
పొందెఱిఁగిన సిద్ధిలేక పొసఁగదు కవితా
సుందరత, శక్తి యది, యా
కందువ దగ నెఱుఁగువాఁడె కవివరుఁ డెందున్."

"గీ. శక్తి వెలిదైనఁ గావ్యోక్తిసాధనంబు
లెల్లఁ జీకటియింటిలో నిడినసరకు
లెన్ని ఋతువులు గల్గిన నెట్లు పూచు
మహి వసంతాగమము లేక మావిమోక."

సప్తవిధకవులు

ఇంక నీసుకవిలక్షణనిరూపణ మిట్లుండ మనయాంధ్రలాక్షణికులు కవులనుగూర్చి వ్రాయున దర్భమున సంస్కృతలాక్షణికులు గావించినకవి విభాగములను దామును గైకొని తమ తమలక్షణగ్రంథములయందుఁ జేర్చుకొనియు న్నారు. సంప్రదాయసంజీవనియందు విద్యాచక్రవర్తి,

"శ్లో. ఛందోవిభాగజ్ఞో వివేకీ పరికీర్తితః,
అనుప్రాసనమాబద్ధపదబంధస్తు వాచికః
ప్రసాదమధురాయత్తవచనో రోచికో భవేత్,
అర్థసంగ్రహచాతుర్య యుక్తస్స్యా దార్థికః కవిః
శిల్పికస్తు భవే ద్దక్షః కవనే యమకాన్వితే
సాలంకృతిర్భూషణార్థీ మార్దవీ రసతత్పరః."

అని వారివారి రచనావిశేషములనుబట్టి కవులలోని పలుతెఱఁగులవారిని యుక్తనామకరణములతో వేఱుపరచినవిభాగమును బెద్దనయు నప్పకవియు మొదలగువా రిట్లు లనుకరించుచున్నారు.

పెద్దన—

"గీ. వాచికార్థులు శిల్పకరోచికులును
భూషణార్థియు మార్దవస్ఫురణకరుఁడు
నల వివేకియు ననఁగ సప్తాహ్వయములఁ
గవులు నెగడుదు రిహితకావ్యములను."

అప్పకవి—

"ఆ వె. వినుతిగాంతు రిల వివేకి వాచికరోచి
కార్థశిల్పభూషణార్థు లనఁగ
మార్దవానుగతసమాహ్వయుఁడును వాఁగఁ
గవులు సప్తనామకములతోడ."

సప్తవిధకవుల లక్షణములు

ఇంతియేకాక పై శ్లోకమునందువలెనే తత్సప్తవిధకవుల రచనావిశేషములను సైతము బెద్దనాదులు విస్పష్టముగ వివరించియున్నారు. వారిలో నప్పకవి వివరణ మిట్లున్నది:

సీ. గణవర్ణశబ్దార్థగుణదోషనికరంబుఁ
బరికించి పూర్చుఁ గబ్బము వివేకి
బహుతరానుప్రాసపదబంధనియమంబు
నపలక కృతిసేయు వాచికుండు
మృదుమధురోక్తులు వెసకి కావ్యంబెల్ల
రచియించుఁ బసపడి రోచికుఁడు
మితశబ్దములలోన నతివిపులార్థంబు
నిమిడించు నర్థాఖ్య నెసఁగు నతఁడు
సప్తు యమకంబు లెప్పట్ల శిల్పకుండు
పొందుపఱచు నలంకృతుల్ భూషణార్థి
సరళపదవిరళార్ద్రవిస్ఫురణముగను,
జూపు రస మెందు మార్దవస్ఫుటకరుండు.

మూలశ్లోకములో నీసప్తవిధకవులకును గలవరుసను నట్లే యుంచక పెద్దన యెందుచేతనో తనయాంధ్రీకరణమునందుఁ దప్పించెను. అప్పకవి యట్లు తప్పింపక కేవలమును మూలక్రమమునే యనుకరించెను. ఛందోనిర్బంధముచే మూలక్రమము పెద్దనకుఁ బద్యములో

నిముడ లేదని చెప్పఁజాలముగదా? అందులో నీ ఛందోనిర్బంధ మొక తేటగీతియందా? అట్టినిర్బంధము లేనిపట్టున నప్పకవివలెఁ జెప్పక తగినంత కారణము లేకయే పెద్దనమూలక్రమమును దప్పించునా యని మన మూహింప వలసివచ్చుచున్నది. మఱియు మూలక్రమమును భేదించి తన పద్యములోఁ జేర్చినక్రమ మేదే నొకనియమము ననుసరించినదా లేక కేవలము ఛందస్సు ననుసరించియే కూర్పఁబడినదా యనువిషయము నైతము విచారణీయము. మూలశ్లోకములో విద్యాచక్రవర్తి యీసప్తవిధకవులకు నొసంగిన క్రమము నియమసహితమా నియమరహితమా యని పరిశీలించినఁగాని యీవిషయము తేలదు. అట్లు పరిశీలించినప్పుడు మూలశ్లోకములోని మొదటికవి వివేకి. ఏడవకవి మార్దవి. ఈక్రమ మారోహణ క్రమనియమము(ascending order) ననుసరించినదే యైనచో వివేకి యత్యధముఁ డగుచున్నాఁడు. మార్దవి యత్యుత్తముఁ డగుచున్నాఁడు. అట్లుగాక యవరోహణక్రమముఁ (descending order) ననుసరించినదే యైనచో వివేకి యత్యుత్తముఁ డగుచున్నాడు. మార్దవి యత్యధముఁ డగుచున్నాడు. ఇట్టు లేనియమముచే నైనను గుణదోషవిభాగజ్ఞుఁడైన వివేకినిగాని రసతత్పరుఁడైన మార్దవానుగతునిఁగాని లాక్షణికు లధమతరగతిలోఁ జేర్పరు. అందులో మూలశ్లోకకారుఁడు విద్యాచక్రవర్తి! కవులలోని తరగతులను విభాగించి యామూలక్షణములతో నాయాకవులను వివరించుటయే వాని ముఖ్యోద్దేశముగాని, యాకవులకుఁ గ్రమస్థాన మేర్పరచు తలం పున్నట్లు కానరాదు. ఇట్లు మూలశ్లోకములోనివరుస నియమరహితమని గ్రహింపక, తత్క్రమభంగము గావించినయెడల నేమి యుపద్రవము వచ్చునోయని భయపడి యప్పకవి, శ్లోకమునందలి వరుసయే యథాక్రమముగాఁ దనపద్యమునందుఁ గడుభద్రముతోఁ జేర్చుకొనియెను. ఇదిస్వాతంత్ర్య రహిత మైన రచనావస్థ!

### సప్తవిధకవుల స్థానములు

పెద్దన యిట్టియవస్థయందుఁ బడలేదు. మూలశ్లోకమునుగూర్చి పైని వివరింపఁబడిన విషయములన్నియు నతఁడు గ్రహించెను. అందులో నీ సప్తవిధకవులును స్థానక్రమముగాఁ జేర్పఁబడలేదని గుర్తెఱింగెను. మఱియు నీ సప్తవిధకవులను వారిలక్షణములతోఁగూడ మొక్కుబడికొఱ కొకటిరెండు పద్యములలో ముగింపక, విద్యాచక్రవర్తి నిరూపించిన లక్షణములన్నియు విపులముగా వివరించుచు నొక్కొకకవి నొక్కొకపద్యమునందు వర్ణించుచువచ్చెను మూలశ్లోకములోనివరుస ననుసరింపకపోవుటయు, నొక్కొకకవిలక్షణ మొక్కొకపద్యమునందు విపులముగ వర్ణించిచెప్పుటయుఁ బట్టిచూడ, నీ సప్తవిధకవులకును బెద్దనార్యుఁ డొకవిధమైన నియమముతో స్థానము లేర్పరచుటకుఁ బ్రయత్నించినట్లు కనఁబడుచున్నది. చూడుఁడు:

౧. వాచికుఁడు

క. ఛలవర్ణగుచ్ఛపిచ్ఛిల
లలితపదాడంబరావలంబనకవితా
సులభవిరచనాచతురుం
డలవడు వాచికుఁడు నా సుదగ్రప్రౌఢిన్.

౨. ఆర్థుఁడు

క. మితశబ్దమయ్యు నర్థము
సతతవ్యాఖ్యానలాలసత్వమవిపుల
స్థితి నొప్పఁ గవిత సెప్పెడు
నతఁ డార్థుఁ డనఁగ నెగడు నార్యులసభలన్.

౩. శిల్పకుఁడు

క. మహితసుశబ్దార్థంబులు
బహువిషయమకార్థబంధబంధురరచనా
నిహితవిచిత్రములై చన
విహరించున్ శిల్పకుండు విశ్రుతకృతులన్.

౪. రౌచికుఁడు

క. ఒదవెడుకృతిపైఁ గల సొబ
గదలక యొందాఁక నిష్టమగు నందాఁకన్
మృదుమధురరచనసువిశా
రదుఁడై సాగించు నతఁడు రౌచికుఁ డెందున్.

౫. భూషణార్థి

క. తివుటపడి నొడువునప్పుడు
వివిధాలంకారసరణి విడువక చవిగా
నవహితుఁడై కృతి సెప్పెడు
కవి యెందును భూషణార్థి కడుఁ బొగడొందున్.

౬. మార్దవానుగతుఁడు

క. సరళములగుశబ్దములను
విరళములను నర్థములను వీనులకింపం
దరళిత లేశరసోఘము
లరుదుగఁ గృతిసెప్పు మార్దవానుగుఁ డెపుడున్.

౭. వివేకి

క. శ్రుతిశాస్త్రాలంకార
ప్రతిభుఁడు శబ్దాది దోషపటుగుణఘటనా
చతురుఁడు వివేకి నాఁజను
నతఁడు మహాకవిశతంబులందుఁ జరించున్.

వాచికుఁడు

ఇట్లు విపులమైనలక్షణ వర్ణనములతో నీ సప్తవిధకవులలోఁ బెద్దనచే మొదటఁ జెప్పఁబడినవాఁడు వాచికుఁడు. 'అనుప్రాసమారబ్ధపదబంధస్తు వాచికః' అని విద్యాచక్రవర్తిలక్షణము.

"బహుతరానుప్రాసపదబంధనియమంబు
వదలక కృతిసేయు వాచికుండు"

అని యప్పకవి యాంధ్రీకరణము. వాచికునకుఁ బ్రియమైన యీ యనుప్రాసాలంకారము శబ్దాలంకారములలోఁ జేరినది. దీనిని ౧ ఛేకానుప్రాసము, ౨ వృత్త్యనుప్రాసము, 3 లాటానుప్రాసము నని మూఁడువిధములుగా నాలంకారికులు విభాగించినారు. ఈ మూఁడువిధములలో నొకయనుప్రాసమునకుఁ గావ్యాలంకారచూడామణియందు లక్ష్యముగా నీ క్రిందిపద్యమొసంగఁబడినది. చిత్తగింపుఁడు:

"ఉ. చొక్కపుటుక్కు ద్రిక్కితిసి సుక్కక పెక్కువ
నక్కజంపుటు, స్రుక్కక చక్కనై బ్రతుకు నిక్క
నెఱింగితిరేని శాత్రవుల్, మొక్కలమేది ప్రక్కి
యని ద్రెక్కఁడు ద్రొక్కక నిక్కుచున్న మీ,
కొక్కల పక్కఁబెట్టి విఘటించి పలుక్క నరేంద్రుఁ
డిక్కడన్."

ఇట్టి శబ్దాలంకారపూరితమైన కావ్యములను నాలంకారికు లధమకావ్యములుగాఁ బరిగణించుచున్నారు. చిత్రమీమాంసయను గ్రంథమున "శబ్దచిత్రస్య ప్రాయో నీరసత్వాన్నాత్యంతం తదాద్రియంతే కవయః" అని యప్పయదీక్షితులు చెప్పుచుండెను. అందుచే

నిట్టిపదాడంబరావలంబనకవితాప్రియుండైన వాచికుని మొదటఁ జేర్కొనుటవలన నీ సప్తవిధకవులకును బెద్దనార్యుఁ డారోహణ క్రమమున స్థానము లేర్పచినాఁడని యూహించుట కవకాశము కలుగుచున్నది.

### ఆర్థికుఁడు

పెద్దన క్రమములోఁ జేర్కొనఁబడినతరువాతికవి యార్థికుఁడు. పదాడంబరమందు వాచికునివలెనే యర్థసంగ్రహమునం దీయార్థికుఁడును మిక్కిలి యాసక్తుఁడు. అందుచేతనే యార్థికునికవిత్వము 'సతతవ్యాఖ్యానలాలసక్షమవిపులస్థితి' నొందుచుండునని పెద్దన వర్ణించెను. కొలఁదిశబ్దములలో నత్యంతవిపులార్థమును గ్రుక్కి వ్యాఖ్యాన సాహాయ్యమునఁగాని తనభావము తేటపడకుండ రచించుకవిని దత్కావ్యమునుగూడఁ గవులుగాని లక్షణకర్తలుగాని యెందును గణించినట్లు కానరాదు. కావ్యార్థము క్లిష్టముగను గూఢముగను నున్నయెడ రసభంగమునకుఁగూడఁ గారణమగునని యెంచి, యర్థదోషములలో "క్లిష్టగూఢార్థ"మను నొకదోషమును లాక్షణికులు దోషప్రకరణములోఁ జేర్చియున్నారు. కవులు సైతమును గావ్యమునందు శబ్దార్థములు రెండింటికిని సమానగౌరవమునే యారోపించుచున్నారు. క్లిష్టగూఢార్థమును దూషించుచున్నారు. ప్రసన్నకథార్థయుక్తిని విధించుచున్నారు.

౧ "ఉ. ఏయెడనర్థగౌరవసమృద్ధియుశబ్దవిశుద్ధియుం జిరంబై యవపద్యతం బరగ........."పింగళిసూరన

౨ చ. "ఘనతరఘూర్జరీకుచయుగశ్రియగూఢముగాక..."
జైచరాజు-వేంకటపతి.

౩ "దిని వెలుంగు మెఱుంగుఁదీగె య ట్లర్థంబు
తేటతెల్లంబుగాఁ దెలియవలయు"
అడిదము-సూరకవి.

౪ ఆ. వె. "తేనె సోక నోరు తీయనయగు రీతిఁ
దోఁడ నర్థ మెల్లఁ దోఁపకుండ"......మొల్ల.

ఇట్లు 'కవులును లాక్షణికులును'గూడ వ్యాఖ్యానలాలసంబగు కావ్యార్థమును బరిగణింపకపోవుటచేత; మితిమీరినపదాడంబరాసక్తిగల వాచికునిమీదనే, మితిమీరిన యర్థసంగ్రహాసక్తిగల యార్థికుని (The two extremists) సైతమును బెద్దన చేర్చినాఁడు.

### శిల్పకుఁడు

ఈయార్థికునిపైఁ జేర్కొనఁబడినవాఁడు శిల్పకుఁడు. తనకావ్యమునందలి శబ్దములను నర్థములనుగూడ, బహువిధ యమకార్థబంధబంధురరచనానిహిత విచిత్రములుగాఁ గావించుచుండుట యీశిల్పకుని లక్షణము. ఈశిల్పకుని శిల్పమునందుఁ గవులకును లక్షణకర్తలకును గూడ గౌరవభావము గలదు. మహాకవిశేఖరుండైన సోమయాజి తా నీకావ్యశిల్పమునందుఁ బారగుఁడనని చెప్పుచున్నాఁడు. మఱియు మంచనమహాకవిసైతమును:

"కేయూరబాహుచరితము
నేయుదు నీ వాంధ్రభాష శిల్పము మెఱయన్"

అని తనకృతిపతిచేఁ గోరఁబడినాఁడట. కవితాప్రపంచమున నీశిల్పమున కిట్టిగౌరవముఁ గలుగుటచేఁ బెద్దన వాచికార్థికులకన్నను శిల్పకున కున్నతస్థాన మొసఁగుచున్నాఁడు.

### రాచికుఁడు

ఈ శిల్పకునిపైఁ జేర్కొనఁబడినవాఁడు రాచికుఁడు. "ప్రసాదమధురా యుక్తవచనో

కాచికో భవేత్" అని కాచికునకు విద్యాచక్రవర్తి చెప్పిన లక్షణము. కాచికునకు లక్షణములైన యీప్రసాద మాధుర్యములు కావ్యమున కావశ్యకములైన దశవిధగుణములలోఁ జేరినవి. ఈదశవిధగుణములే కావ్యమునకుఁ బ్రాణములని లక్షణకర్తలు నిర్ణయించిరి. ప్రాణములైన ప్రసాదమాధుర్యాదులు లేనికావ్యము శుష్కకళేబరమువంటిది. మహాకవులునైతము నీప్రసాదమాధుర్యముల నెంతయావశ్యకముగాఁ బరిగణించిరో కవుల కవితాతత్త్వనిరూపణ ప్రకరణములో మనము పరిశీలించియే యున్నాము. ఇట్లు కావ్యమునకుఁ బ్రాణదాతయగుటచేతనే పెద్దన యీ కాచికునకు శిల్పకునికన్న నగ్రస్థాన మొసఁగుచున్నాఁడు.

భూషణార్థి

ఈకాచికునిపైఁ బేర్కొనఁబడినవాఁడు భూషణార్థి. ఈతనికావ్యము బహువిధాలంకార విరాజితమై యొప్పుచుండును. రచనయందలి సొబగే యలంకారము. ఈయలంకారములే కావ్యేందిరకు భూషణములని లాక్షణికులనుచున్నారు. మఱియు లక్షణకర్తలలంకారప్రియులగుటచే నలంకార రహితమైన రచన నిషేధించుటకు 'నిరలంకృతి' యనుపేర నొకదోషమును దోషప్రకరణములోఁ జేర్చిరి. ఈదోషమునే యప్పకవి 'అలంకారవర్జిత' మనుపేరున వాడెను. ఈభూషణార్థి కావ్యరచనంగూర్చి పెద్దన 'వివిధాలంకారసరణి విడువక చవిగా నవహితుఁడై కృతిసెప్పుడు' అని చెప్పుటచేత కాచికునివలె మాధుర్యమునైతమును గాపాడుచు బహువిధాలంకార ఘటనాచతురత్వమును జూపఁగలవాఁడని యూహించి తత్కాచికునికంటె భూషణార్థి కున్నతస్థానము నొసంగినట్లు కానంబడుచున్నది.

మార్గవానుగతుఁడు

ఈభూషణార్థి పైఁ బేర్కొనఁబడినవాఁడు మార్గవానుగతుఁడు. 'మార్గవీ రసతత్పరః' అనుటచే నితఁడు కేవలము రసమునందే దృష్టికలవాఁడని తెలియుచున్నది. అందుచే మార్గవానుగతునికావ్యము సరళములగు శబ్దములును విరళములగు నర్థములును గలిగి రసముల వాలమై యొప్పుచుండును. రసమే కావ్యమునకు జీవమని మహాకవులును లక్షణకర్తలునుగూడ నేకగ్రీవముగఁ జాటుచున్నారు. కవితాసాగరము నెన్నెన్నిభాషలలో నెందరెందరెన్నివిధముల మథించుచుండినను దేలుచుండిన సారాంశము రసమే. శయ్యలు, పాకములు, కైశిక్యారభటి ప్రముఖకావ్యవృత్తులు, వైదర్భీగౌడీపాంచాలాదికావ్యరీతులు, ప్రసాదమాధుర్యాది కావ్యగుణములు, విభావానుభావ సాత్త్వికవ్యభిచారిభావములు, మొదలగునవియన్నియు శృంగారాది నవరసములను స్పష్టీకరించుటకును బెంచుటకునుగూడ నుపకరణము లగుచున్నవి. అట్టి రసతత్పరుఁడైన మార్గవానుగతుని నిందఱికంటె నున్నతస్థానమునఁ బెద్దన చేర్చుట తద్దయుఁ బ్రశంసింపఁదగినది.

వివేకి

ఈ మార్గవానుగతునిపైఁ బేర్కొనఁబడినవాఁడు వివేకి. రసతత్పరుఁడైన మార్గవి

కన్నను వీనికున్నతస్థాన మొసంగఁబడినది. ఈవివేకి "శ్రుతశాస్త్రాలంకార ప్రతిభుఁడు; శబ్దాదిదోష పటుగుణఘటనాచతురుఁడు." అందుచే నార్థికుని యర్థసంగ్రహము, శిల్పకుని శిల్పము, రాచికుని మృదుమధురరచనయు, భూషణార్థియలంకారసరణియు, నీవివేకి రచనలయందుఁ బ్రాయికముగా నలరారుచుండును. రసైకలోలుఁడగు మార్దవానుగతుఁడు కావ్యరసార్ణవమున మునిఁగి నవరస తరంగములయందు నిరంతరము నూఁగులాడుచుండువాఁడగుటచేఁ గవితాప్రపంచమందలి బాహ్యవిషయములయందు వానికి దృష్టి యుండకపోవచ్చును. రసదేవత నారాధించు కవికి రసేతరములైన కావ్య నిబంధనములన్నియు మహాయోగికి సంసారవిషయముల వంటివి. లాక్షణికులుమాత్రము కావ్యలక్షణములలో రసమున కెంతటియగ్రస్థానము నొసంగినను, రసపోషణముతోఁ బాటుగ నితర కావ్యలక్షణములు సైతమును సలక్షణముగ లక్షింపఁబడినఁగాని, తత్కావ్యమున కుత్తమ కావ్యత్వమును గటాక్షింపరు. భక్తిరస స్రవంతి తండోపతండముగా స్రవించు భద్రాద్రి రామదాసు చరిత్రమున కీ నిబంధనముచేతనే మనవాఙ్మయమునఁ జోటు లేకపోయినది. ఇట్లు మార్దవానుగతునివలె నెంతటి రసతత్పరుఁడైనను, రసముతోఁ బాటుగ రసేతరములైన కావ్యలక్షణములనుగూడఁ బాటించు సామర్థ్యమును గుణదోషవిచారమును గలవాఁడగుటచే, నీసప్తవిధకవులలో వివేకియే యగ్రస్థానము నలంకరించుచున్నాఁడు. ఆంధ్రమహాకవులైన నన్నయతిక్కనాదులిట్టివివేకులుగనే కొనియాడఁబడఁదగినవారు.



# కనక కనక జానకి నన్ను గాంచినపుడు

అధికార్ల సూర్యనారాయణరావు గారు బి ఏ, బి.యల్.

చిరవియోగానలంబున జిత్తమెఱియ
గనక కనక జానకి నన్ను గాంచినపుడు,
నాటుకొనినదుఃఖముపైని నవ్యహర్ష
వీచికామాలికలు దండు వెడలుచుండ;
నెండ వానయు జతగూడి యుండునట్లు,
చీకటియు వెన్నెలయు చెల్మి సేయునట్లు,
కనుగొనల బాష్పకణములు గారుచుండ
తొగరుపెదవుల జిరునవ్వు దోచె సతికి!





# సంస్కృతభాషలోని రామనాటకములు

నేదేపల్లి వేంకటరమణాచార్యులు గారు

దేవో న శ్శుభ మాతనోతు దశధా నిర్వర్తయన్ భూమికాం
రంగే ధామని లబ్ధనిర్భరరసై రధ్యక్షితో భావుకైః;
యద్భావేషు పృథగ్విధే ష్వనుగుణా న్భావా న్స్వయం బిభ్రతీ
యద్ధర్మై రిహ ధర్మిణీ విహరతే నానాకృతి ర్నాయికా.

పారావార పయోవిశోషణకళాపారీణ కాలానల
జ్వాలాజాలవిహార హారివిశిఖ వ్యాపారఘోరక్రమః;
సర్వావస్థ సకృత్ప్రపన్న జనతా సంరక్షణైకవ్రతీ
ధర్మో విగ్రహవా నధర్మవిరతిం ధన్వీ స తన్వీత నః.

నమ స్తస్మై కస్మైచన భవతు నిష్కించన జన
స్స్వయం రక్షాదీక్షాసమధిక సమింధానయశసే;
సురాధీశస్వైరక్షణకుపిత శాపాయుధవధూ
ద్వృషత్త్వాదుర్ఘాత ప్రశమన పదాంభోజరజసే.

ఈశ్వరసృష్టమగు నీసంసారచక్రమందుఁ బరివర్తమానులగు సకలచేతనులకు ధర్మార్థకామమోక్షములను నాలుగు పురుషార్థము లత్యంతాదరణీయములు. మహాభారతమందు:—"ధర్మంచార్థంచకామంచ యథావ ద్వదతాం వర! విభజ్య కాలే కాలజ్ఞస్సర్వా న్సేవేత పండితః; మోక్షో హి పరమశ్రేయః పురుషార్థచతుష్టయే;" (వక్తలలో శ్రేష్ఠుడా! కాలోపయోగమును దెలిసిన విచక్షణుఁడు కాలమును విభజించి ధర్మార్థకామములను సేవింపవలయును. ఈ నాల్గు పురుషార్థములలో మోక్షమను నది యుత్కృష్టశ్రేయస్సు నిచ్చునది )యని యుధిష్ఠిరునితో భీమసేనుడు చెప్పియున్నాఁడు కావున మోక్ష మితరపురుషార్థములకంటె నధికతరశ్రేయోదాయకము, ముఖ్యతమము. ధర్మాదులు కూడ మోక్షమునకు సాధనము లగుటవలననే పురుషార్థము లని వ్యవహరింపబడుచున్నవి. వీనిలో ధర్మము ప్రవృత్తిరూపధర్మ మనియు నివృత్తిరూపధర్మ మనియు ద్వివిధము. వీనిలో మొదటిది యిష్టాపూర్తాదికర్మరూపము. అనఁగా యాగము లొనరించుట చెఱువులు త్రవ్వించుట మున్నగునవి యిష్టాపూర్తములు. ఇది స్వర్గాదిలోకప్రాప్తికి సాధనము. రెండవది యనఁగా నివృత్తిరూపధర్మము. ఐహికాముష్మికాల్పాస్థిర సుఖసంధాయకము లగు కర్మల బరిత్యజించి కేవల పరమాత్మానుసంధానపరుడై యుండుట. ఇందుకు బ్రమాణము: "ప్రవృత్తిసంజ్ఞికే ధర్మే ఫల మభ్యుదయో మతః; నివృత్తిసంజ్ఞికే ధర్మే ఫలం నిశ్శ్రేయసం మతమ్" (ప్రవృత్తిరూపధర్మమువలన స్వర్గాదిపారలౌకికసుఖమును, పశుపుత్రవృష్ట్యన్నాదిలాభమును నివృత్తిరూపధర్మమువలన మోక్షమును లభించును.) ఇట్టి ధర్మ ముభయలోకశ్రేయస్సాధనము. ఇది అతీంద్రియము (చక్షురాదీంద్రియములకు గోచరింపనది

కాదు). ఇట్టి ధర్మమును బోధించునది వేదము. "ప్రత్యక్షే ణానుమిత్యావా యస్తూపాయో నబుధ్యతే; ఏతం విదంతి వేదేన తస్మాద్వేదస్య వేదతా" (ప్రత్యక్షాను మానప్రమాణములచే బోధింపబడని యుపాయము దేనిచే దెలియబడునో దానికి వేదమని పేరు.) ఇట్టి మూలప్రమాణ మగు వేదము కాళిదాసాదికవికృతకావ్యములవలె భ్రమవిప్రలంభాదిదోషసంభావనాగంధరహితమయి యపౌరుషేయమై, సర్వజ్ఞానఖనియై, స్వతః ప్రమాణమై, అనాదినిధనావిచ్ఛిన్నసంప్రదాయప్రవర్తమానమై ప్రకాశించుచున్నది. "యథాకల్ప స్సకల్ప పూర్వః" అను న్యాయము ననుసరించి యీసంసారమనాది గావున సర్వజ్ఞుడగు నీశ్వరుడు గతకల్పమందలి వేదము నీకల్పాదియందు స్మరించి "యోబ్రహ్మాణం విదధాతి పూర్వం యోవై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై" అన్నట్లు వేదమును బ్రహ్మయను చతుర్ముఖుని కుపదేశింప నతడు మరీచ్యాదులకును వారు తమశిష్యసంఘమునకు నుపదేశింప నీరీతి నుపదేశపరంపరాప్రాప్త మయ్యెనని పూర్వమీమాంసకుల సిద్ధాంతము. మఱికొందఱు శాస్త్రజ్ఞులు (నైయాయికులు) వేదము లీశ్వరప్రణీతము లందురు. ఈయంశమునే బాదరాయణుడు "శాస్త్రయోనిత్వాత్" అనుసూత్రమందు ప్రతిపాదించెను.

ఇట్టివేదము కర్మభాగ మనియు బ్రహ్మభాగ మనియు భాగద్వయాత్మకము. ఇందు కర్మభాగము భగవదారాధనక్రమమును బ్రహ్మభాగము భగవత్స్వరూపస్వరూపగుణవిభూతులను దెలుపుచున్నది. ఇట్లు భగవత్ప్రతిపాదకమగు నీవేదము సంసారిచేతనులకు దత్త్వజ్ఞానము నొసగుటయందు ముఖ్యసాధన మగుచున్నది. తత్త్వజ్ఞాన మనగా సర్వస్వామియైన శ్రీమన్నారాయణునికి సర్వప్రకారముల బరతంత్రములగు నీజీవాత్మలను స్వరూపానురూపపురుషార్థ మగు భగవత్ప్రాప్తిని నిరోధించు ననాదికర్మబంధమును నివర్తింపజేయు నుపాయము. ఇది యర్థపంచకజ్ఞానమూలము. అర్థపంచకజ్ఞాన మనగా స్వస్వరూప పరస్వరూప పురుషార్థస్వరూపోపాయస్వరూప విరోధిస్వరూపముల యథార్థముగ నెఱుంగుట. వీనిలో స్వస్వరూపమనగా నాత్మస్వరూపమిది, దాని లక్షణ మిది యని యెఱుంగుట; పరస్వరూప మీశ్వరస్వరూపము; పురుషార్థస్వరూపము మోక్షలక్షణము; ఉపాయస్వరూపము కర్మజ్ఞానభక్తిప్రపత్తిలక్షణము; విరోధిస్వరూపము భగవత్ప్రాప్తి ప్రతిబంధకీభూతానాదికర్మబంధము. ఇట్లర్థపంచకజ్ఞానపూర్వకముగ బరతత్త్వ మగు శ్రీమన్నారాయణుని పాదారవిందముల యందు న్యస్తాత్మరక్షణభరుండై యతని కత్యర్థప్రియుండై మెలంగుటయే మోక్షసాధనములలో ముఖ్యభూత మని సకల వేదాంతతాత్పర్యము.

అనంతశాఖాంచితమై చతుర్దశ విద్యాస్థానోపబృంహితమై దుర్జ్ఞేయార్థప్రతిపాదక మగు వేదమును గూలంకషముగ జదివినగాని పరబ్రహ్మతత్త్వనిర్ణయ సామర్థ్యము దత్త్వజ్ఞానము గలుగదనియు, రాబోవు కలియుగమునందలిజను లల్పాయువులు మందభాగ్యులు మందబుద్ధులు నగుటచే నిట్టి దుర్ఘటజ్ఞానమును సంపాదింప నసమర్థులనియు నూహించి సకలభూతానుకంపాసంపన్నచిత్తులు, పరమపరతత్త్వయాథాత్మ్యవిదులు, దేవతాపారమ్యవిదులు నగు పరాశర వ్యాస వాల్మీకాది మహర్షులు "ఇతిహాసపురాణాభ్యాం వేదం సముపబృంహయేత్." (ఇతిహాసము భారత రామాయణాది పూర్వరాజవృత్తము. సర్గప్రతిసర్గాది పంచలక్షణ సమన్వితము పురాణము) వీనిచే వేదార్థమును వివరింపవలయును. అనున్యాయమును బట్టి దురవగాహ మగు వేదార్థమును దాము చక్కగ బరిశీలించి సూర్యకిరణములచే నిర్మిత మయి పునర్వృష్టమగు సముద్రజలము సర్వజనోపజీవ్య మయినట్లు పండితపామరసామాన్యముగ నెల్లరకు సులభముగ దెలియురీతి బరతత్త్వనిర్ణయమును మోక్షోపాయనిష్కర్షమును జేసి బద్ధచేతనులకు సంసారసుఖసంతరణోపాయమును దెలిపిరి.

"ఇతిహాసపురాణాభ్యామ్" అనువాక్యమున "అల్పాచ్తరం పూర్వమ్" అనుసూత్రమును బట్టి అల్పాచ్కమయిన పురాణశబ్దము మునుపటి నుండవలసియుండగా ఇతిహాసశబ్దము మొదట బడుట "అభ్యర్హితం పూర్వమ్" అనుశాస్త్రమును బట్టి; కావున బురాణముకంటె నితిహాస మభ్యర్హిత మయినదని యిందుచే దెలియనగును.

## వాల్మీకి - శ్రీరామాయణము.

సంసారార్ణవనిమగ్నచేతనోద్ధరణార్థమయి పరమకారుణికత్వము వహించి వేదార్థోపబృంహణము నొనరిం

చినవారిలో వాల్మీకి ప్రథమగణ్యుడు. "వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే; వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షాద్రామాయణాత్మనా." (వేదముచే తెలియబడు పరమపురుషుడు దాశరథియై జనింప దత్ప్రతిపాదకమగు వేదము గూడ రామాయణరూపముగ బరిణమించెను) అనునట్లీవాల్మీకి సాక్షాద్వేదసమ్మతమగు రామాయణమును రచించి "ఇతిహాసపురాణాభ్యాం వేదాంతార్థః ప్రకాశ్యతే, ప్రాయేణ పూర్వభాగార్థో ధర్మశాస్త్రైః ప్రకాశ్యతే." (వేదముయొక్క ఉత్తరభాగార్థము) (ఉపనిషదర్థము ఇతిహాసపురాణములచేతను పూర్వభాగార్థము ధర్మశాస్త్రముచేతను ప్రకాశింపజేయబడుచున్నది) అనురీతిగా నీరామాయణమందు వాల్మీకి సకలముముక్షుజనోపజీవ్యము లయిన వేదాంతార్థములను సంపూర్ణముగాఁ బ్రతిపాదించియున్నాడు. సంస్కృతవాఙ్మయచరిత్రమును బట్టి విమర్శింపగా నీవాల్మీకి యాదికవి యనియు, నితడు రచించిన రామాయణ మాదికావ్య మనియు నిర్ణయింపబడుచున్నది. "వాల్మీకి నాదదర్శ ససర్జ పద్యమ్" అని అశ్వఘోషుడు. "ప్రాచేతసోపజ్ఞం రామాయణమ్" అని కాళిదాసు, "ఆద్యః కవి రసిత దిష్ట్యాహి రామచరితమ్" అని భవభూతియును, "బభూవ వల్మీకభవః కవిః పురా" అని రాజశేఖరుడును, "భాస్వద్వంశవతంసకీర్తిరమణీరంగప్రసంగస్వనద్వాదిత్రప్రసమక్వణి ద్విజయతే వల్మీకజన్మా మునిః" అని జయదేవుడును. "శుభ మతనుత కావ్యం స్వాదు రామాయణాఖ్యం మధుమయభణితీనాం మార్గదర్శీ మహర్షిః" అని భోజరాజును ఇంక దక్కు సంస్కృతకవులును తమతమగ్రంథములలో గృత్యాదిని వాల్మీకి నాదికవియని శ్లాఘించియున్నారు. ప్రతిపాదకశైలక్షణ్యమును బట్టియు, బ్రతిపాద్యశైలక్షణ్యమును బట్టియు శ్లాఘ్యతమమగు నిట్టి గ్రంథము మఱియే వాఙ్మయమందుగూడ గానరాదు. ఇది సర్వాలంకారశాస్త్రలక్షణోపేతమయి సకలభారతవర్షీయ ప్రత్నూత్నవాఙ్మయగ్రంథసమితి కాదర్శకమై, సకలపురుషార్థస్యందియై రాజిల్లుచున్నది. ఇట్టి యుత్తమకావ్యమునకు గథానాయకు డుత్తమశ్లోకు డగు శ్రీరామచంద్రుడు. "పుణ్యశ్లోకస్య చరిత ముదాహరణ మర్హతి," "క ఉత్తమశ్లోకగుణానువాదా త్పుమా న్విరజ్యేత వినా పశుఘ్నః" అన్నట్లు లోకోత్తరు డగునాయకుని గుణవర్ణనము గ్రంథమునకు దత్ప్రణేతయగు కవికి గూడ బ్రతిష్ఠాహేతువగును. ఈ మహాపురుషుని చరిత్రమును జదువువారికి వినువారికి గూడ మాతాపితృభక్తి, సోదరప్రీతి, లోకమర్యాదానువర్తనము, స్వప్రతిజ్ఞానిర్వహణతత్పరత్వము, ఆశ్రితవాత్సల్యము, స్వార్థనివృత్తి, పరనిందాసహిష్ణుత, శబ్దాదివిషయవిరక్తి మొదలగు సద్గుణము లలవడునట్లు చేయును.

రామకృష్ణావతార చరిత్రముల తరతమభావము నాలోచింపగా రామావతారచరిత్రమే అధికతరముగా నాసేతుహిమాచలము వ్యాపించి యాబాలగోపాలముగా సకలజనహృదయపేటికోట్టంకితమయి విలసిల్లుచున్నయది. ఈపరమపావనచరిత్రము పురాణ కావ్య నాటకాఖ్యానాఖ్యాయికాదిరూపముగా నార్యభాషానిబద్ధంబై శ్రవణపానలోభాకృష్టమానసు లగు విద్వజ్జనులచే బాపఠ్యమానంబై యుండుటయేకాక యనార్యభాషానభిజ్ఞులగువారుకూడ నీచరిత్రము జదివి యానందించుటకు దగినట్లు సులభశైలిని దత్తద్దేశభాషాకోవిదులగువారిచే బ్రబంధములుగాను వచనకావ్యములుగాను నాటకములుగాను ద్విపదలుగాను పాటలుగాను రచింపబడి సకలదేశములందు బ్రచురింపజేయబడినది. ఐరోపా అమెరికా మొదలగు విదేశములయందు నివసించువారైన నల్పముగానో అధికముగానో రామకథ నెఱుంగనివా రుండ రని నాయభిప్రాయము. ఇంత పవిత్రచర్వణమయిన యీచరిత్రమెంత యన్నిభాషలలో నేవిధముగా వర్ణించిన నతృప్తాస్పదముకదా! ఈవిషయమయి ప్రాచీనసంస్కృతకవులగు మురారి జయదేవు లిట్లు తమ రామనాటకముల యందు వ్రాసియున్నారు :

మురారి అనర్ఘరాఘవములో—

"యదిక్షుణ్ణం పూర్వై రితి జహాతి రామస్య చరితం
గుణై రేతావద్భి ర్జగతి పున రన్యో జయతి కః;
స్వమాత్మానం తత్తద్గుణగరిమ గంభీరమధుర
స్ఫురద్వాగ్బ్రహ్మాణః కథ ముపకరిష్యంతి కవయః"

ఉ. తొంటిబుధాళి రామకథఁ
దోరముగా విమతించె నంచుఁ దా

మంటకమానినన్ జగతిఁ
నట్టిగుణోజ్జ్వలుఁడైన నాయకుం
డుంట ఘటిల్లునే కవుల
కొప్పగువాగ్విభవంబు తెల్పనే
వెంటభజించు ధన్యతను
వీని కృతార్థత గాంచు టెట్లొకో.

జయదేవుఁడు ప్రసన్న రాఘవములో—

"స్వసూక్తీనాం పాత్రం రఘుతిలక మేకం కలయతాం
కవీనాం కో దోషః స్స తు గుణగణానా మవగుణః;
యదేతై ర్నిశ్శేషై రపరగుణలుబ్ధై రివ జగ
త్యసావేక శ్చక్రే సకలసుఖసంవాస వసతిః"

సీ. తవాతిమసూక్తిపాత్రముగ
దాశరథి న్నుతియించిరంచు నా
విమలమనస్కులైన కవి
వీరులు నిందునుతె యీ రఘూద్వహో
త్తముగుణబృందదోషమని
తద్దయుఁబల్కఁగఁ బోలు గాని ని
స్సముఁడని రాముఁజేరి
గుణసంతతులెల్ల వసించె నొక్కచోన్.

ఇట్టి శ్రీరామచంద్రుని చరిత్రమును మనసంస్కృత కవులలో కొందఱు నాటకరూపముగా రచించియున్నారు. భవభూతి మహావీరచరిత్రము నుత్తరరామచరిత్రమును, మురారి యనర్ఘరాఘవమును, రాజశేఖరుఁడు బాలరామాయణమును, జయదేవుఁడు ప్రసన్నరాఘవమును, భాసకవి ప్రతిమానాటకము నభిషేకనాటకమును, రామభద్రకవి జానకీపరిణయమును వ్రాసియున్నారు.

ఈకవిపుంగవులీచరిత్రమును నాటకరూపముగా వ్రాయుటలో నొకవిశేషము గలదు. కావ్యములు శ్రవ్యములనియు దృశ్యములనియు రెండువిధములు. వానిలో శ్రవ్యకావ్యములు శ్రవణమాత్రముచే నానందజనకము లగుచున్నవి. దృశ్యకావ్యము లన్ననో అట్లు కాదు. వీనిలో ప్రతిపాద్యకథ ఇతిహాసము పురాణము మొదలగు మూలగ్రంథములనుండి సంగ్రహింపబడినను నటులచే నభినయింపఁబడుట కౌచిత్యానుసారముగా నచ్చటచ్చట గ్రంథకర్తచే మార్పు లొందింపఁబడి మనకన్నులయెదుట నాకథ జరుగుచున్నట్లు రామాదివేషముల ధరించి వారి సుఖదుఃఖాద్యనుభవముల ననుకరించెడు నటులచే బ్రయోగింపబడినవి యయి సామాజికుల కానందదాయకము లగుచున్నవి. అందువలననే దశరూపకములో ధనంజయుఁడు

"ఆనందనిష్యందిషు రూపకేషు
వ్యుత్పత్తిమాత్రం ఫల మల్పబుద్ధిః;
యోఽపీతిహాసాదివ దాహ సాధు
స్తస్మై నమ స్స్వాదుపరాఙ్ముఖాయ"

అని చెప్పియున్నాఁడు. నాటకము లితిహాసాదులవలె కేవల త్రివర్గాది వ్యుత్పత్తిమాత్రఫలకములు గాక విగలితవేద్యాంతరము పరమానందరూపము నగు రసాస్వాదమును గలిగించును. "అవస్థానుకృతి ర్నాట్యం రూపం దృశ్యత యోచ్యతే, రూపకం తత్సమారోపాత్" అని దశరూపకము ఆంగిక వాచి కాహార్య సాత్వికాదిభేదభిన్నమగు చతుర్విధాభినయముచే నటులు కావ్యోపనిబద్ధు లగు ధీరోదాత్తాదినాయకులసుఖదుఃఖాద్యవస్థల ననుకరించుట నాట్య మనంబడును. నీలాదిరూపములవలె నిది కంటిచే జూడఁబడునది యగుటచే రూపమని చెప్పఁబడుచున్నది. నటునియందు రామాదులయవస్థల నారోపించుటచే రూపకమనంబడుచున్నది. ఇట్లు నాట్యరూపరూపకశబ్దములు మూఁడు నొక్కయర్థమందు ప్రయోగింపబడుచున్నను ఇంద్ర పురందర శక్ర శబ్దములవలె ప్రవృత్తినివృత్తిభేదము గలవి యగుచున్నవి. ఈరూపకములు, నాటకము, ప్రకరణము, భాణము, ప్రహసనము, డిమము, వ్యాయోగము, సమవకారము, వీథి, అంకము, ఈహామృగ మని పదివిధములు. వస్తునేతృరసములను బట్టి యీరూపకము లిట్లు భేదించినవి. వస్తువనగా ప్రతిపాద్యకథ. ఇది ముఖ్యమయినది యాధికారికమనియు, నంగభూత మయినది ప్రాసంగిక మనియు ద్వివిధము. శ్రీరామాయణమందు సీతారాములవృత్తాంత మాధికారికము. విభీషణ సుగ్రీవాదివృత్తాంతము ప్రాసంగికము. ఇది పరప్రయోజనాంగ మయియుండి యందువలన స్వప్రయోజనసిద్ధి గడయును.

ఇది మరల పతాకయనియు ప్రకరియనియు రెండువిధములు. వీనిలో పతాకయనునది సుగ్రీవాది

వృత్తాంతమువలె నాటకము చివరకు ననువర్తించునది. అల్పమయి క్రమణాదివృత్తాంతమువలె ప్రాదేశమాత్రమై యుండునది ప్రకరి.

నేత యనగా నాయకుడు. "మహాకులీనత్వ ము దారతా చ తథా మహాభాగ్యవిదగ్ధభావౌ; తేజస్వితా ధార్మిక తోజ్జ్వలత్వ మమీ గుణా జాగ్రతి నాయకస్య" అని నాయకసామాన్యలక్షణము. ధీరోదాత్త ధీరోద్ధత ధీరలలిత ధీరశాంతు లని నాయకులు నలుగురు.

రసములు : శృంగార హాస్య కరుణా రౌద్ర వీర భయానకాః; బీభ త్సాద్భుత శాన్తా శ్చ రసాః పూర్వై రుదాహృతాః" అని నవరసములు.

రసనిరూపణము : లోకములో నాలంబనకారణములయిన నాయికానాయకులచే బుట్టింపబడునదియు, నుద్దీపనకారణములయిన వెన్నెల, పుష్పమాల్యములు, చందనము మొదలగువానిచే వృద్ధిబొందింపబడునదియు, కార్యములగు కటాక్షభుజాక్షేపాదులచే బ్రతీయమానమగునదియు సహకారులగు చింతాగ్లానినిర్వేదాదులచే బరమావధిని బొందింపబడునదియు నయి, తక్కినకారణము లుండుటచే నీపురుషు డీస్త్రీయం దాసక్తిగలవాడు, ఎవ్వ డెవ్వ డెట్లుండునో వాడు వాడీరీతిగానే యుండు నని అభ్యాసపాటవముగల శ్రోత్రియబ్రహ్మచారి వ్యతిరిక్తుల కనుమానమందు, గుణాలంకారమహిమచే గావ్యమందు, ఆంగిక వాచి కాహార్య కావ్యభినయమహిమచే నాట్యమందు నభివ్యక్తమగుచు, రత్యాదిస్థాయిరూపముగా సామాజికహృదయములయందు జిరకాలమునుండి వాసనారూపముగా నున్నదియు నాసమయమందు విగళితవేద్యాంతరుడైన ప్రమాతతో స్వాకారమువలె నభిన్నమయినను అనుభూయమానమగుచు పునఃపునరుపభుజ్యమానత్వమే ప్రాణముగా గలది యయి, విభావాదు లున్నంతవరకు నుండునది యయి విభావాద్యనేక పదార్థములతో మిళితమై యున్నను పానకరసన్యాయముగా నేకరీతిగా ననుభూయమాన మగునది యయి ఎదుట స్ఫురించుచున్నదానివలె నుండునదియు, సర్వావయవముల నాలింగనము చేసికొనుచున్నదానివలె నుండునదియు, నితరము నంతయును గప్పివేయును బ్రహ్మానందాస్వాదనమును గలుగజేయుదానివలె నలౌకిక చమత్కారకారియగునది రసమని చెప్పబడును. నాటక ప్రయోగ దర్శనసమయమందు సామాజికుల కిట్టిలోకోత్తరరస మావిర్భవించును.

రామాయణకథను నాటకముగా వ్రాసినవారిలో మహాకవియగు భవభూతి మొదటివాడు. ఇతడు తనవృత్తాంతమును సంగ్రహముగా మాలతీమాధవప్రస్తావనయం దిట్లు చెప్పియున్నాడు. "అస్తి దక్షిణాపథే పద్మపురం నామనగరం తత్ర బ్రాహ్మణాః కేచి త్తైత్తిరీయాః పంక్తిపావనాః కాశ్యపాః పంచాగ్నయ స్సోమపీథినో ధృతవ్రతా ఉదుంబరనామానో బ్రహ్మవాదినః ప్రతివసంతి త దాముష్యాయణస్య తత్ర భవతో భట్టగోపాలస్య పౌత్రః పవిత్రకీర్తే ర్నీలకంఠస్య పుత్రః శ్రీకంఠపదలాంఛనః" ఇతనిపూర్వులు బేరారుదేశమందున్న పద్మపురమను గ్రామమందు నివసించెడువారు. కాశ్యపగోత్రోత్పన్నులు. తైత్తిరీయశాఖాధ్యేతల్లు, అగ్న్యుపహితులు, గృహస్థాశ్రమధర్మముల జక్కగా జరపెడువారు. వారింటి పేరు ఉదుంబరంవారు. ఈవంశమందుజనించిన భట్టగోపాలుడనువానికి నీమహాకవి పౌత్రుడు. నీలకంఠునిపుత్రుడు. ఇతనితల్లి పేరు జాతుకర్ణి. ఇతని పేరు శ్రీకంఠుడు. "యన్నామ్నా నామా భగవాన్ యస్య జ్ఞాననిధి ర్గురుః" అని యితడు చెప్పిన ట్లితనిగురువు పేరు జ్ఞాననిధి. ఇతడు వేదశాస్త్రపారంగతు డని యితడు వ్రాసిన గ్రంథములవలననే తెలియనగును. ఈ మహాకవి కాన్యకుబ్జేశ్వరుడగు యశోవర్మనృపాలుని యాస్థానమందు బ్రవేశించినపుడు "సాంబా పునాతు భవభూతిపవిత్రమూర్తిః" అను మకుటముతో చండీశతకమను నొకశతకమును జెప్పగా నీతనిపోషకుడగు నాయశోవర్మ భవభూతి యని పేరిడెను. నాటనుండియు నీమహాకవి భవభూతియని వ్యవహరింపబడుచుండెను. క్రీస్తుశకము 693-729వరకు గాశ్మీరదేశము నేలిన లలితాదిత్యుడీయశోవర్మను జయించె నని రాజతరంగిణిలో గల్హణుడు చెప్పియున్నాడు. కావున భవభూతి అష్టమవర్ష శతకమందుండెనని మనము నిశ్చయముగా జెప్పవచ్చును. సప్తమశతకమందున్న బాణుడు తాను వ్రాసినహర్షచరిత్ర పీఠికలో గాళిదాస ప్రవరసేన సుబంధ్వాదుల జెప్పినను భవభూతి నెచ్చటను బేర్కొనకపోవుటచే నీతడు బాణునికి దరువాతివాడని స్పష్ట

మనుమన్నది. కావున భవభూతి అష్టమవర్షశతకమం దుండెనని మనము నిశ్చయముగా జెప్పవచ్చును.

ఈమహాకవి "ప్రాచేతసో మునివృషా ప్రథమః కవీనాం యత్పావనం రఘుపతేః ప్రణినాయ వృత్తమ్; భక్తస్య తత్ర సమరంసత మేఽపి వాచః" అని మహావీరచరిత్రప్రస్తావనలో జెప్పినట్లు రామభక్తుండు గావున మహావీరచరిత్రము, ఉత్తరరామచరిత్రము ననురెండు రామనాటకములను వ్రాసెను. వానిలో మొదట మహావీరచరిత్రమును విమర్శింతము. నాటకసంవిధానమునకు దగినట్లు కవి రామాయణకథను మార్చియున్నాడు. మురారి కూడ దన యనర్ఘరాఘవమందు భవభూతి యేర్పరచిన కథాసంవిధానమునే కొంతవఱకు ననుసరించెను. ఎట్లనగా, రావణుడు సీత నభిలషించుచున్నవాడై జనక విశ్వామిత్ర శతానందు లున్నచోటికి దనదూతను పంపుట - మాల్యవచ్ఛూర్పణఖాసంవాదము - వారివలు రాలోచించు నీతిప్రయోగము. రామపరశురామసంవాద మీరెండునాటకములలో నించుమించుగా సరిగా నున్నవి. మహావీరచరిత్ర ద్వితీయాంకములో చతుర్థాంకప్రారంభములోను అనర్ఘరాఘవములో జతుర్థాంకప్రారంభమందును మాల్యవచ్ఛూర్పణఖా సంవాదము చెప్పబడినది.

మహావీరచరిత్ర ద్వితీయాంకము మాల్యవచ్ఛూర్పణఖాసంవాదము. విశ్వామిత్రయాగవిధ్వంసకులగు సుబాహు మారీచులను వారి పరివారమును రాముడు సంహరించె నని విని మాల్యవంతుడు రామప్రతాపమును సహింపలేక సచింతుడై యుండగా నింతలో శూర్పణఖ వచ్చి దశరథపుత్రులపాణిగ్రహణమంగళము నిర్విఘ్నముగా జరిగె ననియు, నగస్త్యమహర్షి రామునికి మహేంద్రసంబంధమగు ధనుస్సు నొసగె ననియు జెప్పెను. అది విని మాల్యవంతుడు రాముని నిరుత్తరప్రతాపమును, ఋషులకు దేవతలకు వానియం దుండు భక్తివిశ్వాసములును, అతని సర్వగోత్రపుణ్యమును బ్రశంసించి తనవారి ధర్మప్రతిద్రోహమును గుఱించి విచారించుచు మనుష్యుడైనను సర్వావిధములబలవత్తరుడగు రామునితో విరోధము సంభవించె నని దుఃఖించుచుండగా మహేంద్రపర్వతమందున్న పరశురాము డొకవార్తాహరునిద్వారా మాల్యవంతుని కొకపత్రిక నంపెను. దానిలో నిట్లు వ్రాయబడియుండెను. "దండకారణ్యతీర్థోపాసకులకు నే నభయ మిచ్చి యుండుట మీ రంద ఱెఱింగినదియే. ఇపుడు విరాధదనుకబంధప్రభృతులు వారిని బాధించుచున్నారని వింటిని. కావున వా రట్లు చేయకుండ వారించి, మాకు మీయం దున్న మాహేశ్వరప్రీతిని రక్షించుకొనవలయును. అట్లు కానిచో మీ మిత్రుడగు పరశురామునికి వైమనస్యము గలుగును.

శూర్పణఖ:—ఎంతగర్వావష్టంభముతో వ్రాసినాడు.

మాల్య. ఇతడు క్షత్రియజనతపోవిద్యావీర్యాదులచే నుత్తముడై యీభూమినంతయును గశ్యపునికి దానమిచ్చినవాడగుటచే నిరీహుడు. అన్యులను సరకుగొనని వాడు. తాను మనము మాహేశ్వరుల మని మనయందు గొంచముప్రీతి గనపఱచుచుండును గాని పనివచ్చినపుడు మనయెడల మిగుల గఠినుడై యుండును.

శూర్ప. అతనివిషయమయి మీ రేమి యాలోచించుచున్నారు?

మాల్య. రామునిహరధనుర్భంగ మితనికి దెలిసిన యెడల సహింపడు. ఈయుభయులకు యుద్ధము సంభవించును. ఆయుద్ధములో సుందోపసుందులవలె నొకరి నొకరు చంపుకొన్నచో మనకు మిక్కిలి ప్రియము. ఇట్లు కాక పరశురాముడు రాముని జయించిన పక్షమున, మనకోర్కె సిద్ధించును. రాముడు పరశురాముని జయించినను బ్రాహ్మణుడని పరశురాముని జంపక విడిచిపెట్టును. ముముక్షువగు నీపరశురాముడు విడిచిపెట్టిన శస్త్రమును మరల బట్టడు. అందువలన మన కనిష్టము వాటిల్లును.

శూర్ప. రామునివలన భార్గవునికి బరాజయము సంభవించినచో నేమి విశేషము?

మాల్య. పరశురాము డారణ్యకవ్రతి. అతడు రాముని జంపినను మరల నారణ్యకుడే యగును. పక్షాంతరమం దారాజపుత్రుడు జామదగ్న్యుని జయించినయెడ ప్రభుమంత్రోత్సాహశక్తిసంపన్నుడై దేవతా

బృందములకు నాయకు డగును. శత్రుపక్షాశ్రితులగు దేవతలను మన మవమానింపగా బ్రకృతికోపము సంభవించును. రావణవిజేత యగు కార్తవీర్యుని వధించిన పరశురాముని రాముడు పరాభవింపగా లోకమున కంతకు రాముడే ప్రభువగును.

శూర్ప. అయితే మనమిపు డేమి చేయవలయును?

మాల్య. రామపరశురాముల కుభయులకు బరస్పరవైరమును బుట్టింపవలయును.

శూర్ప. రాముడే పరశురాముని జయించినయెడ మన రాక్షసజాతికి గొప్పకీడు మూడును.

మాల్య. అవిషయమయినకూడ శక్తికొలది ప్రతివిధానము చేయబడును. పరశురామోత్తేజనము జేయుటకు మహేంద్రద్వీపమునకు బోవము రమ్మని యుభయులు నిష్క్రమించిరి.

## మహావీరచరిత్రము

చతుర్థాంకప్రారంభములో మరల మాల్యవచ్ఛూర్పణఖా సంవాదము (మిశ్రవిష్కంభకము) సంభ్రాంతులై శూర్పణఖామాల్యవంతులు విమానముచే ప్రవేశించుచున్నారు.

మాల్య. దేవతల ఐకమత్యము చూచితివా? ఇంద్రాదులు రామునికి వంద్యులయినారు.

శూర్ప. తాతగారూ! మీ రాలోచించినది యెప్పుడైన మఱియొకరీతిగా జరుగునా?

మాల్య. దశరథుడు తొల్లి కైకేయికి రెండువరముల నొసగెద నని ప్రతిజ్ఞజేసి యున్నాడు. ఆసంగతి జ్ఞాపకముచేయుటకొఱకు కైకేయి యిపుడు మంథర యను తనపరిచారికను అయోధ్యనుండి దశరథుని యొద్దకు మిథిలానగరమునకు బంపుచున్నది. అది యిపుడు మిథిలానగరప్రాంతమం దున్న దని చారులు నాతో జెప్పిరి. దానిశరీరమందు బ్రవేశించి నీ వీరీతిగా జేయవలయునని మెల్లగా జెవిలో జెప్పుచున్నాడు.

శూర్ప. రాముడు మఱియొకరీతిగా జేయునా?

మాల్య. ఇక్ష్వాకుకుటుంబమందు సద్వృత్తి యెప్పుడును భేదింపదు. విశేషించి రామునివంటి విజిగీషుని యందు.

శూర్ప. అందువలన నేమి?

మాల్య. రాముడు పితృవచనపరిపాలకుడై యరణ్యమునకు బయలుదేఱగా సామదానభేదదండోపాయములచే నతనిని దూరముగా రాక్షసాంతికమునకు దీసికొని వచ్చి వింధ్యారణ్యమందు బ్రవేశించునట్లు జేసినచో నతడు సులభముగా దొరకును. తీక్ష్ణులయిన విరాధ దను కబంధప్రభృతులు దండకారణ్యమందు సంచరించుచున్నారు. లుప్తప్రభుశక్తియగు రాముని వంచించుటకు వారిద్దరు సమర్థులు. అందువలన సీతాస్వీకారాగ్రహమువలన రావణుని నివర్తింపజేయ నవసరము లేదు.

శూర్ప. రామునికి లక్ష్మణుడు సహాయుడై యుండుటలో నేమి ప్రయోజనము?

మాల్య. రామునివలె లక్ష్మణుండును వీరుడు, సర్వాస్త్రపారగుడు. నవ్యదండప్రయోగము వీరిద్దఱికిదుల్యమే.

శూర్ప. దూరముగానున్న దాశరథిని సమీపమునకు దీసికొని వచ్చుట; అతనితో స్త్రీవైరము దెచ్చికొనుట; యీ రెండును యుక్తముగా నున్నట్లు కానరాదు.

మాల్య. రాముడు మనకు భూమ్యనంతరుం డగుటచే ప్రత్యాసన్నుడేకాని దూరస్థుడు కాడు. పరివారముతో గూడిన సుబాహుమారీచులను తాటకను బరిమార్చుటచే రాముడు మొదటినుండి మనతో బద్ధవైరిడే. మఱియొకరీతిగాగూడ రామరావణవైరము ప్రతిపాదనీయము. ఎట్లనగా, నతడు జగమును రక్షించువాడు. మనము జగమును బీడించువారము. మనమెల్లప్పుడు నప్రియ మొనరించు రామునితో సామ మెట్లు కుదురును? దేవతలచేగూడ బ్రభువుగా వరింపబడినవాడేమి యర్థ మపేక్షించును? అందుచే దానము పనికిరాదు. భేదము పనికిరాదు. బలవత్తరుడగు శత్రువును వెల్లడిగా దండింపగూడదు. రహస్యముగా శిక్షింపవలెను. అందుచే సీతాపహరణముకంటె వేఱుగా రామునికి రహస్యశిక్ష యేమున్నది? శత్రువులు భార్యనపహరింపగా సిగ్గుపడి ప్రాణముల బరిత్యజించును. లేక సంధికైన వచ్చును. పరిభవోత్థకోపముచే మనలను వధించుటకు బూనుకొన్న యెడల నతనిని వారిధి యడ్డును. కాని రావణునితో తొలి

నుండి సఖ్యము జేసికొన్న వాలి యతనిని వధింపగలడు. ఈ సందర్భములలో చాల సంగతు లాలోచింపవలసియున్నది.

శూర్ప. అవి యెవ్వి?

మాల్య. నీవు రావణుని కిష్టురాలవు. కార్యజ్ఞురాలవు. కావున నాహృదయఖేదము నంతయును నీకు దెలిపెద. భూమ్యనంతరుడగుటచేతను క్షత్రియుడగుటచేతను రాముడు మనకు రెండువిధముల శత్రువు. మా మాతామహుడగు విభీషణుడు మనకు సహజశత్రువు. సర్పమువలె భయంకరుడు. కుంభకర్ణుడు నిద్రాళువని యతనివలన నున్నను లేనివానితో సమానుడు. విభీషణుడు ధర్మగామికాత్మగుణసంపన్నుడు గావున ప్రకృతులతనియందనురక్తులు. సంసార్పత్తులగు ఖరదూషణాదులు రావణు నాశ్రయించియున్నారు. అంతర్భేదజర్ఝరమైయున్న రాజకులము రామునిచే నభియుక్తమై భేదింపబడును. విభీషణుని విషయమై ప్రతివిధాన మాలోచింపవలెను. అతనివిషయమై తూష్ణీందండముగాని ప్రకాశదండముగాని సంశోధనముగాని అపసారణముగాని ప్రయోగింపబడవలెను. అతనిని ప్రకాశముగా శిక్షించినయెడల రాక్షసులు సహింపరు. తూష్ణీందండమయినను ప్రాజ్ఞులచే నూహింపబడినది యగు ప్రకృతిప్రకోపకారణమగును. సంశోధనము ప్రయోగించినయెడల నైకమత్యముగల ఖరాదులు వికృతి నొందుదురు. అతడు వెడలగొట్టబడ్డవాడైనను ఖరాదు లతనిని చుట్టువాయికొందురు. కావున మొదట ఖరాదులసంగతి నాలోచింపవలెను.

శూర్ప. అను జీవిత్వ మెంతవత్సితము. రావణునికి ఖరాదులకు నన్యోన్యసంబంధము తుల్యమయి యున్నను మాతామహు డిట్లాలోచించుచున్నాడు.

మాల్య. స్వామి కార్యైకతత్పరులప్రవృత్తి యిటులనే యుండును.

శూర్ప. ఖరాదులు లేనియెడ విభీషణు డేమి చేయవలయును?

మాల్య. విభీషణుడు ప్రాజ్ఞుడు. అన్నవికారమును జూచి స్వయముగా దొలగిపోవును. పౌరసునివలన భయము గలుగునని తలంపుగూడదు. చిన్ననాటనుండి సఖ్యముగల సుగ్రీవు నతడాశ్రయించును. అక్కడను మఱగా వాలిచే జంపబడును. వాలి వీని నుపేక్షింపడు.

శూర్ప. రాముడు పరశురాముని జయించినట్లు వానిని గూడ జయించినయెడల రామవిభీషణసమ్మేళనము మనకు మిక్కిల ననర్థావహమని యూహించెదను.

మాల్య. రాము డెప్పుడు వాలిని జంపునో అప్పుడే మన సంపరము రామునిచే జంపబడినవారమని తలంపుము. విభీషణుడొక్కడే కులతంతువయి శేషించును. ధర్మమయుడగు రాముడు వానికి సిరినిచ్చును గాక. ఎచటికి బంపంబడితివో అచటికి బొమ్ము. జనకదశరథులయొద్ద వసిష్ఠవిశ్వామిత్రులు లేనిసమయమున నీపని సులభముగా సిద్ధించును. నేనుగూడ లంకకు బోయెదను.

శూర్ప. (కైకసి నుద్దేశించి) అమ్మా! నీవుగూడ దుఃఖము ననుభవింపవలసియున్నావు.

మాల్య. ఖరదూషణ ప్రభృతులార! పాపాత్ముడనైన నేను మిము వధ్యులనుచున్నాను. విభీషణా! కార్యవశమున నిన్ను విడువవలసివచ్చినది. ఓయి రావణుడా! నీకు గొప్ప ఆపదను దెచ్చుచున్నాను. వత్సే కైకసి! ఇక నీ వెంతోకాలము నీయుగ్రపుత్రులను జూడవు. అని నిష్క్రమించిరి.

ఈమిశ్రవిష్కంభముచే రామవివాసనము, సీతాహరణము, ఖరదూషణాదివధ, రామసుగ్రీవసఖ్యము, వాలివధ, విభీషణుని రామాశ్రయణము మొదలగునవి సూచింపబడెను.

అనర్ఘరాఘవములో చతుర్థాంకమందు మాల్యవచ్ఛూర్పణఖా సంవాదము.

మాల్య. సీతను వరించుటకు బంపబడిన పురోహితునిచే జెప్పబడిన కకుత్స్థకులకుమారుని మానుష్యాతిశయమును విన్నది మొదలుకొని కష్టదశ ననుభవించుచున్నాను. అట్టి యద్భుతతేజస్సు మనుష్యలోకమందు నిరభిసంధిగా నెట్లుదయించును? దశాననుని

చరిత్రముకూడ దానికిదగినదే యున్నది. ఈచింతచే నాకు రాత్రులయందు నిద్రలేదు. అయ్యో! దైవము నాకింత చిరజీవిత్వ మేలయొసగెను? విమర్శించి మైథిలరాజుకూడ నకార్యజ్ఞుడు. తనపుత్రికను రావణునివంటివరుని కియ్యక మనుష్యుని కిచ్చెను. మిథిలావృత్తాంతము నరయుటకు బంపబడిన శూర్పణఖ యేమి యింత ఆలస్యము చేయుచున్నది.

(ఇంతలో శూర్పణఖ ప్రవేశించి) వివాహనేపథ్యలక్ష్మీశోభమానములగు రఘుకులకుమారుల ముఖపుండరీకముల నాలోకించి మాయామానుషభావముచే కృతార్థురాలనైతిని. ఏమి ఆశ్చర్యము? గుణస్వభావ మిట్టిది. శత్రుగతమైన నానందింపజేయును.

మాల్య. (స్నేహముతో జూచి) ఓహో శూర్పణఖా! ఇటు రమ్ము. నే నిచటనున్నాను.

శూర్ప. కనిష్ఠమాతామహుడు డీయట్టాలకశిఖరమునందే యున్నాడు. దుష్టకార్యము లన్నియును నొక్కసారి వచ్చి యితనిని జుట్టుకొన్నవి. ఏలయనగా నిపుడు ప్రజాగరక్లాంతలోచనుడై మాతామహుడు ముసలి యొకనివలె గానవచ్చుచున్నాడు. సామాన్యమయిన మంత్రిత్వము మిక్కిలి కష్టము. అందులో విశేషించి సాహసికవ్యవసాయి యగు రావణుని మంత్రిత్వము మఱింతకష్టము. ఇతడు నాకొఱకే నిరీక్షించుచున్నాడనితలంచెదనని సమీపించి, ఆర్యా! నమస్కారము.

మాల్య. వత్సా! కళ్యాణభాజనురాలవు కమ్ము. ఇచట గూర్చుండుము. దశరథుడు భరతశత్రుఘ్నులతో జనకునికడకు వచ్చినాడా?

శూర్ప. అయ్యా! దశరథుడు రాగా కుమారులకు వివాహము లయినవి. ఆసమయమందే నేను మిథిలానగరమును బ్రవేశించితిని.

మాల్య. (నిట్టూర్పువిడిచి) సీతావివాహము మిక్కిలి వెల్లడిగా జరిగినది. (విమర్శించి) ఇది దురాత్ముడగు విశ్వామిత్రుని దుర్నాటకము. స్వయజ్ఞరక్షణార్థమై దశరథునొద్దనుండి రామలక్ష్మణులను దీసికొనివచ్చి వారికి దివ్యాస్త్రముల నుపదేశించి సుబాహుమారీచాదిరాక్షసుల జంపించెను. హరధనుర్భంగమును జేయించి రామునికి సీత నిప్పించి వివాహము జేయించెను. ఇకముం దేమి చేయునో నాకు దెలియదు. కానిమ్ము. అతీతవర్ణనచే నేమి ఫలము? సీతాబలాత్కారగ్రహణమందు బ్రయత్నించుచుండెడి రాక్షసపతి విషయమయి యేమి ప్రతివిధానము?

శూర్ప. ఆర్యా! సీతాగ్రహణమందు బలాత్కారము తప్ప మఱియొక ఉపాయము గానరాదు.

మాల్య. వత్సా! అట్లనబోకు. అట్టిమహానుభావునిచే బరిగ్రహింపబడిన సీతను బలాత్కారముగా సంగ్రహించుట మహాప్రమాదము. ఆయితే యిక మన నిశాచరనాథు డీపని జేయగా మన మెట్లు వారింపగలము?

శూర్ప. తెలిసి యాలోచించినట్లు కాల మెంతయుకుటిలముగా నున్నది. ఏల యన; త్రిభువనలక్ష్మీలీలాబందీకారుడగు మహారాజు రావణుని విషయమయియుకూడ నిట్లాలోచింపబడుచున్నది!

మాల్య. విశ్వామిత్రుడు దివ్యాస్త్రముల నొసంగెను. హరధనుర్భంగముచే దేవతల కందరికి గొప్పఉత్సవమాయెను. ఈజగత్త్రయమంతయు రఘుపతిచే నాక్రీతమని యెఱుంగుము.

శూర్ప. ఇందుకు సందేహమేమి? ఆవివాహమహోత్సవమందే నేనంతయు గన్నులార జూచితిని.

మాల్య. రావణునిదుర్గళ - పదియుంది కూడి రాళ్లురువ్వి యొకనిని జంపినట్లగును. మిథిలానగరమును బ్రవేశించి రావణుడు బలాత్కారముగా గళత్రము నపహరింపగా రాము డెట్లు సహించును? రావణుని జంపుటకు బ్రయత్నించు రామునికి పౌరజానపదులందఱు సహాయము గావించెదరు. అరణ్యాగ్నివలె నాతని తేజస్సు దుష్ప్రసహ మగును.

శూర్ప. (వేడినిట్టూర్పు విడుచుచు) అయ్యా! ఇపు డేమి చేయుట యుక్తము.        [సశేషము]



ఓమ్

# కూ నూ రు

( ము గ్గు రు )

మహారాజశ్రీ మామయ్యగారికి. కోయంబత్తూర్, 2-7-23.

న మ స్కా ర ము లు.

క్షేమముగ మేము నేఁడు కోయంబత్తూరు కుశలముగఁ బ్రవేశించినాము. నేఁడే చెన్నపురి వెళ్లెదము. నేను శ్రీగురువుగారును కూనూరును బ్రశంసించుచుఁ దొందరగ రచించిన పద్యముల నిందుతోఁ బంపితిని. వీనిపై మీ యభిప్రాయమును దెలుపఁగలందులకు శ్రీగురువుగారు కోరుచున్నారు. ఈ పద్యములకు వేఱుప్రతి లేనందున వీనిని జూచి వెంటనే చెన్నపురికిఁ బంపుఁడు. జాబును వ్రాయుఁడు.

చిత్తగింపుఁడు.
చిం. సీ. రా.

ఓమ్

## వీ డు కో లు పు

సీ. అభ్రంకషంబు లైనట్టి శృంగములపై, విహరించితిమి సింధువేష్కతోడఁ
జరియించితిమి భయంకరగుల్మతరులతా, గహనభూములఁ గనుఁగందకుండ
వడవడవడకించు నలితెమ్మెరలపెంపు, భరియించితిమి విసిర్వ్యాఘ్రకముగఁ
దనివొందితిమి సుధాధారామధురచిత్ర, ఖగగానములు వీనుఁగవలఁ గ్రోలి
సర్వరక్షకుఁడైన యీశ్వరునికరుణ, నింతకాలంబు మేము నీచెంత నిలిచి
యింక నేఁగుచున్నార మింట్లకడకు, ననుమతింపఁగదయ్య! నీలాచలేంద్ర!

చం. తరుప్రలతీరు, నూతనలతానివహంబులసౌరు, నీరదో
త్కరముల పెంపు, సంతతవికాససుమప్రచయంబుసొంపు, ని
ర్ఝరనిచయంబుచొప్పు, విలసద్వనవీథులయొప్పుఁ, గల్గి మే
టి రహిఁ వహించు నిన్నుఁ బురుడింపఁగఁజాలెడుకొండ లున్నవే?

మ. ఒకచోఁ బూచినతీవ లుల్లమున కత్యుత్సాహముంగూర్ప, వే
ఱొకచోఁ బండినభూరుహావళులు నోరూరింప, నింకొక్కచో
నకలంకామృతపూర్ణనిర్ఝరము లుద్యత్ప్రీతిరెట్టింప, నె
న్నికకుంగా మీఱిన నీ మనోహరత వర్ణింపం దరంబా నాకో?

గీ. వక్రపథగాములై వచ్చివచ్చి నీదు, నెత్తి నెక్కినఁ గాని మన్నింతు వనిన
నెంచఁగారాదె నీదైన మంచితనము, నీలభూధరరాజ! నిర్నిద్ర తేజ!

మ. సకలామోదకరత్వదీయ వనసంచారం బదేవారి కూ
రక లభ్యంబగుఁ బూర్వపుణ్యఫలసారప్రాప్తిచేఁగాక? దా
నికి దూరంబయి పోవుచుంటి మన నెంతే చింత వాటిల్లదే
యకటా! నీమెడఁబాటు మాకు గిరిరాజా! దుస్సహంబౌఁగదా.

సీ. ఒకనాఁడు బహుసాహసోద్రేకమున భవ, ద్దుర్గమారణ్యముల్ దూఱి చనుచు
నొకనాఁడు సంతోష ముప్పొంగ నీదుకూ, టాగ్రంబులం దెక్కి యాడుకొనుచు
నొకనాఁడు కోర్కెకీరికలెత్త భవదీయ, జలపాతములఁ గాంచి సంతసిలుచు
నొకనాఁడు పరమకౌతుకముతోఁ గ్రొత్త త్రో, వలువట్టి విహరణంబులు సలుపుచు
మామహారాజు ముద్దుకుమారకులును, మేము నానందమయులమై మేటిసుఖము
చూఱలాడినయట్టి యాసుదివసములు, మఱలవచ్చునె జన్మజన్మములకైన?

క. గురుగౌరవమున నమ్మ, ద్ధరణీనాయకు ననుంగు తనుజన్ములు మ
మ్మరసి దయఁ జూచుచుండఁగ, మరల భవన్నికటమందు మసలుట యెప్పుడో?

క. తృణకాష్ఠజలసమృద్ధిన్, గణనీయంబగుచు నీశిఖరమునకు విభూ
షణమైతగు కూనూర్ప, ట్టణమున వసియించు టక్కటా! యిఁక నెప్పుడో?

మ. జలపాతంబులయొద్ద కేగి పరమోత్సాహంబుతోఁ దచ్ఛిలా
స్థలులన్ శీతలనీరబిందు నివహస్యందంబులం దోఁగు భూ
తలనాథాత్మజు లేమునుంగలసి సంతాలాడుచున్ వేడ్క విం
దులు గావించెడు పుణ్యవాసరము లెందో మాకుఁ జేకూరుటల్.

సీ. చిటపట వర్షించు చినుకులం దేనాఁడు, విహరించినారమో వేడ్క మిగుల
నేనాఁడు పొగమంచులోన డాఁగుడుమూఁత, లాడుకొంటిమొ ముదం బావహిల్లఁ
జలిగాలిలోన వెచ్చనిదుస్తులం దాల్చి, యేనాఁడు శిఖరంబు లెక్కినామొ
గుడ్డిమెంపలలోనఁ గులుకుచు నేనాఁడు, వచ్చినారమొ యసివాఱుపోయి
అట్టి సుదినంబు లవి యెల్ల నరిగిపోయె, నంతయును మాకు స్వప్నవృత్తాంత మాయె
నేమనఁగవచ్చు? నింక మే మింత కేగి, కథలుగాఁ జెప్పుకొనియెడు గతియె కలిగె.

సీ. తలలతో నాకాశతలము రాసెడు నీదు, భూరుహంబుల కిదే బుజ్జగింపు
తెలిమఱుల్గియపుసరంబులయొప్పుఁ జూపు నీ, జలపాతముల కిదే సాంత్వనంబు

కలగానమధురసంబులు విందువెట్టు నీ, విహగంబులకు నిదే వీడుకోల్పు
చిత్రవర్ణప్రశస్తివహించి నవ్వు నీ, కుసుమంబులకు నిదే కూర్మిముద్దు
అతిథిసత్కారసంతతోదాయత్తచిత్త, వృత్తి వగు నీ కిదే నమస్కృతిశతంబు
సెలవొసంగుము పోయి వచ్చెదము మమ్ము, మఱచిపోవకుమయ్య! భూధరవరేణ్య!

సీ. ఎల్లి నిన్విడిచిపోయెద మనుగ్రహ ముంపు, మాపై మహారాజమందిరంబ!
యిట కింక రాము రేపటినుండి మాపొందు, మఱచిపోవకు మమ్మ మధురవాపి!
యీనాఁటికేకదా యిట దంతశోధ స్ఫుట మమ్ముఁ దలఁతువో తటతలంబ!
నీ కెవ్వ రింక రేపు నీళ్లు వోయుదురమ్మ! దూర మయ్యెదు మాకుఁ దుమ్మిమొక్క
యెచటివారము మేము! మీ రెచటివారు? కలసికొంటిమి దైవసంకల్పవశతఁ
దాదృశంబు ఋణానుబంధంబు తెగియెఁ, బాయుచున్నార, మేమి సెప్పఁదగు నింక?

హైల్యాండ్సు
కూనూరు, నీలగిరి
2-7-1923

ఓలేటి వేంకటరామశాస్త్రి.

---

ఓమ్.

# కూనూరు

1. ఆతిథ్యము:

సీ. జలజల జాల్వాఱు స్వాదునిర్మలనిర్ఝ,రాంబువు లర్ఘ్యపాద్యములు గాఁగ
నెఱనెఱ 'టీ' మొల్క లడరి గోమున మించు, శాద్వలస్థలము లాసనముగాఁగ
నటునిటు నూఁగాడు నవనీజశాఖాళి, కమనీయతాలవృంతములు గాఁగ
వేర్వేఱు చవుల నివ్వెఱఁగొల్పు ఫలరాశి, షడ్రసోపేతభోజనము గాఁగ
విహగతతి విన్పు సన్యక్తవిమలగుణము, మధురగానంబు గాఁగ సమ్మానగరిమ
మాకు నాతిథ్య మిడితివి మఱవఁగలమె? చారువైభవభరమ! కూనూరుపురమ!

అద్రులు:

సీ. ఆరోహణావరోహణకాలములఁ ద్రిభు,వనవిహారము తలంపునకు వచ్చె
సంజవేళల దృష్టిసారింపఁ గైలాస,మేరువుల్ హృద్వీథి మెలఁగఁజొచ్చెఁ
గనుచూపుమేరకుఁ గలయఁ జూచినవేళ, ధాన్యంపురాసులు దలఁపువచ్చెఁ
బైనుండి క్రిందికిఁ బ్రవహించుసెలయేళ్లు, త్రిపథగాలక్ష్మి జ్ఞప్తికి మరల్చె
నద్రివరులార! మీపయి నరిగినపుడు; గన్నులారంగ మిమ్ములఁ గాంచినపుడు;
పోవుచున్నార మింక మిమ్ములను వీడి; అకట! క్రమ్మఱఁ గాంచుభాగ్యంబు కలదె?

అద్రిమార్గములు:

సీ. పాతాళమాననుండి స్వర్గంబు తుదిదాఁకఁ, జెలువారి నిడినని శ్రేణు లనఁగ
నచలస్థితి దలిర్చ నాపాదమస్తంబు, రచియించినట్టి పెన్త్రాళ్లనంగ
నగ ముపఘ్నముగాఁగ నెగఁబ్రాఁకి వలిపంపుఁ, తీయఁగాఁ గాచెడి తీవలనఁగ
నానందసౌధాగ్ర మంది యందుఁ జరింప, విలసిల్లు సోపానపంక్తు లనఁగ
నద్రిమార్గంబు లొప్పు విహారయోగ్య, సమ్యగానందదాయకస్థలము లగుచు
సతతమానవసంచారసంభవంబు, లయ్యు నీశ్వరరచితంబు లనఁగఁ దనరి.

మొల్కలు:

ఉ. కొండల నెక్కి మాకుఁ దమకోమలపావనహస్తరాజముల్
నిండిన వేడ్క నూఁతయిడి, 'నిర్భయచిత్తులరై చనుండు రా
రండ'ని మాకు సాయము చిరం బొనరించిన మొల్కలార! యె
న్నం డయినన్ మిము న్మనమునన్ స్మరియింపక యుండ నేర్తుమే?

విహారము:

ఉ. చల్లనినీడలందు ఘనసానుస్థలందు వియత్ స్థలంబుతో
నుల్లసమాడు శృంగముల హాయిరని పాఱెడు కొండ కాల్వలన్
బల్లపులోయలన్ బహువనంబులలోఁ జరియించినార మే
ముల్లము లుల్లసిల్ల సరసోక్తులతో నగరీమతల్లికా!

సీ. సెలయేళ్ల పరిసరంబుల ఫలాహారముల్, మనమార మెసవుచు మసలినాము
బంగారుటీరెండఁ బైఁ బూసికొని దివంబుల షికార్లను బెక్కు సలిపినాము
దడదడఁబడుచుండు జడివానసోనల, నంగరఖాలతో వెలంగినాము
మిన్నుమన్నును నొక్కటెన్నుఁ జేసిన పొగ, మంచులోపల సంచరించినాము
రివ్వు మని వీచుగాలిలోఁ రేణులందుఁ, జీకటులలోనఁ జిటపొటచినుకులందు
మించువేడుకతో విహరించినాము, భోగనికరంబ! కూనూరుపురవరంబ!

శుభ్రాభ్రములు:

సీ. సురతరంగిణినుండి ధర రాలు తరఁగల, నురుగులఁ దలఁపించి యారుస మొసఁగు
పగలింటిదొర తేజివదనంబు వెల్వడు, ఫేనంబుఁ దలఁపించి ప్రియము గొలుపు
తెల్లనిదొరమేనఁ దీర్చెడు సితభస్మ, పుంజంబుఁ దలఁపించి ముదము వెట్టు
సుర లార్చుకొను ధౌతపరిధానసముదాయము, మును దలఁపించి ప్రమోద మిచ్చు

నంతరాళంబులో దేలియాడుచుండి, యక్షీపర్వంబుగాంగ శుభ్రాభ్రసమితి
భళిరె! కూనూర! నీవెంతభాగ్యవతివొ! తరమె యేరికి నీపుణ్యగరిమ పొగడ!

వనాంతరసీమలు:

చ. చిగురులసౌరు పత్రములచెల్వము మొగ్గలతీరు పుష్పముల్
సొగసును బూవుబిందియలసొంపును పిందెలకావి పచ్చికా
యగమిబెడంగు పండులకమొయారము కొమ్మలనీటు చెట్లసొ
యగము నుతింపంగా దగు వనాంతరసీమలయొప్పు లెంతయున్.

సూర్యదేవుడు:

సీ. ఖరకరుండని తీవ్రకరుండని తిగ్మాంశుండని వేడివెల్గని యఖిలజనులు
నిన్నుం దపనుం గాంగ నెన్నుచుందురు రూఢి,పదముల సూర్యదేవా! కనంగ
ఖరకరత్వము గానంగారాదు కానంగా, రాదు వేడిమియుం జిత్రంబు తండ్రి!
యింతచల్లనిచూపు నీగిరివ్రజమందు, సారించినాండవ వేకారణమున?
దృష్టి నీమీంద నిడి నీవె దిక్కుగాంగ, నిన్ను సేవింపవచ్చెడి నియతమతుల
నట్లు చూచెదుకాంబోలు నయ్య! దేవ! అచలసన్మార్గు లెంతధన్యాత్ము లొక్కొ!

ప్రకృతి:

సీ. రేరాజు దినరాజు రేపవల్ మేఘాళి, కావల దూబూచు లాడుచుండ
జీమూతతతి రోదసీగహ్వరమునందు, స్వేచ్ఛావిహారముల్ సేయుచుండ
దమిమీఱం బవనుండు తరుగుల్మలతలలో, నొయ్యొయ్య నుయ్యాల లూంగుచుండ
గలకలధ్వని విహంగంబు లుప్పరవీథి, యందు నుప్పనంబట్లు లాడుచుండ
నలరు లామోద మందందం జిలుకుచుండం, గమ్మనూరెండ లింతింత గాయుచుండ
బ్రకృతిసౌందర్యజలధిలోపల నయారె! యోలలార్చితె మమ్ము! కూనూరుపురమ!

సింహావలోకనము:

చ. కరువలి యెండ వాన హిమకంధరముల్ వలపింపంగా వనీ
గిరులను మెట్టుచున్ ననలు గిల్లుచుం బండులు కోసికొంచు ని
ర్ఝరమధువున్ విహంగకలరావముం గ్రోలుచుం జెట్లనీడలన్
జరుగుచు నస్మదీయనృపసంతతి మేముం జరింప నయ్యెడిన్.

వియోగము:

సీ. చల్లచూపుల నించు చంద్రభాస్కరులార! తమిమీఱం దిరుగు నభ్రంబులార!
తరుప్రజల గిలిగించి మురియు తెమ్మెరలార! వెండినీరాను నీరెండలార!

అభ్రంబుతో మేలమాడు వృక్షములార! చల్లఁగా మలఁగు నిర్ఝరములార!
కలరవంబునఁ బాడుఖగవితానములార! మఱుమాయగావచ్చు మంచులార!
వలపునవ్వుల నవ్వు పుష్పంబులార! రాగమును జూపు పల్లవరాజులార!
రసము లొలికించు ఫలనికరంబులార! చిత్రచిత్రంబులార! మాచిన్నలార!

మ. అకటా! మి మ్మొడఁబాయునట్టి సమయంబయ్యెన్ వియోగంబు మే
మిఁక నెట్లో భరియింప? మీశీతలచ్ఛాయతోఁ బ్రాద్విషద్యాస మొం
దికడున్ దోఁచకయుండు; నిన్నిదినముల్ నెయ్యంబు తియ్యంబుఁ బొం
దుకొనంగా విహరించినార! మిఁక నెంతో యిట్టియానందముల్

మేలు:

క. మారాజకుటుంబము మే, మారోగ్యము గలిగి తిరుగునట్టిశుభము కూ
నూరుపురీ! దయ నొసఁగితి; వారయ నీమేలు మఱువనగునే మాకున్?

'హైల్యాండ్స్' కూనూర్ 2-7-1923 }                    పంతలపుడి సీతారామయ్య

---

శ్రీరామాయనమః

పిఠాపురము, 8.7 23

క. 'కోయంబత్తూర్' నగరమునఁ, బాయుచు మీ రనిచియున్న పద్యాన్వితలే
ఖాయుగళము కరగతమై; యాయతసమ్మోదపరవశాత్ము నొనర్చెన్.

చ. కవివరులార! మీరలు వికాసవిశుద్ధమనోజ్ఞబుద్ధిచే నా
శువున రచించి పంచిన వచోమణిగుంఫితపద్యమాల గ
స్తవ చరితార్థ మానటు లొనర్చె వినీలధరాధరేంద్రము
బ్రవిమలనిర్ఝరాంబువుల భవ్యవనంబులఁ గానిపించుచున్.

సీ. సాంద్రనీహారసంఛన్ననీలమహీధ్ర, సానుసంచారంబు సలిపినట్లు
తరులతాగుల్మసంతతశోభిరమ్యాట, వీవిహారంబు గావించినట్లు
సహజశీతలతా ప్రసన్నాంబుధరభిన్న, వర్షధారలఁ బర్వ వాఱినట్లు
అత్యున్నతావనీధ్రాధిత్యకారోహ, ణావరోహణముల నలరినట్లు
కేలి కలగంటి! వెలలేనిహాయి గంటిఁ! బిదప మేల్కొంటి! గనుఁగొంటిఁ బెంపుటింటి
తెల్లవాఱినదాఁకఁ జింతిల్లుచుంటి! మీయదృష్టంబునకుఁ జాల మెచ్చుకొంటి!

8

ఆ. గీ. గురువుగారికవిత సరసధారాశుద్ధి, లలితభావఫణితి వెలయుచుండె
వారిశక్తి యెన్న వశమానె? యుభయభా, షాకవిత్వకరణచణులు వారు.

ఆ. గీ. మాయనుంగుభాగినేయుని క్రొంగ్రొత్త, కవిత నూత్నభావకలిత మగుచుఁ
దత్పురోభివృద్ధిఁ దలఁకించుచుఁ బ్రమోద, వారిరాశిఁ దేల్చివైచుచుండె.

మ. తనిపోవం బరికింప మీదగు కవిత్వప్రౌఢి; యీ రీతిఁ దోఁ
చెను నాకుం "బృథుకాక్షరంబులు గురుశ్రీవర్ణతుల్యంబులే"
యని; యైనం గడు నారితేజనకలంబై యున్న దొక్కండు, నూ
తనమార్గంబున నున్న దొక్కఁ, డిట భేదం బెన్నఁగా రాదగున్.

తే. గీ. ఇంతకును సంతసింపంగ నెలయు నొకటి, మనమహారాజుఁ దత్కుటుంబమును మీరు
సేవకాళియుఁ జిట్టిని చేదకుండ, వెడలివచ్చితి గదె పదివేలు మాకు.

తే. గీ. ఎపుడు నగరంబునకు మీర లేఁగుదెంతు, రెపుడు మిముఁ గనిసౌహార్ద మొసక మెసఁగ
స్వాగతం బని యచ్చటివార్త లెల్ల, నడిగి విని యుబ్బఁ గల్గునో యనుచు నుంటి.

---

ఉ. భోజధరాతలేంద్రు మొగముం గనువాని కిసల్పకల్పనా
భ్రాజితకావ్యసంసృజనపాటవ మబ్బెడి దంద్రు పెద్ద; లం
యాజభవత్కవిత్వ మిపు డుత్సుకితం బకీయుంచు నాం కయం
రే! జనియించె నిక్కపిత, యీశ్వరతత్త్వ మెఱుంగ శక్యమే?

నడకుదుటి వీరరాజు.

---

ఓమ్.

'S'
'Dunmore'
Madras.
10-7-23.

మామయ్యగారూ!

నమస్కారములు.

క. మానితమృదుభాషితములు, నానారసభావకల్పనా మిళితంబుల్
మానవరత్నము లందె న, నూనానందాద్భుతాబ్ధి నోలార్చె మమున్.

ఉ. ఎప్పుడు వచ్చునల్లుఁ, డిఁక నెప్పుడు వచ్చును మిత్రవర్యుఁ, డిం
కెప్పుడు నేను వారి కెదురేఁగి యొసంగుదు స్వాగతంబు? నా
కెప్పుడు వీనులం బడునొ యింపగు నచ్చటివార్తలెల్ల? నే
నెప్పుడొ యుబ్బఁగల్గు? టను నిట్టి త్వదుక్తులు మాకు దీవనల్.

క. మీయాశీర్వచనఫలం, బా యనఁగా సుంత వెనుకఁ బట్టెఁ బ్రయాణం;
బాయూరియుదంతము లా,ప్యాయముగా నాలకింప నగు సముఖమునన్.

చ. ఇది యటులుండె, ఔ!—కవన మిట్టి జనించెను మీకు నిప్పుడే!
యదియునుగాక భోజవసుధాధిపుఁ డయ్యెను మాదుకైత! మీ
సదమలనూత్నభావనరసంపుఁగవిత్వము కాళిదాసుఁగా
నిదె మిము మార్చివైచె! భళి! 'యీశ్వరతత్త్వ మెఱుంగ శక్యమే'?

గీ. 'అక్షరము' లంచు 'వర్ణంబు' లంచు, నవ్వి 'తుల్యములె' యంచు నర్థంబు దోపకుండఁ
బొగడు తెగడులమధ్య మమ్ములను దూర్చి, యేమొ వ్రాసితి రొకపద్య మేర్చి కూర్చి.

సీ. 'కలగంటి' నని వ్రాసి కడుపుబ్బ నవ్వింపఁ, 'బెంకుటింటిని' గానుపింపఁ బ్రియమొ?
అద్వితీయకవిత్వ మది మీకు నుగ్గుపా, లయ్య 'సద్యఃకవి' ననుట ప్రియమొ?
'కవివరుల్' మీ రని కలముబల్మి వెలార్చి, యంతగా మము మేలమాడఁ బ్రియమొ?

చిం. సీ. రా.

అణుపారల్లేని మాయన్నదమ్ములలోన, భేదభావంబు గల్పింపఁ బ్రియమొ;
తెలిసె మీపక్షపాతబుద్ధి యది యింక, నెఱుఁగలే మనుకొంటిరో యేమొ; మీరు
పెద్ద; లేమేమి యాడినఁ బ్రియమె; కాని, యింతనుడికారితనము మే మెందుఁ గనము.

చ. సుహృదయరత్నమా! పటునచోరచనాపరిపాటిమై గుణ
గ్రహణపరాయణత్వ మధికంబుగఁ దోఁపఁగ మిత్రబంధ్వను
గ్రహమున మాకవిత్వము పొగడ్త యొనర్చిన మిమ్ముఁగూర్చి, యా
గ్రహపడఁబోలునో ముదముఁ గాంచఁగఁబోలును యానతీదగన్.

ఓ. వేం. రామశాస్త్రి.

శ్రీదేవాయ నమః.

పీఠికాపురము, 13-7-23

ఓకవీంద్రులార! యుభయులు నేకమై, నన్ను నొంటిఁ జేసి నవ్వుటాల
తోడ నాశుకవిత జోడించి వ్రాసిన, పద్యసప్తకంబు ప్రమద మొసగె.

మ. పదిరెండేఁడులు దాఁటిపోయెఁ గవితాబంధంబు నన్వీడి; నేఁ
డుదితం బయ్యె భవత్కృపత్వపరనోద్యోగంబునం జేసి; దో
హదముం గూర్చిన మీకవిత్వ మలభోజాధీశుఁ జూ టబ్రమే?
యిదిసత్యేతరమే? కవీంద్రులకు మీ కెట్లాడినం జెల్లదే?

క. పొగడో తెగడో యరసిన, నగపడియెడి; దేల యిట్టు లరమర స్పెందక ?
బిగివీడరు, పెఱవారల, నగచాటులఁ బెట్టుచుందు రౌర! కవీంద్రుల్ !

క. కలగనుట కల్ల యగునేకొ! కలము బలిమియొక్కొ మిమ్ముఁ గవివరు లనుటల్!
కలుగునొకో యహంకార లిఁక, తెలిసెను నాపకుపాతక్షమణ! బలాగే!

చ. అహంకార లేల గల్గు హృదయంబు లభిన్నము లైనచోట? ని
ద్దఱకును గల్గువాసి విదితం బయినంత లిఖించినాఁడ; ని
ర్తీక నను వేలుసేఁత గురుధర్మమొ? పద్యము దవ్విదిఁ జేసి మీ
నెఱతనము న్వెలార్చితిరి! నేరమి చూపుట యిట్టిదేకదా!

చ. సుహృదయులార! బంధుర వచోమృదుభావవిచిత్రకల్పనా
సహ మగుమీకవిత్వమును వర్ణనచేసితి లోకధర్మసం
గ్రహమతిఁ దోఁచినంత; యథార్థంబుగ వర్ణనసేయుదాఁక నా
గ్రహవడఁ జెల్లునో ముదముఁ గాంచఁగఁ జెల్లునొ ముందు వ్రాసెదగున్.

క. ఇంతకు నంతకు మీ రసు, వెంతయుఁగా కనుచు నెనరు తెన్నులు గనునా
కెంతయు నంతవొప్పెను మీ "సుంత వెను కంబట్టు" ననెడిసుద్ది గనంగన్.

న. వీరరాజు.

ఓమ్.

'Dunmore'
Madras.
15-7-23.

మాననీయ్యగారు ! మిత్రమా ! కవీంద్రా !

నమస్కారములు:—

ఉ. 'ఇంద్ర'పదంబు మాకుఁ దగునే యటు లీయఁగ మీకుఁ బాడియే
సాంద్రవచః పటిష్ఠగుణసాగరు లౌటను మీరు మమ్ము ని
స్తంద్రత నట్లుపల్కితిరి చాలు మము న్వినుతించుపల్కు లా
'యింద్ర'త మీదె మీకవితయే ఘనదుందుభి యట్లు చాటగనే.

చిం. సీతారామయ్య.
ఓ. వేం. రామశాస్త్రి.

శ్రీదేవాయనమః.

పీఠికానగరము 16-7-23

క్షేమము — కవిశేఖరద్వయమా!

చ. పదములు తొట్రుపాటుఁ గను, భావము తెక్కలు దాల్చు, నర్థసం
పద పరదేశ మేఁగు, సుకుమారత బేలతనంబుఁ గాంచు, బ
ట్టడవడ నొందు, ధార వెనుకాడు, నుదారత డిందుఁ, బాకమో
ముదురును గానఁ బ్రస్తుతము మాయుద మాశుకవిత్వలేఖినిన్. [స్వకీయ పద్యము]

సదకుదుటి పిఠాపురాజు.

---

ఓమ్.

'Dunmore'
Madras.
18-7-23.

కవీంద్ర చంద్రమా!

నమస్కారములు.—

చ. పదములు తొట్రుపాటు గనవు; భావము తెక్కలుఁ దాల్పవు; దర్థసం
పద మఱియెందుఁ బోదు; సుకుమారత బేలతనంబు రాదు; ప
ట్టడవడ గాదు; ధార వెనుకాడదు; దుదారత పోదు; పాకమో
ముదురదు; కాని ప్రస్తుతము మానితి మాశుకవిత్వ లేఖినిన్.

ఓ. వేం. రామశాస్త్రి.
చిం. సీతారామయ్య.





# మూన్నాళ్ళముచ్చట

(ఒక విమర్శనము)

ఆంధ్ర శేషగిరిరావుగారు

ఉ. 'కూర్చిన కూర్పులా? స్వరసగుంభనముల్; తేర్చిన తేనె.'......కవితాప్రసారమా?

ఇది యొక చిన్నిరసవత్ప్రబంధము. ఆంధ్రలోకమునకుఁ జిరపరిచితులగు శ్రీయుత వేటూరి ప్రభాకరశాస్త్రికృతము. 'ఈనాటివి యీనాఁటివియుఁగాఁ గథలఁ గల్పించి చినచిన్నకృతులు రచింపఁ' దలఁపుఁగొని వీరు కూర్చి ప్రచురించినకూర్పులలో ఈ 'మూన్నాళ్ళముచ్చట' తొలిమొగ్గ. ఈ కృతి హృద్యమధురరచనాశోభితంబై, నీతిబోధకంబై రసవంతంబై, యలరారుచున్నది. ఇయ్యది చదువం జదువ రసజ్ఞులకు నోరూరక మానదు. ఇందలి కవిత్వము.— చవిగల ఆంధ్రప్రబంధరాజముల చక్కం జదివిచదివి యందలి అందచందముల రుచిపొం దెఱింగిన యభిజ్ఞుని రసోదంచితమును రామణీయకమును అగురచనముగాని 'కట్టెలమోపుకవిత్వపుకూఁత' గాదు. 'నేఁటి అంగడికవుల'పద్యముల వలె నెక్కువడి కుంటువోక శ్రీశాస్త్రిగారి పద్యములు నిరర్గళధారాప్రవాహోపేతములై శబ్దస్థాపనము గలిగి, మేలైనశయ్యతోఁగూడి యుచితరీతుల నొప్పారి, విందుఁగొల్పుచుండు తేనియ తేటలు.

'నీతినిం బొరంగల్గిన' ఈకథాసార మారసి 'ఆరంగూరినకూరిమిం జెలఁగు' తరుణ దంపతులు మేలుగాంతురను ఉత్సాహముతో ఉన్నతాదర్శముతోఁ గవి దీనిని రచియించెను. 'చిక్కనైన' మేనిచెలువు గల్గిన ఎల్లియను 'క్రొవ్వంజవ్వనముబ్బ' దాసి గుబ్బెత 'టక్కుంజెక్కులంజెక్క' లేఁ బ్రాయంపుఁ బెంజీఁకటిని మునిఁగి, 'పువ్విల్కానికిఁ గీర్తి విత్తమును గోల్పో'వుచున్న ఇల్లుజేని నిల్లాలు తిలకించి మందలించుట ఇందలి యితివృత్తము. దీనిని గవి ముద్దులుమూట గట్టుపదరచనతో శ్రవణాభిరామముగా రచించి ధన్యుఁ డాయెను.

"అనుకూలవతి; నాదుమనసులో వర్తించు
కులకాంత మది నెంత కుందునో కా?"

అను ఏకపత్నీవ్రతుఁడగు ప్రవరాఖ్యుని మాటలకును, ధర్మపత్నియెడల ధర్మభ్రంశము గావించిన ఈయిల్లుజేని దిగువవాక్యములకును గలతారతమ్యము చదువరులు కనుఁగొందురు గాక!

"శాకంపింపక మన సిష్టు పెండ్లితజే సంకల్పంబు "ధర్మ
ప్రజా, సంపత్త్యర్థ" మటంచుఁ జెప్పితిని దుచ్ఛం
బైన కామేచ్ఛకై, దంపత్యమ్ము నిరాకరించు ఋషి
తాత్పర్యంబు గుర్తించియున్, దాంపత్యంపుఁ బవి
త్రతన్ జెఱిచితిన్ ధర్మేతరప్రక్రియన్.

చ. తలఁచిన సిగ్గుగూరు శపథంబుగ 'నాతిచరామి' యం
చు నేఁ, బలికితిఁ బెండ్లినాఁడు హితబంధుగురుద్విజ

వహ్నిసన్నిధిఁ, దెలిసియు నర్థముగా నెఱపితిఁ
దుర కట్టు లనర్థ మయ్యెనో, యలఘుతరార్థముల్
గన మహర్షికృతంబులు గృహ్యధర్మముల్."

భర్తవజ్జ కనులారఁ గనుఁగొని ఈ ఋల్లాలు వెల్లఁబోసికొనిన తలపోఁతలు వారివారి భర్తలకుఁ బరిచర్యలు సలుపఁ బ్రాలుమాలు పెద్దయింటి ఆడుపడుచుల కెల్లఁ జిరస్మరణీయములు.——

"శా. కా కేమున్నది నేనె మంచమతినై కావించితిం దప్పిదం, బేకాలమ్మును భర్తృదాస్యమును నేనే యేల
చేయంగరా, దాసుల్ పోఁకలుసైత మీయవలెనే
యాదాసి యెల్లప్పుడున్, నాకై చూచుచుఁ గాచుకో
వలయుఁ గాదా భర్తృవాల్లభ్యమున్.

చ. ఎఱిఁగి యెఱింగి యింటిపను లేయెడఁ జేయఁగఁ బ్రాలుమాలి యక్కఱ నిరుపూఁట వండుటయె కష్టము
గాఁ బసిబిడ్డ లేడ్చుచోఁ, దటి పరిదిద్దుకొంటకే
సతం బడుచున్ బతి నెమ్మినమ్మి రే, మఱి మఱి
చూఱవిడ్చితిని మానము ప్రాణము దాసిమిందనన్."

అని చింతించుచుఁ జిఱుతసంతానంబుపై వ్రాలి తద్భావోద్రేకము మాన్ప వతఁబసు కాంతను కాంతుఁడు చేరఁజేరి పిల్లల ముద్దాడు నెపము పెట్టి చల్లఁగ సల్లాప ముపక్రమించినాఁడు. అంత నాసాధ్వీమణి.——

"గీ. తల్లిఁ దండ్రి నక్క సెల్లెండ్ర నన్నద
మ్ములను విడిచి పుట్టినిలు త్యజించి
తిమ్మె దైవ మనుచు నమ్మి వచ్చినదాని
నాఁడుదానిఁ దగునె గోడు కుడుప!

గీ. అత్త చేసినపనులకు నాఁడుదియును
మగఁడు చేసినపనులకు మాఱుఁ గలదె?
ఇతరులకుఁ జెప్పఁదగు గృహపతులె యిట్లు
మెలఁగఁజొచ్చిన ధర్మంబు నిలుచు టెట్లు?

క. పతు లెల్లప్పుడును బతి
వ్రతలుగ నుండవలె ననునిబంధము కలుగన్
బతు లెల్లప్పుడుఁ బత్ని
వ్రతులుగ నుండవలె ననునిబంధము లేదో!"

అని యగని. గసరినది ఆపై నిల్పలేఁడు ప్రేమ కొసర నారంభించినాఁడు. అత్తటి ముద్దుబిడ్డలు చేసిన చెణుకులను గవి యెంత మనోహరముగ, మంజులముగ, మార్దవముగ, నభివర్ణించెనో తిలకింపుఁడు.——

ఉ. "ఏమువకమ్మ! యేమివడె యెత్తుకొనంగదె" యం
చుఁ బల్లివెం, బాముఁ జీరకొంచు గొని యశ్రులం
దుడ్చుచు "నేడిపించుము, నాఁడు నేఁడు మాయ
మను నాయన! పోపొ" యందు మనుఱుమన్, సిడని
సిగ్గుఁ గూర్చుఁ గౌఁగిటఁ బట్టి ముద్దిడఁ బల్లి చెంగటన్.

వ. రెండవ నిసుంగును.

క. "ఆఁకలె యమ్మా! యాఁకల
నాకన్నము పెట్టరావె"! "నానా రా!" యం
చేకీభావముఁ గూర్చెను
గోఁకచెంగింగిళ్ళు చమ్మకుసు నాయనకున్.

ఉ. ఆరయ నాల్కగళ్లహ్వయంబు లసంబసు గెండు
రజ్జువుల్, కుఱిమియున్ ఫురిం బెనఁగి కూడి యభేస
మునన్ రహింపఁగాఁ, బేరినపెంపు దేన నిఁక వేర్ప
డకుండఁగ నేర్పడున్ సుతా, కారపుముద్దుఁ
ముళ్లై యఖండసుఖోదయమూలకందమున్."

ఆషాఢమాసపు భారతియందు శ్రీ శాస్త్రిగారే రచించిన 'ముద్దుబిడ్డ'అను పద్యమును ఈసందర్భములో స్మరింపఁ జేరుకొనుచున్న కుతూహలమును పెడఁద్రోయఁజాలక రసగుళికయనఁదగిన ఆపద్యరత్నమును తిరుగఁ దోడుచున్నాను.

"శా. దూరానం దిలకించి ఓర్నగవుతోఁ దోతెంచి
పావమ్ములం దాగోహించి మొగమ్ము గాంచి
కయివో యల్లార్చి తాటించుచు, గ్నోరం గోరిక
లూర 'నె త్తికొను' మంచుం దొక్కుపల్కుడు న,

ల్లారుంబెల్లముఁ బుత్రుఁ జేకొననివాఁ డానంద మేమందునో?!"

'పుత్రగాత్ర పరిష్వంగ సుఖము' అల నాఁడు నన్నయకవియే దివ్యగాన మొనర్చి నాఁడు. నాఁటికి నేఁడు మరల శ్రీశాస్త్రి గా రెత్తి అల్లారుముద్దుగా శ్రుతిహితముగాఁ బాడుచున్నారు.

'కుశేశయ కుట్మల కోమలము' లగు శ్రీశాస్త్రిగారి కవితాభూషలు ఆంధ్రభాషా యోష ఆదరణాతిశయములతోఁ దాల్చి మిన్నంది వన్నెకెక్కఁగలదు. పూర్వాధునిక కవితా పద్ధతులలోఁతును బాఁతును బాగుగ నారసి రెండుపద్ధతులను సమ్మేళన మొనర్చి నూతనకావ్యరచనకు నవ్యసారస్వతమునందు మార్గదర్శకులైన ఆధునికాంధ్రకవిగ్రామణు లలో శ్రీశాస్త్రిగారొకరు. వీరి 'మూనాళ్ల ముచ్చటలో'—'ఊవ్వాఊట్లు, ఆరఁగూరినకూరిమి, అల్లారుంబెల్లము, పలినపేర్మి, చిఱుబుస్సులు, అల్లిక బెల్లిక, అచ్చిక బుచ్చిక, మెతకమాటలు, అంజెవేఁకుఁచు,' మొదలగు నుడికారముగల తెలుఁగుపలుకుబళ్లమేళ్లరసి వాడియున్నారు. సజీవభాషకు ముఖ్యపరికరము లనఁదగిన సామెతలను—'వండనియన్నము వదుకనిబట్ట; గుడిసెకట్టఁడు జడివానఁ, దడిసిగాని; పకువలెఁ జేరి మేకగుట;' మొదలగువానిని సందందుఁ బొందికగా నుపయోగించి సహజమధురమగు కవితకు సింగారము చిలికించినారు.

ఉన్నతకవితాచిహ్నము లగు ప్రసాద మాధుర్యములకు, ధారాశుద్ధికి, పరిపక్వశైలికి, ఈచిన్నికృతి నిధానమై యున్నను, ఆవేశము, కథాసంవిధానము, పాత్రపోషణము, ఇం దొకరవ్వ మెఱుఁగుపడియున్నవని నాయభిప్రాయము. ముందుముందు వీరు రచింపఁ బోవు కృతులలో వీనికిఁగూడఁ దగినంత ప్రాతినిధ్య మిచ్చి సారస్వతసుందరికిఁ గ్రొత్తావి హత్తించెదరుగాత మని వేఁడికోలు.





# కాకతీయాంధ్రలక్ష్మి

శ్రీ శేషాద్రిరమణ కవులు

శ్రీప్రోలదేవ ధాత్రీనాథ విక్రమా,డంబరంబున జననంబునొంది  
శ్రీరుద్రదేవదోర్వీర్యవహ్నిజ్వాల,లల్లుకొన్నపుడుప్రాయముగడించి  
గణపతిదేవ విఖ్యాతవిక్రాంతిచే, సమధికైశ్వర్యముల్ సంతరించి  
రుద్రమాదేవి నిర్నిద్ర తేజంబుచే, నాంధ్రదేశంబెల్ల నాక్రమించి  
అవల శ్రీమత్ప్రతాపరుద్రావనీశ, రాజ్యకాల శుభోదయారంభమందు  
అస్తమింపఁగవిధిసీముఖాంతరమున,వ్రాసెనే! కాకతీయాంధ్ర రాజ్యలక్ష్మి!




చేపూరు సింహాచలం గారు

[గతసంచిక తరువాయి]

వేదశాస్త్రసిద్ధాంతమే లేదనియెడి
నాస్తికుండు లోకమున దుర్నయములెల్లఁ
జేసి దుర్మార్గుఁడంచు ప్రసిద్ధినొందు
నిట్టి నాస్తికాభిప్రాయ మెపమునేసి
బ్రహ్మమున్నదని యెవఁడు భావమందు
నిశ్చయజ్ఞాన మొందునో నియతితోడ
వాఁడు ముక్తి నొందుకొఱకు వలయు సాధ
నంబులైనట్టి వర్ణాశ్రమంబులెల్ల
పాలనముసేయుకొఱకు సద్భక్తితోడ
మంచిమార్గమునే పోవ నెంచుచుండుఁ
గాన సన్మార్గుఁడను కీర్తిఁ గాంచు నతఁడు
శిష్యుఁడాచార్యుఁ జూచి ప్రశ్నించె నిట్లు
"పొందునా బ్రహ్మమున్ లేక పొందకుండు
నా యవిద్వాంసుఁ డంతంబు నందగానె?"
"బ్రహ్మను బడయునా లేక పడయలేఁడ
మరణమొంది విద్వాంసుఁడు?" మరియు నొకటి
గలదు "బ్రహ్మసమత్వము గలది కాన
నెట్లవిద్వాంసుఁడై మరణించి తాను
బ్రహ్మమును బొందలేఁడో విద్వాంసుఁడట్లు
బ్రహ్మమును బడయునా లేక పడయలేఁడ?"
అంతగురువనె నాకాశ మాదిగాఁగ
నఖిలమౌ జగద్రూపకార్యంబునకును
బ్రహ్మ కారణం బౌనని భగవతీయగు
శ్రుతివచించె సకలభూతతతికిఁ గార
ణంబయిన బ్రహ్మ వివిధరూపంబుగాఁగఁ
బుట్టవలెనంచుఁ దలఁచి తా నిట్టి సృష్టిఁ
జేయువిషయముఁ జక్కఁగాఁ జింతసేసి
ప్రాణికోటి కర్మానుసారముగ నామ
రూపములతో సృజించి యారూపమందుఁ
దాఁ బ్రవేశించియు వివేకిదానివలెను
దెలిసికొనుదానివిధమున, దలఁచునటుల
చూచుదాని కరణిగాను దోచుచుండు
చేతనంబు బ్రహ్మయగు నచేతనంబు
బ్రహ్మమే యౌను, నిలయంబు బ్రహ్మ మనిల
యంబు బ్రహ్మసుమ్ము, నిరుక్తమగును బ్రహ్మ
బ్రహ్మ మనిరుక్తమే యౌను, బ్రహ్మసత్య
మౌ నసత్యంబు బ్రహ్మమే యౌను గాన
పారమార్థిక సత్యమౌ బ్రహ్మమిట్టుల
భిన్నధర్మంబులను గల్గి పెక్కురూప
నామములతో జగతిగఁ గానఁబడుఁ గాన
బ్రహ్మమే సత్యమౌనని బ్రహ్మవేత్త
తెలిసి నిశ్చింతతోఁ దాను మెలఁగుచుండు
బ్రహ్మయే కారణంబౌఁ బ్రపంచమెల్ల
సృష్టికిన్ ముందు రూపవిశేషరహిత
మైన యవ్యాకృతముగ నడఁగియుండి
సృష్ట్యనంతరంబునఁ దా విశేషనామ
రూపములతోడ సత్యస్వరూపముఁ గల
దాయె, బ్రహ్మ యద్విధ కారణాంతరంబుఁ

గాని సాధనాంతరమైనగాని కోర
కయె జగంబును గల్పించెఁ గాన నదియె
స్వ ప్రకాశంబు, నదియె రసస్వరూప
మిట్టి రసము ననుభవించియే కదయ్య
జీవి సుఖవంతుఁడగుచుండె శిష్య! నీకు
నీహృదంతరాళంబున నిర్వికార
మైన యానందరూపుఁడే లేనియెడల
ప్రాణనాది క్రియలఁ జేయు వాఁడుగాడు
సాధకుండగువాఁడు నాకరహేతుఁడును
గనుల చేఁజూచుట కలవిఁ గానివాఁడు
చెప్పుటకు వీలు లేనట్టి స్థిరయశుండు
నైన పరమాత్మయందు భయంబు లేని
స్థితిని నెవ్వండు బొందునో స్థిరముగాఁగ
నప్పుడే వాఁడు భయము లేనట్టిస్థితిని
బొంది యానందసాగరమందుఁ జేరు
ఆత్మయం దెవ్వఁడు ప్రతిష్ఠనందఁగాంచునో
యట్టి విద్వాంసుఁడే బ్రహ్మమందుఁ జేరు
జననమరణ రూపమగు సంసారమునకు
బీజమైన "నీ, నా" యను భేదబుద్ధి
బడయు నాయవిద్వాంసుఁడు బ్రహ్మనెందఁ
జాలఁడని వేదశాస్త్రముల్ చాటుచుండె
పండితమ్మన్యుఁడైన విద్వాంసుఁడైన
వ్యావహారిక భేదంబు నాత్మయందుఁ
గాంచెనేని యాస్వల్ప మేకత్వబుద్ధి
నంతయును నాశనము చేసి సంతతభయ
హేతువైన జన్మాదులకెల్ల హేతు
వౌను జ్ఞానమున్ గల్గు దేవాదులకును
సంతతంబుగ నాత్మనిష్ఠానుభవము
దృఢతరంబుగఁ గల్గకుండెడి కతమున
భయముచేఁ బ్రవర్తింతురు నియతముగను
బ్రహ్మవల్లను గలిగిన భయముచేత
వాయుదేవుండును దివిజపతియు రవియు
జాత వేదుఁడాదిగసుర సంఘమెల్ల
తమకు నియతమైనట్టి కార్యములఁ జేయు
చుండిరి, తమను శాసించుచుండువాని
యాజ్ఞకును బద్ధులైయుంట యర్థమగును
అట్టిస్వప్రకాశానందమైన బ్రహ్మ
వివరమును దెల్పెదను నీకు వీను లలర
లౌకికానందమును బోలె లోకమందు
విషయసంబంధమైనట్టి వివిధభోగ
ములవలన జనియించెనా మున్ను చెప్పి
నట్టి స్వప్రకాశానందమైన బ్రహ్మ?
మటులకాక స్వాభావికంబౌనె? యనెడి
విషయమే చర్చగాఁదోఁచు వివిధగతుల
నిపుడు స్వప్రకాశానంద మిద్దియనుచు
నూహసేయుకొఱకు లౌకికోద్భవమగు
నట్టి యానందమును దెలియవలె మొదట
బాహ్యవిషయంబులెల్ల యౌవనముతోడ
మేళనంబౌటచేతనే మిన్నయగును
లౌకికానందమంతయు లోకమందు
జగతియంతయుఁ దనదు రాజ్యంబుగాఁగ
వజ్రసారసు దేహ సంపదను బొంది
దేహమానసపీడలన్ దెలియకుండ
యౌవనాది లావణ్యభాగ్యంబు గలిగి
సకలశాస్త్రపాండిత్య సరణిఁ దెలిసి
వినయవితరణంబులు స్వాభావికముగాఁగ
సకలసంపదలింట నక్షయముఁ బొంద
మనసుఁగని కార్యముల్ సేయు మనుజులుండ
త్యాగభోగంబులందు నుత్సాహముండ
సరససద్గుణంబుల నెఱజాణయగుచు

నుండు మనుజుని యానంద మొక్కటైన
మానుషానందమని యంద్రు మౌనివరులు
మానుషానంద మే నూఱు మడుఁగులైన
నది మనుష్యగంధర్వ యానందమగును?
మనుజ గంధర్వులన్నఁ దా మాచరించు
పుణ్యకర్మలవలనఁ దపోబలమున
మనుజులై యుండి గంధర్వమహిమ లెల్లఁ
బడయుదురు వారు మనుజులవలెఁ బరిమిత
శక్తులుగాక యణిమాదిశక్తు లెల్ల
కరగతంబు లొనర్చి సుఖంబు లొందు
సాధనల్ గల్గియుందురు సకలవిధుల
మనుజ గంధర్వసమ్మోద మహిమ శతము
దేవగంధర్వమోదమై తేజరిల్లు
దేవగంధర్వుఁడనఁగ నా దేవలోక
మందు గంధర్వుఁడై జన్మమొందువాఁడు
దేవగంధర్వసమ్మోద భావశతము
గూడి యొకచిరలోక లోకుఁడగునట్టి
పైతృకానందరూపమై పరిఢవిల్లు
చాలకాలము నిలిచి లోకసరణిఁ గాంచు
నతఁడె చిరలోక లోకుఁడౌనని వచింత్రు
అట్టి చిరలోకలోకుఁడై నట్టివాని
దైనయానందగరిమ నూరంతలైన
నదియె యాజాన దేవతానందమగును
ఏది పితృలోకమునకును మీఁది నుండు
నట్టిలోకమే యాజాన మనఁగఁ జెల్లు
స్మార్తకర్మలం దెక్కుడాచరణఁ గలుఁగు
నతఁడె యాజానలోకమునందుఁ బుట్టు
నతని యానందశత మొక్కటైన నొక్క
కర్మదేవుని యానందగరిమయగును
అగ్నిహోత్రాది కర్మల నాచరించు
వార లాజానజులగు దేవతలకన్న
భోగభాగ్యంబు లెక్కువ పొందుచుంద్రు
కర్మదేవుని యానందగరిమ నూఱు
మడుఁగు లోకదేవతానంద మహిమయగు హ
విర్భుజులు దేవతలపేర నెలయువారు
దేవతానందశత మొక్కడి దివిజపతికిఁ
గల్గుమోదంబునకు సరిగాఁ దనరుచుండు
శతశతమఖుని యానంద సందోహ మది
దేవగురుఁడైన వాచస్పతి కొకఁడొందు
దివిజగురుని యానంద సందోహశతము
మూడులోకంబు లేలెడు ఘనముఁ గల్గు ప్ర
జాపతికి నొక్కయానంద సంపదగును
శతగుణాధికమగుచుఁ బ్రజాపతికిని
గల్గునానందము హిరణ్యగర్భునకొక
శర్మమగును మన శాస్త్రంబు చాటు
చుండు, సృష్టి సమిష్టిరూపుండనియు హి
రణ్యగర్భుండనియును సూత్రాత్మ యనియుఁ
బ్రహ్మనే చెప్పుచుండిరి బ్రహ్మవిదులు
శ్రోత్రియుండు సదాచార సుశ్లోకుఁడగుచు
కోరికలులేనివాఁడైన కోవిదుండు
మున్ను చెప్పినవారి ప్రమోదములఁ
బొందఁగలఁడు ముహూర్తకాలికిఁ బొందఁగలఁడు
ఇంద్రియాతీతుఁడైన సర్వేశ్వరు నెపుఁ
డెఱుఁగునో వానికిన్ భయ మేలకలుగు
పుణ్యకర్మలఁ జేయక పోతి నని యు
నఘము లేటికిఁ జేసితి ననెడిచింత
వానికుండునె? వాఁడెపో బ్రహ్మ, వాఁడు
బ్రహ్మవిషయికానందానుభవము నొంది
బ్రహ్మగీతంబు హాయిగాఁ బాడుకొనుచు
సకలలోకముల్ దాన్యైన సరణిఁ గలిసి
నిర్మలానందసందోహ నిలయుఁడగును.

[సశేషము]




పానుగంటి లక్ష్మీనరసింహారావు గారు

"ఆఁ ఒప్పే! చెప్పినప్పుడు రవంత వినవలయును. ఒక్కటే యేడుపా? ఎల్లకాలము తల్లిదండ్రు లుట్టికట్టుకొని యూఁగులాడుదురా? ఆయన కేమి? మహా అదృష్టవంతుఁడు అనాయాసముగా వెడలిపోయినాఁడు" అని సుందరరామయ్య, గదిలో నేడ్చుచున్న భార్యను గదిగుమ్మమునొద్దఁ గూరుచుండి యోదార్చుచున్నాఁడు. ఇంతలో సుందరరామయ్య కొడుకు కటకువచ్చి "నాన్నా! ఎవరో ప్లీడరు గారఁట! నిన్నుఁ జూడవచ్చి వీధిగుమ్మములో నున్నా"రని చెప్పెను 'ప్లీడరు నాయింటి కెందులకురా? ప్లీడ రొకఁడు పోలీసువాఁ డొకఁడు నాగుమ్మములో నడుగుపెట్టవలసినపని యేమున్నది? ఏతగవునకైనఁ బోయినవాఁడనా? ఏనేరమునైనఁ జేసినవాఁడనా? మామగారు చచ్చిపోవుటచే మతిపోయియున్న నన్నుఁ జూచుటకుఁ బ్లీడ రెందుకురా?" యని లోలోన సుందరరామయ్య గుంజెలదట్లు గొణఁగుకొనుచుండ నింతలో "సుందరరామయ్యఅన్నగారూ! నమోనమః" యనుచు న్యాయవాది యే లోనికి వచ్చెను. సుందరరామయ్య లేచి జగన్నశాస్త్రిని జాపపైఁ గూరుచుండఁబెట్టెను. వారిద్దఱిట్లు మాటలాడుకొనుచుండిరి.

జగ్గ:—మీమామగారు స్వర్గస్థులగుటచే మిమ్మును మావదినెగారిని బరామర్శించుటకు వచ్చితిని.

సుంద:—మీరెన్నఁడు మాయింటికి దయచేయలేదే! నేఁ డెంత శ్రమ తీసికొంటిరి? మీకుమాయందింతదయయని నేనెఱుఁగను.

జగ్గ:—అన్నా! ఎవరిదారిని వారు సుఖముగా నన్నప్పు డొకరినొకరు చూడకపోయినను బాధలేదు. ఏదో రవంతచిక్కు తటస్థించినప్పుడే యొకరినొకరు పలుకరించుకొనవలయును. దినములు వెడలిపోవువఱకు మీరు మావదినయు చేబ్రోలులోనుండి మొన్ననో నిన్ననో యిక్కడకు వచ్చితిరి కాఁబోలు.

సుంద:—నిన్ననే వచ్చితిమి.

జగ్గ:— మీ రక్కడనుండగా మామగారి మరణశాసనముఁ గూర్చియు దత్తస్వీకారమునుగూర్చియు దత్తునితల్లిదండ్రులతో మీకేమైన మాటలు జరిగినవా?

సుంద:—ఏమియు జరుగలేదు అత్తగారిదివఱకే లేదమోను. మామగారిప్పుడు లేకపోయిరి. ఆయనకు సోదరులెవ్వరు

లేరయ్యెను. మ్యాతో మాటలాడువా రెవ్వరు?

జగ్గ—దత్తునితండ్రి వట్టిమారీచుఁడు. వాఁడే యీతంత్రమంతయుఁ జేసినాఁడు. వానిని జట్టినారకమ్మువలెఁ జీల్చిననైనఁ బాపము లేదు.

సుంద:—ఎవరిపాపమున వారు పోవుదురు. మాకాగోడవయేమియు నక్కఱ లేదు. మాకుఁ దినుటకు సమృద్ధిగా నున్నది. మాకీకుఱ్ఱవాఁ డొక్కఁడే. వది యేమైపోయినను మాకుఁ జింత లేదు.

జగ్గ:—అన్నా! పరమ వేదాంతిలాగుననున్నావు. నీకొడుకు తాతనిదౌహిత్రుఁడు. ఆతనిమూఁడు లక్షులరూపాయలయాస్తి నీతనికి న్యాయముగా రావలసియున్నది. నీకొడుకుభాగ్యవంతుఁడగుట నీ కిష్టములేదా యేమి? సత్యకాలపుమాటచెప్పుచున్నావు! నీకొడుకుహక్కును జెడఁగొట్టుటకు నీ కేమి యధికారమున్నది? నీవూరకుండినను నింక రెండేండ్లలోఁ బెద్దవాఁడై నీకొడుకే వ్యాజ్యెమువేసి తాతగారియాస్తిని సంపాదించుకొనును.

సుంద:—వాఁడు పెద్దవాఁడైనప్పుడే యట్లు జరుగునుగాక నేనీగొడవలోదిగను

జగ్గ:—ఆలస్యమైనకొలఁది వారికి బలము హెచ్చును; మనకుఁదగ్గును; ఉన్నదంతయుఁ జరాస్తి; దాఁటిపోవునెడల రాఁబట్టుకొనుట కష్టము. బ్యాంకులోనున్నసొమ్ము దత్తునిపక్షపువారి కీయఁగూడదని దాని యేజెంటుకు కోర్టువారియాంక్ష పంపవలసి యున్నది. (సీవరుసునియమించి యింటిలో నున్న వెండిబంగారువస్తువులయొక్కయుఁ బత్రములయొక్కయు జాబితా వ్రాయించి యాసొత్తును గాపాడవలసియున్నది. దత్తస్వీకరణకృత్యమును జేయించిన పురోహితుని మనపక్షమున కాకర్షింపవలయును. ఆకాలమందు మరణశాసకునికి స్మృతి లేదని యప్పటివైద్యునిచే మనపక్షమున సాక్ష్యమిప్పింపవలయును. ఇంకనెన్నియో జరుగవలసియున్నవి.

సుంద:—ఆయన యథార్థముగాఁ బెంపుచేసికొన్నాఁడేమో! నిజానిజములు భగవంతునికిఁ దెలియవలయును. నాభార్య కీయవలసినదేమో ఆయన యిదివఱకే యిచ్చినాఁడు. ఆదత్తతనిజమైనయుండవచ్చును. కాక, యసత్యమే కానిండు. వ్యాజ్యములోనికి దిగి నేనీబాధలన్నియుఁ బడఁజాలను. మా కాసొమ్ము ప్రాప్తిలేకపోవుటచే నట్టు జరిగినది. ఏదోవ్యవసాయము చేసికొని యిదిగరిసెలు పండించుకొని నేనొకనిఁ జూడకుండ నన్నొకరు చూడకుండఁ గాలక్షేపమును జేయుచున్నాను. నేను బుట్టినతరువాతఁ దగవనునది యెఱుగను. నాదినము లిట్లు వెడలిపోనిండు.

జగ్గ:—అన్నా! నీకేమియు శ్రమమక్కఱ లేదు. అన్నిటికి నేనున్నాను. చేవ్రాలు చేయుమని నీకుఁబంపిన కాగిదములమీఁదఁ జేవ్రాళ్లుచేసి నాకుఁబంపుము. మూఁడు నిముషములలో నీపెంపు కొట్టివేయించి నీకొడుకును గుబేరుని జేయకుండు నెడల నన్ను జగ్గన్నశాస్త్రి యనిపిలువవలదు. చూచుకో నాతమాషా. జగ్గన్నశాస్త్రి

పట్టిన వ్యాజ్యమున కెన్నడైన నపజయముండెనా? పెట్టుబడిపెట్టుటకు నీయొద్ద సొమ్మున్నదా సంతోషమే. లేదా నేనే పెట్టుబడి పెట్టవలెను కాని, అన్నా! నీమొగముమీఁదఁ గొంతసందేహము పొడకట్టుచున్నది. నే నింత పెట్టుబడిపెట్టి నీపక్షమున నింతయభిమానముతో నేల పనిచేయుటకుఁ బూనుకొనవలయునా యని నీమనస్సునఁ గలిగిన సందేహము నీనుదుటిపైఁ గనఁబడుచున్నది. నీ కట్టి సందేహము కలుగుట న్యాయమే. నాయభిమానమునకుఁ గారణమేదో చెప్పెదను వినుము. నా కొక మేనగోడ లున్నది. అది తండ్రిలేనిపిల్ల. నేనే దానిని పెంచినాను. దానిని నీకుమారుని కీయవలయునని సంకల్పించుకొంటిని. తండ్రి లేఁడన్న లోపము తక్క దానికేమియు లోపము లేదు. దానితల్లియొద్ద నలుబదివేలరూపాయలు గుల్లలున్నవి. దానికిఁ బదివేల రూపాయలు భూలతోడుగున్నది. తండ్రి సంపాదించినది కొంతవిరివిగా నేనే వడ్డికిఁ ద్రిప్పుచున్నాను. తగిన యింటిలో దానిని బడవైవవలయునని చూచుచున్నాను. ఇందుచే నే నింతగాఁ బ్రాకులాడవలసి వచ్చినది. ఈయపేక్షయే నాకులేనియెడల నీవు నాకందనంటివాఁడవే. జమీందారులు నాయింటియరుగులమీఁదఁ లఁబడి నా దర్శనమునకై వేచియుందురు. అట్టినేను నీయింటికిఁ దండ్రిలేనిపిల్లక్షేమము నపేక్షించి వచ్చితిని.

ఈమాటలతో సుందరరామయ్య మోము తెల్లబడెను. అతనికొడుకు సుబ్బరామయ్య మోమెఱ్ఱబడెను. తలుపు చాటున నుండి లటుకున నీనెలకుఁ బొటకరించిన సూరమ్మమోమూసరవెల్లివలె నేరంగు గలదో చెప్పుటకు వీలు లేకుండెను. ఈ సన్నివేశమును జూచిన జగ్గన్నశాస్త్రి "మెత్తబడుచున్నాఁడు. నా మేనగోడల నీ ముండకొడుకున కిచ్చెద నని యాసపెట్టుకొని యున్నాఁడు. వీనికున్న ముప్పదిపుట్ల మాగాణి నెట్లైన హరించుటకే నా ప్రయత్న" మని



తనలో ననుకొనియెను. అంత సూరమ్మ తన మొగమును దిరిగి తలుపుచాటున నుంచుకొని "వారు భాగ్యవంతులు. మావంటి వారికిఁ బిల్ల నిచ్చెదరా ?" యని సన్న సన్నగఁ బలికెను. "సూరమ్మవదినా? మీ భాగ్యమున కిప్పుడు లోపమేమి? నీకొడు కెంత లక్షాధికారి కావలసియున్నాఁడో! అదిగాక యింకొకపరమార్థమైనమాట; నాకుమాత్రము కొడుకా కొమ్మా? పదిమంది కాపురమున్న యింటిలోఁ రుచుండి చెప్పుచున్నాను. నా మేనగోడలు మగఁడే నాకుఁ గొడుకు కాఁ గూడదా? ఏమో! ముందు జరుగఁబోవు నీ మాట లిప్పుడెందులకు? ఏమియుననుఁడు. అన్నా! నేనుబోయెదను. వదినా! సెలవు. అబ్బాయీ! మనయింటికిఁ బెండ్లికూఁతును జూతువుగాని రావోయి" యని పలుకుచుఁ బిల్లవానిని గుఱ్ఱపుబండిలోఁ గూరుచుండఁబెట్టి తనయింటికి దీసికొనిపోయెను.

౨

సుందరరామయ్య కింట నిలువసొమ్ము లేకుంటచే నారంభము మొదలుకొని చివర వఱకు వ్యాజ్యెమునకు న్యాయవాదియే పెట్టు బడి పెట్టవలయుననియు నాసొమ్మంతయు నూటికి రూపాయ యెనిమిదణాలవడ్డితోఁ దాని చ్చెదననియు భార్యప్రోత్సాహమున, ఖరారు నామా వ్రాసి రిజిస్టరిచేయించి యాతఁడు ప్లీడరు చేతఁ బెట్టినాఁడు. ఇంక నెన్నియో వట్టికాగి దమ్ములకుఁ గ్రిందఁ జేవ్రాళ్లుచేసి ప్లీడరుచేతి కిచ్చినాఁడు. న్యాయవాది నిరంకుశముగా వ్యాజ్యమునకుఁ బూర్వరంగప్రయత్నములను జేయుచున్నాఁడు. సంవత్సర మైనది. రెండు సంవత్సరము లైనది. మూఁడుసంవత్సరము లైనది. ఎంతసొమ్మిదివఱకు వ్యయమయ్యెనని సుందరరామయ్య యొకప్పుడడుగ "సుందర రామయ్య అన్నా! ఎంతసొమ్మయిన నేమి లెక్కయయ్యా గ్రంథముజరుగనీయవయ్యా!" యని న్యాయవాది విసుగుదలతోఁ బలికి నాఁడు. తనతండ్రి సొత్తు మూఁడులక్షలరూపాయలు తనకు వచ్చునని సూరమ్మ సంతసించుచున్నది. చిలుకవంటిపిల్ల ప్రక్కలోనికి వచ్చునని సుబ్బరామయ్య సంతసించుచున్నాఁడు. చేతికి ముష్టిచెంబు వచ్చునేమోయని సుందరరామయ్య యేడ్చుచున్నాఁడు. ఏడ్చి మాత్రమేమిచేయఁగలఁడు? ఇట్లు కొన్నిదినములు గడచినపిమ్మట జగ్గన్నశాస్త్రి సుందర రామయ్య యింటికి వచ్చి సబుజడ్జిగారికిఁ బ్రతివాదు లిరువదివేలు లంచమిచ్చుటకు మాట లాడుచున్నారు. నేను ముప్పదివేలిచ్చి న్యాయమూర్తిని మన ప్రక్కకు లాగి ప్రతివాదినోట బెడ్డగొట్టినానని చెప్పెను ఆమాట విని సుందర-రామయ్య నెత్తినోరుకొట్టుకొని యేడ్చెను. "ఇదివఱ కెంతవ్యయమైనదో చెప్పవయ్యా!" యని న్యాయవాదిని బట్టుదలతో నడిగెను. "అన్నా! నీవేమియు మాటలాడ కూరకుండుము. అన్నిటికి నేనున్నాను. చచ్చుసొమ్ము. ఎంతవ్యయమైననేమి? మనము పట్టినపట్టు నెగ్గవలయునని, చూడఁదగినదా మఱియొకటి యా?" యని న్యాయవాది సుందరరామయ్యను జీవాట్లుపెట్టి గిరుక్కున నింటికిఁ బోయెను.

3

ఒకనాఁటి రాత్రి సుందరరామయ్యను జూచుటకుగంజాముజిల్లానుండి యొకమిత్రుఁడు వచ్చెను. ఆయనతో సుందరరామయ్య తన సోదెయంతయు వెడలఁబోసికొనెను "అయ్యయ్యో! ఈప్లీడరు నీకెక్కడఁ దాపురించినాఁడయ్యా! ఇతఁడు కొంతకాలము మాజిల్లాలోఁ బ్లీడరీ వెలుగఁబెట్టినాఁడు. అక్కడ నీతఁడెందఱు మొఖాసాదారులకు ముష్టిచిప్ప చేతికిచ్చినాఁడు! ఎందఱుసంసారిణులను ధనమానములుహరించి పూటకూటింటివారిఁగఁ జేసినాఁడు! ఎందఱు సంసారులను దిబ్బమీఁదఁ గూరుచుండఁబెట్టి నాఁడు! ఈతఁ డక్కడఁ ద్రవ్వినగోఁతు లింకఁ బూడినవా? వేసినమ్రుల్లింక విడినవా? అంటించిన కొంప లింక నాఱినవా? కోసిన కోఁత లింక మానినవా? అక్కడ నింక నున్నయెడల నోర్మెమోటుప్రజలు చంపుదు రేమో యనుభయముచే నిక్కడకు వచ్చినాఁడు. ఈతనిని నీవు వదల్చుకొనినయెడలఁ గాని దక్కవు. సామాన్యసంసారివి నీలెక్క యేమి? పాదుషానైనఁ బదిరోజులలోఁ బకీరును జేయఁగల పండితుఁ"డనిచెప్పెను ఆమాటలు విని సుందరరామయ్య తలపై రెండు చేతులతోఁ గొట్టుకొని. "నాయనా! ఏనేటిశని పట్టుకొన్నయెడల దానధర్మములుచేసి వదల్చుకొందును రోగమేదైనఁ బట్టుకొన్నయెడల మందుమూఁకులచే వదల్చుకొందును. పిశాచము పట్టుకొన్నయెడల మంత్రములచే వదల్చుకొందును, కాని జగ్గన్నశాస్త్రిప ట్టెట్లు వదల్చుకొనవలయునో నాకుఁ దెలియకుండ నున్నది. ఏదైన యుపాయము నీవేచెప్పు"మని యాతని బతిమాలుకొనెను. "నేను దత్తుని తల్లిదండ్రులతో మాటలాడి వచ్చెద"నని చెప్పి వారితో మాటలాడి మఱునాఁడు వచ్చి "సుందరరామయ్యగారూ! మీప్రతివాదులు మీభార్యకుఁ బదివేలరూపాయ లిచ్చెదమనుచున్నారు. ఇఱువదివేలిమ్మని బేరమాడితిని. తుదకుఁ బదునైదువేలకు వారి నొప్పించితిని ఇది మీ కిష్టమా?" యనిచెప్పెను. "ఇంతకంటెఁ గావలసిన దేమి.? పదివేలైనను మాకుసంతోషమే. ఏలాగైన నీన్యాయవాది మమ్ము వదలుట మాకుఁ గావలసినది. ఇతఁడు మాకు మృత్యువువలె దాఁపురించినాఁడు నీవుపోయి "ఉభయ కక్షులవారు సఖ్యపడినారు. కావున నావ్యాజ్యము నునేనింక నడపఁదలఁచుకొనలేదని యాతనితో నామాటలుగాఁ జెప్పి నన్ను బ్రదికించి పుణ్యముకట్టుకొనుమని మిత్రుని యాచించెను. అటులేయని యాతఁడు ప్లీడరు నొద్దకుఁ బోయెను.

౪

మఱునాఁడు సుందరరామయ్యయు జగ్గన్నశాస్త్రియు నిట్లుమాటలాడుకొనుచుండిరి.

జగ్గ:—అన్నా! నీకేమి మతిలేదా? చచ్చు పదునైదువేలా? రావలసినమూఁడులక్షులలోఁ బదునైదువే లెన్నవవంతో యొఱుఁగుదువా? ఛీ! పదునైదువేలా? ఈవ్యాజ్యములో నొక్కపురోహితపుబాపనయ్యకుఁ బదునాఱువేలు గిఱగిఱద్రిప్పి యొకమ చేతితోఁ బాఱవైచి వానిని మనవైపునకుఁ ద్రిప్పితిని. దత్తస్వీకరణకాలమునందు

పర్వతరెడ్డి రామచంద్రారెడ్డి గారు



మీ మామగారికి స్మృతిలేదని మనపక్షమున బలుకుటకు వైద్యునికి యిరువదివేలా నవెట్టి పండ్రెండువేలిచ్చితిని. రేపు సాక్ష్యము చెప్పుటకు బోనెక్కు సమయమందు మిగిలిన యెనిమిదివేలు వానిమొగాన గొట్టెదను. ఇంక నెందఱెందఱి కెంతెంత యిచ్చితినో నీవెఱుగుదువా? ఈయవాంతరపుగొడవయంతయు నీకు దెలియవలసినపని యేమున్నది? నే నెన్ని పాట్లుపడుచున్నానో నీవెఱుగుదువా? నారక్తమింకకొఱకు ధారపోయుచున్నానని నమ్ముము.

సుంద:— ధారపోయుచున్నది నీరక్తముకాదయ్యా నాది. నన్నింతటితోనైన వదలిపెట్టుము. ఇక మీరెవ్వరికిని నావ్యాజ్యముకొఱకు సొమ్మీయవలదు. ఇంక నారంభమే లేదు. అప్పుడే డెబ్బదివేలు దాటినట్లగపడుచున్నదే. అయ్యో! అయ్యో! నాకొంప మునిగిపోయినదోయి భగవంతుడా! (చింతించును)

జగ్గ:— అన్నా! అన్నా! అధైర్యపడెదవేల? ఛీ! తప్పుకాదా! నీకేమియు భయములేదు. దిగ్విజయ మొనర్చుటకు నేనున్నాను. డెబ్బదివే లొకలెక్కయా? ప్రతివాదులను లొంగదీయుటకు నే నెట్లు పనిచేయుచున్నానో నీకు వ్యవహారజ్ఞానమున్నయెడల దెలిసికొనగలవు? మీమామగారు వ్రాసినది దొంగమరణశాసనమని నిర్ధారణ పఱచుటకు నే నొకలోకోత్తరమైన చమత్కార మొనర్చినాను. ఇప్పుడు అదే పూర్తిచేసి యిక్కడకు వచ్చితిని. మీ మామగారియొద్దనున్న యొకలేఖరిని మనపక్షమునకు లాగి వానివ్రాతతో దరిమిలా తేదీగల యొక మరణశాసనము సృష్టింపించినాను. ఆమరణశాసనములో యావదాస్తియు నీభార్య కిచ్చినట్లు వ్రాయించినాను. దానిలో బూర్వమరణశాసనమును గూర్చియు దత్తతను గూర్చియు నేమియు నుదాహరింపలేదు. అందుచే బూర్వమరణశాసనమున్నచే అది కేవల కల్పితమని కోర్టువారికి దోచకతప్పదు. తెలిసినదా? ఇంతటితోనైనదా? మరణశాసనమును సృష్టించినందులకు దత్తుని తల్లిదండ్రుల సంశమానదీప్రులకో బంపింపకుండ నే నూరకుందునా?

సుంద:—(గుండెలు కొట్టుకొని) అయ్యో! అయ్యో! నాభార్యపేర మరణశాసనమును సృష్టిచేయించితివా? మమ్ము నేరములలో గూడ దింపి కారాగృహమున నుంపదలచితివా? అయ్యో! అయ్యో! ఎంతకర్మముపట్టినది. (ఏడ్చును)

జగ్గ:— అన్నా! నీ వేమియు మాటలాడకు. ఎక్కడనో అసందర్భపుమనుష్యుడవు! ప్రాణప్రదమైనరహస్యముకదా! అట్లు నోరు చేసికొందువేల? బుద్ధిలేదా? నావలన నీపనిజరిగినది కాని లక్షరూపాయలిచ్చిననైన మరియొకడు సాధని చేయింపగలడా? 'శ్రీరాములు మొదలుచిత్తగింపవలయును'

వఱకునంతయు నేఁబదియైదువేల తోఁగ్ల ప్తముగాఁ గడతేర్చినాను. నీ క్షేమము కొఱకుఁ జేసినపనియేదోకూడ గ్రహింప లేక యిట్లు మొత్తుకొందువేల?

సుంద:—అమ్మయ్యో! తిరిగి 55 వేలా? నా యనా! నాప్రాణమైనమిఁగుల్తువా లేదా? మీరు నాకొఱకేమియుఁ జేయవలదు. నేను బ్రతివాదులతో సఖ్యపడినాను. వ్యాజ్య ము వదలుకొన్నాను. మీరు దయయుంచి నన్నింతటితో వదలిపెట్టుఁడు.

జగ్గ:—జగ్గన్నశాస్త్రి వెఱ్ఱిముండకొడుకని నీయభిప్రాయముకాఁబోలు. న్యాయవాది సింహమని నమ్ముము. ఇదివఱకు నేనుబట్టిన వ్యాజ్యములలో విజయమొందితినే కాని కక్షిదారునితో నెన్నడైన తుచ్ఛమైన రాజీ కంగీకరించితినా? నేనెప్పుడైన నట్టి పౌరుషహీనమైనపని చేసితినా? నాపరు వను బ్రతిష్ఠను నీవు చూడ నక్కఱ లేదా? ఇటున్నసూర్యుఁ డటుపొడిచిన నరే వ్యాజ్యమేదో డిక్రీవఱకు నడవవలసి నదే కాని యీ నపుంసకపురాజీనామాకు నే నంగీకరించెదనా? నీకేమి? పదివేలు వచ్చునని తోఁచినయెడలఁ బ్రతివాదితో సఖ్యమున కొడఁబడుదువు. నే న ట్లొడఁ బడుదునా? కోటిరూపాయలు విలువ చేయఁగల నాకీర్తిని నీకొఱకు గంగలోఁ గలుపుకొందునా? ఘాల్తుఁ దక్కుపడిన నరే వ్యాజ్యము జరుగవలసినదే.

ద:—అయ్యా! నాకుఁ దెలియక యడుగు చున్నాను వ్యాజ్యము నాకొఱకా మీ కొఱకా?

జగ్గ:—అదే బుద్ధిహీనమైనమాట. నేను నీ పక్షమున వకాలత్నామా యెప్పుడు తీసి కొంటినో యప్పుడే యంతయు నాదే. నీ వూరక నిమిత్తమాత్రముగనుండఁదగినదే.

సుంద:—నిమిత్తమాత్రముగా నున్నందు లకుఁ బ్రాయశ్చిత్తమైనదికాదా! వ్యాజ్య ము మొదటివిచారణయైనఁ గాలేదు. అప్పుడే లక్షపాతికవేలు కాఁబోలు నా నెత్తిని రుద్దినారు. ఇఁక నా కక్కఱలేదు. నేను వ్యాజ్యమును వదలుకొన్నాను! బాబూ! రక్షింపుము.

జగ్గ:—వదలుకొనుటకు నీయిష్ట మనుకొంటి వా? వ్యాజ్యము కడవఱకు నడపవలసిన దనియుఁ బెట్టుబడి యంతయు నేనుబెట్ట వలసినదనియు నీవు నా కొడంబడిక వ్రాసి రిజిస్టరిచేసి యీయలేదా? ఇప్పుడు నీ విట్లు గింజుకొనినంతమాత్రమున నాబం ధము నిన్ను వదలునా? నీవు నీయొడం బడికకు వ్యతిరేకముగా నడవఁ బ్రయ త్నించినందులకు నిన్ను "క్రిమినల్"లోని కీడ్చి యెంతపనియైన నేను జేయలేనా? కాని జగ్గన్నశాస్త్రి అపకారి కాఁడు. భూతదయగలవాఁడు. స్వార్థపరిత్యాగి. అది సిద్ధాంతమైనమాట. గాంధిటోపీలు పెట్టు కొని యింతమంది ప్లీడర్లు వృత్తులు మాను కొన్నారుకదా! నే నట్లు మానుకొంటినా? ఎందుకు మానుకొనలేదు? ప జాక్షేమము

కొలుకు, లోకోపకారము కొఱకు. నేను వకాల్తీ తీసుకొనుటయే తమకు మహాగౌరవమని జమీందారులు నాకొఱకుఁ బడి కాపులుపడుచుండ నన్ను వదలుకొందునని మొత్తుకొందువేల? ఇంతనిర్భాగ్యతయున్నదా?

సుంద:—నాయనా! ఈ వ్యాజ్యము వచ్చిన తరువాతనే నా కీనిర్భాగ్యత కలిగినది. అన్నమునకుఁ గూడ మొగము వాచి ముష్టి యెత్తుకొనవలసివచ్చునేమో యని మిమ్ము నేను వదలుకొనుటకుఁ గారణమైనది.

జగ్గ:—సరే. నీ వంత మొత్తుకొను చుండగా నడుమ నాకేల? నాసొమ్ము నాకెవ్వఁడిచ్చె



దవు? లక్షపాతికవే లిదివఱకు వ్యయమైనది. నాఫీజు – సాటిబ్రాహ్మణుఁడవు కావున – పాతికవేలకంటె నెక్కువ తీసుకొనుట ధర్మము కాదు. మనకు ధర్మము ప్రధానముకాని ధనము కాదు. ఏదో చేతిసొమ్ము పెట్టితిని గావునఁ దిరుగ నడుగవలసివచ్చినది. కాని నే నట్లడిగెడివాఁడను గూఁడఁగాను. ప్రస్తుతము సొమ్ముకుఁ జాల నిక్కచ్చిగా నున్నది. నా సొమ్మంతయు మొత్తముగా రేఫే యీయవలయును.

సుంద:— అయ్యయ్యో! నే నొక్కసారి యీయఁగలనా? ప్రతివాదు లీయవలసిన పదునైదువేలు తెప్పించి రేపిచ్చెదను. తరువాతఁ గ్రమముగాఁ దీర్చుకొందును.

జగ్గ:—ప్రతివాదు లిచ్చినారు. నీవు పుచ్చుకొన్నావు. ఆసంగతి చెడునని యిప్పుడు నేను వినియే వచ్చినాను. నాకాసంగతియేమియు నక్కఱలేదు. నా సొమ్ము నా కిచ్చి మఱి మాటలాడుము.

సుంద:—నాయొద్ద సొమ్ములేనిదే.

జగ్గ:— లేదు లేదని తెగనీల్గెద వేల? ముప్పదిపుట్లు మాగాణి పెట్టుకొని బీదయఱపు లఱచెద వేల?

సుంద:—అయ్యయ్యో! ఆభూమి తాకట్టుపెట్టుమందువా?

జగ్గ:—తాకట్టా! నీ మొగము! ముప్పదిపుట్లు కూడ నమ్మిన మెడల లక్షరూపాయలకంటె నెక్కువ

వచ్చునా? ఆ భూమి యాస యింక బెట్టుకొనకుము. అది పోయినదన్నమాటయే. మిగిలిన యేఁబది వేలమాట యేమి రా భగవంతుఁడాయని నేను దేవులాడుచుండగాఁ దాకట్టుపెట్టెదనని చేబదులు తెచ్చెదనని బుద్ధిహీనమైనమాట లాడెద వేల?

సుంద:— అట్లైన నన్నిప్పు డేమిచేయమందురు?

జగ్గ:— ఒకఁడు చెప్పనేల? ఆభూమి నాపేర వ్రాసియిమ్ము. మిగిలినసొమ్మునకుమావదినె యొడలిమీఁద గుల్లగుట్ర యింటిలో వెండి పాత్రసామాను మొదలగునవి నాపరము చేయుము. ఇట్లు నేను స్వాధీనపఱచుకొందును. ఆచింత నీ కక్కఱలేదు. ఇంతకన్న వేరే యాధారము కనఁబడకపోయినప్పుడు నీ వేమిచేయగలవు? నేనేమిచేయఁగలను? నీభూమి నీభార్యనగలు పుచ్చుకొనవలసి వచ్చెనే యని నేను లోపల నెంత యేడ్చుచున్నానో ఆపరమాత్ముఁడే యెఱుఁగును.

సుంద:— ముప్పదిపుట్లభూమి. నిక్షేపమువంటిది. బహిరంగముగా నమ్మినయెడల రెండు లక్షలువచ్చునేమో? మీసొమ్ము మీకుఁ బోగా నేఁబది వేలు నాకు మిగులును. వానితోఁ బొట్టఁబోసికొందును. నన్ను రక్షింపుము. ఇవి చేతులు కావు.

జగ్గ:— నే నేయుద్దేశముతో నీభూమి రెండవ కంటివానికిఁ దెలియకుండ వ్రాసియిమ్మంటినో దానికిఁ గారణము నీ వెఱుఁగకున్నావు. ఇందులోఁ బరమార్థమేమనగా, సృష్టించిన కాగిదములు బోలెఁడున్నవి. అవియన్నియు నీవు నాకిచ్చినట్లేకదా. నీ వీయకుండినయెడల నా కట్లు రాఁగలవు. వానినిగూర్చి యేమాత్రము పైకిఁబొక్కినను నీకు మావదినెకుఁగూడఁ బహునాల్గు వత్సరములు కారాగృహవాసము తప్పదు. ఈబాధ మీ కెక్కడఁ గలిగిపోవునోయని నే నింతగాఁ బ్రాకులాడుచున్నాను. అందుకొఱకు బహిరంగముగా భూమినమ్మఁదగదు. దానివలన లక్షబాధ లున్నవి. ఇవి యన్నియు యోజించియే భూమి గుప్పచప్పకాకుండ నాపేర వ్రాసియిమ్మని నేను బలుకవలసివచ్చినది.

సుంద:— అయ్యయ్యో. ఈయక తప్పదా?

జగ్గ:— అంతసొమ్ముకూడ రే పిచ్చినయెడలఁ దప్పును. అది నీ వీయ లేవు. అందుచే భూమి వ్రాసి యీయక తప్పదు.

సుంద:— సరే. వ్రాసియిచ్చెదను. అట్లైన సృష్టించినకాగిదములవలన మాకేమియు బాధ లేదుకదా.

జగ్గ:— అన్నా! అట్లైన నీపై నేఁగవ్రాలినయెడల నన్నుఁ దుపాకిపుచ్చుకొనికొట్టుమంతే! మీకాగిదా లన్నీ మీయెదుటనే చింపివైచెదను. కాని యెప్పుడు వ్రాసియిచ్చెదవు?

సుంద:— మీయిష్టము.

జగ్గ:— ఈరోజుననే స్టాంపు కొనుము. వ్రాయవలసిన చిత్తును వ్రాసెదను. రేపు రిజిస్ట్రీ కావలెను.

సుంద:—అదా?

జగ్గ:—"అన్నా! నమస్కారము. పదినెను బాలచాలు నడిగినానని చెప్పుము." (తనలో) ఇదివఱకు నేనీవ్యాజ్యమునఁ బెట్టుబడిపెట్టినవి ముప్పదిరూపాయ లైన లేవు. రూపాయకుఁ బుట్టెడుభూమి. వహావ్వా! ధర్మకాలము!

ప్లీడరుపోయెను సుందరరామయ్య మఱునాఁడుస్టాంపువ్రాసి రిజిస్టరిచేసి యిచ్చెను. భార్య యొడలి పదివేలరూపాయల వస్తువులు రెండువేలరూపాయలు వెండిపాత్ర సామగ్రియుఁ బ్లీడరు నధీనము చేసెను. మిగిలినముప్పది యెనిమిదివేల రూపాయలు ముందెప్పుడైన నీయవచ్చునని చెప్పి యా మొత్తమునకు సుందరరామయ్యచేఁ బ్లీడరు నోటువ్రాయించుకొనెను. సుందరరామయ్య మఱియొకయూరు పోయి యేవృత్తియు నెఱుఁగనివాఁడు కావున "సీతారామాభ్యాన్నమః" యనుచు నక్షయపాత్రతోఁ గాలక్షేపమును జేసెను.

# ఐక్యము

పల్ల వేంకటశాస్త్రిగారు

నా కొఱకుగాదె సృజియించినావు నీవు, సౌష్ఠవం బది పొంగారు జగములెల్ల
గనియు నానందవార్ధిలో మునిగి మునిగి, జనని యద్దాన నైక్యమైతిని గదమ్మ!

అల్లగోదావరీ నదిఁ బిల్లతరగ, పింఛులో నుండి వెల్వడు దండిముత్తి
యంపుసరులన నెప్పెడి తుంపురులను, జనని! భవదీయకళగని తనిసితమ్మ!

లలితబృందావనీ వీథికల లతాంత, సౌరభంబుల గోపాల చక్రవర్తి
మధురగానమ్ము భుజముల మలపికొనుచు, మోసికొని తెచ్చి వీనుల మోసల నిడు
పిన్నపవనుని నడకల వన్నెలందు, జనని! భవదీయకళగని తనిసితమ్మ!

లలితవాసంతచూతప ల్లవము లనెడి, కవినృపతిమాళి పద్మరాగంబులెల్ల
ధవళిమము సేయ బూను యంత్రంబనంగ, చంద్రనిర్గత మసృణ ప్రసారములను
జనని! భవదీయకళగని తనిసితమ్మ!

విమల కాంత ప్రపూతమై వెలయు నభ్ర, మందు భవదీయకళగని డెందమందు
నిర్మలాకారకాంతి మిదే యటంచు, జనని యద్దాన నైక్య మైతిని గదమ్మ




## ప్రహసనము

వేటూరి ప్రభాకరశాస్త్రి గారు

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించును)

సూత్ర—

క. సురనరమకుటేంద్రమణి [నిశా
స్ఫురితము, శుభలక్షణము, సుపూజితము,
చరణమితాంగుష్ఠము, శివు
చరణము, మిమ్మెల్ల వేళ సంరక్షించున్.

ఇదె మాయిల్లు లోనికిఁ బోయెదను (పోయి) విదూషకా! విదూషకా!

విదూ—(ప్రవేశించి) అయ్యా! ఇదుగో ఉన్నాను.

సూత్ర—ఇతరు లెవ్వరును లేరుగద! నీ కొక మంచిమాట చెప్పెదను.

విదూ—సరే; (బయటికి వెళ్లిచూచి వచ్చి) అయ్యా! ఇత రెవరూలేరు, ఆమంచి మాట యేమిటో సెలవివ్వండి.

సూత్ర—అనేకసిద్ధపురుషులయనుగ్రహము పొంది గొప్పశక్తులను సంపాదించినవాఁడు, ఉత్తమలక్షణములుగలవాఁడు, ఒకబ్రాహ్మణుఁడు దేశాంతరమునుండి యిక్కడికి వచ్చుచు, ఇప్పుడు నా కీక్రిందివిధముగా జోస్యము చెప్పినాఁడు.

"నేటికి ఏడవనాఁడు నీకు రాజాస్థానమున దర్శనము దొరకఁగలదు. అప్పుడు నీప్రయోగమునుజూచి సంతోషించి రాజుగారు నీకు గొప్పసమ్మానము బహుమానము జరుపుదురు" అని.

ఆబ్రాహ్మణుఁడు అసత్యములాడువాఁడు కాఁడు గావున నుత్సాహముచెంది సంగీతసాధనము సాగించుచున్నాఁడను.

విదూ—ఐతే; మీ రిప్పుడు నాటకమా ప్రకరణమా ఏది ఆడుదా మనుకొన్నారు?

సూత్ర—ఇక్కడనే నాకు నాలోచనము; నాటక ప్రకరణోద్భవము లయిన వాకేహామృగ డిమ సమవకార వ్యాయోగ భాణ సల్లాప వీథ్యుత్సృష్టికాంక ప్రహసనాదులగు నాట్యరసములందు హాస్యమే ప్రధానమైనదని నాతలంపు. కాన ప్రహసనమే ప్రయోగింతును.

విదూ—నేను ప్రహసన మెరుగను.

సూత్ర—అట్లేని నేర్చుకొనుము. నేర్వకుండ నేడిగాని రాదు.

విదూ—ఐతే తమరే మరి నాకు నేర్పండి.

సూత్ర—లెస్స.

గీ. బుద్ధిని గుదుర్చుకొని జ్ఞానసిద్ధికొఱకు
నను గమింపుము సన్మార్గమున నన్ను

(తెరలో)—శాండిల్యా! శాండిల్యా!

సూత్ర—(విని)

బ్రాహ్మణశ్రేష్ఠుఁడయి బ్రహ్మపదము కోరి
సన్న్యసించిన యోగీంద్రు భాతృసట్లుః
నిష్క్రమించిరి.

ఇది ప్రస్తావన

(పిదప పరివ్రాజకుఁడు ప్రవేశించును.)

పరి—శాండిల్యా! శాండిల్యా! (వెనుకకుఁజూచి) కానరాకున్నాఁడే, అజ్ఞానసంవృతుఁడయిన వీని కీనడివడి తగినట్లే యున్నది.

సీ. వివిధరోగములకు వీడుపట్టయి, వార్ధ
కమునకు వశమయి, కాలునకు ర
హస్యంపుఁబొంచుచోటై, యున్న దీదేహ
మడఁగారు నెప్పుడో, పొడిచి పొంగి
పాఱునదిఁ గూలిపడు తటద్రుమమట్లు;
నమ్మరానివి దీనియెమ్మెలెల్ల
బహుజన్మకృతపుణ్యవశమున నరజన్మ
మందియు భ్రమసి దేహాత్మబుద్ధి

గీ. నజ్ఞుఁడగువాఁడు బలము ప్రాయమ్ము రూప
మరసికొని పొంగిపోవుచు నవి ఘటించు
దోషములఁ గానలేక తుందుడుకుచెంది
చెడెడు; నయ్యయో యజ్ఞానచేష్టితంబు!

కాఁబట్టి దయసేయుఁడైన యీయజ్ఞాను నిపై నపరాధములను లెక్కించి లాభము లేదు. మరలఁ బిలిచెదను. శాండిల్యా! శాండిల్యా!

(అంతట శాండిల్యుడు ప్రవేశించుచున్నాఁడు)

శాండి—ఓహో! నాకథ తలుచుకొంటున్నాను. మొదటిది. నేను కాకులకు పిండాలు వేయుగా, మిగిలినకూళ్లతో పొట్టల్నింపుకొంటూ, పొట్టకోసినా అక్షరమ్ముక్కైనా లేక, మెళ్లోజందెం మాత్రం వేసుకొని అంతటితోనే బ్రాహ్మణ్యం అబ్బిందిగదా అని సంతోషించుకొంటూ ఉండే కుటుంబంలో పుట్టాను. ఆతర్వాత రెండోది; మాకొంపలో బువ్వకు లేకపోవడంచేత, ఆకలికి తాళలేక పెందలాడి పిండానికి ఆశపడి బౌద్ధభిక్షుకులలో కలిశాను. వాళ్లముండమొయ్య! అక్కడ ఆత్తొత్తుకోడుకులు, ఒంటిపూట సాపాటు వాళ్లే కావడంచేత, ఆకలికి ఆగలేక దాన్ని విడిచిపెట్టి చీవరము చించివేసి, పాత్రము బద్దలుకొట్టి, గొడుగు ఒకటి మాత్రం పుచ్చుకొని బయలుపడివచ్చాను. ఇహ మూడోది; ఈ పెద్దస్వాములవారికిప్పుడు సరకులు మోశేగాడిద నైనాను. స్వాములవారు ఈచేరువనే ఉన్నారనుకొంటాను. ఆయన్ని చేరబోతాను. ఏరీ స్వాములవారు? ఎక్కడికో వెళ్లినట్టున్నారే; ఆఁ! ఈపెద్దసన్న్యాసి పెందలాడి తిండిమీద ఆశపడి తాను ఒంటిగానే భిక్షమెత్తడానికి ముందుగా పరిగెత్తాడల్లే ఉంది. అట్టే దూరంపోకముందే వెంటబడి కలుసుకొంటాను. (పరిక్రమించి చూచి) ఇదుగో! స్వాములవారు! (చేరఁబోయి) అయ్యా! స్వాములవారు! క్షమించండేమి; క్షమించండేమి;

పరి—శాండిల్యా! వెఱవకుము. వెఱవకుము.

శాండి—అయ్యా! స్వాములవారూ! నిత్యకళ్యాణం పచ్చతోరణంగా ఎప్పుడూ ఉన్న

వాలు జరుగుతూ, సుఖప్రధానమై, వుం డే యీజీవలోకంలో, మీరు భిక్షాటనం చేసేటప్పుడు ఏవిధాన వర్తిస్తారండీ?

పరి—విను.

చ. అడుగువఁ బూని ధర్షణము
లందియుఁ గుందక కామమానముల్
విడుకొని బీదలిండ్లకడ
భిక్షము నెత్తి శరీరధర్మముల్
గడపుచు, దుఃఖదోషబహు
ళంబగు లోకమునన్, మొసళ్లపెన్
మడుగునఁ బోలె నెప్పుడుఁ బ్ర
మాదముపాల్పడ కేఁ జరించెదన్.

శాండి— పద్యకము :
తల్లీతండ్రీ లేరు, తమ్ము లన్న ల్లేరు
దైవానుగ్రహముత్తదే, వొంట్రిగాణ్ణి!
పొట్టకూటికోస మిట్టా వస్తినిగాని
ధర్మలోభము నాకింతైనా లేదండీ!

పరి—శాండిల్యా! ఇదిఏమోయీ!

శాండి—అవునండీ! తమరు, ధర్మమూ, అధర్మమూ రెండూ బంధకము లవుతవని శాదండీ అన్నారు.

పరి—నిజమే! ధర్మము అధర్మము ఫలాభిసంధితో చేసినచో బంధకములే అవును.

గీ. ఎవఁడు ఫలముఁగోరి యెదియేని కర్మ మూ
హించి చేయు నవహితేంద్రియుఁడయి
వానికొఱకు దానిఫలము మరల్ పర
మందు దాఁచియుంచు న్యాయమట్లు.

శాండి—అయితే, అయ్యా! ఎప్పుడండీ ఆఅకామకర్మఫలం పొంద గలిగేది?

పరి—ఎప్పుడు విరాగైశ్వర్యము లభించునో అప్పుడు.

శాండి— ఆవిరాగైశ్వర్యంఎట్టాలభిస్తుందండీ!

పరి—అసంగతచేత

శాండి—ఓస్వాములవారూ! ఇదేమిటండోవ్! అసంగత అని ఒకటి అంటున్నారు? అదేమిటో కొంచెం సెలవియ్యండి.

పరి—అదిరాగద్వేషములకు మధ్యస్థమైనదశ!

గీ. దుఃఖమున సుఖమున నిత్యతుల్యబుద్ధి
భయమునను హర్షమున నేకభావకలన
శత్రులందు మిత్రులయందు సామ్యచింత;
ఘనులు పలుకుదు రది యసంగత యటంచు.

శాండి—అయ్యా! ఇటువంటిదికూడా ఉంటుందా?

పరి—లేనిచో పేరెట్లు కలుగును?

శాండి—అయ్యా! అట్టా ఉండడము సాధ్యమౌతుందంటారా?

పరి—సందేహ మేమి?

శాండి—అబద్ధం. ఇది వట్టి అబద్ధం.

పరి—ఏహేతువుచేతనోయి అట్లనెదవు?

శాండి—అయ్యా! స్వాములవారూ! అదిసాధ్యమే ఐతే మీరెందుకండీ నామీద కోప్పడతారు?

పరి—అధ్యయనము చేయవని.

శాండి—నేను అధ్యయనము చేస్తేనేమి చేయకపోతేనేమి; ముక్తులైనవారికి మీరెందు కీగోడవ?

పరి—కాదోయీ, అట్లుకాదు, అభ్యాగతుఁడైనశిష్యునిమేలుకొఱకుదండించుటఫలసినదని

స్మృతులు చెప్పుచున్నవి. కాఁబట్టి కోపము లేనివాఁడనయినను నేను నీశ్రేయస్సుకొఱకు దండించుచున్నాను.

శాండి—ఆశ్చర్యముగా ఉందే; ఆశ్చర్యముగా ఉందే; కుపితులు కాకుండానే కొట్టుతున్నారుగా నన్ను! ఇహ కట్టిపెట్టండి ఈకథ. అతిక్రమించి పోతున్నది భిక్షావేళ.

పరి—తెలివిమాలినవాఁడా! ఇది ప్రాతస్సమయము. మధ్యాహ్నసమయము గాదు; ధాన్యము దంచి రోకళ్లు మూలఁబెట్టినతర్వాత, ప్రాయలు చల్లార్చినతర్వాత, అందఱును ఆరగించినతర్వాత, మధ్యాహ్నకాలమందు భిక్షకుఁబోవలెనని ధర్మోపదేశమున్నది. కాఁబట్టి యందాఁక విశ్రమార్థము మీయుద్యానవనమునకుఁ బోవుదము రమ్ము.

శాండి—ఆహా! మీరుచెప్పే దొకటి, చేసే దొకటిగా ఉన్న దేమిటండీ!

పరి—ఎట్లు?

శాండి—అయ్యా! తమరు సుఖదుఃఖసమానులుగా!

పరి—అవును సుఖదుఃఖములందు సమానమైనదే అంతరాత్మ. కర్మాత్మ విశ్రాంతిని గోరుచున్నది.

శాండి—అయ్యా! స్వాములవారూ! ఏమిటో అంతరాత్మ అంటున్నారు, కర్మాత్మ అంటున్నారు. ఎటువంటివండి అవి? అంతరాత్మ అంటే ఏమిటి? కర్మాత్మ అంటే ఏమిటి?

పరి—విను.

గీ. స్వప్నమందు గగనసంగతమగునది
యంతరాత్మ, మఱి సమస్తవిధులు
గష్టములు సుఖములుఁ గనునది కర్మాత్మ
జనుఁ డనంగ దేహి యనఁగ నదియె.

శాండి—అజరమై, అమరమై, అచ్ఛేద్యమై, అభేద్యమై, ఉన్న దేదో అది అంతరాత్మ. నవ్వేది, ఏడ్చేది, శయనించేది, భుజించేది, నశించేది, ఏదనంటావో అది కర్మాత్మ. ఇంతేనా?

పరి—ఎట్లు గ్రహింపవలెనో అట్లు గ్రహించితివి.

శాండి—చాలుచాలు. కట్టిపెట్టండి. పట్టుపట్టారు.

పరి—ఎట్లు?

శాండి—అయితే ఆ అంతరాత్మ, ఇప్పుడీకనబడే మీరూ అంతా ఒక్కటేకదా! శరీరం లేకపోతే ఇహ మరేమీ లేదాయె గదా! మళ్లీ ఇపుడు అంతరాత్మ వేరు; కర్మాత్మ వేరు; అంటూ ఏమో చెప్పసాగిరి. పొందుబాటుగా ఉందా యిది?

పరి—లౌకికముగానిప్పు డిట్లుచెప్పినాఁడను. ఇతిహాసపురాణాదులు, లౌకికరీతిని సురనరపశుపక్ష్యాదిజీవభేదమును సత్యత నంగీకరించుచున్నవి.

శాండి—అదంతా అట్లా ఉండనియ్యండి. మీరెవరు? 'మీరు' అనిపించబడే మీరెవరు?

పరి—విను.

చ. అనలము వాయువుర్వి జలము
నాకస మన్నవి పాళ్లు గూడఁగా

బొనరిన పార్థివానువుల
ప్రోవు చలించెడు విగ్రహంబున
దనరంగ వీనులుం గనులుం
ద్వక్కును ముక్కును జిహ్వ గల్గంగా
గనె నరసంజ్ఞ, నేనన ను
కానొకం డట్టిండ బ్రాణిధర్ముండన్.

శాండి—ఆహా! ఇంతకూ మిమ్మ మీరే ఎరగ లేకుండా ఉంటిరి. ఆత్మ నింకా ఎరిగుండే దేమిటి? సరేలెండి! అయ్యా! ఇదుగో ఉద్యానము.

పరి—నీవు ముందుగా బ్రవేశింపుము. సందడిలేక శాంతమై యుండునరణ్య ప్రదేశములం జూచుకొని ప్రవేశింపం దగినవారము మేము.

శాండి—అయ్యా! తమరే ముందు ప్రవేశించండి. నేనే తర్వాత వస్తాను.

పరి—అదేల?

శాండి—పాతకాలపుముండ మా అమ్మ చెప్పేది. ఈవనంలో అశోకవృక్షపు చిగురుటాకులచాటున పెద్దపులి ఉన్నదని. అందుచేత భయమవుతున్నది. అయ్యా! మీరే ముందు దయచెయ్యండి.

పరి—మంచిది.

(ముందువెనుకలుగా ఇద్దఱు ప్రవేశించుచున్నారు.)

శాండి—అయ్యో! అయ్యో!! పెద్దపులి పట్టుకు పీకుతున్నదండోవు! ఈపులిబారి నుండి తప్పించండోవు! దిక్కుమాలిన వాణ్ణి పులినోట పడిపోతున్నానండోవు! ఇదుగో కారుతున్నది కంఠంలోనుంచి రక్తం.

పరి—శాండిల్యా! భయపడకు. ఇది నెమిలిగదవోయి!

శాండి—నెమలాండి! ఆఁ! నిజంగా!

పరి—ఔనోయి! నిజముగానే నెమిలి.

శాండి—అమ్మయ్యా! నిజంగా నెమలే అయితే ఇహ కళ్లు తెరుస్తాను.

పరి—భయపడ బనిలేదు. తెఱవుము.

శాండి—అమ్మా!! లంజెముండాకొడుకు, పులి గాదు; నన్నుచూచి భయపడి నెమలిరూపంతో పరుగెత్తాడుసుమా! (ఉద్యానము నిరూపించి) ఏమిఉద్యానం, బలే! బలే!! సంపంగులు, జువ్వాలు, కలిగొట్లు, నీపములు నిచుళములు, తిలకములు, గోరంటలు కొండగోగులు, కల్హారములు, మామిళ్లు ప్రేంకణములు, ఏపులు, తాళ్లు, తమాలములు, పొన్నలు, నాగములు, పొగడలు, సరళములు, సర్జములు, సిందువారములు, సప్తపర్ణములు, గన్నెరులు, కొండమల్లెలు, చందనములు, అశోకములు, మల్లెలు, నంద్యావర్తములు, తగరములు, ఖదిరములు, అనంట్లు మొదలయిన వృక్షాలతో శోభిస్తున్నది. వసంతుడు తాండవమాడుతున్నాడు. చిగురుటాకులు, ముదురుటాకులు, పువ్వుగుత్తులు, నిండిఉన్నవి. మాలతులు, గురివెందలు, తీగెపందిళ్లల్లుకొనిఉన్నవి. నెమళ్లు, కోవెలలు, చిలకలు, తుమ్మెదలు, తేనెటీగలు, మధురధ్వనులు చేస్తున్నవి. ప్రియజనమును వదలి ఉండడంచేత చివికిచింతిస్తూఉండే పడుచు

ప్రాయపువారికి పరితాపాన్నీ, జోడువీడకుండా ఉండే సొగసర్లకు సుఖాన్నీ కలిగిస్తూ ఈఉద్యానము ఎంతరమణీయముగా ఉన్నది!

పరి—మూర్ఖుడా! పూటపూటకు నింద్రియములు హీనగతి పొందుచుండగా నీ కిందు రమణీయత యెట్టుకన్పట్టుచున్నదోయి! చూడుము:

ఉ. ఆమని వచ్చెఁ గ్రొంజిగురు
టాకునగల్ ధరియించి యంచు, ఫు
ల్లామలపుండరీకమయ
మై శరదాగమ మింపుగొల్పెనం,
చీమెయి వచ్చుచో ఋతువు
లెంతయు నజ్ఞులు సంతసింతు రి
స్సీ! మృతి చేరువా టెఱుఁగరే
రమణీయత యిందు నున్నదే!

శాండి—ఏది యెప్పుడు రమణీయముగా ఉంటుందో దానిని అప్పుడు రమణీయంగా ఉన్నదంటారు.

పరి—ప్రాజ్ఞసమ్మతము కానిమాట మాటాడితివి. విను:

గీ. గతముఁగూర్చి మిగుల వెతకుదురువా, రనా
గతముఁగూర్చి యాశఁ గాంచువారు
వర్తమానమందుఁ బరితృప్తిగననివా
రెందుగాని ముక్తి నందలేరు.

శాండి—త్రోవ చాలాపొడుగుగా ఉంది. మనమిప్పుడు ఎక్కడ కూర్చోవడము ?

పరి—ఇక్కడనే కూరుచుందము.

శాండి—ఇక్కడి నేల అపరిశుభ్రంగా ఉంది.

పరి—అరణ్యభూమి పవిత్రమైనది. పరిశుద్ధమైనది.

శాండి— మీకుగనక బడలికగా ఉన్నదంటే, కూర్చోవలెనని బుద్ధిపుట్టిందంటే, ఇహ, చెడ్డభూమినైనా మంచిభూమినిగా చేసివేస్తారు.

పరి—ఓయీ! శ్రుతి ప్రమాణము. నేనుగాదు

క. అతిమానోన్మాదమున న [నాత్మో
హితమును హితమయుని యెంచుచెప్పెడు
దితమే ప్రమాణమనికొను
కితవులకుం బరములేదు కించిత్తైనన్.

శాండి—తెగచెప్తూ ఉంటారు. అట్లాగు ఇట్లాగు అదీ యిదీని; మీ కో ప్రమాణమున్నట్టు నాకు తోచలేదు.

పరి—కాదోయి! అట్లు కాదు.

గీ. లోకమంతు విబుధులు ప్రమాణమనుదాని
నే ప్రమాణముగను నీవుఁ గొనుము
అప్రమాణ మెప్డు దోప్పరుసుమ్ము ప్ర
మాణమంచు సుప్రమాణవిదులు.

శాండి—అయ్యా! నాకు తోచలేదండీ. మీకో ప్రమాణం ఉన్నట్టు- అట్టా ఇట్టా చెప్తూ తూ ఉంటారు.

పరి—నాయనా! అధ్యయనము చేయుమోయి! తెలియును.

శాండి—నా కక్కర లేదండీ అధ్యయనము.

పరి—ఎందుకని?

శాండి— అధ్యయనానికి అర్థ మేమిటో చెప్పండి?

పరి—అధ్యయనము చేసినవారికిఁగూడ నధ్యయనార్థములు కాలాంతరమునఁ దెలియఁదగినవిగానుండును. కావున నీవు ముందుగా నధ్యయనము చేయుము.

శాండి—అధ్యయనముచే నేమిస్తుందండీ?

పరి—విను- జ్ఞానము; జ్ఞానమువలన విజ్ఞానము; విజ్ఞానమువలన సంయమము; సంయమమువలనఁ దపస్సు; తపస్సువలన యోగప్రవృత్తి; యోగప్రవృత్తివలన నతీతానాగతవర్తమానతత్త్వదర్శనము; వీనివలన నష్టగుణమైన యైశ్వర్యము లభించును.

శాండి—అయ్యా! స్వాములవారూ! ప్రత్యక్షములుగాని విషయములందు నాబుద్ధిని మీయిష్టమువచ్చినట్టు పరిభవించి మాట్లాడుతున్నారు.నాకెందుకుగాని అదంతా. అయితే! అధ్యయనంవల్ల ఎవ్వరికి అగపడకుండా పరులకొంపల్లోకి దూరడానికి శక్యమౌతుందా?

పరి—నీకోరిక యెట్టిదోయి?

శాండి—నాకోరిక యెట్టిదో చెప్పమంటారా? ఆశాక్యశ్రమణులకోసం, సంఘాలలో తయారవుతూఉండే, కమ్మకమ్మని భక్ష్యభోజ్యాలను కడుపునిండుగా ఆరగించడం నాకోరిక!

పరి—అయ్యో! మిక్కిలితుచ్ఛమైనదిగదోయి నీకోరిక!

శాండి—ఇందుకోసమేకాదండి తమరు బుద్ధిగోరిగించుకొన్నదీని? ఇంతకంటె వేరే ప్రయోజనం నాకు కనపడలేదు సుమండీ!

పరి—ఆఁ, ఆఁ, కాదట్లుకాదు.

గీ. విపులు మహాత్ము లెపుడు సేవించుచుండ్రు
సురలునసురులుఁగూడ మెచ్చుకొనుచుండ్రు
అవ్యయమవార్యమక్షోభ్యమద్భుతముమ,
హాత్తరం బట్టియోగ మే నభ్యసింతు.

శాండి—తమరొక్కరూ సమాహితులై కూర్చుండి యోగాభ్యాసచింత జరుపుకోండి. నేను సుసమాహితుణ్ణై సుభోజనచింత జరుపుకొంటాను. అయ్యా స్వాములవారూ! యోగం యోగం అని మీవంటి సన్న్యాసిస్వాములవార్లు తరుచుగా ప్రశంసిస్తూ ఉంటారు! ఎటువంటిదండీ ఆ యోగమనేది?

పరి—విను:

గీ. జ్ఞానమూలము ద్వంద్వనాశకము తత్త్వ
సంహితమ్ము మహాతపస్సార మింక
ద్వేషమునకు రాగమునకును వేఱుపడిన
తీరుగలది యోగంబని తెలియుమోయి!

శాండి—'ఆహార ప్రమాదము సర్వప్రమాద' మని బోధించిన బుద్ధదేవుడికి పదివేల నమస్కారాలు.

పరి—శాండిల్యా! ఇదేమోయి!

శాండి—స్వాములవారూ! ఎరగరా ఏమిటి? మొదట నేను పెందలాడి తిండికోసం శాక్యశ్రమణులలో కలిశాను.

పరి—అక్కడ నేమేని నీకు పరిజ్ఞానముకల్గెనా?

శాండి—కలిగింది-కలిగింది-బోలెడంతకలిగింది.

పరి—కానీ, ఏదో విందుము.

శాండి—అయ్యా! ఐతే వినండి "అష్టౌ ప్రకృతయః, షోడశవికారాః, ఆత్మా, పంచవాయవః, త్రైగుణ్యం మనః, సంచరః, ప్రతిసంచరశ్చేతి." ఈవిధంగా జినభగవానులు పిటకపుస్తకాలలో చెప్పినారు.

పరి—శాండిల్యా! ఇది సాంఖ్యసమయము, శాక్యసమయము కాదు.

శాండి.—ఆకలిగా ఉండడంచేత మనస్సంతా అన్నముమీదికి పోయింది. అందుచేత లోపల అనుకొన్న దొక్కటైనా పైకి చెప్పింది ఇంకొకటి అయింది. ఇప్పుడు చెపుతాను వినండి. "అదిణ్ణాదాణాదో వేరమణింశిక్ఖాపదం, పాణాదిపాదాదో వేరమణిం శిక్ఖాపదం, ముథావాదనో వేరమణిం శిక్ఖాపదం, అబ్బమ్మచయ్యాదో వేరమణిం శిక్ఖాపదం, అకాలభో అయణాదో వేరమణిం శిక్ఖాపదం, అహ్మోణం బుద్ధం ధమ్మం సంఘం సరణంగచ్ఛామి."

పరి.—శాండిల్యా! స్వసమయమును విడనాడి నీవు పరసమయమును బలుకుట యుక్తముగాదు.

గీ. తమముమీఁకుకొనుము త్యజియింపుము రజస్సు
సత్త్వమందు సంప్రసక్తిఁ గనుము
ధ్యానయోగమందుఁ దగిలి యుపాసింపు
మిదియె జ్ఞానమునకు నొదవు ఫలము.

శాండి.—అయ్యా! స్వాములవారూ! మీరు సమాహితులై యోగాన్ని చింతించండి. నేను సుసమాహితుణ్ణై సుభోజనమునే చింతించుకొంటాను.

పరి.—కట్టిపెట్టుమోయి యీకథను.

గీ. ఇంద్రియముల నాత్మయందు యోజింపుము
సకలజగము మేన సంగ్రహింపు
సర్వమందు నాత్మసమవీక్షణ మొనర్పు
సత్త్వమాశ్రయింపు జ్ఞానమునను.

(అంతట గణిక, ఇద్దరు చెలికత్తెలు, వత్తురు.)

గణిక.—ఓసే, మధురికా! మధురికా! ఎక్కడనే ఎక్కడనే రామిలకుడూ!

చేటి.—అజ్జుకా! శావ, ఇదుగో వస్తున్నానని చెప్పి నగరంలోకే వెళ్లాడు.

గ.శి.—ఓశే! అక్కడి కెందుకువెళ్లాడోగదా!

చేటి.—ఆఁ! ఇంకోలేముంది; జూదగాళ్లను తొందరపెట్టటందుకు వెళ్లాడు.

గణి.—ఇంతసేపైనా ఇంకా జూదం ముగియలేదటే!

చేటి.— బాగానే ఉంది! మంచిమాట న్నావు. జూదమంటే చెప్పడానికేనాగాదటే! సిగ్గుతో చితికిపోయే స్త్రీలను కూడా ఆతాగుడు గింతులువేయించి, [illegible]ట్టు చేస్తుందే! దానిమజా మగవాళ్లకు [illegible]ట్టాన ఒదుల్తుం దనుకొన్నావు?

గణి.—వెళ్లు, తొందరపెట్టి తీసుకురా!

చేటి.—అజ్జుకా! అట్లాగే వెళ్లుతున్నాను, పిల్చుకొని వస్తాను. (వెళ్లును.)

గ.శి.—ఓశే, పరభృతికా! ఎక్కడ కూర్చుందామే; చెప్పు, ఎక్కడకూర్చుందాము?

చేటి.—అజ్జుకా! ఇదుగో పూచినమామిళ్లు, తిలకములు, చుట్టుకొని ఉన్న యీశిలాపట్టముమీద కూర్చుందాము. కూర్చుండి ఏదీ ఒకపాట పాడు.

గణి.—పరభృతికా! సరే. అట్లాగే.

(ఇద్దఱు కూర్చుందురు, ఇద్దఱును పాడుదురు.)

గేయము.

పరభృతమధుకరరుతశింజితములు
మొరయ చూతశరముల్, మునిజన
విరాగపరిహారముల్, తాలిచి
పరాక్రమము చెలఁగఁగ, మదనుఁడు,
బలే! యిందు మెలఁగుఁగా. (సశేషము)




పుండలేముల వెంకటశాస్త్రి గారు, బి. ఏ., ఎల్. టి.,

అతులమహానుభావముగదా కరిఁగింప భవత్కృపారసం
బతిమృదులప్రభావము ననన్యసులభ్యము, నార్యలోకస
న్నుత, మగుటన్ దరిద్రుఁడు ననూనశుభమ్ముల నొందు దాన; భూ
పతి యధమాధముండగు లవం బెడఁదైనను; వేంకటేశ్వరా! ౬

చ. జగముల సృష్టిసేసితట! చక్కఁగ వానినిఁబ్రోచుచుండి య
త్యగణితకీర్తి నొందితట! యంతమునందు లయమ్ముఁగూర్చి యీ
జగములలోనఁ గొందునట! సర్వవిభుం డన నీవ కావె? యి
మ్మగ నినుగొల్చుభక్తులకు ముక్తి సుసాధ్యము వేంకటేశ్వరా! ౭

చ. మము భవరోగపీడితవిమానసులన్, మదమత్సరాది దో
షములఁ గలంగు జీవులను సత్కరుణామతి బ్రోవనున్న దై
వమవని నిన్నుఁ జేరితిమి భక్తి తెలంగ గణించి పాప కూ
పమునఁ బడంగనీక మనుపంగదె పావన! వేంకటేశ్వరా! ౮

చ. సలిపినతీర్థయాత్రలును జన్మములున్ దపమున్ వ్రతమ్ములున్
సలలితమైన ధర్మమును సత్యవచోనియమం బుపాస్తియున్
ఫలమును బొందనేరవు స్వభావము నిర్మలమైనఁగాని కే
వలము విశుద్ధమానసమె భక్తికి మూలము వేంకటేశ్వరా! ౯

చ. కలియుగమందు నీవె మము గావఁగ దైవతమంచుఁ దెల్పు ప్రా
జ్ఞులపలు కాలకించితి మనోహరమైన భవత్స్వరూపమున్
నిలిపితి నెమ్మనమ్మున ననిందితమైన భవన్మహత్త్వమున్
దెలియ నుతింపగాఁ గడఁగితిన్! ననుఁబ్రోవుము వేంకటేశ్వరా! ౧౦

[పశేషము]





# భాషా కుటుంబములు

కోరాడ రామకృష్ణయ్య గారు

భూభాగమందలి యాయా ప్రదేశముల నివసించుచుండెడి మానవకోటియంతయుఁ గొన్ని జాతులు, కుటుంబములుగా విభజింపఁబడుచుండినట్లే, యీమానవకోటిచే వ్యవహరింపఁబడుచుండెడి భాషలు కూడఁ గొన్నికుటుంబములుగా విభజింపఁదగియున్నవి. భాషయనునది మానవుఁడు తనజన్మకుఁ గారణభూతులగు పూర్వపురుషులనుండి పడసిన యొక యపూర్వంబగు సొత్తు. ఇట్టిపూర్వసంపత్సంపన్నుఁ డగుటచేతనే మానవుఁడు తక్కిన జంతువులకంటె భిన్నుఁడై జంతుకోటిలో నగ్రస్థానమును వహించుచున్నాఁడు. అనుకరణశక్తి, జ్ఞాపకశక్తి, విశ్వాసము, బుద్ధిబలము, సుఖదుఃఖాద్యనుభవము, మొదలగువిషయముల మానవులకుఁ దక్కిన జంతుకోటికిని విశేషభేద మగపడదు. కాని యీభాష యనునదిమాత్ర మీజీవకోటిమధ్య నొకసరిహద్దుగా నేర్పడిమానవకోటిని తక్కిన జీవకోటినుండి వేఱుపఱచి దాని యాధిక్యమును జాటుచున్నదివలె నున్నది.

భాషయనున దెట్లు ఏకాలమున నేర్పడినది? ఒక భాషనుండి యనేకము లేర్పడినవా, లేక యేక కాలమున పలుచోట్ల పలుభాసలు బయలుదేరినవా యను విషయములు వివాదముతో గూడినవిగా నున్నవి. కాని ప్రస్తుతము వ్యవహారములోనున్న భాషలను వానిస్థితిగతులను, అవిపొందుచున్న మార్పులనుబట్టి విచారింపఁగా, భాషలకు మార్పు సహజగుణమైనట్లును, అనేకవిధములగు కారణములచే నొక్కభాషయే యనేకవిధములగు మార్పులను జెంది, యొక్కజనసంఘముచేతనే భిన్నరీతుల వ్యవహరింపఁబడుచుఁ, దుదకుఁ గాలక్రమమున భిన్నభాషలుగా మాఱిపోవుచున్నట్లును దెలియవచ్చుచున్నది. ఒక్కయాంధ్రభాషయే దేశభేదమునుబట్టియు, వర్ణభేదమునుబట్టియు, నెన్నివిధములుగావ్యవహరింపఁబడుచున్నది మన మెఱింగిన విషయమే. మొట్టమొదట భాష లనేకముగఁ బుట్టి కాలక్రమమున నవి కొంత సంస్కారమును బొందినకొలఁది కొన్నిప్రతిరూపములు లేక ప్రత్యేకాకారములు (Types) కలవిగా నేర్పడియుండ, వానినుండి యిప్పుడుభూభాగమున వ్యవహారములో నున్న భాషలు బయలుదేరియుండవచ్చును. అట్లు కాక అనాదియగు నొకభాషనుండి బయలుదేరినవేయైనను, ఆయాదేశకాలస్థితులనుబట్టియు, నాయాజనుల ప్రయత్నములనుబట్టియు, భిన్నములై వేఱువేఱురూపములఁ బొందినవై యుండవచ్చును. కాని మొత్తముమీఁద నిప్పుడు వ్యవహారములో నున్న భాషలన్నియుఁ గొన్ని మూలభాషలకుఁ జెందినవై కొన్నికుటుంబములుగ నేర్పడఁదగియున్న వనువిషయమును మాత్రము భాషాతత్త్వవేత్తలందఱు నేకాభిప్రాయులై యున్నారు. భాషాకుటుంబముల నేర్పఱచుట యనఁగాఁ గొన్నికొన్ని భాషలలోఁ గలపోలికలనుబట్టి యాపోలికలకుఁ గలకారణములను వానికిఁ గలసంబంధమును గూర్చి విమర్శించి యవి పరస్పరము జన్యజనకభాషాసంబంధమో లేక సోదరభాషాసంబంధమో కలవై యుండెనని నిర్ధారణచేసి యాసంబంధమునుబట్టి వాని నొకవంశవృక్షముక్రింద నమర్ప యత్నించుటయే యైయున్నది. భిన్నభాషలు మాట్లాడువారికిఁ బరస్పరము నేమాత్రము నర్థముకాకుండునంతగా మాఱి వేఱుపడిపోయిన యాయాభాషలకుఁ గలసంబంధ మిట్టిదని నిర్ధారణచేయుటకుఁ దగినమార్గము లేవో మన మిప్పుడు విచారింపవలెను.

భాషలపరస్పరసంబంధమును నిర్ధారణచేయుటలో మనకుఁదోడుపడునవి రెండు ముఖ్యములగు నంశములు కలవు. అందొకటి యాభాషలయందలిపదపరికరము (Material), రెండవది యందలి పదవాక్యముల సంఘటనాపద్ధతి (Method of expression) లేక వ్యాకరణాంశములు. మొదటిది కొంతసులభమైన మార్గము. ఆయాభాషలయందలి పదపరికరమును సరిపోల్చిచూచుట. అట్లు సరిపోల్చిచూచినపు డాయాభాషలయందు

సమానార్థకములగు పదములుగాని, లేక పదముల మూలరూపములు (root elements) గాని యొకరూపము గలవై (లేక తుల్యరూపములు కలవై) కన్పడినచో నా భాషలు పరస్పరసంబంధము కలవని యూహింపవచ్చును. సంబంధము కలవనే కాదు, అవియన్నియు నేదో యొక కాలమున నొక ప్రాచీనభాషనుండి బయలుదేరి కాలక్రమమున విడిపోయి తుదకు భిన్నత్వమును జెందిన వనికూడఁ జెప్పఁదుము. చరిత్ర మనకుఁ దోడ్పడినచో నీభిన్న భాష లేయే కాలమున నేయేమార్పులను జెందినవో సూచించుచు ప్రాచీనభాషతో నేకాలమున నైక్యమును బొందియున్నవని సూచించుచు వానిచరిత్రను వెనుక కన్వేషింపగలుగుదుము. ప్రస్తుతము భిన్నభాషలుగా వ్యవహరింపఁబడుచున్న, ఫ్రెంచి, స్పానిష్, పోర్చుగీస్, రుమేనియన్, ఇటాలియన్, మొదలగుభాష లొకకాలమున నాయాప్రదేశములవాడుకలో నున్నభాషలతో మేళనముబొందినవ్యావహారికలాటిన్ భాషారూపములే. ఆయా దేశకాల పరిస్థితులను బట్టి యాయొక్క-భాషయే యిన్ని రూపములఁ జెంది భిన్నభాషలుగా మాఱినదను విషయమును నిర్ధారణచేయుటలో చరిత్రకు భాషావిషయములును, భాషానిదర్శనములకు చారిత్రకనిదర్శనములును బరస్పరము నుద్బలకము లగుచున్నవి. ఇట్లే ఉత్తరహిందూస్థానమున వ్యవహరింపఁబడుచుండెడి భాషలన్నియు నొక కాలమున నాయాప్రదేశముల వ్యవహారములోనున్న ప్రాకృతభాషలనుండి బయలుదేరినవనియు, నీప్రాకృతభాషలయందలి భేదముకూడ, ప్రాచీనప్రాకృత భాష మగధావంతి శూరసేనాది దేశభాగములలో భిన్నరీతుల వ్యవహరింపఁబడుటచేఁ గలిగినదేయనియు, నీప్రాకృతమును, వైదికభాషనుగూడ 'జెండవెస్టా' (Zend Avesta) భాషతోఁ బోల్చిచూచినయెడల నివియన్నియు సన్నిహితసంబంధము కలవేయై ప్రాచీనార్యభాషనుండి వచ్చినట్లును, కేవలమాయా భాషలయందుఁగల పోలికలనుబట్టియే కాక ఆయాభాషాగ్రంథములందలి యితరనిదర్శనములనుబట్టికూడ మనము నిశ్చయింపవచ్చును. ఇంగ్లీషుభాషకును యూరపుదేశమందలి ట్యూటానిక్ కుటుంబభాషలకు గలసంబంధమును, ఒకకాలమున జర్మనుదేశస్థులగు ఆంగిలులు, సాక్సనులు మొదలగుజాతులు బ్రిటన్ దేశము నాక్రమించిరనియు, నప్పుడే తమభాషనుగూడ నచ్చట నెలకొల్పిరనియుఁ దెల్పెడి చారిత్రకాంశము లే సమర్థించుచున్నవి.

ఒకవేళ నీపై విషయములను సమర్థించుటకు చారిత్రకనిదర్శనము లేమియు లేకున్నను, ఈభాషలయం దగపడుచుండెడి సమానార్థకములగు సరూపపదజాలమునుబట్టి భాషాశాస్త్రజ్ఞుఁడు వీనికిఁ గలసంబంధమును నిర్ధారణచేయలేకపోఁడు. కాని యట్లు నిర్ధారణచేయుటకుఁ బూర్వము మాత్రము కొంచెము నిదానించి యాపదములను బాగుగఁ బరిశీలించును. రెండుభాషలలోఁ గొన్ని పదములు సమానముగఁ గన్పడినంతమాత్రమున నాభాష లొకకుటుంబమునకే చెందినవని నిశ్చయింప వీలులేదు. ఏలయనగా నొక దేశముపై మఱియొక దేశమువారు దండెత్తుటవలనఁగాని, వర్తకవ్యాపారములవలనఁగాని, వలసపోవుట మొదలగు కారణముల వలనఁగాని, భిన్నభాషలు మాట్లాడువారికి పరస్పరసంబంధము కలుగుచుండును. అప్పుడాజనులతోపాటు ఆభాషలును నన్యోన్యసంబంధము కలుగుటచే, నొక భాషనుండి మఱియొక భాష యనేకములగు పదముల నెరవు తెచ్చుకొని స్వభాషాపదములవలెనే (ఒక్కొక్కప్పుడు స్వభాషాసాంప్రదాయానుసారములగు యత్కించిత్సంస్కారములతో) వాడుకొనుచుండవచ్చును. ఈరీతి నెరవుతెచ్చుకొనుటచేఁ గలిగిన యాభాషలలోని పదములసారూప్యమును బట్టి యవి యేకకుటుంబమునకుఁ జెందినవేయని నిశ్చయింప వలనుపడదుకదా! కావున భాషలసాజాత్యమును నిశ్చయించుటకుఁ బూర్వభాషలలో సరూపములై కన్పడెడుపదజాలము, ఒకదానినుండి యొకటి యెరువుగాఁ దెచ్చికొనినది కాదని ఋజువు కావలెను. ఒకప్పు డీయెరువుతెచ్చికొనిన పదములకే యాభాషలలోఁ బ్రచారం బెక్కువయగుటచే నంతకుఁబూర్వ మందాభాషలలో నాయాయర్థముల వాడుకలో నున్న నైసర్గికపదములు (Native words) బహిష్కృతములై క్రమముగా వాడుకలోనుండి తప్పిపోవుటయుఁ దటస్థించును. అట్టిపదముల సంఖ్యనుబట్టి మనము స్థూలదృష్టితో విచారించి యాభాషల సంబంధబాంధవ్యములను నిశ్చయించినచో నది సత్యమునకు దూరము కాకమానదు. ఆధునికపరిషియన్ (పార్సి) వాస్తవముగ ఇండోయూరోపియన్ భాషాకుటుంబములోఁ (సంస్కృతము ల్యాటిన్, గ్రీకు, ఎవెస్టాభాష, ఇంగ్లీషు మొదలగువానిలో) జేరినదేయైనను, ఇప్పుడాభాషలోఁ గలిసిపోయిన ఆరబిక్ పద

సమూహమునుబట్టి స్థూలదృష్టితోఁ జూచినచో నది సెమెటిక్ (హీబ్రూ, అరేబిక్ మొదలగు భాషల) కుటుంబములోఁ జేరినదిగాఁ జెప్పఁదగియుండును. ఇంగ్లీషు భాష వాస్తవముగ ఇండోయూరోపియన్ కుటుంబమునకుఁ జెందినట్యూటానిక్ శాఖలోనుండి బయలుదేరినదై జర్మన్ మొదలగు భాషల కత్యంత సన్నిహితమైయున్న భాష. కాని తరువాతికాలమున దేశము నార్మనులచే నాక్రమింపఁబడినపిదప, నీభాషకు ల్యాటిన్ ఫ్రెంచిభాషలతోఁ గలిగినయత్యంతసాంగత్యమునుబట్టి యాభాషలనుండి యమితంబగు పదజాలమును సంగ్రహించికొనియుండుటచేఁ గోశములయందలి పదజాలమును బట్టియే విచారించినచో నింగ్లీషుభాష ల్యాటిన్ శాఖకుఁ జెందినదని చెప్పవలసియుండునుగాని జర్మన్ భాషకుఁ గాని ట్యూటానిక్ శాఖకుఁగాని వానికంటె సన్నిహిత సంబంధముకలదని చెప్పుట కవకాశము లేదు. ఇంతయేల? మనయాంధ్ర భాషవిషయమునఁగూడ నిట్టిసందిగ్ధస్థితి లేకపోలేదు.

ఆంధ్రభాష వికృతియని యాంధ్రవైయాకరణులందఱు చెప్పుదురు. అనగా సంస్కృతప్రాకృతములు ప్రథమద్వితీయ ప్రకృతులనియు, వానినుండివచ్చినదిగావున నిది వికృతియనియు వారిమతము; కాని సంస్కృతాంధ్రభాషలకుఁ గలసంబంధము ప్రకృతివికృతిభావములకుఁ గలసంబంధమే యనువిషయము మాత్రము విచారణీయమైయున్నది. ఏలయన నాంధ్రభాషయనునది సంస్కృతభాషయొక్క వికారము లేక వికృతియేయైనట్టయితే "తజ్జా సమాచ దేశ్యా గ్రామ్యా చేయం చతుర్విధా భవతి" (ఆంధ్రశబ్దచింతామణి)అనియు;

ఆ. "తత్సమంబునాఁగఁ దద్భవంబన నచ్చ
తెనుఁగునాఁగ మఱియు దేశ్యమనఁగ
గ్రామ్యభాషనాఁగ గల వైదుతెలుఁగులు
వాఱువేఱు వాని విస్తరింతు.
(కేతన-ఆంధ్రభాషాభూషణము)"

అనియు నీమొదలుగ నాంధ్రభాషను నాలుగు విధములుగను, నైదువిధములుగను విభాగంబొనర్చిన యాంధ్రలక్షణకర్తల యభిప్రాయమేమో దురూహ్యంబగుచున్నది. ఆంధ్రభాష నాలుగు, ఐదుతెలుఁగు లన్నప్పుడు, తత్సమభాష, తద్భవభాష, దేశ్యభాష, అచ్చతెనుగుభాష, గ్రామ్యభాష యనియు వీరిభాషము అని సందేహము కలుగకమానదు. తెనుఁగుభాష, గ్రామ్యభాష యనఁగా నేమో కొంచెమర్థమగును గాని తత్సమభాష తద్భవభాష యనఁగా నర్థముకాదు. మనము అచ్చతెనుఁగుగాని, గ్రామ్యభాషగాని మాట్లాడవచ్చునుగాని తత్సమభాష. తద్భవభాష మాట్లాడుట లేదు. కావున "తెల్లమగు నైదుతెలుఁగులఁ దెనుఁగుబాస"(సూచిరిమ్మ.) యని తెలుఁగుబాస యైదుతెలుఁగలని చెప్పినలక్షణకర్తలయభిప్రాయము, తెలుఁగునందలి పదము లైదుతెలుఁగులుగా నున్నవనియే కాని తెలుగుభాష యైదుతెలుఁగులనికాదని వారు "యాంధ్రభాషాభేద చతుష్టయము (లేక పంచకము)నకుఁ జెప్పినలక్షణమునుబట్టి మనము తెలుసుకొనవలసియున్నది.

"క. మును సంస్కృత పదములపైఁ
దెనుఁగు విభక్తులు ఘటించి తేటపడఁగఁ జె,
ప్పిన నది తత్సమమగుఁ జను
వనము, ఘనము, పురుషుఁడబల, వసుమతి యనఁగన్
(కేతన-ఆంధ్రభాషాభూషణము)

"తే. ఆంధ్రదేశపురస్థాయులైన సకల
జనములకును మఱుంగు దేశంబు లేక
తేటతెల్లమిగాఁ బల్కు మాటలెల్ల
ననని శుద్ధాంధ్రదేశ్యంబు లనఁగఁ బడును.
(అప్పకవీయము.)"

దీనినిబట్టి ఆంధ్రభాషాభేదము - అనగా నాంధ్రభాషాపదములయందలి భేదము అని యర్థమైనట్లు స్పష్టమగుచున్నది. అయితే ఒకభాషలోని కొన్నిపదములు మఱియొకభాషనుండి వచ్చిన వికృతులైనప్పుడాభాష యంతయు దీనివికృతియని చెప్పవలసినదేనా? ఒకవేళ అట్లే చెప్పఁదలఁచినచో నీలక్షణకర్తలు చేసిన యాంధ్రభాషాపదముల విభాగములోఁ జేరిన దేశ్యపదములు, అచ్చతెనుఁగుపదములు అనునవి యాద్యప్రకృతినుండిగాని ద్వితీయప్రకృతినుండిగాని వచ్చినవికావే; ఈపదములతోఁగూడినభాషనే వికృతియని చెప్పఁదలఁచిన నది యెట్లుపొసఁగును. అను సందేహములు కలుగుట కవకాశములు లేకపోలేదు. దీనిని సావకాశముగఁ బరిశీలింప

వలసియున్నది. పూర్వలాక్షణికులు సంస్కృతము దేవతల భాషయని, దానియం దుండెడియభిమానముచేఁ గాఁబోలును "జనని సమస్తభాషలకు సంస్కృతభాష ధరాతలంబునన్" అని ధరాతలంబునందలి (అనఁగా బహుశః హిందూదేశమునందలి) భాష లన్నిటికిని తల్లి భాషయే యనిచెప్పఁగడంగినప్పు డాంధ్రభాష వికృతియనుటలో నాశ్చర్య మేమియు లేదు. ఇట్లు లాక్షణికులు సంస్కృతాంధ్రములకుఁ బ్రకృతివికృతి భావసంబంధమును నిరూపింప మఱికొందఱు అది జన్యజనక భావ సంబంధమే యని చెప్పుచు నీరెంటికి నభేదమును సాధించుచున్నారు. సంస్కృతభాషాభిమానముయొక్క విలాస మిట్లుండ, "ఆంధ్రవాఙ్మయచరిత్ర" కారులు:

"కాశ్మీరదేశమునందుగల కారదవ్వుల నివసించువారు మొదలు కన్యాకుమారికడ నసించువారివఱకు మాటలన్నియు సంస్కృత జనితములు; కొన్ని యనాగరకజాతులమాటలు, కొన్ని విదేశజులమాటలు నుండవచ్చును. వానికైన నుత్పత్తులు లేకపోవు. ప్రపంచభాషలకే సంస్కృతము తల్లి భాషయనుట యసత్యమని నాకుఁ దోఁపదు" అని సంస్కృతమే ప్రపంచభాషలకుఁదల్లియను వాదమును బలపఱచుచు, కాశ్మీరదేశమునుండి కన్యాకుమారివఱకు వ్యవహరింపఁబడుచుండెడిభాషలలో నెక్కుడైనకొన్ని యనాగరకజాతులమాటలు (ఇవి దేశ్యములా!) కొన్ని విదేశజులమాటలు నుండినచో వానికిఁగూడ నుత్పత్తు లుండకపోవు. అనగా నేసంస్కృతధాతువునుండియో యివియనంతములుగఁగలవుగావునను, "ధాతూనామనేకార్థత్వా" త్తను సూత్రసహాయముచేతను—ఏదోయొక ప్రత్యయము కలుపుటచే వ్యుత్పత్తి కల్పింపవచ్చునని సూచించుటతో మాత్రము వారు తృప్తిఁబొందలేదు. ఇఁక నేమనఁగా; నాంధ్రభాష యేప్రాచీనప్రాకృతమునుండియో వచ్చిన దగుటచేతను ఈప్రాకృతములు వేదకాలముననే గ్రంథగౌరవమంది, సంస్కృతముననే మాతృకలైన ట్లగపడుటచేతను, ఆంధ్రభాషయే సంస్కృతభాషకుఁగూడ జనని కావచ్చునని సూచించుచు, సంస్కృతభాషాభిమానముకంటెఁగూడ నెక్కుడగు మాతృభాషాభిమానమును వెల్లడించినారు. "కావున నాయూహచేఁ బ్రాకృతములలో నొకటియైన యాంధ్రభాషయు లిపియు, నట్టిన భాషయగు సంస్కృతముకంటెను, దేవనాగరలిపికంటెను ప్రాచీనములనితలంచుచున్నాను." (ఆం. వాఙ్మయ. చ. 26 పుట.) కావున నిట్లాంధ్రభాష ప్రపంచభాషల కన్నిటికిని జననియగు (సంస్కృత) భాషకు జనని—వృద్ధపితామహి—యగుచున్నది. ప్రపంచభాషల కన్నిటికిఁ గాకపోయినను ఇండోయూరోపియన్ కుటుంబమునకంతకు నీసంస్కృతమే తల్లి భాష యయియుండునని శబ్దశాస్త్రజ్ఞులు తలంచినకాలము లేకపోలేదు. కాని సవిమర్శంబును సువ్యాప్తంబు నగు నవిరతాభ్యాసము చేసిన మీదట పాశ్చాత్యశబ్దశాస్త్రవేత్తలీసంస్కృతవాఙ్మయము ఇండో యూరోపియన్ కుటుంబమునకుఁ జెందిన భాషావాఙ్మయములలో నతిప్రాచీనమై, ప్రాచీన భాషాలక్షణముల నధికముగఁ జూపుచున్నను, గ్రీకు, ల్యాటిన్, జర్మానిక్, ఇంగ్లీషు మొదలగు భాషలు మఱికొన్ని ప్రాచీనతరములగు లక్షణములను జూపుచున్నవనియు, వీనికిని సంస్కృతభాషకును సోదరభావమే—అనగా నివియన్నియుఁ గూడ నతిప్రాచీనంబగు ఇండోయూరోపియన్ భాషనుండి వచ్చినవే—యనియు సనిదర్శకంబుగ నిర్ధారణచేసిరి. దీనికిఁదగిన నిదర్శనంబులఁ జూపుట కిచ్చట నవకాశముచాలదు; కాని యొక్కవిషయము మాత్రము గమనింపఁదగియున్నది. యూరపుఖండము యొక్క పశ్చిమపుఁగొసనున్న బ్రిటిషుద్వీప నివాసుల భాషయగు నింగ్లీషు, పెక్కువేల మైళ్లదూరమున ఖండాంతరమందున్న యీసంస్కృతభాషకు, సమీపముననొకదేశముననే కలసియున్న తెలుఁగుకంటె, సన్నిహిత సంబంధంబుకలదని మాత్రము మనకుఁ దెలియవచ్చుచున్నది.

భాషలసంబంధబాంధవ్యముల నిర్ణయించుటలో సరూపపదము లొకసాధనమనియు, నాసారూప్యము సహజమై యుండవలయునుగాని యెరువు తెచ్చుకొనుట వలనవచ్చినదికాఁగూడదనిగదా సూచింపఁబడినది. అయితే మన వాఙ్మయచరిత్రకారులు సంస్కృతాంగ్లములకుఁగల సంబంధముకంటె సంస్కృతాంధ్రముల సంబంధమే సన్నిహితంబని తెలుపుటకుగా "సారూప్యపదములే జన్యజనకసంబంధమును, సన్నిహితత్వమును నిర్ణయింపఁగలిగినచో నీక్రిందియుదాహరణములవలన నాంగ్లేయభాష

తెలుఁగుకంటె సంస్కృతమునకుఁ జేరువగఁ గన్పడును" (కాని నిశ్చయముగ నట్లుకాదు.) అని వ్రాయుచు నాక్రింది యుదాహరణములలో నేరీతిపదములయందు సారూప్యము కనఁబడినచో నవి యాభాషలసహజసంబంధమును సూచించునో అట్టిపదములనే కొన్నిటిని గైకొనిరి. అనఁగా నింను కుదాహరణముగాఁ గైకొనిన పదములలోఁ గలసారూప్యము కేవలము యాదృచ్ఛికమే కాని కొన్నిటిలోనైనను సహజముకాదని యభిప్రాయపడినట్లు కనఁబడుచున్నది. ఇంతేకాక యిట్టిపదములయందుఁగల సారూప్యము సంస్కృతాంగ్లముల సన్నిహితత్వమును నిరూపింపలేదని యాయన తలంచిరిగావున "సారూప్యపదము లున్నంతమాత్రమున నాంగ్లము మనభాషకంటెఁ బ్రాచీనమైనదని కాని, మనభాషకుఁ దల్లివంటిదనికాని తలంచుటకు వీలులేదు" అని యీపైపదముల పరిశీలనవలనఁ దేలినఫలితముగా నొకయపూర్వసిద్ధాంతమును జేసిరి. ఉదాహృతపదములలోని కొన్నిటికిఁగల సారూప్య మాభాషల సన్నిహితసంబంధము నెట్లు తెల్పుచున్నది ముందు చూపఁబడును. ఇంతేకాక మఱి కొన్నిటితోఁ గలసారూప్య మాభాషలకు సన్నిహితసంబంధములేదనికూడ నెట్లు సూచించునది ముందే తెలుపఁబడును.

కావున భిన్నభాషలలోని యెట్టిపదములసారూప్య మెంతవఱకు వానిసాజాత్యమును వెల్లడించి నిర్ణయించుచున్నది యనువిషయమును ముందు పరిశీలించి, తరువాత వా రుదాహరించిన యింగ్లీషు పదములలోని సారూప్యము యొక్కయు, తెలుఁగుపదములయొక్క భేదముయొక్కయు లక్షణములను దానివలనఁ దేలుఫలితమును గూర్చియు విమర్శించుకొందము.

భిన్నభాషల కొక్కొకకాలమునఁ గలిగెడి సంసర్గమువలన నొకభాష మఱియొకభాషనుండి విశేషంబగుపదజాలము నెరవు తెచ్చుకొనుచుండును గావున, భాషాశాస్త్రజ్ఞుఁడు పదజాలమునుబట్టి భాషలసంబంధమును నిర్ణయించుటకై, నాపదములను గొంతజాగ్రత్తగాఁ బరిశీలింపవలసియుండునని పైనఁ జెప్పఁబడియే యున్నది గదా! ఈపరిశీలనములో నాతఁడు చేయుపని యేమనఁగా నాతఁ డీపదజాలములో నేవి సహజములో యేవి యితర భాషలనుండి యెరవు తెచ్చుకొనినవో తెలిసికొనుటకు యత్నించును. ఈసందర్భమున నిజముగా భాషయనఁగా నేదో మనము గుర్తింపవలసియున్నది. ప్రతిభాషయందు నేయేపదజాలము నేయేపదవాక్యసంఘటనారీతులు, సామాన్యముగా నాభాషమాట్లాడువారందఱకు సులభముగ నర్థమై, నిత్యవ్యవహారమున వారిచే వాడుకొనఁబడుచున్నవో, ఆపదములే, ఆరీతులే, ఆభాషకు సహజములగుచున్నవి. అట్టిసామాన్యపదజాలమే నిజముగా నాభాషయని చెప్పఁదగియున్నది. ఇట్టిపదములు నిత్యపరిచితములగువస్తువులు, జంతువులు, వ్యాపారములు, గుణములు, మొదలగువానిని గుఱించి చెప్పునవియు; తల, ముక్కు, కన్ను మొదలగు నవయవవాచకములు; తల్లి, తండ్రి, అక్క, అన్న, మొదలగు సంబంధవాచకములును; నేను, నీవు, వాఁడు, అను సర్వనామములును, సంఖ్యావాచకపదములు మొదలగునవిగా నుండును. కాని శాస్త్రవిషయములకు, కళలకు సంబంధించిన పదములు గాని, మత, తత్త్వవిషయములకు సంబంధించినవి గాని యాభాషయం దున్నయున్నను, అవి జనసామాన్యమున కర్థమగునని కాని, ఆయావిషయములవారికిఁ బ్రసక్తికలిగినపుడు తక్క యితర నిత్యవ్యవహారమునఁ బ్రయోగింపఁబడుచుండునని గాని చెప్పుటకవకాశము లేదు. అంతమాత్రమున నీపదజాలమంతయు నాభాషలోనిది కాకపోదు. కాని సర్వత్ర నిత్యవ్యవహారమునమాత్ర ముండదు.

కోశములందు సంగ్రహింపఁబడిన పదజాలములో నిట్టిపదము లనేకము లుండుటచే, నిత్యవ్యవహారమందున్న పదములసంఖ్య మిగులతక్కువగా నున్నట్లు కనఁబడవచ్చును. మఱియుఁ గోశములందలి పదజాలములోఁ గొన్ని పదము లొకభాషాపదములతో సారూప్యముకలవై మఱికొన్ని మఱియొకభాషాపదములతో సారూప్యము గలవైనచో నందెక్కువవంతుపదము లేభాషాపదములతో సారూప్యము కలిగియుండునో యాభాషతో దీనికి సహజసంబంధమున్నదనికూడ మనము నిర్ధారణ చేయఁగూడదు. అనఁగాఁ గేవలసరూపపదముల బాహుళ్యమునుబట్టి కూడ మనము భాషలసాజాత్యమును నిర్ణయింపలేమనుట. ఇఁక నేమనఁగా నాసరూపపదములు పైఁజెప్పిన నిత్యవ్యవహారములోనివై యుండవలయును. నిత్య

వ్యవహారములోనున్న పదములతో డిసారూప్య మేభాషాపదములకు విశేషముగాఁ గలదో యాభాషకు దానితో డిసాజాత్యము కలదని నిర్ణయింపవచ్చును. కాని భాషలసాజాత్యమును నిర్ణయించి కుటుంబములుగా నేర్పఱిమటకుఁ బదములగూర్చిన సంబంధ మొక్కటియే ప్రమాణముకాదనియు, నందలి వ్యాకరణాంశములును, వాక్యరచనా విధానమును, వీనికంటెఁ గూడ బలవత్తరమైన ప్రమాణమగుచున్నదనియు నిదివరకే సూచింపబడినది. మనప్రస్తుతాంశము పదములవిషయమైనది. ఇంగ్లీషుభాషలో ననేకపదము లనేకభాషలనుండి, మాఱుమూలలనుండి వచ్చిచేరినవి. ప్రపంచమునందుఁ బ్రతిష్ఠగాంచిన దేశభాషలలోఁ దదపదముల నింగ్లీషుభాష కెరువివ్వనిభాషయే లేదనుట యత్యుక్తిగాదు. ల్యాటిన్, గ్రీకు, హీబ్రూ, కెల్టిక్, ఫ్రెంచి, స్పానిష్, హిందూస్థానీ, చీనాభాష, అఱవము, తెలుఁగు, మళయాళము, మొదలగుభాషలలోనిపదము లెన్నియో యాభాషయందుఁ గలసి తత్కోశములందు సంగ్రహింపఁబడినవి. తక్కిన భాషలలోనిపదములమాట యటుండ, బ్యాండికూట్ (Bandicoot) జాగరి (Jaggery) జాక్ (Jack-fruit) మొదలగునవి తెలుఁగు, తమిళము, మళయాళములలోనుండి గ్రహింపఁబడిన పదములు కలవు. మొత్తముమీఁదఁ గోశములందలి 43566 పదములకును, 29853 పదములు ల్యాటిన్ కుటుంబమునకుఁ జెందినవనియు, 13230 మాత్రమే ట్యూటానిక్ కుటుంబమునకుఁ జెందినవనియు, తక్కినవి మిగిలినభాషలనుండి వచ్చినవనియు లెక్కలఁజూచి తేల్చిరి. ఇట్లు పదముల సంఖ్యలనుబట్టి మాత్రమే చూచినచో నింగ్లీషుభాష ల్యాటిన్‌కుటుంబమునకే చేరియున్నదని చెప్పవలసివచ్చును. కాని యేదైన నొకచిన్నపొత్తంబుఁ దీసికొని అందొక పత్రమునందలి పదములను లెక్కపెట్టినచో తక్కినభాషలమాట యటుండ, ల్యాటిన్ కుటుంబమునకుఁ జేరిన పదములకంటెఁగూడ ట్యూటానిక్ కుటుంబమునకుఁ జేరిన ఆంగ్లోసాక్సన్‌పదములే యెక్కుడుగాఁ గన్పట్టును. నిత్యవ్యవహారమందలి పదములలోఁ గూడ నాంగ్లోసాక్సన్‌పదములే కాక ప్రత్యయములు, క్రియలు మొదలగునవికూడ విశేషముగఁ గన్పడుటచే, కోశమందలిలెక్కలెట్లున్నను, ఇంగ్లీషుభాష ట్యూటానిక్ కుటుంబమునకే చెందియున్నదని నిశ్చయింపఁబడియున్నది.

[సశేషము]

## ముగ్ధప్రణయము

నాయని సుబ్బారావు, సాహితీసమితి

చిత్తమున నిన్ను భావించి చెవులుసోకు
ప్రేమఘంటారవోదితావేశవశత
పోదు నీమందిరద్వారభూమి దనుక!
అలసభావమ్మున నన్నంత నలముకొనును!

నీ పవిత్రోత్తమాంగ పూజాపరత్వ
మున విరిసికొన్న నాదులోచన సుమమ్ము
లభినవోన్మేష లజ్జాభరానతములు
ముకుళితమ్ములు నీ పాదపూజ కగును!

అంతవఱకు సుధాప్రసన్నాతిమధుర
మోహనశ్రీకమైన నీ మోము దమ్మి
ముగ్ధలజ్జాదృగంతమై మూసుకొనును!
భక్తునకు తగినట్టి దైవతమ వీవు!

తనువు ముచ్చెమ్మటలు పోస తప్పిదారి
ఎట్టులో గర్భగుడి ప్రవేశింపగలను!
ప్రణయ భావాతి ముగ్ధదేవతకు నీకు
విమల కర్పూర నీరాజనమును పూని!

అదియు వణకెడు నాచేతులందు కలగి
పొడము నిట్టూర్పులో నారి పోవనిమ్ము!
చీకటులు బాపు నీ రూపురేకలందు
నొక్కనిముసమ్ము వెలిగి ధన్యుడను కనను!



# పిశాచం

శ్రీ వాసుదేవ రావు

"మనూ" జవాబు లేదు.

నాకు కోపం వచ్చింది. ఎందుకురాదు? నాకు జ్వరంతగిలి కోర్టులో కూర్చోలేక యింటికి వచ్చాను. తలవాకిలి మూసివుంది. నాలుగు పిలుపులు పిలిచాను. తలుపుతీయ లేదు. ఎండలో నిలిచాను. ఎంతసేపు నిలవనూ? కాళ్లుగజగజావణికి పోతూన్నవి. తలుపు బద్దలయ్యేటట్టు కోపంతో తట్టాను.

"మనూ! తలుపు." అన్నాను.

"ఆఁ!"

తలుపు తెరిచింది. నేను గడపలోపల ఆడుగుపెట్టాను. మను నన్ను చూచింది. నేనూ మనూముఖంకేసి చూచాను. మనూమొహం వెలవెలబారింది. గాభరాపడ్డది మను. నేను పలుక లేదు. మనూ నన్ను పలుకరించ లేదు. నాకంటే ముందుగా లోపలికి నడిచింది మను. నేనూ వెంటనే పోయినాను. మను వంటయింటిలోకి పోతూ తనగదితలుపు ముందుకు తోసుకుని వెళ్లి పోయింది. నేను నాగదిలోకివెళ్లి డ్రెస్సుతీసి మంచంమీద పరున్నాను. కాని, ఒంటరిగా వుండలేక పోయినాను. మనూగదిలోకి వెళ్ళాను పరుందామని. ఇటు తిరిగిచూచే సరికి మేజాబల్లమీద టోపి ఒకటి కనబడ్డది. వెండీబంగారు జరీ చంకీబుటేదారీపనితనం, బహు అందంగా ఉంది. చాలా ఖరీదుగలది. గొప్ప జమీందారుల కుండవలసింది. ఎవరిది టోపి? ఇక్కడికి ఎట్లా వచ్చింది? బల్లను సమీపించాను. టోపీని తీసి పరీక్షించాను. అది చిన్న పిల్లవానిదికాదు. నాయీడువానిది. నా తలకు సరిపోయ్యేది. నా గుండెలో గుభిల్లు మన్నది. కడుపులో ఒక విధంగా వికారం పుట్టు కొచ్చింది. కన్నులు గిర్రున తిరిగి పోయినవి. నిలవలేక పోయినాను. తూలి అక్కడే పడిపోయినాను.

ఆతర్వాత నేమి జరిగిందో నాకు తెలియలేదు. ఆస్థితిలో నేనెంత సేపున్నానో తెలియలేదు. కండ్లు తెరచి చూచేసరికి మను నాపక్కన కూర్చున్నది. ఒక్క చేతితో నాతల ఒత్తుతూన్నది. నేను కండ్లు తెరిచేసరికి నామీదవున్న మనూ చూపులు నేలవంకకు మరలినవి. పెదవులు లింమక విడివడినవి. పలువరుస కొంచెముగా కనబడ్డది.

"టీ చల్లారి పోతూంది. లేచి తాగుదురూ? సుస్తీగా ఉన్నారు. తలనొప్పున్నదా? జ్వరం తగిలి నట్టుంది." అన్నది మను.

నేను బదులు మాట్లాడ లేదు.

"'టీ' తాగండీ, డాక్టర్ని పిలిపిస్తాను" అన్నది దైన్యంతో.

నిజానికేమిగాని, అప్పుడు నేను మానవ లోకంలో వుంటేనా? కడుపులో యెన్నెన్నో ఆలోచనలు పుడుతున్నవి. అంతరిస్తూన్నవి. ఎట్లాగో నాదృష్టి బల్లమీదనున్న టోపిమీదికి తిరిగి పోయింది. మాయం! టోపి బల్లమీద లేదు! మాయమై పోయింది. మనూవైపు చూచాను. మను తిరిగి తలవాల్చింది, చిరునవ్వు మొహానతోచింది. దాచేసింది. మాయలమారి! ఏమీయెరగనట్టు నాపక్కన కూర్చున్నది. ఒక్క నిమిషం అట్టే చూశాను.

"'టీ' కాచి చాలాసేపయింది. లేచితాగుదురూ; మంచాని కడ్డంగా పరున్నారేల? లేచి సరిగా పరుండవచ్చు. కాళ్లు తీపులా? ఒత్తనా?" అని మను 'టీకప్పు' నాచేతి కందిచ్చింది.

నేను లేవలేక పోయినాను. ఎందుకు? పడ్డది పెద్ద బండ హృదయంలో! అట్టే తాగేశాను. కండ్లు మూశాను.

"డాక్టర్ని పిలిపించనా?" అని మను నాకాళ్లు పిసుకుతూ దిక్కు మొహంపెట్టి అడిగింది.

ఆచేతులు నాపాదాలమీద పడడంతోటే భగ్గున మండింది. కాళ్లు విదిలించుకున్నాను. మార్మొహంపెట్టి పరున్నాను? మనసు పరిపరి విధాలా పోతూన్నది. గుండెలు దడదడ కొట్టుకుంటున్నవి, మనసు విచారంలో మునిగి పోయింది.

"దాచేసింది! మాయలమారి! ఏమీయెరగనట్టు నటిస్తూంది! నేను చూడలేదనుకుంది! ఎందుకు దాచేసింది? ఏమీ భయంలేకపోతే యెందుకు దాచాలె? ఏదోవుంది! ఉంది. ఎక్కడ దాచింది? ఎక్కడ దాచి వుంటుంది! దొంగవస్తువు నింట్లో దాచిపెట్టుతుందా? ఏమో? నేను చూడలేదనుకుని యిక్కడే దాచరాదా? రేపోమాపో సమయం కనిపెట్టి యెవరిది వాని కిచ్చివేయరాదా? ఇంట్లో నేవుంటుంది? ఎట్లా దొరకుతుంది? ఉందో లేదో? వెదకుతాను. ఏమను కుంటుందో? ఎందు కింతానుమానం అనుకుంటుందేమో! తాళంచెవు లిమ్మంటే యేమనుకుంటుందో? ఎందుకంటే ఏమనను? ఎదుటకాదు. నాటున వెదకాలె." అని నాలోనే ఆలోచించుకున్నాను.

"ఉస్స! మనూ, నాకాయాసంగా ఉంది. ఒక్క గంటసేపు నన్ను నిద్రపోనీ. అంతవరకూ నాదగ్గరికి రాకు." అని నేనిట్టుమొగమై అన్నాను.

"అయితే, కాస్తసేపు నిద్రించండీ; వంటచేసి పెట్టివచ్చి డాక్టర్నిని పిలిపిస్తాను. ఒంటరిగా వుండలేకపోతే నన్ను లేక వేయండీ" అని మహాప్రేమతో అని మను వెళ్లిపోయింది.

నేను తలచినట్టు నాకొంటెపాటు చిక్కింది. తలుపులోపలనైపున గొళ్ళెంపెట్టాను. గదిలో వెదక ఆరంభించాను. తాళపు చెవులగుత్తి తలగడ కిందవున్నది; తీశాను. పెట్టెలన్నీ తెరచిచూచాను. బీరువాలో వెదకాను. అల్మారులలో పరీక్షించాను. బల్లసొరుగులో చూచాను. లేదు. ఎక్కడాలేదు. ఇంతల్లో నేమైవుంటుంది? లేదు. ఇంట్లోలే దాటోపి. వానిది వానికే పంపించేసింది. అవకాశమేది? ఎంతవకాశంకావలె? ఎంతసేపుకావలె! గజంత! ఛీ-ఛీ!

తిరిగి మంచంమీద పడ్డాను. విచారంలో మునిగిపోయినాను. మనసు కేయి విధాల పోతూన్నది. ఏది నిజమో, యేది కాదో, యెవరు చెప్పగలరు? ఇంతకాలం నుంచీ నన్నింతో ప్రేమిస్తున్న నామను యిప్పు డీలా చేస్తుందా? చేయకపోతే, తలుపు తీయడాని కింతాలస్యం దేనికి? నేను కోర్టులోనుండి వచ్చేవేళ కాలేదుకదా యింతలో రాననుకున్నది! మోసపోయింది. నేను తనగదిలోకిప్పుడే రాననుకున్నది. రాకూడదనే కాబోలు తలుపులు ముందుకు తోసికొని తొరతొరగా నడచి దొడ్లోకి పోయింది? నేను నాగదిలోకి పోయి, డ్రెస్సుతీసేలోపలనో, కాక, తలుపుతీసే లోపలనో, గాభరాపడి తరిమివేసింది! ఆగాభరాలో, ఆహడావిడిలో, టోపి మరిచిపోయినాడు. మను తలుపుతెరిచింది! నన్నుచూచింది! కోర్టునుంచి ఈవేళముందుగా వచ్చినాననీ, అందులోనూ యీలాంటి వేళకానివేళకు వచ్చినాననీ, తెల్లబోయింది! నాకంటే ముందుగాబోయి నాకంట బడకుండ జాగ్రతచేసింది. నేను తనగదిలోకి వెళ్లననుకుంది; కాని, నాకర్మం, నన్నిక్కడికే లాక్కునివచ్చింది. గుట్టు బయటపెట్టింది టోపి! తిరిగి, యేమీ యెరగనట్లు, వగలమారి! ఎంతసాహసం! ఎన్నాళ్లనుంచీ యీలా జరుగుతున్నదో? ఒకసారి, రెండుసార్లుచేసే దొంగతనాలు బయటికిరావు. ఎంతోకాలం నుంచీ చేస్తూన్న దొంగతన మేజొక్కసారి బయటపడతవి. పాపఘటం నిండవద్దూ? నేడు బయటపడ్డది. రోజూ నింతే నేమో? ఇంక వేరేప నేముంది? నే నన్నంతని కోర్టుకు వెళ్లిపోగానే సాయంత్ర మింటికి మళ్లీ వచ్చేవరకు—ఎంత తీరిక! ఇంతేనేమో! ఆహాహా! ఎంతకాలం దాగింది? నేను కండ్లుమూసుకుని పాలుతాగానా? ఎంగిలిపాలు తాగానా? ఛీ-ఛీ-వ్యర్థం నా జన్మ. ఈబాధపడడంకంటే వురిపోసుకుని చచ్చేదే మేలనిపిస్తూంది! ఇంతటి నిర్భాగ్యురాలైనదా మనూ? "మనూ, మనూ, ఎంతటిదానవు? ఎంతలో, ఎంతచేసినావే! నీప్రేమఅంతా నిజమనుకుని మహానందసాగరంలో తేలుతూన్నాను. గదే! అన్నినటన అనుకోలేదే! మోసమనుకోలేదే! నీవగలు నాకు తెలియక మోసపోయినాను కదే! మనూ, మనూ! ఇంతటి నీచానికొడికట్టావే! అబ్బబ్బబ్బా! తల వ్రూడిపడిపోయే టట్లున్నదే!" అని నాలోనేను పరిపరివిధాల ఆలోచనలో మునిగాను. దుఃఖం, కోపం,

అన్యాయం, మానభంగావస్థ, ఇన్ని అవస్థలూ, యింకా కొన్ని అవస్థలు, నన్ను దహిస్తున్నవి. నాతల చీలిపోతుం దేమో అనిపించింది. అంతలో నాతల రెండుచేతులతో పట్టుకున్నాను. అంతలో మను నాదగ్గరికి వచ్చింది. నాచేతులు మెల్లగా తొలగించి తన చేతులతో నాతల పట్టింది. ఈపగలునాకు తెలుసును! ఆచేతులు నాకు తగిలేసరికి నాదేహం గగుర్పొడిచింది! అరకాలి మంట నెత్తికెక్కింది! చేతులు విసిరేశాను. ఎందు కనుకుందో? నన్నోరచూపుల చూచింది. నేనూ ఆసమయంలోనే క్రీగంట చూచాను. చిరునవ్వు నవ్వడానికి ప్రయత్ని స్తూన్నట్లు కనబడ్డది. కాని, అరక్షణంలోనే, పెదవులు స్ఫురించినవి. కన్నులకుండా గంగ భవాని ప్రవహిస్తూ న్నది. దేనికి? వగలమారి! నా కామాత్రం వగలు తెలియ దనుకొన్నది పాపం!

"తలనొప్పి చాలా బాధగా వున్నదా? 'అమృ తాంజనం' రుద్దనా? సాంతిపాలు కలికం పెట్టనా? ఇట్లుంటే నేలాగా? నా కేమీ తోచటం లేదు. డాక్టర్ని పిలిపించనా?" అని పుట్టెడు ప్రేమతో, మహాదయతో అడిగింది మను.

వగలమారి! ఎంతప్రేమ? నాకొడలు మండి పోగింది. ఈవగలెందుకో? ఇంకెందుకుంటుంది? చేసిన నేరం దాచడానికే! నాకు అనుమానం కలగ కూడదనే! ఇంతమాత్రం చేతనే నాకండ్లు కప్పేయగలదా! పెట్టింది పెద్దటోపినాకు! ఇంతకాలంనుంచీ కండ్లుమూసికునే వున్నాను. దాచింది—ఎంతకాలందాగుతుంది? ఎంతదా చినా నిది దాగుతుందా? పాపం నిండింది. బయటపడ్డ దీవేళ! మనూ, నామనోహరి, యింతటి విశ్వాసం మాలిన దైనదా? నామనోహరి, నన్నెంతో ప్రేమిస్తూన్న నామ నోహరి, నన్నే పరమదైవంగా భావిస్తూ సకలవిధాలా నన్ను సుఖానందసాగరంలో తేలుస్తూన్న నామనోహరి, నేటికి ఆటోప్లేవాని మనోహరి—అంతలో నాకండ్లు గిర్రున తిరిగి పోయినవి. అట్టే దిండు మీదికొరిగి పోయి నాను. లోకంమరచి పోయినాను. ఎప్పుడువచ్చిందో మను, నాకు తెలియలేదు. నన్ను లేపింది. గడియారం పదకొండు కొట్టింది.

"ప్రొద్దున పదిగంటలకు తిన్నఅన్నం, మధ్యాన్నం కూడా ఫలహారమేమీ పుచ్చుకోలేదు, రాత్రి రెండు ఝాములైనవి. రెండు మెతుకులు మిరియాల చారులో కలిపి యిస్వనా? ఇట్లా గుంటే శోష వస్తుందేమో!" అని అన్నది మను. అప్పటి ఆమె ప్రేమ, దయా, జాలి, పూర్వమెప్పుడో నేను కల్లో అను భవించినట్లు నాకు తోచింది. మొదటినుంచీ యింతే, ఇంకా యింతెంతో యెక్కువే! కాని, యిప్పటి యివన్నీ వగలు! ఈస్థితి లోనే నాకు నవ్వొచ్చింది! మను నన్నొగగంట చూ చింది! తిరస్కారంగా నవ్వానానుకున్న దేమో! గాలి వాల్చింది!

"పలుకరా! చారులో అన్నం కలిపి యివ్వనా?" అని తిరిగి అన్నది మను.

"ఊహుఁ!"

"బార్లీ జావ కాచి యివ్వనా?"

"ఊహుఁ!"

"లంఘనం చేస్తారా?"

"ఊఁ!"

"శోష వస్తుందేమో, ఇంత పాలైనా—"

"నాకేమీ అక్కరలేదు. ననుగ్నారికే బాధించ వద్దు!" అని నేను కసిరాను.

అప్పుడామె కండ్లగుండా ముత్యాలు రాలినవి. మెల్లగ నాపక్కనుంచి లేచి వెళ్లిపోయింది. వెంటనే తలుపులన్నీ మూసిన చప్పుడు వినబడ్డది! తాను భోజనం చేయందే తలుపు లన్ని మూస్తూన్నదే!—వెంటనే వచ్చి కూర్చుంది నాపక్కన! నేను ముంగ మావలిపై పునకు తిప్పు కున్నాను. మను నాకాళ్లొత్త నారంభించింది. కాళ్లు తప్పించుకున్నాను. అట్టే కూర్చుంది. ఎంతసేపు కూర్చుం దో నాకూ తెలియదు. నాలోకంలోనేనుండి పోయి నాను.

మను నన్ను నిద్రలేపింది. కండ్లు తెరచాను. సూర్యుడు తన కిరణాల్ని మాగటికిటికీ గుండా పంపి నన్ను తట్టి లేపుతున్నాడు.

"చాలా పొద్దెక్కింది. కాఫీ చల్లారిపోతూంది. వేడివేడిగా ఒక్క కప్పుపుచ్చుకుంటే—"

లేచాను దంతధావనమయింది. కాఫీ గుటక వేశాను కాని, కాఫీ రుచిగా ఉండ లేదు.

"మొఖం చిట్లిస్తూన్నారు. కాఫీ చల్లారిందా?"

"ఊహూఁ!"

"బాగుండ లేదా?"

"ఊఁ!"

"పైత్యం చేసిందేమో?" అన్నది మను.

కాని, నేడు కాఫీ రుచిగా వుండక పోవడం దేని కి? ఎప్పుడూచేసే చేతులే నేడుచేసినవి. ఎప్పుడూ యిచ్చే చేతులే నేడు యిచ్చినవి. కాని, కాఫీలో మాత్రం యెప్పుడూవుండే రుచి నేడు లేదు. విషప్రాయం గావుంది! ఎట్లాగైతేనేం. ఏదిలేకపోయిన వుండగలను గాని, కాఫీ లేకుండ నేనొక్కక్షణ ముండలేను. ఒక్క గుక్కన తాగేశాను, కషాయంతాగినట్లు! పడుక కుర్చీలో పడ్డాను.

"సిగరెట్ కావాలీ? ఎందుకూ? ఇవి మా నేద్దురూ" అన్నది మనూ 'సిజర్సు' ఒకటి నాకు చూపుతూ.

'సిజర్సొ'కటి ముట్టించాను. ఆలోచనలో మునిగాను. పావుగంటలో మను నాదగ్గరకువచ్చి పక్కన కుర్చీలో కూర్చుంది. నాపొట్టమీద చెయిపెట్టి చూచింది.

"కొంచెంగా తగ్గిందికాదూ జ్వరం?"

నేనా మొహం కేసిచూచాను. చిరునవ్వు నవ్వింది మను.

"పలకరూ ? అయాసంగా ఉందా ?. పలకనివ్వ టంలేదా ? నిన్నటినుంచీ నాతో మాట్లాడలేదు. జ్వరం తగిలింది కదా, ఆయాసంగా ఉందేమో అనుకున్నాను. ఇప్పుడు కొంచెం తగ్గిందిగా! యిప్పుడూ పలుకరూ? పావుగంట, మాట్లాడుతూందాము. వంట త్వరగా చేయాలికాదా ! ఈవేళ కోర్టుకు వెళ్లడమెట్లు ? పోకుకామ్మా! వద్దు. శరీరం బాగుంటేనే అన్నీ ! 'లీవ్ లెటర్' వ్రాసి పంపుదురూ!"

"వగలు! నేను కోర్టుకు పోతానో లేదో తెలిసికోవ డానికే పన్నుగడ! పోతే పిలిపించుకోవచ్చును. పోనంటే పెందలాడే రావద్దని కబురుపంపవచ్చును! వగలమారి! ఎంత గడుసుతనం! నా కివన్నీ కొత్తలుకావు. కాని యిప్పుడన్నీ కొత్తలే! విపరీతాలే! వగలే ! విచిత్రాలే!" అని యింక నేమేమో నాలో నేనాలోచిస్తూన్నాను.

మను మళ్లీ యిట్లన్నది: "ఇలా పలక్కుంటే నాకేమీతోచటంలేదు. నేనేమనుకోవాలి? ఒంట్లో ఫలా నిజబ్బుగా వుందని చెప్పితేనా? ఒంటరిదాన్ని, నాకేమి తోస్తుంది? పలకరూ?"

నేను పలక తలచుకొని వుండలేదు. కండ్లుమూసి కున్నాను. మళ్లీ నావిచారంలో మునిగి పోయినాను.

"అడుగనా? ఏమనుకుంటుందో! ఆటోపి యెక్క డదాచిందో? అడగనా? చెప్పనా? ఇంట్లో దాచివుం టుందా? అమాత్రం ఆలోచన మనూకూ తోచ కుంటుం దా? ఇంట్లో దాచితే చిక్కుతానేమో అని భయం లేకుంటుందా ? ఇంట్లో దాచలేదు, నిశ్చయం. కాని, ఆటోపీయేమిటో, అది యెవరిదో, వ్యాడెందుకువచ్చాడో అడిగి అనుమానం పరిష్కారం చేసుకుంటే నయం. కాని చెపుతుందా? నిజం ఒప్పుకుంటుందా? ఒప్పుకోనకపోతే మరి టోపీ సంగతియేమి? నాకండ్లతో చూచానే. ఒప్పు కోక పోతేమాత్రం నమ్ముతానా ! నిజం చెప్పేవరకు మానుతానా! చెప్పేతీరవలెనుగాని, దాచ శక్యమా ! చెప్పితే, నేరం ఒప్పుకుంటే, తన అధఃపతన చరిత్రం తన నోటిగుండా మనూ చెపుతూండగా ఈచెవులతో నేనూ వినవలసిందే! ఛీఛీ! దుర్భరం, అసహ్యం! పడలేనీబాధ. అంతకంటే వురిపోసికుని చస్తేనే మేలు! కాని, యీలాంటి అనుమానాలచేత బాధపడడంకంటే ఒక్కసారే యేదో ఒకటి తేలుతుంది కదా! అడుగుతాను. కాని, అట్లయి వుంటుందా ! నామను ఇంతటి విశ్వాసఘాతుకపు పనిచేసి వుంటుందా ? నన్నుగావదలి యింకొక్కనికి తనప్రేమ—నాయందలి ప్రేమలోభాగం—ఇచ్చి వుంటుందా? ఇంతటి నీచానికి పాల్పడి వుంటుందా? ఏమో! అయినా, అడిగితే మంచిదే! ఏదొఒకటి తేలితే మంచిది."

అని నాలో అనుకున్నాను. ఇటు మొగమైనాను.

"మనూ,"

మను చిరునవ్వు నవ్వింది, అందులోనూ విషాదం కలిసేవుంది. దుఃఖం కలిసేవుంది. కాని, నవ్వుమాత్రం అరువు తెచ్చుకుందని స్పష్టంగా కనబడ్డది. ఎప్పటి ఆ చిరునవ్వు మొహం కేసెరుగనా? ఎప్పటి నవ్వుకాదు; ఆమోముపైన యెప్పటి కళా లేదు.

"ఏమిటి?" అన్నది మను.

ఊరుకున్నాను. ఆలోచనలో పడ్డాను.

"ఏమనుకుంటుందో! నన్నెంతటి వాణ్ణిగా భావిస్తుందో! కేవలం మూర్ఖుణ్ణి అంటుందేమో! వట్టి అనుమానపు మనుష్యుడంటుందేమో! అంతమాత్రం అయితే నయమే! తనపై నేరం మోపినానని, తన నడతనుగూర్చి, పాతివ్రత్యమును గూర్చి, శంకిస్తూన్నానని, భరించలేక, రొమ్ములో నై నాపడి—ఆలాగై నాకొంతమేలే! ఈలాటి విశ్వాసఘాతకురాలు, ఈలాటి వగలమారి పిశాచి; ప్రపంచానికి బరువు—స్త్రీలోకానికి అపకీర్తి— నాకు లెంపులు."

నాకు మళ్ళీ తలనొప్పి సాగింది. నాతల బద్దలై పగిలి పోతుందేమో అని తోచింది. అదీ సమాధానమే. తల బద్దలైతే ప్రాణం పోతుంది. ప్రాణంపోతే ఈఅనుమానం వదులుతుంది! కాని, కాలేదు. మనూ నాయెదట వుండడం నాకిష్టం లేదు.

"వంట పని యేమీ లేదా? ఈలాకూర్చున్నావు?" అన్నాను నేను.

"ఇక్కడ ఈలాగుంటే నాకేపని తోస్తుంది? వంట యెంతసేపు కావాలి?"

రాత్రిభోజనం లేదు. ఎండెక్కుతోంది. ఇంత వరకూ వంటపనికి మొదలుపెట్టలేదు. అనుమానంవల్ల, కోపంచేత, అసూయతో, నాపొట్ట నిండేవుంది. ఆకలి వేయడం లేదు. మనూకో? రాత్రీభోజనం లేదు. నాపాదాలకడ వాలి నిద్రపోయిందికదా! నాకు జాలి పుట్టింది.

"మనూ, వంటపనికి ప్రారంభించు" అన్నాను.

"వంట యేంచేయను? ఏది సహిస్తుందో చెపితే వండుతాను." అని మను మహాదరంతో నన్నది.

నే నూరకున్నాను.

"ఏమి కూర వండనూ?"

"ఏదో ఒకటి వండుమూ!"

మను లేచి తొందర తొందరగా నడిచి పోయింది. తిరిగి వచ్చింది.

"ఒంటరిగ వుంటారా? కుర్చీ వంటయింటో వేస్తాను. అక్కడ కూర్చుంటే మాట్లాడుతూ వండుతాను. ఇక్కడ వొంటరిగా వదలి అక్కడ నాకేమీ తోచదు. మాటిమాటికీ యిక్కడికి వద్దామంటే వంట..."

"అక్కరలేదు. వంటత్వరగా చేసి వచ్చి చెప్పు."

మను వెళ్ళిపోయింది. తిరిగీ నాలోకంలోనే మునిగిపోయినాను. ఎంత ఆలోచించుకున్నను అనుమాన పిశాచం నన్ను వదలింది కాదు. నేను [illegible] ఉన్నా తనేప్పుడు అడిగి నా అనుమానం పరిష్కారం చేసుకుందామనుకుంటాను. మను నా యెదుటికి రాగానే [illegible] అనుకున్నదంతా మరిచిపోదును. నోట మాటే రాదు. లోలోపలనే బాధ, లోలోపలనే [illegible] దెబ్బలు; ఆబాధ నాకే తెలుసును. [illegible] తెలుసును.

ఈ విధంగా వారం రోజులు గడిచినవి. నేనంతగా మనూను పలకరించ లేదు. ఆమె ముఖం యెప్పుడు చూచినా విచారంతోనే వుండేది. తన దొంగతనం నాకు తెలిసినందుకు లోలోపలనే కుములుతూన్న దేమో! ఆ సంగతే తెలియదు.

నాకు జ్వరం నిమ్మళించింది కాని, నన్ను పట్టి పీడిస్తూన్న పిశాచంమాత్రం నన్ను వదిలిందికాదు. మరింత తీవ్రంగానె పీడించ సాగింది. నేననేకవిధాల నామనసును సమాధాన పరచుకొన యత్నించాను.

"మను ఇంతటి విశ్వాసఘాతకురాలేనా! నా మను ఇట్టి తుచ్ఛపు పనికి లొంగునా? ఎవ్వరైనా నమ్ముదురా? బ్యాంకు దివాలాతో నాపూర్వార్జితం సొమ్మంతా పోగా నేను విచారిస్తూంటే, నాపక్కలో కూర్చుండి, నాభుజాన తన తలనొర్చి, నాకంఠాన్ని తన రెండుచేతులా పెనవేసికొని, చిఱునవ్వు మొహాన చిందులాడుతుండగా నన్నెంతగా ఓదార్చింది! "ఇంత మాత్రానికే యింత విచారం దేనికి? ఒక్కనాడు విచారంతో వుండడంతోటే శరీరం జబ్బుచేసి నానాబాధలూ కలిగి శరీరంపాడై పోతుంది కదా! మళ్లీ నాలుగురోజుల దాకా మనుష్యులలో కలవరు కదా!, ఇంత మాత్రానికే యెంతో కాలం విచారిస్తూంటారు! వెధవడబ్బు! డబ్బును మనం సంపాదించాము, డబ్బు మనల్ని సంపాదించిందా? పోతే మానె, వెధవడబ్బు! ఉన్నప్పటినుంచీ భయమే, విచారమే. ఉన్నవాళ్లకంటే లేనివాళ్లే యెక్కువ సుఖపడ

తారు. చూడండీ! బ్యాంకులో డబ్బు పోయిందంటే, అన్నీ పోయినవా? నావంటిమీది నగలున్నవి కదా? అవి పోయినా మానె? శరీరం కులాసాగా ఉంటే యెంత సంపాదించ లేరు! పోయినంతా సంపాదించలే మను కోండి. మనకు ముఖ్యంగా కావలసినంతమాత్రం సంపాదించలేరా! అందులోనే మితంగా వాడుతూ నెలకేదో కొంత వెనక వేసుకుంటే అదేచాలును. పైగా యింకా యెన్ని లాభా లున్నవో చూడండీ! వంటవాళ్లతో పని లేదు. నేనే నాచేత్తనైనట్లే వండిపెడతాను. మీకు సకలమైన ఉపచారాలూ చేస్తాను. ఇప్పుడు నన్ను సుకుమారిగా చూస్చి పెట్టి వున్నారు. అన్ని పనులకూ నౌకర్లున్నారు. అందరితోనూ అవసరం లేదు. అన్నిటికి నేనున్నాను గదా! ఏమూలాన్నైనా మీపాదసేవ చేసే పుణ్యం, భాగ్యం, సంతోషం, నాకు కలుగుతుంది ఇంత పెద్దిల్లు మన కెందుకు? అద్దె కిచ్చివేసి మనకు సరిపోయే చిన్నయిల్లొకటి మన మద్దెకు పుచ్చుకుందాము. ఇల్లు శుభ్రంగా ఉంచి ముందరి భాగంలో సీమపూల మొక్కలూ, నాటు పూలచెట్లూ నాటి నేనే నీళ్లు పోసి పెంచుతాను. గులాబీమొక్కలు నాప్రాణం కదా! వెనుక దొడ్డిలో కూరతోట వేసి పెంచుతాను. కూరలకు పనికి వస్తవి. అప్పటికీ యిప్పటి సంపాదన చాలక పోతే, ఉన్నవి కదా నావంటి మీది నగలు! కాలక్షేపం చేయ లేమా! ముఖం వేలవేశారేల? నగలు పోతవని విచారమా! అందరూ నగలు పెట్టుకొన్నవారే ఉన్నారా? నగలైనా దేనికి! ఈలాటి చిక్కులకు పనికి రావడానికేనా! పోనీండీ. నా కావిచారం లేదు. సింగారించుకొనే దాన్ని నేను. నేనే నా మనస్పూర నానగలన్నిటిని మీ స్వాధీనం చేస్తున్నాను. ఇంక మానవచ్చు మీ విచారం. ఒక్క నవ్వు నవ్వుదురూ! నేను చూడలే నీవిచారం. సంతోషంతో వుందురూ! డబ్బు సంపాదించడానికి ఒంట్లో బలం వున్నది. విద్యావున్నది. కావలసినంత వుపచారం చేయడానికి నేనున్నాను. ఇంకా విచార మెందుకూ? లేచి "టీ" పుచ్చుకొందురూ! చల్లగ చల్లారి పోతూంది" అని యింకా పరిపరివిధాలా నాదుఃఖ మంతా పోగొట్టి నన్ను సమాధానపరచిన అమనూకా యీ దుర్బుద్ధి?

ఆ పెద్ద యిల్లు విడిచి మేమీ యింటికి వచ్చినప్పటినించినీ సకలమైన వుపచారాలు చేస్తూ నన్ను సుఖపెట్టుతూన్న అమనూకా యీ దుర్బుద్ధి? ఇది నమ్మవచ్చునా? ఏమో! ఎందుకునమ్మకూడదు? అప్పుడూ నావద్ద పుష్కలము ధన ముండేది. ఆవిడ ఒంటిమీద కావలసినన్ని నగలుండేవి. ఇప్పుడు డబ్బు పోయి పేదవాణ్ణి అయినాను. నగలలో కొన్ని అమ్మేసినాము. కాబట్టి యీ దుర్బుద్ధి ఆవిడకు ఇప్పుడు పుట్టివుండకూడదా? ఛీ! ఛీ! అట్లవునా? నామనూ నేనెఱుగనా? ఇంతకాలం నుంచీ యెంతో ప్రేమతో వుండిన మను యిప్పుడు దరిద్రుడైనానని తన శీలం విక్రయిస్తుందీ డబ్బుకోసం? నమ్మవచ్చునా? నమ్మకపోవడాని కాధార మేది? స్త్రీలమనసులోతు బ్రహ్మదేవుడికైనా తెలియదట. ఇంక నాబోటి వారికెట్లా తెలుస్తుంది? అటుగాక పోతే అన్ని పురాణాల్లోనూ యెందు కిదే మాట యేకరు పెట్టాలె?

ఛీఛీ! నిరర్థక మీ జన్మ. నిష్ప్రయోజన మీ బతుకు.

ఈవిధంగా యింకా నానావిధాలా ఆలోచనలో తర్క వితర్కాల్లో మునిగాను. ఆలోచనకు అంతు లేదు. అనుమానం పుట్టనే కూడదు. పుట్టిందా పెద్ద పిశాచం. పట్టినట్టే వదిలించుకోవడం బ్రహ్మతరం కాదూ? అందులో ముఖ్యంగా భార్య నడత విషయం అనుమానం బ్రహ్మరాక్షసి పట్టినట్లే. నా మనూమీద నాకెప్పుడు నేలాటి యనుమానం కలగలేదు. సరళమనస్క—విశాల హృదయ—దయామయి. అన్నీ బాగానేవున్నవి. కాని, యిప్పుడు కలిగిందనుమానము. వదిలించుకోవడ మేలాగా? పట్టి పీడిస్తూన్నది. నా మనసులోనున్నది ఇది అని మనూకెట్లా తెలుస్తుంది? ఈ నెల రోజులనుంచీ చూస్తూ వున్నాను. ప్రతి విషయంకూడా పరీక్షిస్తునే వున్నాను. నడతలో అనుమానం సరేకదా! నడకలో అనుమానం, కన్నీటిలో అనుమానం, మాటలలో అనుమానం, ఆచూపులలో అనుమానం, నాయెదుటవస్తే అనుమానం, చాటున వుంటే అనుమానం, అన్నీ అనుమానాలే! ఎన్ని విధాలింకా పరీక్షించవచ్చును? ఎంత కనిపెట్టితే మాత్రమేమి? కన్నులు కప్పివేయ లేదూ? మాలిన్యం తొలగించివేయ లేదా?

పోనీ, అడుగనా? అనుమానం తీర్చుకొందునా? నిజం చెప్పుతుందా? నేర మొప్పుకుంటుందా? పైగా అనుమానించానని యెందులో నైనా పడి చస్తే? అపరాభవం నాకే! ఛీ!ఛీ! ఇంకాచూదాం; ఇంకాచూదాం.

అని నానాటికీ నేను కృశించిపోతూ వున్నాను. మనస్సులోని వేదన మనస్సుకే తెలుసును. మనసులో నిలకడ లేదు. బుద్ధి పాడై పోయింది! మెదడు బరువయింది. బలంక్షీణించింది. చిక్కి శల్యమై పోయినాను. మంచంమీదినుంచి లేవ లేక పోయినాను. మనూ మహాశ్రద్ధతో నాకుపచారాలు చేసేది. కాని, ఆవుపచారాలు నాకింపుగా ఉండేదికాదు. చేయి నాకు సోకితే ముండ్లకంపగా తోచేది. మాట్లాడితే వెగటుగా తోచేది. ఎదురు వస్తే పెద్దపయ్యాన్ని చూచి నట్లయ్యేది. చాటుకు వెళ్లిపోతే అనుమానం. ఈలా వున్నది నాస్థితి.

నేను వద్దన్నావినక మను డాక్టర్ని పిలిపించింది. ఆయన నన్ను పరీక్షించాడు. రోగం ఫలానిదని నిర్ణయించలేక పోయినాడు. ఏదో ఒక మందిచ్చాడు. నా రోగం సంగతి డాక్టరు కేలా తెలుస్తుంది? దగ్గర వున్న మనూకే తెలియదు. చేయి పట్టిచూస్తే తెలుస్తుందా! మందిస్తూన్నాడు. నేనూ పుచ్చుకుంటూన్నాను. వ్యాధి కుదరదు. కొంతకాలం గడిచింది! మందు ఒంటపట్ట లేదు. ఏలా పట్టుతుంది? రోగ మొకటైతే మందు వేరొకటి! తెలియకనే అన్నారా 'మనోవ్యాధికి మందు లేదు!' అని! మరీ వాడిపోయినాను. కండ్లు గుంటలు పడ్డవి. బుగ్గలు సొట్ట పడ్డవి. నారూపమంతా మారిపోయింది! వికారాకారం దాల్చాను. పలకలేను. చేతులు కదిలించలేను. అన్నహితవు తప్పింది! నాస్థితి నాకే తెలియాలి! ఆదేవుడికే తెలియాలె! ఒక్క నెలరోజుల్లోనే నేను జీవచ్ఛవమైపోయినాను.

ఈమధ్య ఒకటి రెండు మార్లు నిద్రాదేవి నన్ను కదిలించింది. కాని, నాలోపల వున్న అనుమానపిశాచం ఆమెకు నన్ను లొంగనిచ్చింది కాదు. నిద్రాదేవి నా పిశాచాన్ని వదిలించడానికి ప్రయత్నించింది. కాని, సవతిమచ్చరమెక్కడికి పోతుంది? ఇద్దరూ పోట్లాడినారు. ఒకనాడు నిద్రాదేవి నన్ను ఆవహించింది. ఎంత సేపామె అధీనంలో వున్నానో నాకు తెలియలేదు.

ఉన్నట్లుండి నాముహం మీద నీళ్ల చుక్కలు నాలుగైదు పడ్డవి. కండ్లుతెరచి చూచాను. మనూముఖం ఆవలికి తిప్పింది. నాతలవేపున కూర్చుండి నాతల పిసుకుతూన్నది. పైటచెరగుతో కండ్లు తుడిచికొన్నది. నాకు మహాకోపం వచ్చింది! "మాయ" అన్నాను కోపం పట్టలేక. నాతలమీదనున్న చేయి విసరేశాను.

"నిద్రాభంగ మయిందా! క్షమించండి. పాపిష్ఠురాలిని!" అని మను మనస్సు నొచ్చుకుంటూ దైన్యంతో అన్నది. కండ్లు కన్నీరు కారుస్తున్నవి. నేను చూడ లేక పోయినాను!

"మాయ"! అన్నాను మళ్లీ.

"ఏమి మాయ! ఎందు కట్లా కసురుతారు? బాధ అవుతుందా? నన్ను కాళ్లు పట్టనీయరు, తల ఒత్తనీయరు, నన్ను చూడడం తోటే ముహం చాటల తిప్పుకుంటారు. నేను దగ్గరవుండడం కిట్టలేదా? ధుమధుమలాడుతారు, విసుక్కుంటారు, కండ్లు చూసుకుంటారు. ఎప్పుడూ యిట్లుండలేదే! నాచేతులూ తగలనీయడం లేదు. నేనేమి చేయబోయినా మీకింపుగా వుండడంలేదు! కారణమేమిటో? నేనేమిచేశాను? మీకు మనసుకురాని పని నేనేమి చేశాను! నన్నెందుకు కసురుతారు? మీకు నేను భారంగా తోచానా? నా సేవలు మీకు ప్రియించడంలేదా! చెప్పుదురూ, నేను చేసిన అపరాధమేమిటో! ఇన్నాళ్లు మూశాను. ఓర్చుకోలేక ఓర్చుకోలేక ఓరుస్తూన్నాను. ఈకసురులు, ఈనిరాదరణ, ఈకోపంతోటి చూపులు, ఈపెడమొగం, ఈవిసుగు, ఇంకా ఏమి కావాలె? డాక్టర్లు జబ్బేమీ లేదంటారు. మందు ఒంటబట్టలేదాయె. డాక్టర్లకు తెలియనిజబ్బు—నాకు తెలియని జబ్బు—కడకు మీకూ తెలియని జబ్బు—అజబ్బేమిటి? ఆలోచిస్తే యేదో మనోవ్యాధి పుట్టి పీడిస్తూన్నట్లున్నది. కాకపోతే యింతలోనె యిట్లవుతారా? చిక్కి శల్యమై పోయినారే? ఎందుకు వచ్చిన జబ్బు! మీ మనోరోగాని కేదో కారణముండాలెకదా.

"నీవే" అన్నాను. తటాలున నోరు జారింది.

"నేనా? నేనా? నేనేనా మీ మనోవ్యాధికి కారకురాలిని? నేనేనా మీ యీదుర్దశకు కారకురాలిని? అయ్యో; చెప్పరైతిరే! ఈమాట వినీకూడా నాప్రాణా

లు లేచిపోవే! నెత్తిమీద నా పెద్దపిడుగు పడరాదా! ఈమాట వినలేను; ఈనింద భరించలేను; ఈపరాభవం సహించలేను. అయ్యో అప్పుడే చెప్పివుండరాదా? వుండరాదా? తన ప్రాణాలకంటెనూ ప్రాణంగా, తనకంటి రెప్పలకూ రెప్పలుగా, నన్ను రక్షిస్తున్న మీ కింతటి దైన్యం—ఇంతటిదుఃఖ—కలిగించి, యింకను ప్రాణాలుపట్టుకొని వున్నానే! ఎంతటి పాపిష్ఠురాలిని! మీచేతులతో నన్ను చంపండి! ఈమాటన కోర్చలేను. ఈబాధను అనుభవించలేను." అని అంటూ మహాదుఃఖముతో మను తూలి నామీద పడ్డది:

"ఛీ, దుర త్మగ్గురాలా; నీముఖం చూడవచ్చునటే! ఎంతటి వగలాడివే! నీవు నాకు భార్యవేనా? ఎందు కీవగలు? ఇంతకాలంనుండి అట్లే అనుకొని నమ్మాను. నీమాయమాటలకు లొంగాను. నీ కపటప్రేమపాశంలో చిక్కుపడ్డాను. నీరుపదీపానికి శలభమైనాను. వగలమారీ, బంగారుపాలబొమ్మ వనుకుని భ్రాంతితో చేత పట్టుకున్నాను. అది ఆకస్మాత్తుగా లోకలీసి మాయమై పోయింది. పూలమంచమని తలచి మెడలో తగిలించికున్నాను. నాగుబాముకరిచి విషం క్కింది. నీళ్లు అని భ్రమిసి దిగాను. ఊబిలో దిగబడ్డాను! వానచినుకు అనుకుని ఆత్రంతో నోరు తెరిచాను. పెద్ద పిడుగు అయింది! నీమరాలా! నీమూలాన నా పేరు మాసింది! ఆనాడు, మన డబ్బంతా బ్యాంకులో దవాలాకాగా, అందుకు నేనుదుఃఖిస్తూంటే... ఇంకాబతికయెందుకని నేను చావసిద్ధమైతే, అప్పుడు—అప్పుడు—నీవు, వగలమారి! నీవు, నన్నెంతగా సమాధానంచేసినావే! ఎంతగా దుఃఖాన్ని చల్లార్చినావే! వదులుకుందు నిశ్చయించుకున్న నాప్రాణంమీద తీపి నాకెంతగా తిరిగి పుట్టించినావే! మనూ! ఆమనూ నీవేనా, నీవేనా! మనూ, మను! నన్నెంతగా మోస వుచ్చావే! నేను నీభావం తెలియక యింతిలో నీవుపన్నినవురిలో తగులుకున్నానే! అన్నిటా, మీకు కావలసిన వుపచారాలు చేయడానికి, నేను న్నానంటివే! నావ డబ్బు పోయినందుకు ఇంత విచార మెందుకంటివే! ఎంతో ప్రేమ వూడిపడినట్లు నటిస్తివే, తెలిసింది; నీవగలు! ఛీ! ఛీ! నీమొహం చూస్తేనే పాతకం చుట్టుకుంటుంది. ఛీ! ఛీ! దురాత్మగ్గురాలా!—" ఇంక మాట్లాడలేక పోయినాను. ఆవేశం పెరిగింది. అశక్తుడనై పోయినాను, నాలుక యెండబారింది. గుండె దబదబ లాడింది. పడిపోయినాను. కన్నులు మూతలు పడ్డవి. మను యేమీ మాట్లాడలేదు. శాంతభావంతో నా నా మొహం మీదనే తన చూపులు నిలిపింది. కాని, ఆకండ్లలో గంగాయమునాసంగమం అయి మహావేగంతో ప్రవహిస్తూన్నది. ఉస్సుమని నిట్టూర్పులు మాత్రం వినబడుతూన్నవి.

ఎంత సేపటికో, నాకు తెలియదు, కాని, కండ్లు తెరిచాను. మను నాపాదాలపైన మొహం పెట్టుకుని పడివుంది. ఒక చేతితో విసనకర్రపట్టుకుని నాకు విసురుతూన్నది. నేను కండ్లు తెరిచానని తెలియలేదు. ఏమో అనుకుంటూంది. వినబుద్ధి పుట్టిందినాకు. కండ్లు తిరిగి మూశాను.

"ఎన్నడూ అన లేదే! నేడేమి నాకర్మమూ! ఎంతతిట్టినా ఎంతకొట్టినా, చంపినా, ఓరుస్తాను! గాని, భార్యను కానా? వగలమారినా? విశ్వాసఘాతకు రాలినా? అయ్యో! అపనింద, దయామయుడా! పరమేశ్వరుడా! ఇట్లా నన్ను పరీక్షిస్తావా? ఈమాటన చాలదా! మగని చేతనే పరాభవమా? అంతకంటే చావు మేలు! ఎందుకిట్లా నన్ను అనుమానించారో?"

"తెలిసింది, నీవగలు." అని తటాలున నే నన్నాను.

మను లేచింది. నాకు కొంచె మెడంగా నిలిచింది. దేహమంతా గజగజ వణుకుతూంది, కన్ను లెర్రపడ్డవి. భయంకరాకారం దాల్చింది మను. అప్పుడు నాకు కరాళమూర్తి మహిషాసురమర్దనీరూపం జ్ఞాపకం వచ్చింది. ఏదో శక్తి నన్ను మింగవచ్చిం దనుకున్నాను.

"నేను భార్యను కానా? నన్నట్లు ఎందు కనవలసివచ్చింది? నేనేమి ద్రోహం చేశాను? ఆవిధంగా నేను విశ్వాసఘాతుకురాలినని అనుమానించడానికి నిదర్శనమేదీ? కారణముండవలెకాదా? రుజువు పరచవలె, నిజం కనుక్కోవలె. తప్పుంటే శిక్షించాలె! అన్యాయం లో లోపలనే కుళ్ళడ మెందుకు? అడగాలె, నేరముంటే చంపాలె. నాయేనడత మీకు సహ్యమైంది? నేను మిమ్మెట్లా మోసపుచ్చాను? నానేర మేమిటో నా నెత్తికి చుట్టాలె. ఇంతవరకూ ఓర్చుకున్నాను. ఇంకూరుకోను.

మీ మనసులో వున్నదేమిటో బయటికి రావాలె. కాక పోతే నే నుర్యోగ్యోగ్యో—!"

"అదీ మేలే! అదే మంచిది. ఇంతటి వగలమారి బతికివుండి యితరుల పరువును బూడిద పాలుచేసి, కొంపలు కూల్చడంకంటే—అప్రతిష్ఠ. నెత్తికిచుట్టి, తానూ మెట్టుకోవడంకంటే—చావే మంచిది. ఇంతటి విశ్వాసఘాతుకురాలికి బలవంతపు చావు కాక మంచి చావు వెప్పటికిని రాదు. చేసినచేత లేలాటివి? నన్ను పెట్టిన బాధ లెంతటివి! బాధకుబాధ—నన్ను బాధించినంత బాధా—వడ్డీతో యింకా అంతబాధా—అనుభవించాలె"

"కానిండి, నా నేరం నాకప్ప జెప్పండీ! నా తప్పేమిటో?

"మాయలాడీ! ఇంకా యీవగ లెందుకూ? ఇంకా దాచుతా వెందుకూ? నీ తప్పు నీ వెరుగనట్లు నటిస్తావు!"

"లేదు, ఎరగను, నా నేరం నే నెరగను. తమ తప్పులు తా మెరిగే కల్లతే లోక మెందు కింతపాడవుతుంది? చెప్పండీ, నా తప్పు లేమిటో?"

"ఆహాహా! ఎందుకీజన్మ—పాడుజన్మ—భార్యయింకొకని కోరిందని లోకు లందరూ ఛీ-ఛూ, అని మొహాన్ను మ్మేస్తూంటే—కడుపు కండ్లార చూచీ చూడగా—ఈ ప్రాణాలు—మొండిపడి పోకున్న వే? ఎందుకీ మొండి బతుకు!" అని అంటూ నేను నా తల పగలకొట్టుకున యత్నించాను. మను నన్నా పనిచేయనీయక ఆపింది. నన్ను పట్టుకుంది.

"ఏమి మీ కండ్లార చూచారు? నే నితరునితో మాట్లాడుతూ? ఏమి చూచారు? ఎవరేమి చెప్పారు? ఎవరిని, ఛీ-ఛూ, అంటారు? ఎందుకు? ఎవరిని చూచారు? అప్పుడే పట్టుకోవలసి వుండె. ఒక్క దెబ్బతో యిద్దర్నీ నరకవలసి వుండె. అవాడెవడు? ఎవడువాడు? ఎవడిని చూచారు? చెప్పండీ, ఇంక దాచీ లాభం లేదు."

"టోపీ—"

"ఏటోపీ వానిని? ఎప్పుడు?

"నాకు జ్వరం తగిలి కోర్టులో కూర్చోలేక యింటికి మధ్యాహ్నం వచ్చిన నాడు."

"చూచారా? స్వయంగా చూచారా?

"ఆఁ. చూచాను. విను; ఇంకా దాచడ మెందుకు? కుండ బద్దలు చేస్తాను. ప్రాణం పైకెగిరి పోతూంది. అయ్యో పట్టుకో, నన్ను పట్టుకో, అది కాస్తా చెప్పిపోతాను, ఇంక ప్రాణాలు ధరించలేను. నాలుక పిడచ పడ్డది. కొంచెం నీళ్లు—వద్దు. అపవిత్రం అయిన నీచేతితో వద్దు."

మను గ్లాసుపట్టుకొచ్చింది. 'వద్దు' న్నాను. 'నీళ్లు కాదు పాలన్నది గ్లాసు చేత బట్టి పోయినాను. చేతులు వణుకుతూన్నవి. గిన్నె పట్టకోలేక పోయినాను. దిండు పై నొరిగాను. మను ఆపాలు కాస్తా నానోట్లో పోసింది. పది నిముషా లూరుకున్నాను. మనూ సంహించాను. ఏమో ఆలోచిస్తూంది. కాని, ఎపాన విచారం కనబడలేదు. వికారం కనబడలేదు. నిష్కపటంగా కనబడుతూంది—కొద్దిగా దుఃఖం మాత్రం కనబడుతూంది. వగలు—నటన! ఇంత నేర్చింది అంత నేర్చివుండదూ? నేను నేర్చింది దాచ నేర్చిందా?

"విను, ఆనాడు, కోర్టులో నాకు జ్వరం తగిలింది. కూర్చోలేక పోయినాను. ఇంటికి వచ్చాను. తలవాకిలి మూసివుంది. తట్టాను, పిలిచాను పది పిలుపులకూ జవాబులేదు. ఎండ—జ్వరం—నిలవలేను. ఎట్లాగో అర్ధ ఘుంట ఆలస్యంగా తలుపు తెరచావు; నన్ను చూచావు; నీమొహం వెలవెలబారింది; గాభరా పడ్డావు! నన్ను ముందుగా పోనీక నీవే నన్ను తోసికుని ముందుగా యింట్లోకి వెళ్లావు. నీగదితలుపు మూశావు. నా గదిలోకి వెళ్లాను. డ్రెస్సుతీశాను. పరున్నాను. మనసుకు నచ్చ లేదు పడకకుపర లేదు. నీవూ దగ్గర లేవు. నన్ను పలకరించలేదు. నాకేమీ తోచలేదు. ఒంటరిగావుండలేక నీవు నీగదిలో వుంటావేమో అని అనుకుని అక్కడ పరుందామని వెళ్లాను. చూచాను—బల్లమీద జరీబుతేదారీ పనిచేసిన చక్కనిటోపీ చూచాను.

"ఎవరి దా టోపీ"

'ఎవరి దాటోపీ! అక్కడి కెందుకు వచ్చింది? నేనింటికి వచ్చినప్పుడు ఎంత పిలిచినా తలుపు తీయవైతి వెందుకు? ఆటోపీవా డుండబట్టే.'

"ఏటోపీవాడు? ఎవరా టోపీ వాడు?"

"ఆబల్లమీద వుండినటోపీని పెట్టుకునేవాడు—ఎవడో? తలుపు ఆలస్యంగా తీసిన కారణ మేమిటి? వాణ్ణి దిడ్డిదోవను సాగనంపి రావడానికి.

"ఆఁ—తెలిసింది."

"విను, పూర్తిగా విను. అడ్డు మాట్లాడకు. తలుపు తెరచిన తోటే నీముఖం వెలవెలబారింది. గాభరా పడ్డావు. అన్నీ కలియవేసుకున్నాను. చేర్చాను. పెద్ద కథ అయింది. ఇంతలో నీవు వచ్చావు. 'టీ' యిచ్చావు. ఓరగంట నన్ను చూస్తూ ముసిముసి నవ్వులు నవ్వుతూన్నావు. దేనికి? నీపగ్గెకు సంతోషించి; టోపీ దాచేశావుగా! గొప్ప పగ్గె! వచ్చినవాడు పోయేటప్పుడు టోపీని వదిలి పోవడ మెందుకు? గాభరా! నే నింటికి వచ్చానని గాభరా! చూస్తానని గాభరా! తప్పించుకో పోవాలెనని ఆత్రం—నీకు అంతకంటే ఆత్రం. పంపించే ఆత్రం, తలుపు తెరిచే ఆత్రం, అంతా ఆత్రం, అంతా గాభ్రా! మరచి పోయినారు. టోపీని మరిచి పోయినారు. 'టీ' నాకీయవచ్చినప్పుడు దాన్ని చూశావు. ముసిముసినవ్వులందుకే. నామీద విసిరిన ఓరచూపులందుకే. చూచాడేమో! ఏమో! ఏమో! పుట్టింది పెద్ద అనుమానం. లోలోపలనే దాచాను. పరీక్షించాను. ఎటు చూచినా అనుమానమే. ఛీ—ఈబతుకుకంటే చావే నయమనుకున్నాను. అందుకు సిద్ధమైనాను. ఇంక—"

"ఇంక నామాట వినండి అంతా తెలిసింది. అప్పుడే నన్నడిగివుండరాదూ; ఇంతదూరం అయివచ్చి వుండేదే! ఇంకాకొంతకాలం దాచాలె ననుకున్నాను. ఇంతకువచ్చింది. ఇంక దాచీ లాభం లేదు. ఇక తీరుస్తాను మీ అనుమానం వినండి—శాంతంతో వినండి.

మనద్రవ్య మంతా బ్యాంకు దివాలాతోటే పోయింది. మీరు విచారంతో వున్నారు. కర్చు తగ్గించి మిమ్మల్ని సంతోషపెట్టాలె ననుకున్నాను. ఏదో సంపాదిస్తూన్నారు—వంటిమీద నగలున్నవి—సరికదా నాకొక ఆలోచన తోచింది. పెద్దమొత్తంగా ఒక్కసారిగా రొక్కం మీకు చూపి ఇది నా స్వార్జితం అనిచెప్పుదామను కున్నాను. అందుచేత మీకు తెలుపకుండానే యీ టోపీ—"

"ఆఁ-ఆఁ- మాయి! నోరు మాయి! మాయలాడీ! సిగ్గుమాలినదానా! మాయింక! నాయెదుటనే నీనోటిగుండనే చెప్పుతూన్నావుగా? గొప్పమొత్తం రొక్కం నాకు చూపాలెనని నేనింతదరిద్రస్థితిలో వున్నందుకు నాకు సహాయం చేయలెనని నీవు నీతిమాలి, సిగ్గువిడిచి, విశ్వాసఘాతంచేసి, ఆటోపీవాని చేపట్టి—"

"కాదు—శాంతించండి అది కాదు నావుద్దేశం. పూర్తిగా వినండి."

"చాలు—విన్నదిచాలు—చెప్పినదిచాలు—నీనాలుక చీలిపోదూ! ఛీ!పో—అవలికి తొలగిపో—నీముఖం నాకు చూపకు, నీమరాలా! నీ నీతిమాలిన చరిత్ర—నీనోటితో—"

"వినండి—పోను—తొలగిపోను — చాలించను. పూర్తిగా నాపలుకులు విని, ఆతర్వాత మీకిష్టము వచ్చినట్లనండీ. మిమ్మల్ని సంతోషపెట్టవలెనని—ఇది అంతా నా స్వార్జితం—కష్టార్జితం, అని చెప్పుదామని బుద్ధిపుట్టింది. మన సరస్వతితోటి ఆలోచించాను. నలుగురు నేస్తులం కలిశాము. మా కంపెనీకి చంకీబుటేదారీపని చేతవును. ఆవిద్య సమయానికి పనికి వచ్చింది. మీరు భోంచేసి కోర్టుకు వెళ్లిపోయిన తరువాత అందరం కలిసి టోపీలు కుట్టేవాళ్ళం. ఆరోజూ, టోపీ కుట్టుతూండి, అప్పుడే వంటయింట్లో పిల్లి యేదో పడవేస్తే, చేతిలోని టోపీని బల్లమీద పెట్టి పోయినాను. అంతలో మీరు వచ్చారు. తలుపు తెరిచాను. మీముఖం నల్లబారివుంది. అవేళకు యింటికి వచ్చారు ఎందుకా అని భయపడ్డాను. జబ్బేమయినా కలిగిందా ముఖం యీలాగున్న దెందుకా అని గాభరాపడ్డాను. అలసివచ్చారుకదా త్వరలో,'టీ'కాచి తెద్దామని లోపలికి పరిగెత్తాను. మీరు మీగదిలో నుంటారనుకున్నాను. టోపీ దాచలేదు. గది తలుపుమాత్రం ముందుకు వేసి నా'టీ' కాచపోయినాను. మీముఖమిల్లాగున్నందుకు నా మనసు స్తిమితం లేకపోయింది. టోపీ సంగతే మరిచాను. 'టీ'తీసికొని మీగదిలోనికి వెళ్లాను. అక్కడ లేరు. నాగదిలోకివచ్చాను. మంచానికి అడ్డంగా పడివున్నారు. టోపీ దాచేశాను, మీరుచూడ లేదనుకున్నాను."

"అప్పటి నీయోర చూపులకు అర్థమేమి."

"అనుమానం—చూశారేమో—ఏమనుకున్నారో? ఎవరిది అనుకున్నారో? అడుగుతారేమో ఏమి చెప్పాలె?

నిజంచెప్పాలేనా? ఇంకకొంతకాలందాచాలేనా?—అదే విచారం—ఆలోచనా. భర్తతో తెలుపకుండానే భార్య యేవ్యవహారమైనా చేయడంతప్పు. నేను తప్పు చేశాను. కోప్పడుతారేమో అని భయం. నామనసు మనసులో లేదు. ఎన్నివిధాలో—"

"నిజమేనా. నీమాటలు నమ్మవచ్చునా?.

"నమ్మండీ! నిజమే చెపుతున్నాను. ఒక్కటోపీని చూచి నన్నింతగా అనుమానించి దూషించి అవమానించారుకదా. అదిగో చూడండి." అని అంటూ మను లేచి వెళ్లి ఒక పెట్టె తెచ్చి తెరచి నాకు చూపింది. "ఇవిగో వలపై టోపీలు. అన్నీ యీమోస్తరువే కదా! ఇన్నిటినీ చూచి యింకా యెంతగా అనుమానిస్తారో?"

అని అంటూ మనూ పరమానందంతో నవ్వసాగింది; నాకాశ్చర్యం కలిగింది. నానేత్రాల్లో బాష్పాలు కురుస్తూన్నవి. నాలోనే నేను పశ్చాత్తాపపడ్డాను.

నాకేదో ఒక విధమైన వికారం కలిగింది. అంతకంటే యెక్కువగా సిగ్గయింది. పట్టలేక పోయినాను. తటాలున మంచం మీదనుండి లేచి క్రిందకి దిగాను. మను నాభావంగ్రహించింది కాబోలు నన్ను తటాలున పట్టుకుని మెల్లగ మంచం మీద కూర్చోపెట్టింది. నాకంఠాన్ని తన రెండు చేతులా పెనవేసి, నాముఖం కొంచెం పైకెత్తి "ఏమీపని? కూర్చోండి" అన్నది. నా కండ్లల్లో నీరు గిర్రున తిరిగివచ్చినది. కంఠం బొంగురుపోయింది!

"మనూ! తప్పు మన్నింపవూ? వజ్రాన్ని గాజుముక్క అనుకున్నాను నీలమణిని బొగ్గనుకున్నాను. అమృతమును విషంగా భావించి పారపోశాను. నీవిలువ నాకు తెలియక పోయింది. తెలిసికూడా భ్రమతలో పడ్డాను. మహాఘోరంగా అనుమానించాను. నీ శీలాన్ని సంశయించాను. తప్పు క్షమించు మనూ! కోపపడకు. నా యింటి లక్ష్మివని తెలిసికోలేక భ్రమలో నిక్కి కన్నులు మూసుకుని, బుద్ధి క్షీణించగా, మోహమూకాలితో తన్నేసినాను. క్షమించు మనూ!—"

అని నేను దీనభావంతో అంటూండగా మను నా నోరు నొక్కిపట్టింది. నన్ను తన హృదయానికి బిగ్గబట్టింది. ఆకండ్లలో బాష్పాలు కురుస్తూన్నవి. అందులోనూ మనూ మొహం మీద చిరునవ్వు తాండవమాడుతూంది. నన్నాపట్టె గాఢంగా కౌగిలించుకొని, నాముఖం కొంచెం పైకెత్తి తనముఖం దగ్గరగా చేర్చి మిక్కిలి ప్రేమతో యిట్లన్నది.



"ఇందులో నేను క్షమించడమేమి? తప్పు నాదే. నన్ను మీరు క్షమించాలె. భర్తకు తెలుపకుండానే రోలాటి వ్యవహారం చేయడమూ భార్యకు తగదు. నేనంతదూరం మాలోచనచేయలేదు. మేమందరం కలిసి టోపీలుకుట్టి, మన సరస్వతీ భర్తషాపులోకి పంపి వానిమీద వచ్చిన పైకం పెద్దమొత్తం మీకు చూపి విమ్మల్ని ఆశ్చర్యంలో తేలుస్తామనుకున్నాము. అదే ఉత్సాహంగాని, యింతవుతుందని అనుకోలేదు. పోనిండి ఇంకనైనా నన్ను వెనుకటివలె ప్రేమిస్తారా? నన్ను నమ్ముతారా? ఇంకనైనా వదిలిందా మీ అనుమానపిశాచం?"

నాహృదయం కృతజ్ఞతతో మహానందంతో సిగ్గతో అపరిమితమైన ప్రేమతో నిండిపోయింది. నేను మనూ నొక్క విధంగా చూచాను. అంతలోనే మను చిరునవ్వు నవ్వింది. ఆక్షణమే పెదవుల్ని నాలుగు కలిసిపోయినవి.



# సన్ధ్యోపాసన

సాహిత్యసరస్వతి సీరిపి ఆంజనేయులు గారు

## II

౬. మనసాపరిక్రమాగీతలు—

పూర్వదిశయందు జ్ఞానరూపుండ వగుచు!
ఖరకరునిపాదములె విశిఖములు గాఁగ
మమ్ము నలయించు నంధకారమ్మునుండి
యెప్డు రక్షణ మొనరింతు వీవు తండ్రి! ౭

దక్షిణదిశను నైశ్వర్యధాముఁడ వయి
జ్ఞానమూర్తులు బాణసమాను లగుట
మమ్ముఁ గలఁచు తిర్యక్సమూహమ్మునుండి
యెప్డు రక్షణ మొనరింతు వీవు తండ్రి! ౮

తలఁపఁ బశ్చిమమ్మున మహోత్తముఁడవగుచు
నన్న మొక్కటె రోపతుల్యంబుగాఁగ
మము నజగరాది క్రూరసర్పములనుండి
యెప్డు రక్షణ మొనరింతు వీవు తండ్రి! ౯

ఉత్తరదిశను శాంతగుణోజ్జ్వలుండ
వయి, యజన్ముఁడవగుచు, సమ్యగ్విధాన
నశనిమార్గణముగ మ మ్మనంతశక్తి
నెప్డు రక్షణ మొనరింతు వీవు తండ్రి! ౧౦

వీరుధనె యొకయానుగ కారణముగ
హరితవర్ణవృశ్చికాదుల చొరవనుండి
మము నధోదిశ విష్ణురూపము వహించి
యెప్డు రక్షణ మొనరింతు వీవు తండ్రి! ౧౧

ఊర్ధ్వముఖమున వేదవేద్యుండ వగుచు
వర్షకణములె శరములై వఱల మమ్ముఁ
గడఁది శ్వేతకుష్ఠాదిరోగములనుండి
యెప్డు రక్షణ మొనరింతు వీవు తండ్రి! ౧౨

అఖిలగుణముల కధిపతివగుట మమ్ము
నహితభావమ్మునుండి కాపాడె దట్టి,
గుణములకు- బాణములకు- రక్షణమునకును-
సర్వమునకును మానమస్కారశతము. ౧౩

౭ ఉపస్థానగీతలు—

నీవు విజ్ఞానమయుఁడవు దేవదేవుఁ
డవు, మఱిచరాచరాత్మకుఁడవు, మహోత్త
ముఁడవు, నజితుండ వానందమూర్తి వగుట,
నిన్నుఁ దెలియ మే ముపాసింతు మన్నిగతుల.

సర్వదర్శనమునకు నెసంగు నీదు
విమలసద్గుణగణపతాకమును గాంచి,
యాంబుగాదివేదముల నత్యంతదీప్తి
వెలయు, నీమహామూర్తినిఁ దెలియఁగలము.

వసుధనీకృపచే శత వత్సరమ్ము
లైనజీవింతు మేము నీ యర్చకాళికు,
నిన్నె కనెదము, వినెదము నీచరితనె,
నిన్నుఁ గూర్చియె భాషింతు మన్నికడల. ౧౪

తలఁప నూఱేండ్లకంటె నత్యధికముగనె
క్షితిని నీదయామృతవృష్టి కతన మేము
బ్రతికి-విని-కని-వినిచెడు వారమయ్య!
స్వాత్వములఁ బొంది ముదమందు వారమయ్య!

దేవ! నీవెప్పుడు.




# పూలరంగఁడు

చింతలపూఁడి శేషగిరి రావు గారు

౧

సమయము నిశీథము. ప్రదేశము భీకరారణ్యము. మీఁదు మిక్కిలి నిర్జనము. దిగంతములందు దట్టముగ వ్యాపించిన చిమ్మచీకటియందుఁ గన్నుఁ బొడిచికొనినను గానరాకుండెను. ప్రకృతికాంత నిశ్చేష్టయై నిదురించుచున్న స్త్రీరత్నమువలె చైతన్యముఁ దక్కియుండెను. నిదురయందున్న వనిత యప్పుడప్పుడు దోమకాటు మొదలైనవాని వలన నవయవములు కదలించునట్లు ప్రకృతి కూడ నప్పుడప్పుడు కొంచెము చలనముఁ గలిగియుండెను. ఇట్లు కతిపయదినములు గడచిన వెనుక నాకసము జీమూతావృతమై యీఱుగాలి 'భంయి' 'ఫంయి' మని వీచి వన్యపాదపంబుల సమూలంబుగఁ బెకలింప మొదలిడెను. అప్పుడప్పుడు కానిపించు సౌదామినీలతల దివ్యకాంతులు తప్ప వేఱొండు కాంతి లేకుండెను. అంతటఁ గుంభవర్షము వర్షింప భూమియంతయు జలమయంబుగ మిట్టపల్లము లేకయయ్యెను. కొంతవడికి వానయు గాలియుఁ దగ్గియాకస మెప్పటియట్లఁ దేజోవిరాజితంబై ప్రకృతికాంత తన సహజస్వరూపముఁ గైకొనెనుగాని యింకను మెఱుపులు తగ్గలేదు. ఇట్టి యర్ధరాత్రమున, నిట్టి ప్రళయాశనిపాత సమయంబున, నిట్టి ఘోరారణ్యమునఁ గర్కశశిలావృతంబయిన నొక యిఱుకుమార్గమున నొకమనుజుఁ డొక కట్టెలమోపు శిరముపై నిడికొని, యొకగొడ్డలి భుజముపై నుంచి మోపు యొక్క భారమును దగ్గించుటకుఁ గాఁబోలు మోపునకు వెనుక ప్రక్కగొడ్డలి నూఁతగ నొనర్చి నడువలేక నడువలేక



నడుచుచుండెను. ఈతఁడింతవఱకుఁ బ్రాణము లఱచేతఁ బట్టుకొని యేచెట్టుక్రిందనో తలదాచుకొని యిప్పుడు బయలుదేరియుండనోపు. ఈతనివయ స్సిరువదియైదువత్సరముల కెక్కుడుగ నున్నట్లు తోఁపదు. ఎగుడుదిగుడుగఁ గొట్టఁబడిన కట్టెలవిధమును, వదులువదులుగఁ గట్టఁబడి కుదిరియుఁగుదురకుండఁ దలపైఁ బెట్టుకొనిన మోపువిధమునుజూడ నీతఁ డీవృత్తికిఁ జిరపరిచితుఁడుకానట్లు తోఁచెడిని. దేహసౌకుమార్యమును, శరీరచ్ఛాయయు, శరీరాచ్ఛాదనకైనను సరిపోని చినికివస్త్రములనుజూడ నీతఁ డొకబ్రతికిచెడ్డ యుత్తమకులీనుఁడనియు, విధివశమున నిట్టిదుస్స్థితికి వచ్చెననియు నూహింపవచ్చును. పాప మీపాంథుఁడు భయవిహ్వలుఁడై ముందువెనుకల బెదరిబెదరి చూచుచుఁ, జీమ చిటుక్కుమనిన గుండె లవిసి హఠాత్తుగ నిలువఁబడుచు, మరల ధైర్యము దెచ్చుకొని ముందునకు సాగుచుఁ గాలుజారి పడఁబోవుచు మరలఁ గాలు నిలువద్రొక్కుకొనుచుఁబయనము నొనర్చుచుండెను. అట్లయ్యు మనోవీథియందు భావపరంపర లేవియో వచ్చుచునేయుండెను. ప్రాయశః తనకుఁ బ్రాప్తించిన దైన్యస్థితింగూర్చియో ఇంటియొద్దనున్న భార్యాపుత్త్రుల దీనావస్థంగూర్చియో, జరాభారమునఁ గ్రుంగికృశించి చావునకుసిద్ధముగనున్న తల్లింగూర్చియో, తలపోయుచుండనోపు. కొంతకాల మిట్లుగడచిన పిమ్మటఁ గన్నుచెదఱున ట్లొకతీవెమెఱపు మెఱయ నాతఁడు తననివాసస్థల మొకకూతవేటుదూరమున కెక్కుడు లేదని తెలిసికొని కొంతధైర్యముఁ దెచ్చుకొని వడివడిగ నడువసాగెను.

౨

గోపాలరావునాయఁడు వెలమవంశమునందు గొప్పకుటుంబమునఁ బుట్టినవాఁడు. ఇంటిపేరు రాకులవారు. నివాసస్థలము రాజమహేంద్రవరము. తల్లిదండ్రు లితనికి బాల్యమునందే హూణవిద్యాభ్యాసముఁ జేయించిరి. ఇతఁ డాకాలమునాఁటి యప్పర్ సెకండరీ (Upper Secondary) పరీక్షయందుత్తీర్ణుఁడై సర్కారుకొలువునం దిరువదిరూప్యముల వేతనమునకుఁ గుదిరెను. రానురాను వేతనాభివృద్ధిఁ గాంచుచు రాబర్టుస (Robertson) న్నను కలెక్టరుగారియొద్ద నాంగ్లేయ ప్రధానలేఖకుఁ డయ్యెను. గోపాలరావునాయఁడు తనబుద్ధిసూక్ష్మతవలనను మాటనమ్మకమువలనను దనయజమానుని ప్రాపకము గొలఁదిదినములలోనే సంపాదింపఁగలిగెను. యజమానుఁడును దనలేఖకుని మిక్కిలి దయార్ద్రహృదయమున నాదరించుచు, నతని సౌశీల్యమున కచ్చెరువందుచు నతని కేదోయొక గొప్పబహుమాన మిచ్చితీరవలయునని గట్టిగ నిశ్చయించుకొనెను. గోపాలరావునాయని కొక్కఁడే కొమరుఁడు గలఁడు. అతనిపేరు రంగారావు. ఆంగ్లేయభాషవలని లాభనష్టములను, సేవకవృత్తియందుఁ గల సాధకబాధకములను బూర్తిగ ననుభవించినవాఁ డగుటంజేసి గోపాలరావునాయఁడు తనకుమారు నాంగ్లవిద్యయందుఁ బ్రవేశపెట్ట నిచ్చగింపలేదు. రంగారావు తెలుఁగుమాత్రము కొలఁదిగ వ్రాయను జదువను నేర్చినవాఁడు. తల్లిదండ్రుల కేకపుత్త్రుఁడు కావుటంజేసి చిఱుతప్రాయమునుండియు

నీతఁడు మిగులగారాబముతోఁ బెరిగెను. ఈతఁడు కొంతకాలమువఱకు నిర్వ్యాపారుఁడై యూరక తినితిరుగుచుండెడివాఁడు. విలువగల దుస్తులు ధరించి యిట్లు తిరుగుచుండుటం జేసి జను లీతనిఁ బూలరంగఁ డని పిలుచుచుండిరి. ఇట్లు కొండొకకాల మేగ 'ఉద్యోగం పురుషలక్షణ' మ్మని యుండెఁ గాన తండ్రి తన కుమారుని నిరుద్యోగిగ నుంపనొల్లక కొంత ధనమిచ్చి చిన్నవ్యాపారమునందు దింపెను. రంగారావు తనబుద్ధిచాకచక్యమున వర్తకమునందు శుక్లపక్షచంద్రునివలె దినదినక్రమాభివృద్ధి గాంచుచుఁ దుదకు రత్నములందును వజ్రములందును నోడవర్తకమునుగూడ సాగించెను. గోపాలరావునాయఁడు తనకుమారుని యౌన్నత్యదశఁ గాంచి పూర్తిగ నానందింపకపూర్వమే యకాలమృత్యువువాతం బడుట సంభవించెను. రాబర్టుసను దొరగారును పెన్షన్ దీసికొని స్వదేశమున కేగిరి. 'అత్యుచ్ఛ్రయః పతనహేతుః' అనునట్లు రంగారావు జీవితసౌధమునకుఁ బతనకాలముసమీపించినది. అతఁడు నిర్లక్ష్యముతో నతివిరివిగ వ్యాపారమును సాగించెను. పిన్నవయస్కుఁడు. ముందువెనుకలారయుశక్తిలేదు. మందలించుటకుఁ దండ్రి లేఁడు. తనకుఁగలయావదాస్తిని దాకట్టువెట్టి పదిలక్షల రూప్యములవిలువగలరత్నములనువజ్రములను విదేశమున కెగుమతిఁ జేసెను. దినములు, వారములు, పక్షములు, మాసములు నొకటిరెండుసంవత్సరములుగూడఁ గడచినవి. కాని తానెగుమతిఁ జేసినయోడజాడ యించుకంతయుఁ దెలియదయ్యె. పాపము! ఏమి చేయఁగలఁడు? రంగారావునాయఁడు తుపానువలన నోడ బద్దలై యుండునని నిశ్చయించికొనెను. నిర్విణ్ణుఁడయ్యెను. హృదయపేటిక బీటలువాఱెను. అతనిపరిస్థితులను దెలిసికొని కొలఁదిదినములలో ఋణదాతలు పైకొని యాస్తినంతయు వశపఱచుకొని కట్టుగుడ్డలతో బైటికి వెడలనడిచిరి. నిస్సహాయుఁడై రంగారావు గర్భవతియైనభార్యను, పసిపాపయైనపుత్రుని వృద్ధయైన తల్లిని వెంటనిడుకొని పూ॥ [illegible] కట్టెల నమ్మఁజాలక గ్రామాంతరమున [illegible] యెను.



## ౩

పోలవరగ్రామమునందుఁ బాడువడినసత్రమొండు కలదు. చాలకాలమునుండి నిరాదరింపఁబడుటం జేసి యది మిక్కిలి శిథిలావస్థయందుండెను. ఆకారణమున నది గ్రుడ్లగూబలకును గబ్బిలములకును నివాసస్థలమయ్యెను. ముందుప్రక్కనున్న వసారామీఁది పెంకులు పొత్తుగఁ బోయి వాసములమీఁద సమర్చఁబడిన వెదురుకూర్పు మాత్రము కానుపించుచుండెను. ఎడమప్రక్కనున్న గోడలు నేలమట్టమగుటం జేసి యాభాగమందలి కప్పుగూడ నేలపాలయ్యెను. మిగిలిన భాగములందు సహితము సూర్యచంద్రులు నిత్యము వాహ్యాళి సల్పుచుందురు. కుడిప్రక్కనున్న యొక్కగది మాత్రము కొంచెము నివాసయోగ్యముగ నుండెను. ఈగదికి ముందువసారాయం దొకయరుఁగుగలదు. సత్రముచుట్టును జిల్లేడు, ఉమ్మెత్త, మొదలగుచెట్లచ్చటచ్చట గుంపులుగుంపులుగఁ బెరిగియుండెను. ఒకనాఁటియర్ధ

రాత్రమున వసారాయందుఁగల యరుఁగు మీఁద నొకస్త్రీ పెద్దపెట్టున గోదనము చేయుచుండెను. ప్రక్కన నొక బాలుఁడు కారణము తెలియకయే తల్లి యేడ్చుచున్నది గానఁ దానును వెక్కి వెక్కి యేడ్చుచుండెను. వీరిద్దఱికిని ముందు నాపాదమస్తకము గుడ్డకప్పఁబడిన యొక మానవాకారముగలదు. ప్రాయశః యిది యొకశవమై యుండనోపు. పాపమాస్త్రీ మధ్య మధ్య తనయు నోదార్చుచు నిదురింపుమని బ్రతిమాలుచుఁ దా నల్లే యేడ్చుచుండెను. ఆపె యేష్మాత్ర మలికిడియైనను ముందునకు వంగి యట్టునిటు చూచుచుండెను. దీనినిబట్టి చూడ నాపె యెరిరాకకొఱకో నిరీక్షించుచుండెనని తోఁచెడిని. కొంత సేపిట్లుగడచెను. ఆపె పరాకున నున్నసమయమున నొకకట్టెయుల మోపు క్రిందఁబడినట్లు శబ్దమయ్యెను. రొప్పుచు రోజుచు నొకవ్యక్తి లోనికివచ్చుచుండ నావనిత యెదురుగ నేగి• కౌఁగిలించుకొని పూర్వముకంటె నెక్కుడుగ నేడ్చుచు నస్పష్టోచ్చారణముతో "ఆహా! నేను గాపురమునకు వచ్చినదిమొదలు కన్నతల్లికన్న మిన్నగ నన్నాదరించెడి యత్త యీలోకమును విడిచిపోయినది. ఆమెకును మనకును నేఁటితో ఋణము తీరిపోయినది" అనెను. ఈమాటలు శ్రవణపుటంబులుసోఁకఁగనేయానూతనవ్యక్తి తటాలున నేలంగూలి కొంతతడవు విలపించెను. పాపము! భార్యను భర్తయు భర్తను భార్యయు ననునయింపవలసిన దేశాని యితరులెవ్వరు లేరుగదా! కొంతతడవునకు భర్త కొంచెము ధైర్య మవలంబించి తా నా సాయంసమయమునఁ గట్టెలఁ గొట్టుటకుఁ దత్ప్రాంతారణ్యమున కేగఁ జీకటిపడుటయుఁ ద్రోవఁదప్పి యడవియంతయుఁ గలయఁదిరుగుటయు, మధ్యేమార్గమునఁ బెనుగాలివీచికుంభవర్షము వర్షించుటయు మొదలుగాఁగల తన కథను సవిస్తరముగ భార్య కెఱుకపఱచెను. భార్యయుఁ దాను పిండివిసరి తెచ్చినయల్పద్రవ్యముతో సొలెడునూకలంగొని వండి బాలునకు గొంతయిడి తానర్ధాన్నమే భుజించి మిగిలినది మఱునాఁటికి మిగుల్చుటయు, నత్తగారిమరణవేదనయు, భర్త రాక తడవయ్యెనని తా ననుభవించిన మనోవేదనయు, మొదలుగాఁగల తనవృత్తాంతము నంతయు భర్తకు వినిపించెను. ఇట్లారాత్రి మూఁడుజాములు గడచి నాల్గవజాము ప్రారంభమయ్యెను. ప్రక్కనున్న యేనాదివానికోడి ఱెక్కలు తటతట నార్చి, మెడ ముందునకు సాచి, కొక్కొరకో యని కూయసాగెను. భర్త యిట్లు మాటలాడుచు గోడకుఁ జేరఁబడి యించుక నిద్రించెను; కాని భార్యకు నిదుర రాదు. గర్భమునందు సన్నసన్నగ నొప్పి ప్రారంభమయ్యెను. అదియే క్రమక్రమముగఁ బెద్దదై ప్రసవవేదనగా మాఱెను. పాప మాసుశీల తన్నావరించిన వ్రీడాభరమున భర్తను మేల్కొల్పి యిదమిత్థమని తెల్పఁజాలదయ్యె. కొంతవడికి భర్త మేల్కాంచి సకలమును గ్రహించెను. కాని యేమి చేయును? పిట్టలు 'పీచు' 'పీచు' మనుచుండెను. కాల్యకృత్యములఁ దీర్పవచ్చిన జనసమూహముసం దప్పుడే కట్టెలరంగనితల్లి మరణించె ననువార్త వ్యాపించెను.

## ౪

సూర్యోదయకాలమునకు శిశూదయ మయ్యెను. నిస్సహాయురాలైన రంగనిభార్యయే యన్నికృత్యములను నెరవేర్చుకొనెను. కట్టెల రంగనియింటఁ జావుపుట్టుక లొక్కమాఱు సంభవించెను.

ఆహా!

"గురువులరాక దాసిమృతి
　గుఱ్ఱపుదాడియు నల్లునల్కయున్
వరసతిగర్భవేదన వి
　వాహము విత్తులఁ జల్లుకార్తెయున్
పొరుగున నప్పుబాధ చెవి
　పోటును వీథిని దొమ్మరాటయున్
కలుగ్ర దరిద్ర మాబ్దికముఁ
　గల్గు నొకప్పుడె కృష్ణభూవరా!"

యనినట్లు రంగనికిఁ జిక్కులన్నియు నొక్కమాఱు సంభవించెను. తల్లికిఁ బ్రేత కర్మ నెనర్చుటకుఁగాని కుమారునకు జాత కర్మ నెనర్చుటకుఁగాని రంగనిచేతియందు గ్రుడ్డిగవ్వయులేదు కాన గడచిన రాత్రి తాను దెచ్చినమోపు నెత్తిపై నిడుకొని వీథివీథిని "కట్టెలుకట్టెలో" యనియఱచుచు బయలుదేరెను. జాముప్రొద్దెక్కినది. రాజమహేంద్రవరమునుండి పోలవరమునకు రాదారిపడవ వచ్చినది. పోస్టాఫీసు (Pcst Office) నందు టపా పగులఁగొట్టి పోస్టుజవాను లెవరియుత్తరములు వారు తీసికొని యెవరివాడకు వారు బయలుదేరిరి. అందొకజవానునొద్ద 'ఆకుల గోపాలరావునాయని కుమారుఁడు రంగారావునాయఁ" డను చిరునామాగల జాబులు రెండు గలవు. అతఁడు గ్రామమంతయుఁదిరిగినను రంగారావునాయని జాడఁ దెలిపినవారు లేరైరి. రంగారావునాయఁడు చిఱుతప్రాయమునఁబాల రంగఁడై తిరిగినదియు నిప్పుడు కట్టెలరంగఁడై కట్టెల నమ్మునదియు నాయూరిలో నెవరికిఁ దెలియును? రంగఁ డట్టు లాకట్టెలమోపును నాలుగణాలకు విక్రయించి చిక్కిలి యాతురముతో గృహోన్ముఖుఁడై చనుచుండ మార్గమధ్యమున నిరువురు పోస్టుబంట్రోతులిట్లు మాట్లాడుచుండిరి.

ప్రథ:—'ఆకుల రంగారావునాయఁడు–పోలవరం–' అని యీజాబుపై నున్నది. ఊరంతయుఁ దిరిగినను వానిజాడ తెలియలేదు.

ద్వితీ:—ఏమి చేయఁగలవు? మఱల వ్రాసినవారికిఁ బంపుము.

ఆకుల రంగారావునాయఁడని రంగని చెవిసోకినంతనే యాశ్చర్యపడుచు నాతనిగు ఱించి యేమిమాటాడుచుంటిరని ప్రశ్నించెను. ఆతఁడు తమ కెవ్విధమైనసహాయముఁ జేయనోపఁడని కాబోలు! వారు ప్రత్యుత్తర మీయకుండిరి. కాని రంగఁడు రెండుమూఁడుసారులట్లు నొక్కినొక్కి యడుగ నాతనికి రెండు జాబులు గలవని ప్రత్యుత్తరమిచ్చిరి. రంగని యాశ్చర్య మినుమడించెను. తానే యామనుజుఁడ నని యొప్పించునప్పటికి రంగనికిఁ దలప్రాణము తోఁకకువచ్చెను. అతఁ డిట్టులా రెండు జాబులను దీసికొని యందొకటి విప్పిచూచెను. ఆకాగితపుఁ బైభాగమున 'రాబర్ట్సన్ లంబార్డు స్ట్రీటు, లండన్– (Robertson—Lombardy Street, London)' అనియుండెను. ఇంకను దిగు

వకురాఁగ, దనకుసంతానము లేమింజేసి తనకుఁ గలయాస్తియందుఁ గొంతభాగము విద్యావ్యాప్తికిని గొంతభాగము బీదలకును బంచియిచ్చి మిగిలిన రెండులక్షల పౌనులను దనయొద్ద రణకు మిక్కిలి పాత్రుఁడైన గోపాల రావునాయని కుటుంబమునకుఁ జెందఁజేసితి ననియు నాప్రైక మాతనిపుత్రుఁడు రంగారావు నాయఁడు మదరాసునఁగల యిండియన్ నేషనల్ బ్యాంకు (Indian National Bank) లోఁ దీసికొనవచ్చుననియు వ్రాయబడి క్రింద రాబర్టు సన్ సంతకముత్తేఁ గలదు. రంగని కదికలయో నిక్కువమో తెలియదయ్యె. తా నెచ్చటనుండెనో యేమిచేయుచుండెనో కొంతతడవు మఱచిపోయెను. కొంచెము మనఃస్థైర్యముఁ దెచ్చికొని రెండవజాబు విప్పిచూచెను. అది కాకినాడనుండి యొకబాల్యస్నేహితుఁడు వ్రాసినది. అందు రంగారావునాయనిమీఁద జర్మనీతీరమునందుఁగనుఁగొనఁబడెననియు నచటినసర్కారువారు మరల హిందూదేశమునకుఁ బంపిరనియు నది యిప్పుడు రంగూన్ పట్టణముఁ జేరెననియుఁ దనకు వార్తవచ్చెనని వ్రాయఁబడియుండెను. ఆహా! రంగనిసంతోషసముద్రము నకుఁ బారము లేదు. పేదకుఁ బెన్నిధి యబ్బినట్టయున్న నిట్టిదియేమైయుండనోపు. రంగఁడి జాబులను రెంటిని దీసికొని యింటికేగి యాశుభవార్త భార్యకు వినిపించి యామెనుగూడ సంతోష సముద్రమున నోలలాడఁ జేసెను. తత్కాలమునఁ దనకుఁగల నాలుగణాలతోడనే జననికిఁ బ్రేతకర్మ యొనర్చి లేదనిపించుకొనెను. పాపము! పూలరంగఁడు కట్టెలరంగఁడై దైవకృపవలన మఱలనొకపరి పూల రంగఁడు కాఁబోవుచున్నాఁడు.



## శాస్తి

బసవరాజు అప్పారావు గారు, బి. ఏ.

ఏనాఁడునాటితినో
యీవలపుమాను,
చిట్టి, లతలా నన్ను
చుట్టుకున్నావు!
వెనకజన్మలో యేమి
పెట్టిపుట్టితిమొ,

బంగారుపంటంటి
పసిబాల కలికి!
పెట్టి యెవరినియేమి
తిట్టుకున్నామొ,
ఇచ్చినదైవమూ
మచ్చిపోడామొ!




ఆంధ్ర శేషగిరిరావు గారు

నీలమేఘశ్యామమైన ఉన్నతకాయము, విశాలఫాలము, విస్ఫురన్నయనాబ్జములు, కలిగి శ్రీ పిడపర్తి పెదపూర్ణయ్య సిద్ధాంతిగారు తమయెడ జనులకు పూజ్యభావము పురికొల్పెడివారు. ఆయన కాత్మవిశ్వాసము మెండు. చిన్న పెద్దలని తేడపాటము లరయక వారెట్టి వారితోనైన సరసముగ సరళముగ ధారాళాంతఃకరణముతో హృదయమిచ్చి మాట్లాడువారు. హాస్యము గ్రోల్లు రికిపడునట్లు చమత్కారముగ సంభాషించెడివారు. ఈయన గొప్ప మేధావి. ధారణాశక్తి యత్యద్భుతము. ఈయనదికంచు కంఠము. సంస్కృతాంధ్రములందు కుశల ప్రవేశమును, హిందూధర్మశాస్త్రములం దపార పరిజ్ఞానమును కల్గి గణిత జ్యోతిషశాస్త్రమందలి తమ ప్రజ్ఞాపాండిత్యములకు వన్నెయు వాసియు సమకూర్చిరి. మానవస్వభావ పరిశీలనమునం దీయనకు మించినవా రుండరనుట సత్యసమీపము. 'బుద్ధి జాడ్యజనితోన్మాదులగు శ్రోత్రియ' శిఖామణులవలెగాక శ్రీ సిద్ధాంతిగారు పండితులయ్యు లౌకికులు. ఆరోగ్యాభివృద్ధ్యర్థము చిన్నతనము గోలె కఠినపథ్యనియమావలంబులయ్యు ఆజన్మము శూలనొప్పిచే బాధపడుచుండెడివారు. శ్రీ సిద్ధాంతిగారు రక్తాక్షి ఆషాఢ శుద్ధ దశమీ శుక్రవారమునాడు (1924 జూలై) కీర్తిశేషులైరి. వీరి మరణముచే ఆంధ్రజ్యోతిష ప్రపంచకమునకు తీరనినష్టము వాటిల్లినది. ఆధునికాంధ్ర మహాపురుషులలో నొకరైన శ్రీ సిద్ధాంతిగారి జీవిత విశేషముల నొక్కింత నీదిగువ పరిశీలింతము.

### వంశవృక్షము

శివరామ సిద్ధాంతి.

|

చలమయ్యశాస్త్రి

|

శేషాచలశాస్త్రి.

పెద పూర్ణయ్య (జన. 1848. మ. 1924.) — చిన పూర్ణయ్య

|

వేంకటరమణయ్య. (ప్రస్తుత సిద్ధాంతులు.)

పిడపర్తివారిది తొలుత గుంటూరుమండల మందలి పిడపర్తి గ్రామము. ఆదిని వీరి ఇంటిపేరు నైషధము వారు. ఈప్రాంతీయులకు వారు పిడపర్తి గ్రామమునుండి వచ్చుటచే పిడపర్తి వారైరి.

శివరామ సిద్ధాంతి తొలుత వీకుటుంబమున జ్యోతిషవిద్య వెలయించెను. వీరి కీవిద్యయం దున్న కూలంకష పాండిత్యమునకు మెచ్చి ఆ కాలమున విజయనగరసంస్థాన పరిపాలకులైన శ్రీ నారాయణ గజపతి మహారాజావారు 'బూరాడపేట' అగ్రహారము నొసగి సత్కరించిరి. శివరామ సిద్ధాంతి కొమరుడు చలమయ్యశాస్త్రి. వీరు జ్యోతిషవిద్యకు పెట్టినది పేరు. రామచంద్రపురము రాజులైన కాకర్లపూడి నరసరాజుగారి యాస్థానమున ఇంద్రగంటి విశ్వపతి శాస్త్రికిని చలమయ్యశాస్త్రికిని 'లుప్తవాస' విషయమై సుప్రసిద్ధ వాగ్వాదము నడచినది. అందు చలమయ్యశాస్త్రి చేయి మీదైనది. జ్యోతిష విద్యారసి

కులైన ఉప్పలపాటి జోగి జగన్నాథ భద్రుదువారి కిని చలమయ్యశాస్త్రిగారికిని 'లుప్తమాస' విషయమై వాదము జరిగినది. వారి వారి వాదప్రతివాదములను తాటియాకులపై వ్రాసి నీటికాలువ వదలిరట. చలమయ్యశాస్త్రి వాదమున్న తాటియాకు నీటి కెదురీదినదట. ఇట్లని జనశ్రుతి.

చలమయ్యశాస్త్రి కొమారుడు శేషాచలశాస్త్రి. వీరు బూరాడపేట అగ్రహార విషయమై దావాలోదిగి అపజయముగాంచి పూర్వార్జితమగు స్థిరాస్తిని కోల్పోయిరి. ఆధునికాంధ్ర దేశమునందు పంచాంగకరణమునకు మూలస్కంధము లనదగిన శ్రీపిడపర్తి పెదపూర్ణయ్య చినపూర్ణయ్యగారులు శేషాచలశాస్త్రి పుత్రరత్నములే.



ఇందు పెదపూర్ణయ్య సిద్ధాంతిగారు కీలకసంవత్సర ఫాల్గుణ బహుళత్రయోదశీ శుక్రవారమున (1848 మార్చి) సూర్యారావు పాలెము (తణుకు తాలూకా) నందు జన్మించిరి. ఎనిమిది తొమ్మిది సంవత్సరములకే బాలరామాయణము, అమరము, సూత్రక్షేత్రగణితములు, పావులూరు గణితమును చదివి ముగించిరి. దుర్మతివత్సరమున (1861) వీరి కుపనయనము గావింపబడెను. ఆసంవత్సరమే శ్రీసిద్ధాంతిగారు పంచాంగములు గుణింప తొలిసారి మొదలిడిరి. రక్తాక్షివర్షము (1864) నందు వీరికి వివాహము జరిగెను. 1866 వ సంవత్సరమున (క్షయ నామ సంవత్సరము) కావ్యపఠనమున కారంభించి మూడు మాసములు 'బూరాడపేట' లో పిడపర్తి రమణయ్య సిద్ధాంతి యొద్దను, మార్కండపాడులో చిలుకూరి అంగారకశాస్త్రి యొద్ద కొన్నిమాసములు పఠించి ఆసంవత్సరములోనే కావ్యపఠనము పూర్తిచేసిరి. శ్రీముఖ సంవత్సరములో (1878) పంచాంగము మొదటిసారి కొమ్మిరెడ్డి సూర్యనారాయణగారి తండ్రి నరసింగరావు గారు కాకినాడలో ముద్రింపించిరి. నాటినుండి నేటివఱకు వీరి పంచాంగము లేటేట ఇరువది వేలకు పైగా కర్చుపడుచున్నవి. 1874 వ సంవత్సరమున శేషాచలశాస్త్రి కాలధర్మమునొందుటయు ప్రస్తుతమువకథానాయకులైన శ్రీపూర్ణయ్య సిద్ధాంతిగారి పేరిట పంచాంగములు ముద్రింపబడుటయు జరిగెను. సర్వధారి ఫాల్గుణమాసమున (1888 మార్చి) తణుకు తాలూకా సూర్యారావు పాలెము కాపురమెత్తిపెట్టి రామచంద్రపురము తాలూకా పులుగుర్త గ్రామము స్థిరనివాసమేర్పరుచుకొనిరి.

ప్లవ సంవత్సరమున (1901) ఆంధ్ర సిద్ధాంతులు సభలకెక్కిరి. ఆవత్సరము శ్రావణమధిక మాసమని శ్రీపిడపర్తి పెదపూర్ణయ్యగారును ఆషాఢ మధికమని కొందఱు సిద్ధాంతులును వ్రాసిరి. ఏత ద్విషయమిద మిథ్యమని నిర్ణయించుటకు సాగి రామశాస్త్రిగారి ప్రోత్సాహమున రాజమహేంద్రవరమున 1901 లో నొక గొప్ప జ్యోతిష సభ జరిగెను. సభాధ్యక్షులకు శ్రీతంజావూరు సుబ్బారావు పంతులుగారును శ్రీదాసు శ్రీరాములుగారును ఉభయపక్ష సిద్ధాంతుల వాదములను సావధానముగ నాలకించి తుదకు శ్రీ పిడపర్తి పెదపూర్ణయ్యగారి సిద్ధాంతమే జ్యోతిష సాంప్రదాయముల ననుసరించియున్నదని నిర్ణయించిరి. ఆతరుణమున మనసిద్ధాంతిగారికి గొప్పగౌరవము జరిగెను.

సం. 1848 లో జన్మించి 1924 సంవత్సరము వఱకు డెబ్బదియారు సంవత్సరములు జీవించి పూర్ణపురుషాయుష జీవిద్దై జూలై పంద్రెండవ తేదీని శ్రీపెదపూర్ణయ్యగారు స్వగ్రామమగు పులుగుర్తయందు కీర్తిశేషులైరి. వారి సహధర్మచారిణియు మఱునాడు స్మృతి తెలియని స్థితిలో మరణించెను. ఈపుణ్యదంపతులకు భగవంతుడు మోక్షము ప్రసాదించుగాక.

## అర్చనము



చిత్రకారుడు:—శ్రీయుత వ. వీరభద్రరావుగారు, కలాభవనము, శాంతినికేతనము.

# ప్రాచీన హైందవ గణితము

దర్భా యజ్ఞేశ్వర సోమయాజి గారు, బి. ఏ., యల్. టి.

[ఆఱవ సంచిక తరువాయి]

47. **మహావీరాచార్యుడు:** మహావీరాచార్యుని గణిత సారసంగ్రహము ప్రాథమికాంశములనుగూర్చి చెప్పు సంపూర్ణగ్రంథము. సాధారణగణిత వ్యాపారములనుగూర్చి యిది సమగ్రముగ నుద్ఘోషించుచున్నది. గుణోత్తర శ్రేఢులిందే తొలిసారి కాన్పింప నారంభించినవి. కుట్టకములనుగూర్చిన యనేక ప్రశ్నలిందున్నను వృత్తీయవిధినిమాత్రము పురస్కరించుకొననేలేదు. దీనియందు సిద్ధ్యుక్తిని పెంపొందినబీజ గణితమే లేదు. దీర్ఘవృత్తములనుగూర్చి వ్యవహరించిన (కొంతదోషభూయిష్ఠమేయనుడు) ప్రథమగ్రంథమిదియే.

48. **శ్రీధరాచార్యుడు:** శ్రీధరాచార్యుని గ్రంథముకూడ మహావీరాచార్యుని గ్రంథమట్లే యుండి, దానికంటె చిన్నదిగనే యున్నది. ఈతడు వ్యక్తవర్గ సమీకరణములనుగూర్చివ్రాసినట్లు వేరొకగ్రంథకర్త పేర్కొనియుండుటచేత నీతడీ సమీకరణములను గూర్చికొంతపరిశ్రమ చేసినట్లే తోచుచున్నది.

48. **భాస్కరాచార్యుడు:** భాస్కరాచార్యుడు క్రీ. శ. 1114 వ సంవత్సరమున జన్మించెను. బ్రహ్మగుప్తునితరువాత నుజ్జయినీసిద్ధాంతకళాగారాధ్యక్షుడై వన్నెకెక్కెను. ఈతడొక సిద్ధాంతగ్రంథమును వ్రాసెను. దీనిలో మొదటి యధ్యాయము లీలావతియను పేరబరగుచున్నది ఇదియంకగణితమునుగూర్చి వివరించుచున్నది. రెండవయధ్యాయము బీజగణితమునుగూర్చియు మఱియొకటి ఖగోళశాస్త్రమును గూర్చియు వేరొకటి గోళమునుగూర్చియు, క్రమముగా వివరించుచున్నవి. భాస్కరాచార్యుని లీలావతి శ్రీధరాచార్యుని గ్రంథము నాధారముగఁ జేసికొని వ్రాసినట్లగపడుచున్నది. వీరి బీజగణితము బ్రహ్మగుప్తుడు వ్రాసినవిషయములనే ప్రకటించుచున్నను శాస్త్రసాంప్రదాయానుసారముగ విషయనిరూపణముఁ జేసిన ప్రథమగ్రంథమిదియే. మిగిలిన యధ్యాయములలో కొన్నిట గణితశాస్త్ర భాగములుకూడ గోచరించుచున్నవి.

50. ఈ గ్రంథమంతయు శ్లోకములరూపముననేయున్నను, సూత్రముల వ్యాఖ్యానములు గద్యాత్మకములుగనే యున్నవి. ఈతని బీజగణితము బ్రహ్మగుప్తుని బీజగణితముకంటె మిన్నయనుట కెంతమాత్రము సందేహము లేదు. ఈతడు తనబీజగణితమునందు సంకేత

ములనే వాడుచు కేవలబీజవ్యవహారములకు మార్గదర్శకుడై వర్తిల్లుచున్నాడు. వీరి రేఖాగణిత భాగములుగూడ బ్రహ్మగుప్తుని రేఖాగణిత భాగములకంటె చాల శ్రేష్ఠములుగానే యున్నవి.

51. ఈతని గ్రంథముయొక్క మొదటి యధ్యాయమునకు లీలావతియని పేరుపెట్టి నట్లు పైన చెప్పియున్నాను. పూర్వాచారము చొప్పున నీతడు దీనిని సరస్వతీ స్తవముతో ప్రారంభించి యున్నాడు. విషయసూచికను చూచి లీలావతి యొక్క సాధారణ క్రమమును తెలిసికొనవచ్చును. తూనికలు కొలతలు, సంఖ్యానీకము; సంకలనము, వ్యవకలనము, గుణకారము, భాగహారము, వర్గములు, వర్గమూలములు, ఘనములు, ఘనమూలములు నను నీయెనిమిది గణిత క్రియలు; భిన్నములను సామాన్యహారస్థితికి మార్చుట; భిన్నరాసుల భిన్నములను కనుగొనుట, మిశ్రాంకములు, భిన్నములకు సంబంధించిన యెనిమిది గణిత క్రియలు; శూన్యవ్యవహార క్రియలు (క౦=క, $0 = 0$, $\sqrt{0}=0$. $\frac{క}{0} = 00$); అంకగణిత ప్రశ్నలకువలె నుండి యంకగణితములందు వ్యవహరింపబడు నేకవర్ణ సమీకరణములు; అన్యజూహాలు (false assumption); ప్రథమఘాతీయనిశ్చిత సమీకరణములు, వీనితోడి వ్యవహారముచేయు నభ్యాసములు; అవ్యక్తవర్గ సమీకరణముల వివరణము; త్రైరాశికము; కూటత్రైరాశికము (Compound rule of three); వడ్డీ; వియోగీకారము (Discount); సమిష్టివ్యాపారము (Partnership); గొట్టములతో తొట్లను నింపుటకు పట్టుకాలము నిర్ణయించుట; పరివర్తము (Barter); అంకశ్రేఢి, సరళాంకముల వర్గములయొక్కయు, ఘనముల యొక్కయు మొత్తములను కనుగొనుట; గుణోత్తర శ్రేఢి; త్రిభుజములతోడను, చతుర్భుజములతోడను వ్యవహరించు ప్రశ్నలు; $\pi$ యొక్క స్థూలఫలము; త్రికోణమితిక సంకేతలు; మూర్తముల ఘనపరిమితులు; ప్రథమఘాతీయ కుట్టకములు; అంకపాశమునకు సంబంధించిన కొన్ని ప్రశ్నలతోనీ గ్రంథముముగియుచున్నది.

52. దశాంశ సంఖ్యానీకమును గూర్చి శాస్త్రీయాచారవిధిపురస్సరముగ జెప్పు గ్రంథములలో నిదియే మొదటిది. ఆర్యభటుడు దీని నెరిగియేయుండును. బ్రహ్మగుప్తునితో వీనికి పరిచయమున్నది. కాని యీ గ్రంథమునందున్నతోగూడ మన యంకెలన్నిటిని సునిశ్చితముగ భాస్కరాచార్యుడు వ్యవహరించియున్నాడు.

53. భాస్కరాచార్యుడు గణితశాస్త్రమునం దెంత ప్రవీణుడో జ్యోతిషమునందు గూడ నంతసామర్థ్యముగలవాడు. తాను జోస్యుఁడగుడు, తనకూతురగు లీలావతి పెండ్లివలన తనకు జేటుకలుగునని తెలిసికొని, యామెను తనకడనే యుండుటకుగాను, ఆమెకు వివాహము జేయలేదు. ఆమెకు చిత్తశాంతి కల్పించుటకోయన్నట్లాతడు తన గ్రంథ ప్రథమ భాగమునకు లీలావతియనునామకరణ మొనర్చి, దానియందలి పెక్కు ప్రశ్నల నామెను సంబోధించి యడిగినట్లే వ్రాసి యున్నాడు. హైందవ గణితములలోని లెక్కలా గ్రంథములు వ్రాసినవారి దేశకాలపాత్రాదు

లవైన సాంఘికార్థిక పరిస్థితులకు సంబంధించిన చక్కని విషయములను వెల్లడించుచున్నవి. భాస్కరాచార్యుడు బానిసల వెలలనుగూర్చి చర్చించియున్నాఁడు. మనవాండ్రు నెలకు నూటికి రు 3½ మొదలు రు 5 వఱకు వడ్డీ పుచ్చుకొను నాచార మున్నట్లు తెలియవచ్చుచున్నది. కొన్ని ప్రశ్నలవలన వారెంతంతకూలి నిచ్చెడివారో యనుసంగతి మొదలగునవికూడ తెలియుచున్నవి.

55. బీజగణితము: మత తత్త్వ, వేదాంత తత్త్వ, గణితతత్త్వాంశముల మూండిటిని ప్రకటించు నర్థగర్భితమగు త్ర్యర్థిశ్లోక మొకటి యీభాగమునకు మొట్టమొదట నున్నది. ఈభాగమున సామాన్యక్రియల వ్యవచ్ఛేదమునుగూర్చి ముచ్చటింతునని ప్రకటించి యున్నాఁడు. దానియం దుపయోగించిన సంకేతములవివరము నీదిగువరీతిని ప్రకటించి యున్నాఁడు. సంక్షేపపదములను, పేరుల మొదటి యక్షరములను, సంకేతములుగ వాడెను. తీసివేయవలసిన పరిమాణముయొక్క గుణక (Coefficient) మీఁద నొకచుక్క పెట్టి దానిచే వ్యవకలనమును ప్రకటించిరి. ఒక పరిమాణము ప్రక్క మరియొక పరిమాణమును నిలుపుటచేతనే సంకలనము సూచింపబడెడిది. గుణాకారమునకును ; తుల్యత, విషమతలకును; ప్రత్యేకముగా సంకేతములు లేవు. వీనిని సంపూర్ణముగ వ్రాసియే ప్రకటించెడివారు. గుణజమును ప్రకటించునపుడు వివిధగుణావయవములకు (factors) (ఘ) యనుసజ్ఞను [ఘాతమను పదముయొక్క తొలి యక్షరమును] లేక కొన్నియెడల గుణావలయములకుమధ్య నొకచుక్కనో చేర్చెడివారు. మధ్యగీత లేకనే విభాజకమును విభాజ్యముక్రింద వ్రాసి భజనఫలములను (quotient) లేక భిన్నములను (fractions) కూడ ప్రకటించెడివారు. సమీకరణముల యిరుపార్శ్వముల నొకదాని క్రింద నొకటి వ్రాసి దానివలన నెట్టి క్రమభంగమును కలుగకుండున ట్లగణిత క్రియాత్మకమగు నన్నిపాదములను సంపూర్ణముగ వ్రాసి ప్రకటించెడివారు. అవ్యక్త పరిమాణమును ప్రకటించుట కనేకసంకేతములు నుపయోగించి యున్నారు. ఇవి చాలమట్టుకు రంగులపేర్ల మొదటియక్షరములే. సాధారణముగా 'వర్ణ' మనుపదము నవ్యక్తపరిమాణమునకు పర్యాయపదముగ నుపయోగించు చున్నారు వర్ణమను పదమున 'కకుప'మను నర్థముగూడ గలదు. కావున నైదుబరులలోని యక్షరములనో లేక లెక్కలలోని విషయ నామముల తొలియక్షరములనో యవ్యక్త పరిమాణమునకు(Variable quantity)సంకేతముగ నుపయోగించుచున్నారు. వర్గ, ఘనముల ప్రథమాక్షరములు ద్వితీయ తృతీయ ఘాతములను ప్రకటించును. వర్గమూలమును పదముయొక్క తొలియక్షరములు (వ. మూ) కరణాంకములను (Surds) ప్రకటించును. బహుపదములు (Polynomials) ఘాతానుక్రమముననే ప్రకటించు నాచారము కలదు. వ్యక్తపరిమాణముల నెల్లయెడల నవ్యక్తపదముగనే ప్రకటించి "రు" యనుసంకేతముతో గలిపి వ్రాసెడివారు. "రు" యన్నది రూప

ములను (Units) పదములయొక్క ప్రథమాక్షరము. "స్వా, ఋ, ణ" పదము లెట్టినిబంధనలేక యథేచ్ఛగ నాదిమధ్యాంతములలో నెచ్చోటనేని ప్రయోగించుచుండెడి వారు. సమీకరణముయొక్క యుభయపార్శ్వములందునుకూడ ప్రతిఘాతమును ప్రకటించుచు నారూఘాత మాయాపార్శ్వముల లేనపుడు శూన్యము నాపదముయొక్క గుణకగా నుపయోగించి ప్రయోగించు నాచార మున్నది.

56. హిందువులు బీజగణితీయ ప్రశ్నలను వేయువిధము చాల నాహ్లాదజనకముగ నుండును. ప్రాచీన గ్రంథములు సాంకేతిక యుతములు గావు. వారు ప్రయోగించిన సంకేతములు పేరులసంక్షేపణములే. ఋణపరిమాణములతోడి వ్యాపారమునందు ఋణభావనగల యామాపరిమాణములమీద నొక చుక్కను నిలుపు నాచారము గలదు. తక్షశిల ప్రాచ్యలిఖిత పుస్తకమునందు ఋణభావము నొక హంసపాదును (× cross) పరిమాణములపైన నిలిపి ప్రకటించిరి. కొంత కాలమైనతరువాత శారద వ్రాతప్రతులలో చుక్కను శూన్యమునకు బదులుగా వ్రాసియున్నారు.

57. భాస్కరుడు తా నుపయోగింపబూనిన సంకేతములనెల్ల విశదపఱచిన తరువాత బీజగణితమాలల (algebraic expressions) సంకలన, వ్యవకలన, గుణకార, భాగహారములకును; వర్గమూలమును కనుగొనుటకును, సూత్రముల నిచ్చియున్నాడు. లీలావతియందువలెనే, కొన్ని శూన్యవ్యవహారములను, కొన్ని సమీకరణముల వివరణలను, కరణాంకములతోడి ప్రక్రియలను, ప్రకటించియున్నాడు. రూపవతులగు దేవకన్యలను గూర్చియు, మహావీరులగు యోధాగ్రేసరులను గూర్చియు చెప్పబడ్డ ద్వ్యాత్మకములగు ప్రశ్నలీ గ్రంథమునందు చాలకాన్పించుచున్నవి.

58. పంచదశవ శతాబ్దమున భాస్కరుడు వ్రాసిన గ్రంథమునం దవ్యక్త పరిమాణములను ప్రదర్శించు ప్రత్యేకపదములను ప్రకటించియున్నాడు. ఏదేని యభీష్టసంఖ్యను యావత్తావ త్తనియు, దీనికి పర్యాయపదములుగ-నలుపు (కాలక), మబ్బురంగు (నీలక), పసుపు (పీతక), ఎరుపు (లోహిత), మున్నగు-రంగులపేళ్ళను పూర్వు లుపయోగించియున్నారు. హిందువు లోకట్లను రూపము (Units) లని యుపయోగించియున్నారు.

| సంకేతము. | పదము. | ప్రయోగము. |
|---|---|---|
| యా = | యావత్తావత్ | - మొదటి యవ్యక్తపరిమాణము. |
| కా = | కాలక | - రెండవయవ్యక్తపరిమాణము |
| రూ = | రూపము | - వ్యక్తపరిమాణము |
| వ = | వర్గము | - ద్వితీయ ఘాతము |
| ఘ = | ఘనము | - తృతీయఘాతము |
| క = | కరణము | - $\sqrt{\text{ఘనాంకము}}$ |

చతుర్థఘాతమును, వర్గ వర్గ ఘాతమనియు; పంచమ ఘాతమును, వర్గఘన ఘాతమనియు; షష్ఠ ఘాతమును, ఘనవర్గమనియు; నిట్లే తక్కిన ఘాతములను నేర్పరచుకొనుచు బోయిరి. వారు సమీకరణములను వ్రాసిన విధమును తెలుపుట కీదిగువ రెండుదాహరణములను చూడుడు:

i యా 6 రూ 800 / యా 10 రూ 100 } 6 య × 300 = 10 య — 100 [అని మనమిప్పుడు వ్రాయు సమీకరణ మగుచున్నది.]

ii యా 197 కా 1644 / నీ i రూం / యాంకాంనీంరూ 6302 } 197య — 1644కా. నీ=6302 [అని మన మిప్పుడు వ్రాయు సమీకరణమగుచున్నది.]

59. తక్కిన ప్రకరణములందు కూడ నచ్చటచ్చట బీజగణిత, త్రికోణమితిక, రేఖాగణిత ప్రయోగాశ్రిత భాగములును గలవు. త్రికోణమితిక సంకేతలలో నాధునికులచే వ్యవహరింపబడు * చ (జ్యశ)=కోజ్యచశ. యను సమీకరణమునకు తుల్యమగు నొకసంకేత యున్నది.

60. ఆర్యభట్ట బ్రహ్మగుప్తులయు; వారి తరువాతివారగు శ్రీధరపద్మనాభాదులయు, గ్రంథములలో ప్రథమమున నరబ్బులకు పరిచయ మున్నట్లే యగపడుచున్నది. భాస్కరుని గ్రంథము నరబ్బు లంతగా నుపయోగించిన ట్లగపడదు.

61. మనవారుపయోగించిన గ్రీకు పదములను కొన్నిటి నిచ్చట కుదురుపఱచెదను.

| | సంస్కృతము. | | గ్రీకు. |
|---|---|---|---|
| 1. | జామిత్ర | = | డయామిట్ర |
| 2. | కేంద్ర | = | కెంట్రన్ |
| 3. | త్రికోణ | = | ట్రిగాన్ |
| 4. | లిప్త | = | లెప్టా |
| 5. | హారిజ | = | ఆరిజన్ |
| 6. | పార్శ్వ | = | ప్లీయూర |
| 7. | జాత్య | = | ఆర్థోగ్నియ |
| 8. | కౌలికమ్ | = | కథెటాస్ |

* d (Sin శ.) — cos d శ.



# సందర్శనము

సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి గారు

అలరు శంపాలతా ప్రగ్రహములు గలుగు
వారివాహాశ్వములఁ గట్టఁబడిన పుష్ప
రథముపై నెక్కి యూరేగు రమ్యమూర్తి
దివ్యతేజస్విఁ గనుఁగొంటిఁ దృప్తిఁగంటి

అనదిపై శతములకు నరిగి యచటఁ
దనకటాక్ష వివర్త శీతల తరంగ
ములను బ్రసరించు నాక్షపాపూర్ణహృదయుఁ
గనులపండువుగా నేను గాంచినాఁడ.

కోకిలధ్వని శ్రుతి సేసికొని వసంత
రూపగీతంబుఁ బాడి భూరుహములెల్లఁ
జిగురు వెట్టంగఁ జేయుచుఁ జిత్తములను
బరవశము సేయు గాయకవరునిఁ గంటి.




చింతా దీక్షితులు బి. ఏ. ఎల్. టి, సాహితీసమితి సభ్యుడు

౧

ఒకనాటి ప్రాతఃకాలమున కవిరాయడు స్వప్నావస్థనుండి మేల్కొన్నాడు. బాహ్యప్రపంచమెల్ల అతనికి గోచరమైనది. నిజస్థితి యతని మనస్సునకు తట్టినది. ఖిన్నుడై పోయినాడు!

మహారాజునకు తనపై దయతప్పినదని యాతడు గ్రహించినాడు!

౨

కవిరాయడు కవి కుటుంబమున బుట్టినాడు. కవి గర్భమున జన్మించినాడు. అతడు పుట్టినప్పుడు కోకిలలు కూసినవి, చిలుకలు పలికినవి, మోడు చెట్లు చిగిరించినవి!

లోకమంతయుకవిరాయనికిస్వాగతముచెప్పినది.

కవిరాయని జనకుడు తన హృదయమును ఆ సమయమున పరిశీలించి చూచికొన్నాడు. కవితారసమునకు బదులు ఆనందరసము హృదయమున నిండియుండుట గమనించినాడు. ఆనంద బాష్పములతో తనకు బుట్టిన కవిరాయని నొక్కమారు తలచుకొని "మహారాజునకు కృతిగా నొసగగల నాకడసారి ప్రబంధ మీతడే గదా!" అనుకొన్నాడు. తన చిన్న ప్రబంధమును, ఈ కవిరాయని మహారాజు చేతిలో బెట్టి జనకుడు నిద్రావస్థను జెందినాడు.

౩

మహారాజు రాజ్యభారమున మునిగి తేలుచున్నాడు. ఎయ్యది మంచి, ఎయ్యది చెడ్డ-అను విషయమును నిర్ణయించుకొనుటలో కాలము జరిగిపోవుచున్నది. ప్రజలను శాసించుచున్నాడు, పన్నులు గొనుచున్నాడు. ఉపదేశవాక్యములను మహర్షుల వదనముల నుండి వినుచున్నాడు. రాజ్యపరిపాలనము కష్ట సాధ్యమైన పని అనుకొనుచున్నాడు. అప్పుడప్పుడు మహారాజు చెవులలో కవులగీతములు పడుచుండుటకూడకలదు. అవి ఈర్ష్యాగీతములో, ప్రణయగీతములో ఆమహారాజు ఎట్లు నిర్ణయించుకొనగలడు ? కవిజనకుడర్పించిన కుమారప్రబంధమును మహారాజు ఎక్కడనోపెట్టి మరచిపోయినాడు ?

౪

కవిరాయడు చిన్ననాటి చెలిమికాండ్రతో దృఢమైత్రి చేసికొని ప్రపంచమును మరచిపోయినాడు.

చిలుకలతో జట్టుకట్టి తీయని పలుకులను నేర్చుకొన్నాడు.

కోయిలలతో సంచారముచేసి పలుకులకు మంజులత్వ మలవడజేసి కొన్నాడు.

గోదావరి నాశ్రయించి స్వేచ్ఛాగాన మభ్యసించినాడు.

ఆతని నివాసము ఎల్లప్పుడు కొండలమీదను చెట్లమీదను.

ఆతని దృష్టులెల్లప్పుడు ఆకాశవీథమున నక్షత్రమండలములవైపే.

ఈసహవాస బలముచేత కొంతకాలము పాట పాడుటే మరచిపోయినాడు కవిరాయడు.

సహవాసులప్రోద్బలముచేత కొంతకాలమునకు గీతములను పాడుట మొదలుపెట్టినాడాతడు.

ప్రకృతి గీతములు, ప్రణయగీతములు! చిలుకలు,కోకిలలు ఆతని గీతములు మెచ్చుకొన్నవి.

ఇంతవరకును ప్రజలు రంగు బొమ్మలను మెచ్చుకొనువారు. సజీవగీతములను చూచి వారు మూకీభావము వహించినారు.

కవిరాయని వంశము వారందరు మహారాజునకు కృతులిచ్చినవారే.

కవిరాయడు చిలుకలకును, కోయిలలకును తనతొలిచూలి బిడ్డ నర్పించినాడు!

మంచి సావాసము చేయుచుండలేదని మహారాజు కవిరాయని మరచినాడన్నారు కొందరు! చిలుకలకును కోయిలలకును కృతియిచ్చుట తగని పనిగా గణించి కోపమందియుండవచ్చునని మరి కొందరన్నారు!

నిజస్థితి మాత్ర మెవ్వరికిని తెలియలేదు.

✗

మహారాజునకు తనపై దయతప్పినదని తెలిసికొని కవిరాయడుఖిన్నుడై దుఃఖగీతములుపాడ మొదలుపెట్టినాడు. లోకమునావరించియున్న దుఃఖసముద్రములో నవి లీనమై పోయినవి.

కొంత కాలమునకు తెలివితెచ్చుకొని మహారాజుపై గీతములల్లినాడు కవిరాయడు. మహారాజున కందచేయుదునని చెప్పి వాయువా గీతములను తనగర్భములో దాచుకొన్నది.

మరల క్రొత్తగీతముల నాతడు పాడినాడు. మహారాజున కందచేతుమని చెప్పి చిలుకలా గీతములను దాచివేసినవి.

క్రొత్తకృతుల మరల నాతడు కల్పించినాడు. ఈమారు కోయిల లాకృతులను మహారాజునకందజేతుమని చెప్పి పుచ్చుకొని ఎక్కడకో లేచిపోయినవి.

తన చిన్ననాటి సహవాసులు తనపై కినుక వహించిన సంగతిని గ్రహించినాడు. చిన్ననాటి సావాసగాండ్రను పూర్తిగా మరచినాడు. లోకమునంతను పూర్తిగా మరచినాడు. తన దృష్టి మహారాజుపై నిల్పి ఎంతో విశ్వాసముతో నాతని దన హృదయపీఠమున నిల్పుకొన్నాడు.

"ధనదేవత నుపాసించుచున్నావా" యని చిలుకలు గేలిచేసినవి.

"మేము లేని గీతములు గీతములా"యని కోయిలలు పరిహాసించినవి.

"వంశగౌరవమును కాపాడుకొనవలెను సుమా" యని స్వప్నములో కవిజనకు డాదేశించినాడు.

కవిరాయని దృష్టిమాత్రము చెదర లేదు. ఒకటే లక్ష్యము—అది మహారాజే.

కవిరాయునికి యౌవనమువచ్చినది.

మహారాజునకు దయకలుగలేదు.

౬

ధ్యానముద్రలో కొంతకాలముండి తరువాత మహారాజుపై మరలగీతములువ్రాయ మొదలు పెట్టినాడు కవిరాయుడు.

సొంతముగా వీనిని తాను కృతియీయదలుచుకొన్నాడు మహారాజునకు.

మహారాజుదర్శనము కవిరాయునికి కలుగలేదు.

తన వంశీయుల పూర్వకృతులలో గలిపి తన కృతులను గూడ గొంగతెత్తిపాడ మొదలు పెట్టినాడు కవిరాయుడు.

మహారాజు కార్యభారమున నుండుటచేతని చెవుల బడలేదివి.

గీతముల సంఖ్య నానాటికి హెచ్చిపోవు చున్నది. పాటలు నిరతము పాడుటచే కవిరాయుని గొంతు బొంగురుపోవుచున్నది.

మహారాజు కార్యనిమగ్నుడై యున్నాడు. కవిరాయునికి నిరాశ ఎక్కువగుచున్నకొలది మహారాజుపై విశ్వాసము అధికము కాజొచ్చినది. తాను రచియించిన గీతముల నన్నింటిని లోకములో ప్రచారార్థమై వదలిపెట్టినాడు కవిరాయుడు.

లోకములోనివారు గీతములను పఠించినారు. "మహారాజు హృదయము వజ్రశకల" మన్నారు కొందరు.

"కవిరాయుడు ప్రకృతిని వదలిపెట్టిన తరువాత స్తోత్రపాఠములను వ్రాయుచున్నాడుగాని గీతములను వ్రాయుటలేద" న్నారు కొందరు. "సత్కార్యమునకు కవిరాయుడు ఫలము నాశించుటతప్పన్నారు కొందరు.

"వంశాచారమును వదలించుకొనుట ఎవ్వరితర"మని కొందరన్నారు.

కవిరాయనికి లోకముపై కోపము పుట్టినది. మనస్సున కొకవిగ్రహము కల్పించుకొని తాను రచించిన కృతుల నన్నింటిని దానికి కృతి యీయ మొదలుపెట్టినాడు.

ఆవిగ్రహమే మహారాజన్నాడు కవిరాయడు. ఎంతో కాలము గడిచినది.

మహారాజు తల నరసినది, ఒడలు ముడుతలు పడినవి. రాజ్యభారము నానాటికి అతిశయించుచున్నది.

కవిరాయనికి దృష్టి మందగించినది. చేతులు వణకుచున్నవి. కంఠము రుద్ధమైనది. గీతములను పాడుచునేయున్నాడు.

మహారాజునకు కవిరాయనిపై అనుగ్రహము కలుగలేదు.

కవిరాయనికిమహారాజుపైవిశ్వాసముతగ్గలేదు!





భమిడిపాటి రామ సోమయాజులు గారు బి. ఏ.

౬

## వస్తులక్షణపరిశోధనము

## (Model Study.)

జ్ఞానాభివృద్ధికి ప్రపంచ పరిశోధనము జ్ఞానమార్గము. ఏసంగతిగూర్చియైన సంపూర్ణముగా నెరుంగుట కాసంగతిని సవిస్తరముగా పరీక్షించుట ముఖ్యము. రాత్రి కొన్ని జంతువులకు కన్నులగపడునని చెప్పుటకు నాజంతువులుచేయుపనులబరీక్షించి పరీక్షించి, రాత్రివేళ కన్నులు కానరానిజంతువుల చర్యలకును, వానికిని గల భేదముం దెలిసికొనవలెను. జ్ఞానసౌధమునకు పరిశోధనాసోపానము లమరియుండును. ఆసౌధముం బ్రవేశింప గోరువాడు శ్రమనెంచక నీ సోపానముల నన్నిటి నెక్కవలెను. అట్లుకానిచో నాతడజ్ఞానభూమిపై నిలచిపోవలయును. సవిస్తరమైన పరిశోధన మున్నపైనగాని జ్ఞానము సంపూర్ణము కానేరదు. చిత్రలేఖనమున నిట్టి పరిశోధన ముండకతీరదు. చిత్రకారుడు కంటికి గానవచ్చు రూపముల దనభావానుసరణముగ జిత్రించుచున్నాడు చిత్రము ప్రకృతి విపరీతము కాగూడదు. దాని ననుసరించి యుండవలెను. అందువలన చిత్రలేఖకుడు తాను లిఖింపవలసినవస్తులయొక్క లక్షణమును బాగుగా పరిశీలింపవలసియున్నది. పరిశీలన మెంతజాగరూకతో చిత్రకారుడు చేయగలడో, చిత్ర మంత ప్రకృతిస్వభావానుసరణమై యొప్పుచుండును. వస్తులక్షణముం బరిశోధింపకయే, జ్ఞాపకశక్తిపై నాధారపడి, చిత్రకారుడు వస్తువుల జిత్రించినను అయ్యవి భావానుసరణములైనను ప్రకృతిస్వభావాను

సరణములు గాకుండును. గొప్పబుద్ధిమంతు డైనవాడు వస్తువుల నెదుట నుంచుకొనకుండ గనే తనచిత్రములను జాలవరకు ప్రకృతి ననుసరించియుండునట్టుల జేయ సమర్థుడై యుండవచ్చును. కాని యాతడే వస్తువుల నెదుటనుంచుకొని వానిని బరీక్షించుచుపైననే చిత్రలేఖన మొనర్చినచో నాతనిచిత్రము లందు లక్షణలోప మెన్నటికిని గానరాదు. అదియట్లుండగా, ప్రపంచమునగల ప్రతివస్తువును గమనించినకొలది వానిలక్షణమునందు రహస్యములు బయలువెడలుచునేయుండును. చిత్రకారు డాజన్మాంతము బరిశోధన మొనర్చినను, కడసారినిగూడ నాత డదివర కెరుంగనిరహస్యములను వస్తువులయందు గ్రహింపగలుగుచుండును. పాశ్చాత్యచిత్రకారులలో నగ్రగణ్యులగు వారెల్లరు, తమజీవితాంతములవరకు వస్తులక్షణపరిశోధన మొనర్చుచునే యుండిరి. వారిజీవితకాలములో నెన్నడును వస్తువుల బరిశోధింపకుండ వారొక్క బొమ్మనుగూడ లిఖించియుండలేదు. అట్టి నియమము చిత్రకారుల కందఱకు నుండవలసినదే. వస్తులక్షణపరిశోధన మొనర్పకుండుటచేతనే బంగాళాచిత్రకారుల చిత్రములన్నియును భావయుతములయ్యును, లక్షణహీనములును లక్షణవిరుద్ధములు నైయున్నవి.

ప్రపంచమునందుగల యచేతనపదార్థములను లిఖించుటకే చిత్రకారుడు వానిలక్షణముల నెంతయో పరిశీలింపవలసియున్నప్పుడు జీవప్రపంచమును లిఖించుట కాతడెంతతీక్ష్ణముగా బరిశీలింపవలయునో చెప్పబనియేమున్నది? ఒకపాత్ర నెన్నిరీతులుగా నుంచియైన లిఖింపవచ్చునుకదా! ఒకసారి వ్రాసినరీతి నొకసారి వ్రాయకుండ లెక్కలేనన్ని వివిధరూపములం జూపి వ్రాయుట కవకాశమున్న నిర్జీవవస్తువులను, చిత్రకారు డాయాసందర్భముల కుచితమగురీతినుంచి దాని లక్షణముం గ్రహింపవలసినదేకదా! పరీక్షలేనిదే యాలక్షణములందు గూఢమై చూచినగాని యెరుంగరాని రహస్యముల నాత డెరుంగజాలడుకదా! ఘనుడగు చిత్రకారుడు, తానుబోయినను తనచిత్రము లంతరింపరాదను నాలోచనగలట్టివాడు, నిర్దుష్టములగు చిత్రముల లిఖింపవలెను. లేనిచో నవి శీఘ్రకాలములోనే, తనకళ్ల యెదుటనే, పండితదూషణాగ్ని కాహుతియై నశించును. అట్లు నిర్దుష్టములై యుండునట్లు లిఖింపవలెనన్న నేచిత్రకారుడైనను తనచిత్రమందు జూపదలంచుకొనిన వస్తువంగాని, వస్తువునం దొక భాగముంగాని, యనేకవస్తువుల సముదాయముంగాని, చూచి, పరిశోధనానంతరమున లిఖింపవలయును. భావమున కుచితమగురీతిని వస్తువులంగూర్చి వానిలో దనభావమునకు దోడ్పడు గుణములనే గ్రహించి, దోషముల విడచి వ్రాయుటే చిత్రకారునినేర్పు.

అది యట్లుండగా నిక జీవప్రపంచమునందలి వస్తులక్షణపరీక్ష కంతమనునదే లేదు. జంతువులనుగాని, యంతకు నెక్కుడుగా, మానవునిగాని పరిశోధింప చిత్రకారుడు గడంగినచో నాతనిపరీక్ష కంతముండదు. మానవునియొక్క నేత్రము నొక్కదానిని చిత్ర

కారుడు పరిశీలింప మొదలుపెట్టి ప్రతిదినము నందుననే కాలముపుచ్చుచుండినను, దానిని బూర్ణముగా, దనజీవితమంతయు ధారవోసియైన గ్రహింపలేడు. భగవంతుని సృష్టిలో గల చిత్రమంతయు నిట్టిదియే. ఏశాస్త్రజ్ఞుడైన దనశాస్త్రమును సంపూర్ణముగా నెరుంగుదునని చెప్పజాలడు. జ్ఞాన మెక్కుడైన కొలది, బుద్ధిమంతున కెరుగని సంగతులే యెక్కుడనియు, దనకు దెలిసిన దేదియు లేదనియు బోధయగును. చిత్రకారుడు ప్రకృతిని ప్రకృతివలెనే చూపించుచున్నాడనగా, ప్రకృతిస్వభావమును జాలవరకు దనచిత్రములందు జూపింపజేయుచున్నాడని భావము. లక్షణము మూలము ననుసరించినకొలదిని, చిత్రము ఘనత నొందియుండును. అందునకే లక్షణపరిశీలనము చిత్రకారున కత్యవసరమై యున్నది. ఒకఘనుడగు చిత్రకారుడు నాతో నొకసారి యిట్లు చెప్పెను. "లక్షణపరిశీలనము లేనివానిని చిత్రములుగా నెమర్శకు లెంచరాదు. మన హిందూదేశమున మానవశరీరలేఖనమందు, ఉండవలసిన తావులందు, కన్నులు, ముక్కు, చెవులు, నోరు, నుంచగలిగిన చిత్రకారులు చాలతక్కువగా గలరు." ఆమాటలయందలి యర్థమును బుద్ధిమంతులైన పాఠకులకు నేచెప్ప బనియేమున్నది? ఆతడు హిందూదేశమునందలి పెదపెద్దవారల మనుకొను చిత్రకారుల చిత్రములనెల్ల బరిశీలించి చెప్పినమాట లట్లున్నవి. గానమునకు సాధక మెట్టిదో, చిత్రలేఖనమునకు వస్తుపరిశీలనముతో గూడిన సాధక మట్టిది. అది లేకుండుట చిత్రకారుల కులసంప్రదాయమునకుం గేవలము వ్యతిరిక్తము. పెద్దతప్పు.

ఇదివరలోని వ్యాసములందు, భావము లేని చిత్రములు నిర్జీవములనియును, ప్రకృతి నున్నదాని నున్నట్టులనే ఫొటోగ్రాఫులనియు క్యామెరాయంత్రమువలె బొమ్మలోని కెక్కించుట యుత్తమమగు చిత్రకారుడు చేయదగదనియును చెప్పితిమి. అట్టియెడల, నేదివ్రాసినను ముందు నావస్తువు నుంచుకొని వ్రాయుట యనునది, ఇలుత చెప్పబడినదానికి వ్యతిరేకస్వభావముగల సూత్రము కాదాయని ప్రశ్న. కొందరు చిత్రకారులు మానవుని వ్రాయుటకు గడంగినప్పుడు తా మెంచుకొనిన యందముగలవాని నొకని దమయిచ్చవచ్చిన రీతిని గూర్చుండబెట్టియో, నిలుచుండబెట్టియో; చూచి, యున్నదున్నట్టులనే లిఖింతురు. అట్టి చిత్రలేఖనము శ్లాఘ్యముకాదు (Direct model). వస్తులక్షణమును చిత్రకారు డెప్పుడు పరిశీలింపవలయును? చిత్రకారు డెంతవరకు వస్తువులయొక్క యాకారవిశేషములకు లొంగియుండవలెను? చిత్రకారుని భావము ప్రాముఖ్యముగలదా యనగా నర్థమేమి?

ప్రస్తుతమున, మన హిందూదేశమునందు, అందునను ముఖ్యముగా మనయాంధ్రదేశమందు, చిత్రలేఖనమునం దభిరుచిగల బాలురందరును, చిత్రప్రదర్శనశాలలు మొదలగు స్థలములందు వన్నెకెక్కియున్న గొప్పగొప్ప చిత్రకారులచే లిఖింపబడిన చిత్రములం జూచి యొకవిధమగు నాశాప్రవాహము మన

స్సులం దుబ్బుకొనిరాగా, నిండ్లకుబోయి, యొక గంటకాలములో దామచూచిన చిత్రముల వంటి చిత్రములను వ్రాయ బ్రయత్నించుచున్నారు. అట్టులు ప్రయత్నించువారిలో గొప్ప బుద్ధిమంతులుకూడ నుండవచ్చును. అసమానబుద్ధి కలవాడైనను, ఎన్నటికిని అట్లు తొందరపడి, ఆశాప్రవాహమునకు లొంగిపోయి, చిత్రలేఖనమునకుగాని యే కార్యసిద్ధికిగాని గడంగినచో, విఫలుడేయగును. కాని యిది ప్రపంచమునందలి యువజనులకెల్ల స్వాభావికమైయున్నది. ఒక ఫలితముం జూచి, యువకు డాఫలితముం దానుగూడ గాంచవలెనన్నయాశ మనమునందు నిండుకొనగా, నయ్యది కాంచుటకుగల మార్గమును, అందలి క్లేశమును, దానికి వలయు కాలమును పాటింపక నేవియో వెఱ్ఱిమొఱ్ఱి ప్రయత్నములు గావించి, యాఫలితముం బొందజాలక వ్యర్థప్రయత్నుడగును. గానాభ్యాస మెంత క్లేశముతో గూడియున్నదో తెలియజాలక, నొక గానసభలో నొకమహాగాయకుని మహాగానము నాకర్ణించి, యందు నానందము విపరీతముగా నంది, యంతటి పాటను వెంటనే పాడ బ్రయత్నించి హాస్యాస్పదుడగుచున్నాడు. ఇట్టి వ్యర్థప్రయత్నములు దేశౌన్నత్యమునకు లాభ మొసంగ నేరవు. దేశయువకులయం దిట్టియుద్రేకముండుట చాలగొప్పసంగతియే. కాని, దాని నేరీతి బాడొనరించుచుండు టెంతయు విచారింపవలసిన యంశము.

గానశాస్త్ర మెంతటి విస్తీర్ణమైనదో, చిత్రలేఖనశాస్త్ర మంతవిస్తీర్ణమైనది. అది యభ్యసించుట చాలకష్టము. ఎంతటిబుద్ధిమంతుడైనను, దానిలో చేయవలసినకృషి న్యాయముగా దీక్షతో జేసినగాని, యందు పాండితి లభింపదు. గొప్ప చిత్రకారులని పేరెక్కినవారందరు, నీయవస్థలన్నియు బడినవారు, పడుచున్నవారు నైయున్నారు. మనలో వేదపరముగా నొక సామ్యమున్నది. "వచ్చేవరకు నేర్చుకొని, చచ్చేవరకు వల్లెవేయవలె" నని. అట్టులనే చిత్రకారుడు తన జీవితములో తుదవరకు నభ్యాస మొనర్చుచునే యుండవలెను. ఆత డెల్లప్పుడును ప్రకృతికి శిష్యుడై దానిలోని రహస్యస్వభావములను నేర్చుకొనుచునే యుండవలెను. అట్టి రహస్యములనెన్నిటినో గ్రహించి, తగినంత పాండిత్యముం గ్రహించియున్న చిత్రకారుడు, దేశమునందు బ్రకటింపదగు చిత్రములను లిఖించుటకు మొదలుపెట్టవలెను. అట్టివాడైనను, తాను వ్రాయబూనుకొన్న చిత్రమందలివస్తువ్రల నెదుటనుంచుకొనియే వ్రాయవలయును. కాని యావస్తువులకు నాతడు భృత్యుడైపోక, తనభావమునకు దగినరీతి నావస్తులనే లొంగించుకొని, భగవచ్ఛక్తి జనితములగు స్వభావరహస్యములకు మాత్రము దాస్య మొనరించి, వానిని దనచిత్రమునందు జూపింపవలయును. అట్లు చేసినపట్ల చిత్రమునందు నవరసములేని గుణములుకాని, యుంపకూడని లక్షణములుకాని కానరావు. ఇది బాగుగ తెలిసికొనుటకై యొక యుదాహర

ణముం దీసుకొని దానిమూలమున జర్చింప వలయును.

మనము రామునివిడచి, సర్వసౌఖ్యములకు గడుదూరమై కఠినచిత్తుడగు దశకంఠునిచే హరింపబడి, లంకలోని వనమునందు రాక్షసస్త్రీలు గావలియుండ రామవియోగ దుఃఖానలమున దపించుచున్న హృదయము గల సీతను వ్రాయవలయును. ఏ చిత్రము నందునైన భావమే ప్రధానము. భావము లేనిదే చిత్రమునకు జీవము రాదు. మనము వ్రాయబోవు నీ చిత్రమునందు ముఖ్యముగా జూపింపవలయు భావ మేది? సీతాదేవియొక్క గుణములు ప్రపంచకాదర్శకములగునట్టుల చూపింపవలయును. ఆమహాపాతివ్రత్యము; ఆమహాదుఃఖము; అట్టి దుఃఖసమయమునను గూఢమై రామభక్తిపూరితమైన యామెవిశాలహృదయము, ఇయ్యవియేకదా ముఖ్యముగా జూపింపవలసిన భావములు? తరువాత జూపవలసినది లక్షణము. అందు సీతయున్నచోటు, సీతయున్న స్థితి, ముఖ్యములు.

ఘనులగు చిత్రకారులకు, కవులకు, గాయకులకు, ఈశ్వరప్రసాదితమగు శక్తి యొక్కొక్కసారి వారల ప్రయత్నము లేకుండగనే కలుగుచుండును (Inspiration). కవియొక్కడు, నేదేనొకచోట గూరుచుండి యే తెల్లవారుజామువేళనో యున్నప్పు డాతని మనస్సునందొక యాలోచన మెఱపువలె స్ఫురించుచుండును. అదియే యీశ్వరప్రసాదితశక్తి. ఆశక్తి ననుసరించుకొని యాత డసమానమగు రసపుష్టిగల కవిత్వమును చెప్పును. గాయకు డాశక్తివలననే మఱియొకసారి తానైన బ్రయత్నించి పాడజాలని పాట నొక్కొకసమయమున బాడగలుగుచుండును. చిత్రకారుడు కూడ నాశక్తివలననే, ఘనములగు భావములను పొంది, తద్భావముల కుచితములగు రూపములం గాంచి, యారూపముల లిఖింపగలుగును. ప్రస్తుతమున మనము వ్రాయవలయు చిత్రములో సీత నేస్థితియందుండిన భావము ప్రపంచమునకు బాగుగా తెలియునో యోచించితిమి. దైవప్రసాదితమగు శక్తివలన దెలిసికొంటిమి, [illegible] తొలుత మనము కాగితముపైన, [illegible] శక్తి నాధారముచేసుకొని పూర్తిగా లిఖింపవలయును. పిమ్మట దానిపైన నాలోచనము వృద్ధిగాగా గలుగుమార్పుల ననుసరించి, దానిలో నవసరములైనచో సవరణల జేయవలయును. అదియైన పిమ్మట నందమగు శరీరముగల యొక స్త్రీని, మనయిండ్లలోని విధాన గూరుచుండబెట్టి, తగినంతకాల మోర్చి యోర్చి, చిన్నచిన్న లక్షణము లన్నిటితో గూడ మరల వ్రాయవలయును. ఇచ్చట మనము జేయుచున్నపని కేవల మనుకరణము కాదు. మన భావమునే మనము లిఖించుచుండియు, ప్రకృతిస్వభావరహస్యము లున్నవాని నున్నట్టుల చిత్రమునందు జూపుటకునై, యాస్త్రీ నెదుట గూరుచుండబెట్టుకొని, దాని శరీరముం జాగ్రత్తగా బరిశీలించి, యందలి రహస్యముల నన్నింటిని గ్రహించుచుంటిమి. ఈపరిశీలనముయొక్క ముఖ్యోద్దేశము మానవశరీరలక్షణము సంపూర్ణముగా జిత్రమునందు

జూపింపగల్గుటయే కాని, మరియొకందులకు గాదు. అట్టులు మనుష్యు నెదురుగానుంచుకొని వ్రాయ గడంగునప్పుడు, వ్రాయగూడని సంగతులుకూడ చిత్రమునందు వ్రాయుదుమేమోయను భీతి యుండును. అట్టిది యుండవలసినదే. ఎందుచేతననగా, చిత్రకారునియెదుట గూర్చుచుండికాని, పరుండికాని, నిలుచుండికాని, తన శరీరసౌష్ఠవముం జిత్రకారుడు పరిశీలించి తన చిత్రమునందు వ్రాయుట కిష్టపడి యట్లుండుట కొప్పుకొను స్త్రీ సర్వసాధారణముగా నుత్తమురాలై యుండదు. అట్టిపనికి చిత్రకారుడు భోగము పడతులనో తత్తుల్యులనో ధనాశపెట్టి తమకు దోడ్పడ దెచ్చుకొనవలసినదే. ప్రస్తుతము సీకార్య మిట్టులనే జరుగుచున్నది. అట్టి వారల నెదుటపెట్టుకొని వ్రాయునప్పుడు వారి ముఖలక్షణములు చాలవరకుచిత్రకారునిచిత్రములోనికెక్కును. కాని వారిలక్షణములందు సహజముగా జారస్త్రీలక్షణములైన గర్వాదులు రూపించుచుండుటచే, నట్టివి చిత్రములలోనికి గూడ వచ్చినచో, సీతాదులకు మచ్చ గల్పించునవే యగును. అందువలన నట్టి దుర్లక్షణములను జిత్రములలోనికి రాకుండ గాపాడుకొని, వలసినంతవరకే యెదుటివస్తువు నుపయోగించుకొని, తనభావము నెక్కడనైన జెడనీయక లిఖింపగల్గుట చాలకష్టసాధ్యమైనపని. కాని చిత్రలేఖన మట్టులనే చేయవలయును. కానవచ్చు ప్రకృతిలోని మంచిచెడ్డల వేరుపరచి, మంచిని గ్రహించి, చెడ్డను విడచిపెట్టుటయే బుద్ధిమంతునిలక్షణమైయున్నది. అందునను చిత్రకారున కాశక్తి చాలముఖ్యము. అది లేనివాడు చిత్రలేఖనమునకు బనికిరాడు.

ప్రకృతి పరిశీలనము లేనిదే యెవ్వనికైనను మానసికచిత్రకల్పనాశక్తి యమరి యుండనేరదు. ఒకసారియైనను జూచినవస్తువైనచో మనస్సునందు దాగి, దానిరూప మగత్యమగునప్పుడెల్ల మానసికనేత్రమునకు బొడగట్టుచుండును. అందువలననే కొందరు, ఎదుట వస్తువు నుంచుకొని వ్రాయుటకును, మనస్సులో నావస్తువు పొడకట్టగా, దానినే చూచి వ్రాయుటకును (Taking pitcures from imagination) నిజముగా భేదములేదని యనుచున్నారు. కాని యట్టియూహ చాల పొరబాటు. ఎదుటివస్తువునకును, చిత్రకారుని మనసునందు దానదివరకు బ్రపంచమునందు జూచినవాని ఫలితముగా తనభావమును సూచింపజాలుటకు బొడకట్టిన చిత్రమునకును, చాలభేదమున్నది. ఏయాలోచనమైనను, తానొక్కటి మనస్సునందు కలుగనేరదు. "పుష్పము" అను మాట యాభానముతో గలసియే మనస్సునందు బొడకట్టుచున్నది. ఆక్షణమునందే, యొకపుష్పము కూడ వికసించి యున్నదున్నట్టుగా మానసపత్రమున లిఖింపబడి మనస్సున కెదుట విస్పష్టముగా గానవచ్చుచున్నది. ఈమార్పులన్నియు మనస్సునం దొక్కసారియే కలుగుచున్నవి. కాని పుష్పభావము ప్రత్యేకముగా మనస్సునం దుదయింపజాలదు. అట్టులనే, యేక్షణమునందు రామవియోగ దుఃఖావ్యా

దయయగు సీతయొక్క భావము, మనమనస్సులందు దైవప్రసాదితశక్తివలన గలుగుచున్నదో, ఆక్షణమునందే, మన కాభావము సంపూర్ణశరీరాది సర్వలక్షణయుక్తమైయే ప్రసాదింపబడును. ఆరూపమే మన కాభావముం దెలియజేయును. ఆభావమే మన కారూపముం దెలియజేయును. ఒకటిలేనిదే రెండవది లేదు. అందువలన నారూపము, నిశ్చయముగా నాభావమును విస్పష్టముగా బోధింపగలదు. అదియే యాభావమున కుచితమగు శరీరము. దానినే ముందు మన మొక కాగితముపైన జాగరూకతతో లిఖించుకొని, తదనుకూలముగ నొకస్త్రీని గూరుచుండబెట్టి శరీరలక్షణరహస్యములం గ్రహించుకొని, చిత్రమును వ్రాయవలయును. ఇట్టి మానసికచిత్రము, పై ప్రపంచమున మనము చూచుచున్నవానియొక్క ఫలితమే కాని, యందు దుర్గుణములు కాలముతో నశించి, స్వచ్ఛములగు గుణములే మనస్సునందు నాటికొని యుండుటంబట్టి నిర్దుష్టమైయుండును. ఎదుట బెట్టుకొన్న వస్తువునందు సుగుణదుర్గుణములు మిళితమైయుండును. అందువలన, చిత్రకారుడు దుర్గుణములను విడచి సుగుణములనే గ్రహించుటకు బ్రయత్నింపవలసియుండును. అది యారెంటికిని గలభేదము. అట్లు లెదుటగలవస్తువునందలి దుర్గుణములను విడచిపెట్టి సుగుణములను గ్రహింపగల్గుటయే చిత్రకారునిబుద్ధికి గలనేర్పు.

దీనివలన వస్తులక్షణపరిశీలనము చిత్రకారున కెంతటిముఖ్యమైనపనియో తెలియుచున్నది. అట్లు లెదుటమనిషి నుంచుకొని యారూపమును వ్రాసినపిమ్మట, సీతాదేవి యాసమయమునం దెట్టిస్థలమునం దుండునని ప్రశ్నించుకొని, యందుల కనుకూలమగు తావు నొకదానిని మనము ప్రస్తుతప్రపంచమునం దెంచుకొని, యచ్చటకు బోయి దానినున్నదాని నున్నట్లు చిన్నచిన్న స్వభావరహస్యములతో గూడ గ్రహించి లిఖింపవలయును. (Ground) ఆపిమ్మట నాచిత్రములకు, రంగులును, రేఖయు వేయవలయును.

అట్లు ప్రత్యక్షవస్తులక్షణరహస్యపరిశీలనము లేనిదే వ్రాయుచుండుటచేతనే, బంగాళాదేశచిత్రములందు చాలవరకు వికారాకారములగు బొమ్మలు కానవచ్చుచున్నవి. అయ్యవి యుత్తమచిత్రములు కావని మనమిదివరకే యెఱింగియున్నారముకదా! వస్తులక్షణము బాగుగా గ్రహింపకుండ నేవస్తువును లిఖించుటయనునది, యనేకవిధములుగా తప్పు. అది యొకవిధమగు దొంగతనము. అట్టి ప్రయత్నముతో వ్రాయబడిన చిత్రములను విమర్శకులు దూషించి, యట్టి దుర్నయములను సాధ్యమగునంతవరకు నడపబ్రయత్నించుట మనదేశ చిత్రలేఖన మభివృద్ధిగాంచుటకు చాలవరకు దోడ్పడును. వస్తులక్షణ పరిశీలనము జేయుడని దేశమునంగల చిత్రకారు లందరకును సంతతము వినవచ్చుచుండునటుల విమర్శకుడు శంఖనాదముల జేయవలయును. అట్లుచేసినగాని, నూతనముగా నుదయమందిన యీ కోమలచిత్రలేఖనలతిక యున్నతస్థాన మలంకరింపజాలక, నేలఁ

బ్రాకి ప్రాకి తుదకు పండి పాదఘాతమున నశించును. చిత్రలేఖనమున కిట్టికట్టుపాటులతోఁగూడిన యభ్యాసము ముఖ్యముగా నుండవలయును. కావననే దీనికి కళాశాలలు గావలయునని ఘోష బయలువెడలుచున్నది. చిత్రలేఖనమునందు నభిరుచిగల బాలుర నాకళాశాలలలో వారి తలిదండ్రులు ప్రవేశపెట్టి వారది నేర్చుకొనునట్టుల జేయవలయును. అట్లుగాని, యీ ముఖ్యమైనయభ్యాసము జరుగనేరదు. అది తగినన్ని కట్టుబాట్లతో (Discipline) నభ్యాసమైననే కాని ప్రయోజనము లేదు. చిత్రకారునకు, బుద్ధి యొక్క ఏకాక, యోరిమి, పట్టుదల, జాగ్రత్త, నేర్పు, మున్నగు గొప్పగుణము లమరియుండవలయును. అట్టి గుణము లభ్యాసమూలమునగాని కలుగవు.





# ముందుపుటక

నండూరి వెంకట సుబ్బారావు బి. ఏ., సాహితీసమితి సభ్యుడు

౧

నా పక్క తిరిగి మాటాడవా
మెంకి!
యీ సిక్కు నీ విప్పగలవా?
యీ జంట విడిపోయి
యే వాడనో తెలి
మెంకిపా ట్నగానె
మెదర నిలిసే దెవురో?
నా సూపు
సెదరగొట్టే దెవురో?
నా దోవ
సదునుజేసే దెవురో?—నా.

౨

మన సేతితో నాటి
మనసొంతమని పెంచి
మనకోట యీ తోట
మరుపు రాకుంటాద?—
నా గుండె
మరిగిపోకుంటాద?—నా.

3

వోయికుంట మే నీతొ
వోరుగుతాదని నమ్మి
కలిసున్న నాకాసి
కన్నెత్తి సూసేవ?
నీ వోన్న
సిన్నెలు సూపేవ?
యింతింత
అన్నెయ ముంటాద?—నా.




రెండవ (యిమ్మడి) దేవరాయలనాడు విజయనగరమున పారసీకరాయబారి

(౧౪౪౧-౧౪౪౪)


భావరాజు వేంకటకృష్ణ రావుగారు బి. యే., బి. యల్.


## అబ్దుర్ రజాక్ జీవితము.

అబ్దుర్ రజాక్ నిండుపేరు కమాలు-ద్దీన్ అబ్దుర్ రజాక్. అతనితండ్రిపేరు జలాలు-ద్దీన్ ఇసక్. అబ్దుర్ రజాక్ తండ్రి మధ్యఆసియాఖండములో 'సమరఖండ' దేశవాస్తవ్యుడు. మనకథానాయకుడుమహమ్మదీయహిజరాశకము ౮౧౬ సంవత్సరము షాబాన్ మాసమున పన్నెండవదినమున (అనగా క్రీస్తుశకము ౧౪౧౩ వ సంవత్సరము నవంబరు ౭ వ తేది.) హిరాట్ నగరమున జన్మించెను. పారశీకచక్రవర్తియగు సుల్తాను షారుఖ్ కొలువున జలాలుద్దీన్ కొంతకాలము "కాజీ" యుద్యోగమునను, మరికొంతకాలము "ఇమామ్" ఉద్యోగమునను౦డుచు సుల్తానుచే నప్పుడప్పుడు ధర్మసందేహనివర్తికై యాహ్వానింపబడుచు ధర్మగ్రంథములు చదివి వినిపించుచుండెను. అబ్దుర్ రజాకు తండ్రివలెనే గొప్పవిద్వాంసుడును, అరబీభాషయందు వైయాకరణియునైయుండెను. తండ్రి చనిపోయినతరువాత నతడు అరబీభాషలోని ప్రత్యయములు, సర్వనామములనుగూర్చి 'అజ్జుద్ దీన్ యాహ్యా' అనునాతడు వ్రాసిన వ్యాకరణమునకు గొప్పవ్యాఖ్యానమునురచించి, దానిని సుల్తానుషారుఖ్‌న కంకితము చేసెను. కృతియొసంగుసమయమున సుల్తాను అబ్దుర్ రజాక్ పాండిత్యమునకును రాజభక్తికిని కడుమెచ్చుకొని తనహస్తమును అత్యంతగౌరవసూచకముగ ముద్దిడనిచ్చి గౌరవించెను. ఆప్రభువు పరిపాలనావసానకాలమున నితడు విజయనగరచక్రవర్తులకడకు[1] రాయబారిగా బంపబడిరియెను. విజయనగరమునుండి స్వదేశమగు ఖురాసాన్ దేశమును సుఖముగా జేరునప్పటికనేకకష్టము లనుభవించి దుర్దశలపాలయ్యెను. సుల్తాన్ షారుఖ్ మరణించినతరువాతనుగూడ నితడు పదునాలుగు సంవత్సరములవఱకు సింహాసనమధిష్ఠించినమీర్జాఅబ్దుల్ లతీఫ్, మీర్జాఅబ్దుల్లా, మీర్జాఅబుల్ కాశిమ్ సుల్తానుల కొలువుకూటముల గౌరవింపబడుచుండెను. విజయనగరమునుండి తిరిగివచ్చినతరువాత క్రీ.శ. ౧౪౪౭వ సంవత్సరమున "గిలాన్" దేశమునకు రాయబారిగా బంపబడిరియెను. కాని యాపనిపూర్తిగాకమునుపే యీజిప్టు దేశమునకు బోవలసినదని సుల్తాను షారుఖ్ వర్తమానము పంపియుండెను. ఇంతలో నాతని నింతయాదరించి గౌరవించినయాసుల్తాను మరణించుటచే ఈజిప్టు రాయబారము కొనసాగియుండలేదు.

క్రీ. శ. ౧౪౧౭వ సంవత్సరమున సుల్తాన్ అబుల్ కాశిమ్ బాబరుతో గలసి "టఫ్‌ట్ యజ్దు" అనునగరమున కరిగియుండెను. ఆసంచారమున చరిత్రకారుడగు షరూఫ్-ఉద్దీన్ అలీయజ్ది అనువానితో సుల్తాను ముచ్చటించినపుడు ఆసంభాషణ నాలకించుట కితడు నాహ్వానింపబడియుండెను. ఇది జరిగినరెండుసంవత్సరములకు సుల్తాను అబుసయిద్‌న కాప్తుడయి యాతనిచే విశేషముగ గౌరవింపబడిరియెను. ఈతనికాలమున మన రజాక్ (౧౪౩౭ అక్టోబరునెల) "ఖాన్‌కహ" అనుసుల్తాన్ షారుఖ్ యొక్క భోజనశాల కధ్యక్షుడుగా నియమింపబడిరియెను. ఈయుద్యోగమునం దితడు చనిపోవునంతకు నుండి ప్రభువున కత్యంతప్రియుడై తనయుద్యోగము నిర్వర్తించియుండెను.

1. ఇమ్మడి దేవరాయలు, మల్లికార్జునరాయలు.

అబ్దుర్ రజాక్ ౧౪౮౨ వ సంవత్సరమున ఆక్టోబరు నెలలో కాలధర్మమునొందెను. ఈతడు రచించిన గ్రంథములలో మిక్కిలి యుపయుక్తమైనది మనకు ప్రస్తుత విషయమును గూర్చి దెల్పు "మల్లా-ఉస్-సఅదయిన్" అను చరిత్ర గ్రంథము. ఇయ్యది యాతని కాలమునుండియు సర్వజనాదరణీయమైయుండెను. ఇందు మన విజయనగర సామ్రాజ్యవృత్తాంతము మాత్రము గాక యాతడు గొల్చియుండిన ప్రభువుల పరిపాలనము నాటి విషయములు గూడ నాలగలవు. ఈ గ్రంథము రెండుసంపుటములుగా నున్నది. ప్రథమసంపుటమున విజగీషామనీష గల తైమూరు చక్రవర్తి యారంభవశము మొదలుకొని యాతని మరణానంతరము వరకు గల చరిత్రయంతయు సవిస్తరముగ దెలుపబడెను. రెండవభాగమున తైమూరువంశస్థుల చరిత్ర మొదలుకొని యీతడు గొల్చిన కడపటి పారశీక సుల్తాను హసన్ మీర్జా మరణానంతరము వఱకు జరిగియుండిన వృత్తాంతములను వివరించెను. ఈ గ్రంథము అబ్దుర్ రజాక్ చనిపోవుటకు రెండుసంవత్సరములకు బూర్వము (క్రీ. శ. ౧౪౭౧) రచించెను. కడుముదిమికాలమున రచించినదయ్యు నాతని చరిత్ర విజయనగర సామ్రాజ్యమునకు సంబంధించినంతవఱకు మనోహరమయిన సూక్ష్మములయిన చారిత్రక విషయములతో నొప్పాఱుచున్నది. ఇట్టి గ్రంథమే లేకుండిన విజయనగర సామ్రాజ్యమునుగురించిన కొన్ని యపూర్వ వృత్తాంతములు మనకు దెలిసియుండవు.

"మల్లా-ఉస్-సఅదయిన్" పారశీక భాషయందు రచింపబడియున్నది. ఇందులో మనవిజయనగర సామ్రాజ్యమునకు సంబంధించినంతభాగము, బెంగాలు సివిలుసర్వీసులో పనిచేసిన సి. జె. ఓల్డుఫీల్డు అనునాతనిచే నాంగ్లభాషలోనికనువదింపబడి, సర్ హెన్రీ. యం. ఎలియట్ గారిచే సంస్కరింపబడెను. ఇపు డాయాంగ్లానువాదమునుండియే నేను మనచరిత్ర కుపయుక్తమయినంతవఱకు నాంధ్రీకరించి[1] చారిత్రప్రియులగు నాంధ్ర సోదరులకు విన్నవించుచున్నాను.

## హిందూస్థానమునకు రాయబారము

అది హిజరాశకము ౮౪౫ వ సంవత్సరము (క్రీస్తుశకము ౧౪౪౧). జ్యేష్ఠమాసమున నొకశుభదినమున సకల పృథ్వీపతియగు సూల్తాను యీచరిత్రకారుడును ఇసాక్ కుమారుడును నగు అబ్దుర రజాక్ నకు, హిందూస్థానమునకు రాయబారిగా నరుగవలసినదని యాదేశమంపెను. అంతట నాతడు హోర్ముజు రేవున బయలుదేరి సముద్రమున కావలిగట్టును గూర్చి పయనమయ్యెను......

"......హోర్ముజుపట్టణము ఆరాజధానికి ముఖ్యనగరము. అదిగాక చాల గొప్ప రేవుపట్టణము. దానికి "జెరూన్" అని మఱియొక పేరు కూడగలదు. ఆమహానగరమున కీడగు పట్టణము ఈభూగోళమున నింకొకటి కానరాదు. సప్తద్వీపములనుండి వర్తకు లిక్కడ కేతెంచెదరు. ఈజిప్తు, శిరియా, రూమ్ (టర్కీ) ఆజర్ బైజాన్, ఇరాఖ్, పార్స్, ఖురాసాన్, మావారాల్ నహార్, టుర్కీస్థాన్ డష్తు-ఇ-కిప్ చాక్, కల్మక్ దేశమున్నగువానినుండియు, తూర్పున చీన్, మాచీన్, ఖాన్ బాలిక్ మున్నగు దేశదేశాంతరములనుండియు వర్తకులు వచ్చుచు పోవుచుందురు. చీనా, జావా, బంగాళము, సింహళము జీర్ బాద్ నగరములు, తనాసిరి, సకోట్రా, మాలదీవులలోని తొంబదినగరములు, మలబారు, అబిస్సీనియా, జాంజిబారు, విజయనగర సామ్రాజ్యపు రేవులు, కలబరిగె, ఘూర్జరము, కంబా, అరేబియా దేశపు రేవులు, ఏడెను, జిడ్డా, జంబో, మున్నగు నానా ద్వీప దేశాంతరములనుండి వర్తకులు వారి వారి దేశములందు దొరకెడి యపూర్వములయిన వస్తుసామగ్రి నెల్లప్పుడు దెచ్చుచు నిచ్చట నమ్ముకొనుచుందురు. వారు దెచ్చెడిసరకులు సూర్యచంద్రాదులు, వర్షములు గూడ మెరుగుపెట్టదలచునంత అపురూపము లయినవి. భూమిపైగల నీయా దేశములని లేక యన్ని ప్రాంతములనుండియు వ్యాపారు లిచ్చట తాము దెచ్చినసరకుల నమ్ముకొనుచు నిచ్చటి సరకులను గొంపోవుచుందురు. వారు ఒక్కొక్కప్పుడు తమకు గావలసినవస్తువులకు రొక్కము వెలయిచ్చికొనుచుందురు. మరియొకప్పుడు ఆవస్తువులకు సరియగు విలువగల తమసామగ్రిని మార్చుకొందురు. వెండి బంగారములపై దప్ప రేవున దిగుప్రతివస్తువుమీదను వెలచేసి నూటికిపదియవపాలు ఆరాజునకు వర్తకులు రేవుసుంకము చెల్లింపవలయును. అనేకవిధములగు మతప్రచారకులు

1. నే నీచరిత్రను ప్రతిపదార్థముగా తెనిగింపక, కొంచము స్వేచ్ఛగా యథామూలముగా తెలుగుచేసితిని. పాఠకు లిందులకు మన్నింతురుగాక!

కాఫరులు, నాస్తికులు, మున్నగు నానాదేశీయులగు వారనేకు లీనగరమున గలరు. వారందరు నానగరాధీశ్వరుని ధర్మపరిపాలనముక్రింద నేయన్యాయమును బొందక సుఖించుచున్నారు. అందువలన నీనగరమునకు న్యాయపరిపాలనమునకు ధర్మమునకు మనికిపట్టు అను అర్థ మిచ్చు "దారుల్ అమాన్" అనుప్రసిద్ధిగలదు. ఈనగరవాస్తవ్యులు ఐరాకీయుల వినయమర్యాదలను, హిందువుల నేర్పుతో ప్రకటింతురు.

ఈనగరమున నేను ప్రయాణమునకు బూర్వము రెండుమాసము లుండవలసివచ్చెను. నేను వ్యాపారి నేమో యనియు సుంకము మీయక పారిపోవజలచినవాడ నేమో యనియు, నారేవుసుంకాధికారులు నన్ను త్వరలో వెడలనీయక పరీక్ష చేయసాగిరి. ఈపరీక్షలో ఓడలు బయలుదేరుఋతువు దాటిపోయెను. అంతట వర్షకాల మారంభమయి యుండినందున వర్షములు వెనుకపడి తుపానుల భయము తీరినతరువాత నన్ను పయనము సేయనీసైరి. నాతోడనుండినగుఱ్ఱములను, మనుష్యలెక్కు ఓడలో * నుంచ వీలులేదని గుఱ్ఱముల నొకయోడలోను, నన్ను నాపరివారమును మరియొకయోడలోను నెక్కించిరి. అట్లు ఆరెండోడలలో నేనును నాపరివారమును పయనమైతిమి.

ఓడలలోనిదుర్వాసన నాకు స్మృతితప్పునట్లు జేసెను. దానికి తోడు సముద్రప్రయాణము నాకు భయావహమయ్యెను. ఈరెండుకారణములవలన నేను మూడుదినములవఱకు నూపిరిలేకుండ చచ్చినవానివలె మూర్ఛపోయి యుంటిని.

మూడవనాడు నాసికాగ్రమున కొంచెము ఊపిరి కనబడినపుడు మావారు నేనింకను జీవించియుంటినని ధైర్యము దెచ్చుకొనిరి. నాకు కొంచెము తెలివివచ్చునప్పటికి ఓడమీద నాతోపాటు ప్రయాణము సేయుచుండిన నామిత్రులును వర్తకులందఱు నైకకంఠ్యముగ సముద్రప్రయాణమున కనుకూలమైన అదను దాటిపోయినపిమ్మట బయలుదేరిన నెట్టియుపద్రవములైన రావచ్చుననియు, అట్టిసమయమున నెవడైన నకాలమరణము నొందినవానిని వాడే నిందించుకొనవలయునుగాని యితరుల నేమనినను లాభము లేదనియు మొదలగు నెన్నియో మాటలు నన్నాడి, తుదకు మేమింక నీతో నీయోడపైన రానని యొక్కపెట్టున నందరును "మస్కాటు" రేవున ఓడదిగిపోయిరి. పాపము వారందఱు నోడకేవును ముందుగానే యిచ్చియుండినందున, పయనము పూర్తిగాకుండ నోడదిగుటచే వారెంతో నష్టపడుటయే కాక సరకుల గూర్చి చాల చిక్కులుపడిరి,

ఇక నేను వారితోపాటు మస్కాటురేవున దిగి యచ్చటమాత్ర మాగక "కరికాట్" అనుపట్టణమునకుబోయి యచ్చట నివాస మేర్పాటుచేసుకొంటిని. ఓడపయనము పూర్తిగాకుండినపుడును, అత్యాంతము గనెక్కుడవైన కొంతకాలము తలదాచుకొనవలసినపుడును, సముద్రవ్యాపారులు దిక్కుమాలినవారివలె యిడుమలపాలగుదురు. ఆయిబ్బందులు వారికే తెలియవలయును. దైవము నిర్దయుడై యుండుటవలన, నాదుగస్తులను ఇంకను దరిచేరకుండుటవలనను నేను కొంచెము మనోవ్యగ్రత చెందితిని. నాహృదయము బ్రద్దలయిన గాజుముక్కలవలె చెదరిపోయెను. నాబాధల ననుభవింపలేక, తుదకు ప్రాణముపై అసహ్యముకలిగి యంతకన్న చచ్చిన మేలను కొంటిని.

ఇట్టిస్థితియందు, అయిష్టముతో "కరికాట్" గ్రామమున సముద్రపుటొడ్డున కాపుర ముంటిమి. ఇంతలో "మొహరమ్" పండుగ వచ్చెను. ఆపండుగతొలి నాటిరాత్రి చంద్రుడతిమనోహరమయిన రేఖతో వెలుగసాగెను. దుఃఖభాజనమై యంత్యప్రక్రియనున్న మాదుస్థితికి ఆ మొహరమ్ నాటి విజయచంద్రుడు ఆశాకిరణములను ప్రసరింపజేసెను. అయ్యది దక్షిణాయనమైనను సూర్యునివేడిమిమాత్రము దుస్సహముగా నుండెను. గనులలోని కెంపులును, ఎముకలలో క్రొవ్వునుగూడ కరిగింపజేయు నంతటి వేడిగాడ్పులు వీచెను......... ఆవేడికి మేము తాళలేకపోతిమి. నేనును, నాజ్యేష్ఠసోదరుడు, మరికొందఱు ప్రియమిత్రులు మొదలగువారలనేకు లాయుష్మమునకు తాళజాలక ఆరోగ్యము చెడి చాల జబ్బుపడితిమి. అట్లు జబ్బువలన నొకరితరువాత నొకరు నాలుగు మాసములు బాధపడుచు నచ్చటనే

* మనుష్య లెక్కు ఓడకు "జోగు" అనియు సరకుగొంపోవునోడకు "కప్పలి" యనియు నాంధ్రమున పేరులు గలవు.

యుండిపోతిమి. కాని ఆయూరివారు కొందఱు, కరియాట్ గ్రామమునకంటె, 'సవూర్' అను పట్టణము చాలమంచి ఆరోగ్యకరమైన నగరమనియు,నచ్చట మంచి తియ్యని ఆరోగ్యవంతమైన నీరు లభించుననియు నచ్చటికి బోయిన శీఘ్రముమే పునరారోగ్యము గలుగుననియు బలుమారు చెప్పుచుండుటచేత వారిమాటలు విశ్వసించి, యింకను లేవలేనిస్థితిలో నున్నను నేను ఓడమీదబయలుదేరితిని. కాని నాదౌర్భాగ్యవశమున అక్కడ ప్రవేశించిన వెంటనే నాకు రోగ మెక్కువయ్యెను. ఇక్కడనున్నప్పుడే నా పెద్దన్నగారు మవులానా అఫీ-ఫుద్దీన్ అబుల్ వహాబు గారు కాలధర్మమునొంది మమ్ముందఱిను దుఃఖసంద్రమున ముంచివేసిరి.

ఎట్టకేలకు ఇక్కడనుండి హిందూస్థానమునకు నోడనెక్కితిమి. పదునెనిమిదిదినము లహోరాత్రము లొక్కరీతిగ మాయోడ గాలిబోసికొనుచు నడచెను. పరిశుభ్రమైన యాసముద్రపుగాలివలన నాకు సంపూర్ణముగ తిరిగి ఆరోగ్యము కలిగెను. అటుల పదునెనిమిదిదినములు గడచి, పందొమ్మిదవనాటి యుదయమున, దైవకృపవల్ల సురక్షితముగ కల్లికోటరేవునమాయోడ లంగరు దింపెను. ఇంతటినుంచి నాదేశమున నేను చూచి వినినవింతల నన్నిటిని యథార్థముగ వర్ణించెదను.

## నేను హిందూస్థానమును జేరుట—ఆదేశపు పరిస్థితులు—ఆచార సంప్రదాయములు—అందందు గన్పట్టువింత విశేషములు:

కల్లికోట మిక్కిలి నిరపాయకరమైన నౌకాశ్రయము.పార్శ్యజావలె నిచ్చటికి నానాదేశీయులగు వ్యాపారులు, వాణిజ్యార్థమై వచ్చుచు బోవుచుందురు. అబిస్సీనియా, జీర్యాన్, జాంజిబారు దేశీయులనుండి యోడలు సరకుతీసికొని తఱచుగా నీరేవునకు వచ్చుచుండును.అప్పుడప్పుడు మక్కానగరమునుండియు, నరేబియాదేశపుటితర నగరములనుండియు నోడలువచ్చుట గలదు ఆవచ్చినయోడలు యిచ్చవచ్చినకాల మాగుచుండును. ఈపట్టణమందచ్చటజూచినను నాస్తికులు (కాఫరులు) గలరు. అందువలన నీనగర మవశ్యము ముసల్మానులచే జయింపబడవలెనది. ఇచ్చట చాలమంది మహమ్మదీయులును గలరు. వారు శుక్రవారమునాడు, నమాజు చేసికొనుటకై రెండుగోపురములు గల పెద్దమసీదులను కట్టించుకొనిరి. వారలకందఱకును దైవభక్తిపరాయణుడయిన యొక 'కాజీ' కూడ గలడు. ఇక్కడి మహమ్మదీయులందఱు 'షాఫీ!' కులస్థులు, సంపన్నులయిన వర్తకులు. సముద్రతీరపు దేశాంతరపట్టణములనుండి, విలువయిన వస్తువులను దెచ్చి యీరేవున దింపికొనుచు విచ్చలవిడిగ వీథులందును, రచ్చలందును రాజబాటలందును కావలిలేకయే నిలువజేసికొందురు. ఈనగరమున నెవరికి నేభీతియు నన్యాయభయమును కలుగనంతటి ధర్మపరిపాలనము గలదు. ఎంతటి విలువగలవస్తు వెచట నిర్భయముగా పారవేసియుంచినను దొంగభయమనునది లేదు. వర్తకులు తాము నిలువజేసికొనిన సరకులపై నెవరిని కాపుంచ నక్కరలేకయే రేవు సుంకాధికారులచే భద్రముగా జూడబడుచుండును. రాత్రింబవళ్లు వారు వాటిచుట్టును కావలి గాయుచుందురు. విదేశవర్తకులు దెచ్చినసరకు అమ్ముడు పడువఱకు వానిపై సుంకమును దీయరు. అమ్మబడిన సరకులకు వెలపై నూటికి ౨ (2½) చొప్పున సుంకము గైకొందురు. ఇతర రేవులను జేరవలసిన సరకుతోనిండు ఓడలు వాయువశమున గమ్యస్థానమునగాక నితరరేవులకడ మెట్టపట్టిపోయినచో నచ్చటిప్రజలు ఆయోడలలోని సరకులను గొల్లగొట్టునాచారము* కాని కల్లికోటలో నట్లుగాదు. ఏదేశమునుండివచ్చిన యోడఅయినప్పటికి ఎట్టిదుస్థితిలో రేవునుజేరినప్పటికి నితరయోడలతో సరిసమానముగ సంరక్షింపబడును. ఆయోడ కట్టియాప యుపాటిల్లదు.

మాయేలికయగు సుల్తానుఫారుఖ్ ఖాకానీ-సయిద్ నృపాలుడు కల్లికోటనగరాధీశున కుత్తమాశ్వములను మేలైన జరీయంగీలు, కుళ్ళాయిలు మొదలగు నమూల్యములయిన యుడుపులను—సంవత్సరాదిపండుగ

* ఇట్టిదురాచారమే యాంధ్రదేశమున కాకతీయగణపతిదేవుని కాలమునకు బూర్వ ముండినట్లు శాసన ప్రమాణములు గలవు. చూడుడు. ప్రాచీనాంధ్ర నౌకాజీవనము పుట ౧౨౬-౭; Ep. Ind. Vol. XII. p. 188 ff.

నాడు కానుకగా నర్పింపదగినవి—బహుమతిగా నంపియుండెను.*

ఇందులకు కారణ మాచక్రవర్తిచే నంపబడిన రాయబారులు బంగాళాదేశమునుండి తిరిగివచ్చు సమయమున, కల్లికోటరేవున దిగవలసివచ్చుటయు, నపుడు వారు సామూరికి మారాజు ప్రశస్తినిగూర్చి విశేషముగా దెలుపుటయు సంభవించెను. ఆ రాయబారులు స్వదేశము చేరినపుడు వారిముఖమున మాచక్రవర్తి కల్లికోటను గూర్చి యంతయు దెలిసికొనియుండెను. మరియు ప్రపంచమున నున్న నృపాలురంపఱుగూడ కల్లికోట ప్రభువుతో నెయ్యము సలుపుట కిచ్చగింతురనియు, నాతనిదేశమునుండియు వారికావశ్యకములయిన సరకులు దీసికొనిరాబడుచుండుననియుగూడ వినియుండెను.

ఇదిజరిగిన కొంతకాలమునకు వంగదేశపుసుల్తాను, జాన్పూరుసుల్తాను ఇబ్రహీంవలన తన కెక్కువబాధ కలుగుచున్నదనియు, నాతని జయించుటకు కొంతసహాయ మంపవలసినదనియు, మాచక్రవర్తిని శరణుజొచ్చెను. శరణాగతరక్షకుడగు మాచక్రవర్తి వెంటనే జాన్పూరునకు షెయిఖుల్-ఇస్లామ్ ఖ్వాజాకరీముద్దీన్ - అబూ - అల్ మకారిమ్ జామీ అనునాతని రాయబారిగా నంపి, వంగదేశముపై నిక ముందెప్పుడును యుద్ధమునకుబోయి బాధింపవలదనియు, నట్లు గావించిన వాటిల్లు ననర్థములకు తానే నిందింపుకొనవలయుననియు సందేశ మంపియుండెను.

అందులకు జాన్పూరు సుల్తాను చక్రవర్తి యాజ్ఞను శిరసావహించెను. కల్లికోటనగరాధీశు డీవృత్తాంతము వినినవెంటనే తనదేశమునందు దొరకు విలువగల వింతవస్తువులను ప్రోగుచేసి మాచక్రవర్తిస్నేహ మభిలషించుచు నొకరాయబార మంపెను. మరియు తన రాజ్యమున మహమ్మదీయులు, ప్రతిశుక్రవారము నాడు నేయాటంకము లేక నమాజు చేసికొనుచు, మసీదులలో ఖుతుబాను పఠించుచున్నారనియు, వారందఱు మాయేలిక యనుజ్ఞ యిచ్చిన నాతనినామములో జేర్చి నమాజు చేసికొందురనియు విన్నవింపజేసెను.

ఆతనిరాయబారి బంగాళాదేశమునుండి తిరిగివచ్చుచుండిన రాయబారులతో కలసినచ్చుటజేసి, మాశాజుకొలువున నున్న సామంతరాజులు కొందఱు ఆతని ఆగమనము రాజున కెరిగించి కానుకల నర్పింపజేసిరి. ఆవచ్చినకల్లికోటరాయబారి మహమ్మదీయుడు; మంచి వక్త. తనవాచాలత్వము చేరాజును సులభముగ మెప్పించి, యింక నీవిధముగ ముచ్చటించెను.

"మాయేలిక మీతో నెయ్యము స్నేహము నెఱపదలచి నన్నంపియున్నాడు. మీరు మాపై ననుగ్రహించి మహమ్మదీయమతప్రవక్తలను మారాజునకు బంపినయెడల అజ్ఞానాంధకారమున నున్న మాదేశపుప్రజలను, ఏలికను, వెలుతురులోనికి దెచ్చి పుణ్యముగట్టుకొనినవారగుదురు." ఆమాటలను మాచక్రవర్తి మనసుకరిగినవాడై తా నొకరాయబారము బంప నిశ్చయించెను. ఆమహాత్కార్యము నిర్వహించుభారము దైవకృపవల్ల యీఅల్పునిపై బడెను. నన్ను కొంద ఱసూయాగ్రస్తులు సముద్రయానమున బోయినవారు మగల తిరిగిరాజాలరనియు, నపాయకరమనియు, నిరుత్సాహపఱచిరి. కాని వారి భయములు నిష్ఫలము లయ్యెను. మాసములు మూడు గడచుసరికి, నేను సుఖముగా స్వదేశము జేరితిని. అప్పటికి నన్ను నిరుత్సాహపఱచినవారు మాత్రము జీవించియుండలేదైరి.

## కల్లికోట నగరము.

కల్లికోటరేవులో నోడదిగి యూరిలోనికి బోవునప్పటికి నేను కలలోనుగూడ కనివిని యెఱుగని యొక వికృతజాతిమనుష్యులు నాకంటబడిరి.

... ... ... ... ...

ఈదేశపునల్లమనుష్యులు స్త్రీపురుషులు మొలపై నొకగుడ్డతప్ప నింకుమింకుగా దిగంబరులయి యుందురు. కుడిచేతిలో ముత్యమువలె తెల్లనై ప్రకాశించు, నొక కత్తిని, యెడమచేతిలో కాఱుమబ్బువలె నల్లనై కాన్పించు తోలుతో చేయబడిన డాలును ధరించి తిరుగుచుందురు.

* అబ్దుర్ రజాక్ రాయభారిగా విజయనగరమునకు బంపబడియుండగా పొరపడి కల్లికోటసామూరియే తనయేలిక యనుకొనిన చక్రవర్తియని యాతడు పంపిన కానుకలన్నియు సామూరికి సమర్పించెను. పిమ్మట తనతప్పు తెలిసికొని యది యితరులకు దెలియకుండ గడుసుదనముగ గప్పిపుచ్చెను. ముందు చూడుడు.

తిరిపెమెత్తుకొను బిచ్చగాని మొదలుకొని నగరమేలు నృపాలునివఱకుగూడ నిట్లేయుందురు. ముసల్మానులు మాత్ర మట్లుగాక మంచివిలువకలిగి అందములైన యంగీలను, పచ్చడములను, విరివిగా నరబ్బులవలె ధరించి తమసంపన్నత్వమును వెల్లడిచేసికొనుచుందురు.

పట్టణములోనికి బోయినవెనుక నేను చాలమంది మహమ్మదీయులతోడను, నాస్తికులగు దేశీయులతోడను ముచ్చటించితిని. వారు నాకొక యనుకూలమైన భవనమును బసగా నిచ్చిరి. మూడుదినములయినపిదప నన్ను వారిరాజునొద్దకు దర్శనార్థము దీసికొనిపోయిరి. నేను అచ్చట నితరమనుష్యులవలె మొలగుడ్డకట్టుకొనియున్న యొకనిజూచితిని. అచ్చటివారంద ఱాతని రాజందురు. వారు తమరాజును సామూరి యని పిలుతురు. అతడు మరణించినవెనుక, నాతనిసింహాసనముపై యాతని తోబుట్టువుకుమారుని కూర్చుండబెట్టుదురట. కడుపునబుట్టిన కుమారునికిగాని, యాతడు లేనప్పుడు సోదరునికిగాని పట్టాభిషేకము చేయురట! శౌర్యపరాక్రమాదులవల్ల నెవడు నిచ్చట రాజగుట లేదు. ఇచ్చటి నాస్తికులలో పెక్కుతరగతి జాతులవారు గలరు. బ్రాహ్మణులు, యోగులు మొదలయినవారు. వారందఱు అనేకమంది దేవతలను గొల్చుచుందురు. విగ్రహపూజలు గావించుచుందురు. ప్రతివర్ణమువారికిని వింతవింత యాచారములు గలవు.

ఇచ్చటిజనములలో నొకజాతి గలదు. ఆజాతిలోని స్త్రీకి పెక్కుమంది భర్తలుందురు. వారందఱు తమ యిష్టమువచ్చినవ్యాపారమును జేసికొనుచుందురు. ఆభార్యతో గాపురముచేయుటకు రాత్రిపగళ్ళిరువదినాలుగు గంటలకాలము వారు సమానముగ పంచుకొనుచుందురు. ఒకభర్త యాస్త్రీతో నున్నంతకాలము మరియొకభర్త యాస్త్రీయొద్దకు బోరాదు. ఆదేశపురాజగు సామూరి యీజాతికి చెందినవాడే యట!

నేను సామూరిని దర్శింపబోవునప్పటికి అతని కొలువున అప్పటికే రెండుమూడువేలమంది హిందువులు పైనిచెప్పినవిధముగనే దుస్తులు ధరించి సభ నలంకరించి యుండిరి. ముసల్మానులలో ప్రముఖులుగూడ కొంద ఱచ్చట నుండిరి. వారు నన్నుచితాసనమున గూర్చుండ నియమించినతరువాత నేను మాచక్రవర్తి యిచ్చినశ్రీముఖమును చదివితిని. పిదప ఆమహారాజుపంపిన కానుకల దెచ్చి యర్పించితిని. సామూరి నారాయబారమున కంత గౌరవ మొసంగినట్లు కాన్పింపలేదు. అంతట నేను సెలవుతీసికొని నాబసకు తిరిగివచ్చితిని. హార్మజునగరపు రాజంపినయుత్తమాశ్వములు మొదలయిన సరకులతో నిండినయోడ ప్రయాణమున చాలకష్టములపాలయి ఓడదొంగలచే దోపిడిచేయబడి, వస్తువులనన్నిటిని గోల్పోయి, చిట్టచివరకు ప్రాణములతో కల్లికోట చేరుకొనినది. నిజముగా నాప్రియమిత్రుని ఆయోడలోనుండి బ్రతికివచ్చుట జూచినపుడు నాకు పరమానందమయ్యెను.

కల్లికోటనగరమున అయిదారుమాసములు, నిరుద్యోగినై, గౌరవములేక దుఃఖభాజనమైన జీవనమును గడిపితిని. ఆరోజులలో నాకు దుఃఖ మొకస్నేహితుడును, కష్ట మొక చెలికాడునై యున్నట్లుండెను. అట్లుండ నొకనాడు చీకటిరాత్రి, నేను మంచముపై పరుండి నిద్రించువేళ, విసుగెత్తిన నాప్రాణమునకు కష్టములు గట్టెక్కెనోయన్నట్లు, అంధకారమునుండి వెలికి త్రోయబడినట్లు స్వప్నమొకటి గంటిని. ఆకలయందు మాచక్రవర్తి కాఖానిసయిన్ సుల్తాను, నిండురాజసముతో నన్నుజేరి, ఆదర మొప్ప "నీవింక భయపడకుము, మనసునూరక నాయాసపెట్టుకొని ఖేదింపకుము. నీకష్టములు త్వరలో తుదిముట్టగలవు" అని గంభీరభాషణముల బలికెను.

ఉదయమయినతరువాత నేను నమాజుచేసికొని కూర్చుండినపుడు కడచినరాత్రికన్న కల జ్ఞప్తికి వచ్చి, నన్నొకింత యానందపరవశునిగా జేసెను. సాధారణముగా స్వప్నములు, తదేకధ్యానములో తలపోసికొనుచున్నవారికి వచ్చును. కలలోనివృత్తాంతములు, పగటిపూట ఎన్నడును జరుగజాలవు. అయినను కొన్నిస్వప్నములు దైవప్రేరితములనియు, నవి తప్పక జరుగుననియు పెద్దలు చెప్పుటయుగూడ గలదు. ఖొరానునం దట్టి ప్రమాణము లెన్ని లేవు?

దైవమునకు నాపై నిప్పటికి కరుణ గలిగెననియు దుఃఖభాజనమైన నాజీవితభాగము సాంతమయ్యెననియు, త్వరలో నాకదృష్టము పట్టుటకిది శుభసూచకమనియు,

నూరకతలపోయుచు, ఆనందించుచు కాలము గడపితిని. పండితులయినవారికి కొందఱికి నాకల వివరించి తెల్పి వారిని దానియర్థము విప్పిచెప్పవలసినదని కోరునంతలో విజయనగర చక్రవర్తి కడనుండి యొకదూత వచ్చెననియు, నాచక్రవర్తి చాలసామ్రాజ్యము నేలు సార్వభౌముడనియు, నిపుడు డాతని రాయబారి సామూరికి పారశీక దేశమునుండి యేతెంచిన రాయబారిని తత్క్షణము తన యొద్దకు బంపవలసినదనియు, నాజ్ఞాపించుచు నొకజాబు వ్రాసియుండెననియు దెలియవచ్చెను. సామూరి విజయనగర చక్రవర్తికి సామంతుడు గాకపోయినను, ఆతడనిన, సామూరి కత్యంతభయము గలదు. ఆచక్రవర్తికి కళ్లికోట వంటి రేవులు మూడువందలు గలవట. మరియు నాతని దేశము మూడుమాసంబులు ప్రయాణము చేసినను తిరగనిదట.

కళ్లికోట మొదలు కాయిల్ పట్టుగల రేవుపట్టణము లనేకము లింకను మలబారుదేశమునందు గలవు. కాయిల్ పట్టణము సింహళద్వీపమున కెదురుగానుండును. కళ్లికోటనుండి బయలుదేరు ఓడలన్నియు మక్కాకు సాధారణముగా మిరియములు, ఏలకులు, లవంగములు, జాజికాయ మున్నగు సుగంధద్రవ్యములను దీసికొనిపోవుచుండును. కళ్లికోటలోనుండు నావికులు మంచిసాహసికులు. వారిని చీనీపుత్త్రులు అని పిలచెదరు. ఒకానొకప్పుడు చీనాదేశీయులు నావికులు కొంద ఱీకళ్లికోటకు వలసవచ్చియుండిరట. అందువలన వారిసాహసిక నౌకాయానమునుబట్టి యీకాలపునావికులకు చీనీపుత్త్రులను పేరు కలిగినదేమో! కళ్లికోటకు వచ్చెడియోడలను, రేవులోనియోడలను ఓడదొంగలు దరిజేరరారు. ఆరేవున యీయావస్తువులను భేదము లేక సమస్తమును దొరకును. ఆవుమాంసముమాత్రము లభింపదు. ఇక్కడ వారు ఆవులను చంపరు. వానిమాంసమును భుజింపరు. గోవు నెవరు చంపినను వానిప్రాణము వెంటనే తీసివేయబడును. గోవనినవారల కెంతయో భక్తి. దానిపేడతో చేసినబూడిదను యీమూర్ఖులు నుదుటిపై ధరింతురు—దౌర్భాగ్యులు!

## విజయనగర యాత్ర.

ఈ'నీమదు' సామూరివద్ద సెలవుతీసికొని, కళ్లికోటనుండి బయలుదేరి, బందానరేవుమీదుగా, మలబారు సముద్రతీరమున ప్రయాణము చేయుచు విజయనగర రాజ్యము పొలిమేరల నున్న 'మంగళూరు'రేవును చేరెను. అచ్చట రెండుమూడుదినములుండి మెట్టదారిని విజయనగరమునకై బయలుదేరితిని. మంగళూరుదాటి ముప్పదిమైళ్లు వచ్చునప్పటికి ప్రపంచమునందెచ్చటను సాటిలేని యొకచక్కని దేవాలయమును జూచితిని. ఆదేవాలయము పదిగజముల చతురమును అయిదుగజముల యెత్తును గలిగియున్నది. అదియంతయు కంచులోహముతో చేయబడియున్నది. ఆదేవాలయమునకు నాలుగు అంతస్తులుగలవు. అవి యొకదానికంటె నొకటి యెత్తుగ నుండును. అన్నిటికంటె యెత్తైన అంతస్తులో మనిషియెత్తుగల దేవునిసువర్ణ విగ్రహము గలదు. ఆవిగ్రహమునకు రెండు ఎఱ్ఱని పెద్ద కెంపులు నేత్రములుగా నమర్చబడియున్నవి. అవి చూచువారికి, విగ్రహము తనవైపు చూచుచున్నదేమో యనునంత మనోహరముగా నమర్చబడియున్నవి. ఆదేవాలయమంతయును మనోహరమయిన శిల్పపుపనులచే శోభిల్లుచు కనులకు మిరుమిట్లు గొల్పుచుండును.

అప్పటినుండి పోవుచు, ప్రతిదినమును నొక్కొక్క జనసమృద్ధమయిన పట్టణమునందో గ్రామమునందో తగులుచు పయనము చేయుచుంటిని. ఇట్లుండ నొకనాడు నేను ఆకాశమున సూర్యునినైతము కప్పివేయజాలినంత యెత్తైనశిఖరమును జూచితిని. ఆపర్వత మొక యరణ్యమధ్యమున నున్నది. ఆయరణ్యమును, పర్వతశిఖరమును దాటి 'బేలూరు' అనుపట్టణము జేరితిని. బేలూరునగరమున నిండ్లన్నియు మేడలవలెను సౌధములవలెను గన్పట్టును. ఈబేలూరునందు మిక్కిలి యెత్తయినయొక ప్రసిద్ధదేవాలయము గలదు. దానిశిఖరము బేలూరునుండి పెక్కుమైళ్లవఱకును గాన్పించుచుండును. అతిశయోక్తియని నిందలేకుండ దాని సౌందర్యమును వర్ణింపుట కడు కష్టము. ఆదేవళము నగరమునకు నడుమ విశాలమైన ప్రదేశమునందు, చక్కనిపువ్వులతోటయందు గలదు. ఆపూదోటయందు పూయనిపుష్పములు, చిగుర్పని ఆకులు లేవు. ఆరామముమధ్య చలువరాతితో గట్టిన మేలైనమంటప మొకటి గలదు. ఆమంటపము మనిషియెత్తున నుండును. మంటపమునందలి రాళ్లు నున్నగా చెక్కబడి యొకదానిపై నొకటి సున్నము లేకయే అతుకబడినట్లు అమర్చబడియుండెను. చూపఱ కీమంటప

మంతయు నొక్కరాతితో చెక్కఁబడినదా యనియు గూడ సందేహము గలుగఁజేయుచుండును. ఆమంటపము నడుమ నల్లరాతితో నిర్మింపబడినదేవాలయము గలదు. ఆదేవాలయముపైన మనుష్యవిగ్రహములు నానావిధములుగ, మూడువరుసలుగ నొకదానిక్రిందట నొకటిగ చెక్కఁబడియుండెను.

ఎంతటినేర్పరియైనను, చిత్రకారుడు తనకుంచెముతోగాని, మసిబొగ్గుతోగాని అంత మనోహరముగ నారూపములను చెక్కఁజాలడని నాఅభిప్రాయము.

ఉన్నతమయిన యీదేవాలయమున శిఖరమునుండి పాదమువఱకు నొకయంగుళమేరయినను పూర్వపశ్చిమఖండముల పూర్వచిత్తరువులతో నిండియుండనిస్థలమే లేదు. ఆదేవాలయముచుట్టును సాలుగేసి యంతస్థులు గల్గి ముప్పదిగజములు పొడవును ఇరువదిగజములు వెడల్పును ఏబదిగజములయెత్తును గల నాల్గుగోపురములు గలవు.

ఇతర మంటపములు మొదలగునవియన్నియు నిట్టి యతి మనోహరమయిన చెక్కడపు బనులతోడను చిత్తరువులతోడను శోభిల్లుచున్నవి. ఆకోవెలయందు రాత్రింబవళ్లు భగవంతుడు స్వీకరింపనిప్రార్థనలు, సంగీతనృత్యవాద్యములు, నైవేద్యములు జరుగుచుండును. ఆదేవాలయమునుండి ధనమును, వెచ్చములను, సమస్తములును ఆగ్రామవాసులు తెచ్చుకొనుచుందురు. *'నాస్తికులగు' నీహిందువుల క్షేత్రము ముసల్మానుల మక్కావంటిదని చెప్పుదురు. ఇచ్చట రెండుమూడుదినములుండితిరిగి ప్రయాణము సాగించితిని. జిహిజ్జా [క్రీ. శ. ౧౪౪౩—చైత్రము] మాసాంతమున విజయనగరపట్టణమును జేరితిని. నారాకవిని సార్వభౌముడు స్వాగతమిచ్చుటకై తగినపరివారమును ఎదురుగ సన్నాహముబంపెను. వారు మ మ్ముచితరీతిని గౌరవించి, చక్కనియొకసౌధమునకు గొంపోయి విడిదినిచ్చిరి. (సశేషము.)

* ఇది యొకవిష్ణ్వాలయము గావచ్చును. అబ్దుర్ రజాక్ చూచినదేవాలయ మేయూరిదోగాని తెలియరాదు.



# ఋతువులు

విద్వాన్ గరిమెళ్ల సోమన్న గారు, యం. ఏ., యల్. టి.,

తీనయుతంబు సమాంతరస్థితిని బొంద న్వంగుచు న్భూమి సూ
ర్యునిచుట్టుం దిరుగంగ నీఋతువు లాఱుం గల్గు నాషాఢమం
దును బుష్యంబున వచ్చు సంక్రమణము ల్తోడ్తో నగుం దక్షిణా
యనముం బిమ్మట నుత్తరాయణము మధ్యం దుల్యమౌ రేపగల్.
వ్రాసితిని స్వభావోక్తుల బాలురకయి

వసంతఋతువు—ద్విపదలు

చైత్రమాసంబు వైశాఖమాసమును
జిత్రవసంతమై చెలఁగు నేటికొుగ
ఎండయుఁ జలియును నివ్వసంతమున
మెండుగ నుండక మితముగాఁ దోఁచు.
పల్లు చెర్వులును గోనేళ్లుబావులును
నీళ్ళతో నిండారు నిర్మలంబుగను.
కలువతామరపూల కలిమిచే నొప్పఁ
గొలఁకులు మడుగులు కోనేళ్లు గుములు.
దట్టముగఁ జిగిర్చి తలిరులం గులుకు

చెట్టుచేమలతోడఁ జెన్నును గూర్చు
గుట్టలు కనుమలు కొండచఱియలును
మిట్టలు వనములు మెట్టు పల్లములు.
చిలుకలు కోవెల లెచ్చట్లపై నుండి
కలకలరవములఁ గర్ణము లింపు.
పుష్పంబు లీఋతువున మెండుగానఁ
బుష్పసమయమని పొందెఁ బేరిద్ధి.
జాజులు మల్లెలు సంపంగి పూలు
రోజాలు వాసన లుబ్బుచునుండు.
పంతంబుతోఁ బూయుఁ బనస జాములునుఁ
జింతలు మామిళ్లు జీడిమామిళ్లు.
తామ్రకాంతుల నీను తలిరు జొంపములు
ధూమ్రకుట్మలహారిద్ద్యుతిఫలాగములు
నప్రసమా వృక్షసంతతుల సొంపునను,
ఆమ్ర కిసలయమధ్య పికగానములఁ
గప్రమా వనలక్ష్మిఁ గనుచు వసంత
సామ్రాజ్యసుఖముల జగము హర్షించు.
ఈరమ్యఋతువున నేఁడాది వచ్చు
శ్రీరామనవమియుఁ జెలఁగుఁ బుణ్యముగ;
వైశాఖ శుద్ధపుఁ బంచమి న్వచ్చు
శ్రీశంకర జయంతి చితలోకశాంతి,
ఆచతుర్దశి నృసింహజయంతి వచ్చు,
బ్రాచుర్యమొందును వైశాఖపూజ.
చైత్రపౌర్ణమిరాత్రిఁ జంద్రబింబంబు
చిత్రంబుగాఁ జిత్తచెంతనగుపించు.
వైశాఖమాసపుఁ బౌర్ణమిరాత్రి
శశివిశాఖలు గూడి చక్కఁగ నిలుచు,

గ్రీష్మఋతువు—ద్విరదగతిరగడ

జ్యేష్ఠమాషాఢముం జేరి గ్రీష్మర్తు వగు
నిష్ఠురం బిపు డెండ నీరెచ్చటను దఱుఁగు.
భానుఁ డుత్తరదిశకు వాలి నిల్కడ మందుఁ
జేను లేమిని భూమి చీకాకుపడి యెండు.
వేడిగాడ్పులు దుమ్ము వెదజల్లుచును వీచు
వాడుచెట్లన్నియును వడ ప్రాణులను నేచు.
చల్లనిజలంబులును జంద్రకిరణంబులును
మల్లెపూలును బనస మామిడిఫలంబులును
జనుల కివ్వేసవిని జాల ప్రియమును జేయు.
దీనులకు విందుగను పెండ్లివాద్యము మ్రోయు
పదును వేసవి తుద వర్షము లందడిగఁ
పిడుగులుఱుములుదిగులు వెట్టఁ గురకలుపడఁగ.
పదను గల్గిన నేల వ్యవసాయికులు దున్ని
యదను గని విత్తుచును హర్షింత్రు ఫలమెన్ని.
ఆషాఢమున దక్షిణాయనారంభమగు
శేషశాయియుఁ బొందు శేషశయనము నొబగు
నెల జ్యేష్ఠపౌర్ణమికి నిలుచు జ్యేష్ఠకుఁ జెంతఁ.
జెలఁగు మఱుపున్నమనిశి నాషాఢకుఁ బొంత.

వర్షఋతువు—మధురగతిరగడ

వర్షఋతువు శ్రావణభాద్రపదము,
కర్షకు లెత్తెఁ గాంతురు ప్రమదము.
నల్లనిమబ్బులు నలువెస లౌనును,
జల్లనిగాలులు జరపును వానను.
మింట ప్రళళళ మెఱయును మెఱుములు,
వెంటనె పెళపెళ వినఁబడు నుఱుములు,
హరివి ల్లాకసమందునఁ దోఁచును,
బోరిపోరి మాలతి పొగడలు పూచును.
చెఱువులు నేళ్లును జిక్కఁగ నిండును,
వరి సగమెత్తగు వరగలు పండును.
చాతకపక్షులు చదలం దిరుగును,
గోతులఁ గప్పంగొంతుక లరగును.
మిడుఁగురు లెగురును మింట న్నిశలను,
బుడమిని గంబళిపురుగులు మసలును.
పచ్చలవన్నెల పచ్చిక పుట్టును,
ముచ్చట నెమళులు ముఱిపము వట్టును,
దినపతి దక్షిణదిక్కున కొరగును,
దినములఁ గ్రమముగ దీర్ఘత తఱుగును,
సుదతుల వ్రతములు సూత్రధరణమును,

యదుకులమునఁ గృష్ణావతరణమును.
గణపతిచవితి యొక్క మహాలయమును,
ప్రణయపతిచెడిని వర్షసమయమును.
శ్రావణపూర్ణిమ శ్రవణముఁ గను శశి,
మావటిభద్రను మెఱుపున్నమనిశి.

శరదృతువు—తేటగీతలు

ఆశ్వయుజమును గార్తిక మనెడినెలలు
శరదృతువగు నిత్తఱిని వర్షములు తగ్గి
తెరలు గాలి పూర్వోత్తరదిక్కునుండి,
ఆకసమునఁ గ్రమ్మును దెల్లయభ్రచయము,
తునుకలగుచును గాలిచే దూదిఁ బోలి
గాలిఁ గలదుమ్ము వానను గలసిపోఁగ
నెండధావళ్యముగఁ గాయు నీఋతువున;
మింట మణులట్లు చుక్కలు మెఱయుచుండు;
వెన్నెలలు గాయు మిక్కిలి విశదముగను.
పల్లలో నీళ్లు చెర్వుకోనేళ్ల జలము
తేటపడు; దమ్మికలువలు తేలుచుండు.
పలువెలుంగుల పక్షులపంక్తు లొప్ప
ఇసుకతిన్నెలు గాన్పించు నేళ్ళనడుమ.
తెల్లబడు నేల యిటనట ఱెల్లుపూయు.
పొట్ల బీరలు కాయును ముదురు వరియు
ఎగురుచుండును దూనీఁగ లెరవెదకుచు,
బసువు లీనును మెండుగఁ బాల నిడును.
రాత్రి చలియుఁ బెరుగు నవరాత్రపూజ
లవల దీపావళియు నిటు హర్ష మొసఁగు.
ఆశ్వయుజ పౌర్ణమికి శశి యశ్వినిఁ గనుఁ,
బొందుఁ గృత్తికఁ గార్తికపూర్ణిమ నిశి.

హేమంతఋతువు—సీసపద్యము

మార్గశీర్షముఁ బుష్యమాసంబు హేమంత
మనఁబడు హిమ బిందు వధికమగుట;
హిమబిందువులఁ దాఁకి యినకిరణంబులు
మలుపిలివెన్నెలఁ బఱపుచుండుఁ
జాలుకేమియును లేక సూర్యుండు దక్షిణ
దిశకు వాలి త్వరగఁ దిరుగుచుండుఁ
జలియు రాత్రియు హెచ్చి జనులను బాధించు
జాడ్యము ల్వ్యాపులు చాలఁగలుఁగుఁ
వెలఁగు ముక్కోటి యేకాదశి వరికోఁత
మకరసంక్రాంతి యిత్తఱి; మార్గశీర్ష
పూర్ణిమనిశి మృగశిరను బొందెడు శశిఁ
బుష్యమిం గనుఁ బుష్యపుఁ బున్నమనిశి.

శిశిరఋతువు—ఉత్సాహపద్యములు

జరగు శిశిరఋతువు మాఘ
ఫాల్గునంబులం దిటన్
బెరుగుఁ బగలు తగ్గును జలి
విరియుఁ బనసమావులున్,
ఒరగు భానుఁ డుత్తరమున
కొడియుమంచు పొగవలెన్;
ధరను బండుటాకులెల్ల
దట్టముగను రాలెడున్
వరియు నూర్పు చేయఁబడును
బైరుగాలి వీచుచున్
మిరెప వంగ కంది పెసర
మెండుగ నిటఁ గాసెడిన్,
జెఱకులాడుదు రసికయుఁ
జిక్కుఁడుఁ దఱచయ్యెడున్.
పరమపదముఁ గనెఁ దొలి హరి
వాసరమున భీష్ముఁడున్
సరసిజాప్తుఁ గొల్తురు రథ
సప్తమిం దమి న్నతుల్.
హరు భజింతురు శివరాత్రి
నంతటఁ జలితీరెడున్.
జరుగు మాఘపూర్ణిమనిశిఁ
జంద్రుఁడు మఘచెంత కు
త్తరదెస మెఱుపున్నమనిశిఁ
దారకాళి తఱచయున్.

# కాళిదాసుని పుష్పములు

ఆయుర్వేద మార్తాండ భిషగాచార్య పండిత హెచ్. సుబ్బరాయ శాస్త్రిగారు,
ఎఫ్. ఆర్. హెచ్. ఎస్.

## అశోక

ఇది చింత, రేల, తంగేడి, సుంకేశర (వాతనారాయణ చెట్టు), పతంగి యీ మొదలగుజాతికి చేరినది. రావణుండు సీతాదేవిని లంకలో అశోకవనమం దుంచి యుండుటచే అశోకవృక్షము జగత్పూజ్య మైనదిగా హిందువులు భావింతురు. దీనిపూలు ఆరంజి ఎరుపు కలిగియుండును.

దీనిసంస్కృత నామాంతరములు

అశోక శ్శోకనాశశ్చ విచిత్రః కర్ణపూరకః,
కంకేలి ర్హేమపుష్పశ్చ పిండపుష్ప స్తథైవచ.



అశోక

రఘువంశము ౮ సర్గలో అజమహారాజు భార్యయైన ఇందుమతిశవముపై మోదుకొనుచు అశోకవృక్షమును చూచి యీరీతి వర్ణించెను :

స్మరసేవ సశబ్దనూపురం చరణానుగ్రహ మన్యదుర్లభమ్,
అమునాకుసుమాశ్రువర్షిణా త్వమశోకేన సుగాత్రి శోచ్యసే

అశోక పుష్పములు వసంతఋతువులో పుష్పించి పాంథులకు మనోవికారము కలిగించుట రఘువంశమున (౧-౮౩) సూచింపబడినది.

అనలసాన్యభృతానలసా న్మనః
కమలధూళిభృతా మరుతేరితా,
కుసుమభారనతాధ్వగయోషితా
మసమశోక మశోకలతాకరోత్.

దీనిచే అశోక ఒకతీగ అని బోధపడును. కుమార సంభవము తృతీయసర్గలో స్త్రీయొక్క పాదతాడనమను దోహదక్రియ లేకనే అశోక వృక్షము ప్రకాండము నుండి పర్ణములతో పుష్పించె నను భావము ఈక్రింద వివరింపబడినది.

అసూత సద్యఃకుసుమాన్యశోకః
స్కంధా త్ప్రభృత్యేవసపల్లవాని,
పాదేన నాపైక్షత సుందరీణాం
సంపర్క మాశింజితనూపురేణ.

ఇందులో రెండుభేదములు కలవు. ఒకజాతియొక్క పూలు ఆరంజిఎరుపు కలిగి, ఆకులు సీతాఫలము ఆకులవలె నుండును. మాఘఫాల్గుణములలో పుష్పించును. ఇంకొకజాతి అశోకపూలు తెలుపు, పసుపు వర్ణయుక్తముగాను, ఆకులు మామిడిఆకులువలె నుండును. దీనియొక్క కాయ మొదట నీలముగా నుండి ఫలించిన వెనుక ఎఱ్ఱగా నుండును. అయితే భుజింప యోగ్యము కాదు. పైజాతి తీగయై యుండును.

కొన్ని కొన్ని వృక్షములు అకాలములో పుష్పింప జేయవలెనన్న యీక్రింది ప్రయోగములు చేయవలెను.

పాదాహతః ప్రమదయా వికస త్యశోకః
శోకంజహాతి వకులో ముఖసీధుసిక్తః,
ఆలోకితః కురువకః కురుతే వికాస
మాలోడిత స్తిలక ఉత్కలికో విభాతి.

మేఘదూతము ఉత్తరభాగము

రక్తాశోక శ్చల కిసలయః కేసర శ్చాత్రకాంతః
ప్రత్యాసన్నౌ కురవకవృతే ర్మాధవీమంటపస్య,
ఏక స్సఖ్యా స్తవ సహమయా వామపాదాభిలాషీ
కాంక్షత్యన్యో వదనమదిరాం దోహదచ్ఛద్మనాస్యాః.

ఇచట మాధవీమంటపమందున్న అశోకవృక్ష మా స్త్రీయొక్క పాదతాడన మిచ్ఛయించుచున్న దనియు, వకుళము ముఖమద్యసీత్కార మపేక్షించు చున్నదనియు భావము.

ఇటులనే ప్రియంగు—తరుణస్త్రీస్పర్శనముచేతను
తిలకవృక్షము ,, అవలోకనముచేతను
కురువక ,, ఆలింగనముచేతను



ముల్లుగోరింట

మందార ,, మృదుభాషణముచేతను
చంపక ,, ఉత్తమహాస్యముచేతను
ఆమ్ర ,, ఫూత్కారముచేతను
నమేరు ,, గానములేక నృత్యముచేతను

పుష్పించును.

రత్నావళీనాటికలో కామదేవపూజ జరుపుచుండు వనితయొక్క చేయి అశోకవృక్షముపై పెట్టగా అది కూడ నొకకోమలమైన చెట్టుశాఖయో యన్నట్టుండెనని యీక్రింద చెప్పబడినది.

స్పష్టస్త్వమేష దయితే
స్మరపూజావ్యావృతేనహస్తేన,
ఉద్భిన్నాపరమృదుతర
కిసలయ ఇవ లక్ష్యతే ఒశోకః.

కురువక (ముల్లుగోరింట)

గోరింటజాతికి చేరినవన్నియు పొదలుగా ఎండ ప్రదేశములో పెరుగునవియే. ఆకులు ఎదురెదురుగా కొంచెము గుండ్రముగా నుండును. పూలు ఒక్కవిధముగా గాక, కాడలపై మొలచునదిగను, పుష్పక్రింద సన్నని యాకులు కలిగియుండును. పువ్వులోపల రెండు పొడవుగ రెండు కుఱుచగ నుండుపండము లుండును. బీజాశయము (ovary) 2 గదులు కలది. ఈజాతిలో చేరిన యితరవృక్షము లెవ్వియన :—

గోరిమిడి Hygrophila Spinosa
నేలవేము Andrographis paniculata
అడ్డసరము Adhatoda Vasica
ఎర్రగోరింట Barleria Cristata కురువక
పచ్చ ,, ,, Prionites కురంటక
తెల్ల ,, ,, Longiflora సైరేయక
నల్ల ,, ,, Mysorensis ఆర్తగళ

కురువకనామాంతరములు

రక్తామ్లానోర క్తపుష్పో రామాలింగనకాముకః,
రాగప్రసవక శ్చైవ సుభగ శ్శోణఝింటికః.
రక్తపుష్పః కురువకః పీతపుష్పః కురణ్టకః
నీలపుష్ప శ్చార్తగళ స్సైరేయ శ్శ్వేతపుష్పకః.

శ్రీమన్మహాకవి కాళిదాసు రఘువంశము ౯సర్గలో యిట్లు వర్ణించెను :

విరచితా మధునోపవనశ్రియా
మభినవా ఇవ పత్రవిశేషకాః,
మధులిహాం మధుదానవిశారదాః
కురవకా రవకారణతాం యయుః.

వనరమకు పత్రాభరణములుగా నుండుకురువక పుష్పములపై భ్రమరములు వసంతఋతువునందు ఝుమ్మనిమూగి మధుపానము చేసెను.




సుర్కిపాటి వేంకటరత్నము గారు

క. విను మవధానంబున నా [యుఁ
యనునది ధృతరాష్ట్ర మహీతలాధిప! మఱి
గను మనుజనిర్నిద్రల సు
జ్జననుత మహనీయదివ్యచరితులఁ గృష్ణమై.

క. పాండవులకుఁ గలవాఁ డీ
తం డనినానుడువు సంధితంత్రము నెద వే
ఱ్ఱొందుగఁ దలఁపకు ధర్మ వె తా!
టుండెటువలె నుందు నే సయోన్నతచరి

క. నీతనయుఁ డొకఁడె దక్కఁగ
భూతలమున నెవ్వరేని పోరితమునకున్
జేతమున సమ్మతింపరు;
భూతభవిష్యత్తు లెఱిఁగి భూతలనాథా!

క. ఒకని యసంగతకార్యము
నకు నై లోకంబు తెగడు నట్టినికి నీ
వకట! యొడఁబడుట ధర్మమె
సకలంబును నెఱింగినట్టిచతురుఁడవయ్యున్.

క. దేవకలవారు పాండు
క్ష్మావిభుతనుజాతు లార్యసన్నుతచరితుల్
కేవలదయ నీయులు నిన్
గావలసినవారు వారిఁ గారింపకుమీ.

క. కుంతీతనయాగ్రజు మతి
మెంతయు నినుగూడి మనికియే, కాదే దు
శ్చింతు లగు కౌరవుల లో
కాంతరమున కనుపుకే యథార్థం బధిపా!

క. తమ మును జేసినయపరా
ధము లెల్ల క్షమింప వేఁడి ధాత్రీసగము వి
క్రమజీవను లగువారల
కమలినమతి నీకుమారు లర్పింపఁ దగున్.

క. శాంతింబొందెడు నంతట
గుంతీప్రజ రాజులెల్లఁ గూడిమనుదు రో
క్కింతయు లోకము దొసఁగుల [లున్.
పొంతంబో దఖిలదివము ముదమునఁ బొద

చ. సమయముగావుటన్ బలుకఁ
జాలెద నిక్క మకారణంబు లో
కము నుతిఁగన్న సాధ్వి తమ
కన్నను బెద్దకు గేస్తురాలు వం
శమునకు వన్నెఁదెచ్చుగుణ
శాలిని నా కనయంబు గూర్చుచు
ట్టము నగు ద్రౌపదిన్ బలిమి
టల్ దగవే మనవారి కంగడిన్.

మ. కలనన్ మార్కొని కౌరవాన్వయము జ
క్కన్ జేతురే చూడుమె
వ్వలనం బాయును పాండవేయులకు జీ
వంబుండునందాక నీ

తులువల్ దార్కొని బిట్టురేఁగి సభలో
దుర్వారులై ద్రౌపదీ
లలనన్ జేసినచేఁతయన్ విషమశ
ల్యం బంతరంగంబునన్.

క. పాండవు లల్పులుగా రి
ద్దండులు నిరవద్య ధర్మతత్పరులై దూ
ష్లిండని యడిగెద రిచ్చిన
భండనముబాసంగ డెల్లభంగుల సుఖమా.

క. తనకుం బెద్ద వగుటచే
నిను నంధుని సింహపీఠినిడి శౌర్యము చే
తను రాజ్య మెల్ల నార్జిం
చిన యాతనిసుతుల నిల్లుచేయుట తగవే.

గీ. ధర్మజాజ్ఞామహోగ్ర బంధనమునందుఁ
దగిలి తమ్ములు మీమీఁదఁ దెగకగాక
లేనిచో వార లొక్కరె పూనికొనర [డె.
వాన్వయము మొదలుసెఱఁ జేయరయ్యనాఁ

గీ. సాధుకోపార్ణవము మానసంపుటెల్ల
మీఱకుండంగఁ జేయుచే మేల్మితనము
పృథుతరోపేక్షయే సంభవించె నేని
సమయఁ జేసెడు నదియు లోకముల నెల్ల.

క. నిను నీతమ్ముఁడు సేవిం
చినదానికి నైన నతని చిన్నారిసుతుల్
దినఁ గట్ట నొసఁగఁ దగదే [న్నన్.
మనుజాధిప! సామపాలుమాట యెటు

క. తెగునంతకు బిగఁదీయుట,
తగ దెవ్వరికైనఁ బాండుతనయులు నీ వి
ట్లగునన్న వచ్చి నీపద, [పా!
యుగ మిప్పుడ పట్టికొల్చు చుందురు భూ

క. తనయులు బందుగులును భూ [బీ
జనములు సేవకులు హితులు సామంతులు
ననుఁ గందురు పినఁ గవచే
మనుమార్గముగాదు జ్ఞాతిమారణ మధిపా!

ధృతరాష్ట్రుఁడు:
క. అనయము లోకజనప్రియ
జననం బగుకార్యమునకుఁ జాలక, దుర్యో
ధన! ధర్మపుత్రుసఖ్యమత [గదే.
మును దీర్చి మనుము బ్రమోదమునఁ బెల్లుఁ

దుర్యోధనుఁడు:
క. మిక్కిలిబిం కొనిన నాడె
వక్కట! పాండవులు కాడ నొంవిభవమునకున్
ముక్కున నుమిసికొనఁగ [కున్.
దక్కున! కునురాజ్యపదము ధర్మసుతున

శా. ద్రోణుం డాతనికున్న భీష్ముఁ డు కృపా
దుల్ దక్కువారల్ రణ
క్షోణిన్ మాలినమైని శౌర్యనిధి నా
కుంగూర్చు నీకర్ణుఁడుం
బ్రాణంబులుగంగఁ బాండవులు సా
మ్రాజ్యంబు దిక్కు కురు
క్షోణిం బాదమువెట్టనిత్తునె! వృథా
క్షోభంబు సీ కేటికిన్.

కృష్ణుఁడు:
క. చెలఁగి మన భీము నెదురన్ [వాఁ
నిలువఁగ నెవఁ డోపు నింద నిక్కముసకు
డలిగిన ఫాలాక్షుండే [లా!
పోలికలనను నడుగుమాలిపోఁడె నృపా

క. ఇంతయుఁ జెప్పుట మీకుం
బొంతువమే లనెడుతలఁపు పోలతమే మీ
స్వాంతమున కెక్కుచో న [పా!
త్యంతము సంతోష మట్టి దగుఁగాక నృ



# నీ వే నా!

కొప్పర్తి నారాయణమూర్తి బి. ఏ., యల్. టి., సాహితీసమితి.

డాక్టరుగారి భార్య పల్లెటూరి పిల్ల. ఈమె కాపురమునకువచ్చి సుమా రొక సంవత్సరము మాత్రమే యయినను పరమ పతివ్రతయనియు సుగుణరాశి యనియు నా గ్రామములో ప్రఖ్యాతిగాంచెను. తలిదండ్రులు తమపిల్లల కీమెను మాదిరిగా చూపి యట్లు నడచుకొనవలెనని చెప్పుచుండెడివారు; కాని యామె భర్తవంటివాడు తమ పిల్లలకు పెనిమిటి కాకుండుగాక యని యాడు పిల్లలుగల వారెల్లరు భగవంతుని ప్రార్థించెడివారు. ప్రపంచమం దిప్పటికాలమున చెలరేగియున్న కృత్రిమ నటనల కండ్లు కాయలు కాచునట్లు కాంచి కాంచి మహారసికాగ్రేసరుడనని మిక్కిలి విఱ్ఱవీగుచున్న డాక్టరుగారు వారి భార్యయందలి సహజ సౌందర్య సుగుణ సంపదల నెట్లు గ్రహించి యానందింప గలరు?

వేశ్యాలోలుడైన భర్తను సన్మార్గమున త్రిప్ప నామె శక్తికొలది ప్రయత్నించకుండ లేదు; స్వభావసిద్ధములైన యామె చేష్టలు మనుజ స్వభావమును చాలవరకు కోల్పోయిన డాక్టరుగారికి కేమియు రుచింపలేదు. ఉచిత రీతిని సద్బోధగావించుట కామెకు భర్త యాస్పదమీయ కుండెను. భోజనముచేయు టాలస్యముగ నాతడు గృహము వీడిపోవును. అందుచే నొకటి రెండు పర్యాయములు భోజన సమయమున నీవిషయమై యొక్కింత ప్రసంగింపబోయెను సుశీల. 'అయ్యవారిని చేయబోవ కోతి యాయెను' నన్నట్లాతడు విస్తరి విడిచిపెట్టి తటాలున లేచిపోయి వారమురోజుల వరకు నింటివైపు తిరిగి చూడలేదు. సుశీల యేమిచేయగలదు? కొంతకాలము లోలోన విచారించి తుదకు మనస్సును సమాధానపరచుకొనెను. చిన్ననాడు తన తండ్రి తన కుపదేశించిన హిందూవనితా ధర్మములే యామెకు ధైర్యము గొల్పెను. పతియే దైవము; ఆతని సౌఖ్యమును పెంపుచేయుటయే వనితాధర్మము; భర్తయిష్టమునకు వ్యతిరేకముగ మాటాడుట హిందూ యువతికి తగదని సుశీల యెంతయు చింతిల్లెను. పతినే యెల్లపుడును సంస్మరించెడిది. మగని దుష్ప్రవర్తనమును గూర్చి యిరుగుపొరుగువారు గ్రుచ్చిగ్రుచ్చియడిగినను నాతని చర్యల వెలిబుచ్చకుండ స్వగౌరవమును కాపాడుకొను చుండెను. ఇట్టి సుశీలపై భగవంతుడు కరుణజూపకుండడని పలువు రనుకొనెడివారు.

ఒకనాటి యుదయమున నాసుపత్రిలో సన్నని చాకుతో నేర్పుగా గోళ్లను తీసికొనుచు మధ్యమధ్య దీర్ఘముగనావలించుచు

నొంటరిగ కుర్చీపై కూర్చునియున్న డాక్టరుగారి యెదుట నలుబదియేండ్ల మనుష్యుడు బుజముపై పిల్లవానిని వేసికొని యుండి నిలువబడి సవినయముగ నమస్కరించెను. మాటాడుట కెవరయిన దొరకిన చాలునని యెదురుచూచుచున్న డాక్టరు తమచేతిలోని పని నప్పటికి ముగించి యీ మనుజునితో సంభాషణ లోనికి దిగెను.

"ఆకుర్రాడు మీకుర్రాడి లాగే వున్నాడే!"

"చిత్తం బాబయ్యా! నిన్నరాత్రి......"

"మొన్నసాయింత్ర పీడు వీధిలో ఆడుకుంటూవుంటే చూశానే!"

"హఠాత్తుగా రాత్రి పదోకండు గంటలకి..."

"వాయువు కమ్మింది కదా!"

"లేదు బాబూ; ఏదో........"

"కడుపు నొప్పి వచ్చింది. పోతుందిలే అదెంతసేపు!"

"అదేం కాదండి! మామూలుగా..."

"బాలరోగమా! చురక వేశారా?"

"అబ్బె! మే మొక ముంగిసి పెంచామండి..."

"ముంగి కాటే కదా!"

"ఆముంగి దీపపు సెమ్మ్యా పడగొట్టింది......"

"అయ్యో, పాపం; వొళ్లు కాలిందేం?"

"ఆచప్పుడికి పిల్లాడు ఉలికిపడి యేడవడం మొదలెట్టాడు..."

"ఓరి, ఇదేనా? ఊరికే భయపడ్డాడు; దీనికి ఔషధం ఎందుకు!"

"అప్పటి నుంచి పిలిస్తే పలకడం లేదు. మధ్యమధ్య కాళ్ళూ చేతులూ తన్నుకుంటాడు."

"ఓహోహో! ఇది సాధారణ రోగం కాదు..."

"బాబూ; ఒక్కడే కొడుకండి, లేక లేక పుట్టాడు. వీణ్ణిబతికించండి. మీమేలు మరచిపోను."

దీనికి ఘుట్టి మందు వేస్తేనేగాని లాభం వుండదు. కొత్తసీసా విప్పాలి......"

"ఏలారక్షిస్తారో; మీఋణము తీర్చుకుంటాను; దయవుంచి......"

"ఏలా తీర్చుకుంటావు?" అనెను; డాక్టరు నవ్వుచు. ప్రక్కగదిలో డాక్టరు కొరకు నిల్చుచున్న జేబురుమాలును చేతబట్టికొని పై సంభాషణలు వినుచున్న కోమలి—ఈమె మంత్రసాని యని వేరుగ చెప్పనక్కర లేదు—కిటికీగుండ తలను దూర్చి మందహాసముతో

"మీకు సంగీతం నేర్పుతాడు. మీకు ఆ వొక్కలోటు కూడా తీరిపోతుంది!" అని తిరిగి చాటుకు పోయెను.

"అయితే నీకు సంగీతం వచ్చునా?"

"చిత్తం; ఏదో కొంత నేర్చుకున్నానండి చిన్నప్పుడు..."

"బాగా పాడగలవా?"

"ఈ రోజుల్లో పాటలూ సంగీతాలూ ఎవరిక్కావాలండి!"

"ఓయి వెఱ్ఱివాడా! సంగీతం లాంటి విద్యవుందా. సరసుడన్నవాడు సంగీతమంటే

చెవికోసుకోడూ!"

"తమకంత ఆదరముంటే రోజూ మీ యింటికి వచ్చి నాకు వచ్చిన శాస్త్ర విద్యా నేర్పుతానండి తమకు."

"నాకు వద్దులే; మా ఆడవాళ్లకి రోజూ ఒకగంట నేర్పుతూ వుండు కొంతకాలము; తరువాత చూద్దాం." అనుచు లోనికి జని బీరువానుండి సీసానొకదాని దీసి అందలి ద్రావకముతో మరికొన్ని ద్రావకముల కలిపి యొకసీసా కెక్కించి గంటకొక పర్యాయము సాయంకాలమువరకు నిమ్మని చెప్పి సీసాను రోగితండ్రికిచ్చెను. అతడు వంగి నమస్కరించి సెలవుతీసికొని వెడలిపోయెను.

పిమ్మట డాక్టరు తనలో తానిట్లు వితర్కించుకొనెను. "నాదు నడతకు నాభార్య చాల కుందుచున్నదనియు, ఇట్లే కొంతకాలము నేనుండిన నామె నాకై విలపించుచు మరణించుననియు పలువురు మిత్రులు నాతో చెప్పి నన్ను మందలించుచున్నారు......... నిజమే! ఇంటనేమియు పనిలేక తీరికగ నెల్లపుడునున్న నెవ్వరికైన మతి చలింపకమానదు. నామిత్రులు చెప్పినట్లు కొంతకాలమునకీమెకు పిచ్చిపట్టిన పట్టవచ్చును. అట్లయిన నామె వంటకుకూడ నిరుపయోగ మగుటయేకాక ఆమెను భరించుట నాకనవసరపు వ్యయమునకును మనోవైకల్యమునకును హేతువగును. .........సంగీతమునేర్చుకొను ధోరణినున్న యెడల కొంతవరకామెమనస్సు శాంతి నొందును. నాపై తలపు మరలును. ఆమెపై నాకు ప్రేమ కలదనికూడ నామిత్రులు నిశ్చయించుకొందురు. ఇప్పుడు నాకీ గ్రామమున నున్న చెడ్డపేరు కొంత తగ్గును.....అవును; అదేయెత్తు!"

ఇట్లూహించుచు నింటికి జేరి స్నానాదుల గావించి భోజనమునకు విస్తరియొద్ద కూర్చుండెను. భార్య యెదుటనుండిన భోజనము సరిగా చేయకుండు టిదివర కెన్నియో సారులు తటస్థించుటచే, వంటకములనన్నింటిని వడ్డించి వంటయింటి మొండిగోడ వెనుక నిలువబడి యుండి చూచుట వాడుక యాయెను, సుశీలకు. ఆ ప్రకారమే నేడును దూరముననుండి భర్త కడుపార భుజించుచుండెనో లేదోయనియు, చేసిన పదార్థము లాతనికి రుచించునో లేదో యనియు నాందోళన పడుచుండెను.

తలనించక వంటయింటివైపు మరల్చి, తా జేసిన పనికి సిగ్గుపడుచున్నవాని కంఠస్వరముతో, "ఏమే!" అని మెల్లగ పిలిచెను, డాక్టరుగారు.

సుశీల యొడలు గగుర్పొడచెను. కట్ట తెగిన తటాకమునుండి వెలువడు జలప్రవాహమువలె నశ్రుజలము చెక్కిళ్లపై పారజొచ్చెను. ఒక్కింత తడవు సర్వావయవము లామె స్వాధీనము తప్పెను. రేయింబవళ్లు తాను సేవించుచున్న శ్రీమన్నారాయణ మూర్తి తనకు సందేశము దెచ్చెనేమో యని తొలుత భ్రమించెను. నిర్జీవ ప్రతిమవోలె గోడకు జేరగిలబడెను.

"ఏమే! నిన్నే!"

ఈ రెండవసారి పిలుపామెను తిరిగి మానవలోకమునకు దెచ్చెను.



"ఊఁ"అని జవాబు అప్రయత్నముగ నా నోటినుండి వచ్చెను. "సంగీతము నేర్చుకుంటావ్?"

ఇట్టి ప్రశ్న కామె సిద్ధపడి యుండక పోవుటచే మాటాడ కుండెను. ఆమె జవాబునకీతడు నిరీక్షించకనే "సంగీతం చెప్పటానికి ఒకణ్ణి కుదిర్చాను. ఇవాళ నుంచి మన యింటికి వస్తాడు. నువ్వు జాగ్రతగా నేర్చుకో." అనెను.

అంత భోజనమగుటచే నతడు లేచి యథాప్రకారముగ దుస్తుల ధరించి వెడలెను. వంటయింటి గోడగు ఆనుకొని నిలుచుండి సుశీల యేమేమో యోచించుకొను చుండెను.

"నేడు నానాథునకు నాపై నింత కరుణ గల్గుటకు కారణమేమయియుండును? ప్రతి దినము సకాలము నీదిన మాయన నెన్నడు గౌరవింపలేదే! వంటకములు నెక్కువగ నెక్కువ రుచిగ చేయలేదే! భగవంతుడు చేయదలచిన వేళ కారణముండవలెనా? జగదీశ్వరుడు తలచిన ఏమిజరుగకుండును. ఇంత వరకు ప్రాణేశ్వరుడునను ప్రేమించకుండుటకు నే జేసిన తప్పేమి? అంతయు భగవద్విలాసము! పూర్వజన్మమున నాచే యొనర్చిన పాపము నీవిధ ముగ నేననుభవింపవలసివచ్చెను ఎరుగకేదంపతుల కెడబాటుగావించితినో; నేనెరిగి యెరుగక యనుభవించుచుంటినేమో. నేటికి పాపవిమోచనము కానోపు! "ఏమే"అని నాథుడు పిలిచెను. అయ్యో! తలచిన సిగ్గగుచున్నది. నా పూజాఫలము నాకు చేకూరెను. ఎంతయో ప్రేమతోనున్న నన్నట్లు పిలుచునా? నేను పలుకకున్న తిరిగి నను పిలిచునేమో! పలుకు తెలియక "ఊఁ" అంటిని. లేకున్న నింకొకసారి "ఏమే" యని పిలిచి నన్నానందాబ్ధి నోలలాడించియుండునుగదా! ......హా, నాయానందమునకే నప్పుడు సమ్మతించకొన్నానుగాని తొలిసారియే పలికియున్న నాథుడెంతయో సంతసించి యుండునుగదా! ఆయనకు రెండవసారి నను పిలువు ప్రేమకూడ తప్పియుండును! సమయమునకు మనస్సు స్వాధీనముతప్పుటయు నాపాపమే! "ఏమే!...ఏమే! ...ఏమే!"...... అంతప్రేమతో, అంత నెమ్మదిగ, అంత సుకుమారముగ, అంతసరసముగ, అంతమృదువుగ పిలిచినపుడు నే మొదట పలుక

కుండినపుడు నాథుడు ననుగూర్చి యేమనుకొనెనో? ఏమనుకొనినను ఆయన తప్పులేదు. ఎప్పుడాయన ననుజూచునా యని వేచియున్న న న్నాయననోటినిండ పిలచినపుడుకూడ సమయము దాట జేసితి నే! నావంటి మాంద్యురాలు, నిర్భాగ్యురాలు, పాపిని, క్రూరురాలు, భువినుండునా? ఇట్టి దానిని భర్త యగౌరవింపకుండునా? ఆయన పాదములపై నొరగి యేడ్చి రక్షించుమని వేడిన నను దరిజేర్చుకుండునా? అయ్యో! వెడలెనుగా! వెడలునప్పుడు "ఏమే" యని పిలచియుంనను పోలేదే!........... లోకులెన్ని యనుకొనిననేమి? నానాథునికి నాపై నిక్కమైన ప్రేమగలదని నాకు తెలియును గాని వార లేమెరుంగుదురు? ఎంతయో ప్రేమలేకున్న నాకు సంగీతము నేర్పుటకు కుదిర్చియుందురా? నాకు సంగీతమురాకుండుట కాయన యెంతవిచారపడుచున్నారో! "జాగ్రతగానేర్చుకో" అని చెప్పివెళ్ళిరి. ఎన్ని దినములకు నానాథుని మెప్పించునట్లు పాడగలనో! అప్పుడేకదా యాయన మనోభీష్టము తీరును! అప్పుడేగదా నాజన్మ సార్థకమగును! తల్లీ! శారదా! నాకీవిద్య ప్రసాదించుము. నమ్మికొలచినవారి యభీష్టములు నెరవేర్చు బాధ్యత దేవతలకులేదా!......... ఏమి నా వెఱ్ఱి? దైవానుగ్రహముకల్గెను గనుకనే నా నాథుడు నాపై ప్రేమజూపెను. ఆ యనుగ్రహమువలననే పతిసేవ సేయు సామర్థ్యముకలుగకపోదు,........"

కొంతసేపటికి లేచి భోజనముచేసి సంగీతముచెప్పువాడింకను రాలేదనుకొనుచు చావడిలోకూర్చుండెను.

భార్యకు సంగీతమునేర్పుటకు డాక్టరుగారిచే నియమింపబడిన మంగలి వెంకటస్వామి మధ్యాహ్నము రెండుగంటలకు డాక్టరుగారింటికి వచ్చెను. తన సంగీతవిద్యను పరీక్షించి యానందించువారు లేరను చింత వెంకటస్వామిని పీడించుచుండెను. తనతో నీవిద్య నశించుననికూడ నాతనిభయము. గొప్పవారింట్ల స్త్రీలకిదివర కెన్నడును సంగీతమునేర్పు భాగ్యమాతనికి పట్టియుండలేదు. అందుచే నాతడును వీలయినంతత్వరలో, అమితమైన యుత్సాహముతో, కావలసినయుపకరణములతో డాక్టరుగారియింటికి వచ్చెను. సుశీలకూడ మిక్కిలి యాదరముతో విద్యనభ్యసించ నారంభించెను. సుశీల విద్యను సూక్ష్మముగ గ్రహించెడిది; ఎక్కువగ నేర్చుకొనవలెనని యభిలాషయు, నేర్చు పట్ల పూనికయు గలిగియుండెను. వీనికి వెంకటస్వామి సంతసించుచుండెను. ఆమె కంఠమునందు మార్దవమున్నదని పలుమారతడు మెచ్చికొనెను. తనకువచ్చిన విద్యనంతను సుశీలకు వీలయినంత త్వరలో నేర్పవలెనను పట్టుదలతో తనకు తీరిక యయినపుడెల్ల వచ్చి సుశీలకు విద్యాభ్యాసము గావించుచుండెడివాడు, వెంకటస్వామి. భర్త మెప్పుబడయునంతవిద్యను శీఘ్రమున నేర్చుకొను నిచ్ఛతో దీక్షగా కృషిసల్పుచుండెను, సుశీల.

ఇట్లు గరుమాసములు గడచెను. సంగీతమందు గురువును మించినదాయెను, సుశీల. సంగీతవిషయమయి భర్త తనతోడ ప్రసంగించునేమోయని యనుదిన మాశతో వేచి

యుండెడిదిగాని, ఆయన యీమాటయే మరిచిపోయెను. ఒకదినమున ధైర్యముబూని యీవిషయమై కదిపెనుగాని డాక్టరుగారు చెవిని పెట్టకుంటచే సుశీల యూరకొనవలసి వచ్చెను. ఎన్నటికైనను మరల భర్తకు దయవొడమకుండునా యను ఆసయే సుశీల ప్రాణముల నిలువబెట్టెను.

రెండుగంటలలో తనకుమారుని రోగమును బోగొట్టిన డాక్టరుగారియెడల వెంకటస్వామికి గాఢ విశ్వాసము కుదిరెను. ఆయన భార్యను కేవలము తన పుత్రికగాభావించి ప్రేమించుచుండెను. అతనికి సుశీల దురవస్థ తెలియకపోలేదు; తెలిసి యేమిచేయగలడు? పెద్దయుద్యోగములు చేయు మిత్రుల యుపదేశముల పెడచెవిని బెట్టిన డాక్టరునకీతడు సలహానొసగ సాహించుళ్లుగు? సుశీల తెలివితేటలుగలదనియు, సుగుణముల ప్రోగనియు, పతిచేయుచున్న యగౌరవమున కామె యెంతమాత్రము పాత్రురాలుకాదనియు తనలోతానెన్నియోసారులు తలపోసికొనియుండెను. ఆమెయెదుట నీవిషయమును ప్రస్తావించుటను చితమని యూరకుండెను. వెంకటస్వామి సుశీలకు చెప్పగల్గినవిద్య యింకలేదు.

ఒకనాటి సాయంకాలమున తానింటికేగుసమయమున సుశీలనుగని,

"అమ్మా! యికనేనిచ్చటకు రా నవసరము. మీయంతట మీరే కృషిచేయవచ్చును."

"ఇంకా తగినంత విద్యరాలేదని నా నమ్మకం" పాపము తనభర్త తన్ను మెచ్చుకొనకుండుట యామెకు సంశయముకల్గించెను. యథార్థమును కనిపెట్టి, "బాబయ్యగారు మీ విద్యను పరీక్షించి నాకు బహుమతి యిచ్చిందాకా వస్తూనేవుంటా."

సుశీల యొక్కనిట్టూర్పువిడచెను. వెంకటస్వామి కన్నులు బాష్పపూరితములయ్యెను. విచారించిన లాభములేదని తలచి సెలవు తీసికొని యాతడు వెళ్ళెను.

ఆ రాత్రియంతయు నాతని మనస్సు తొట్రువడెను. ఏదియో యాలోచించుచుండెను. ఇంటియొద్ద నున్నపు డొక్క నిమిషమైన చంకదించని తన ముద్దుకుమారునయిన నారాత్రి యాతడు పలుకరించనేలేదు.

మరునాటి యుదయమున ఆసుపత్రిలో డాక్టరుగారిని దర్శించి వెంకటస్వామి వినయపూర్వకముగా ననెను,

"అమ్మగారికి నాకు వచ్చిన విద్యను నేర్పడమయింది......"

"అప్పుడే!"

"ఎన్నాళ్లు కావాలండి? నాకు వచ్చిన విద్యయెంత!"

"ఇంతేనా! ఇంకెవ్వరూ సంగీతం నేర్పే వాళ్లు లేరూ?"

"లేకేమండి? అక్కడక్కడ వుంటారు."

"అదిగాదు; నువ్వు యెరుగున్న వాళ్లలో వున్నారా?"

"(కొంచె మాలోచించి) ఒక ఆమె వుందిగాని.....,"

"యెక్కడెక్కడ?" డాక్టరుగారికి ఆత్రమెక్కువాయెను.

"బెజవాడలో..."

"ఏకులం?"

"ఏకులమయితే లెంపి; బోగంది."

"అయితే, అది ఇక్కడకు వచ్చి వుండి చెప్పుతుందా?"

"కులానికి బోగంది; కాని వృత్తికి అటు వంటిది గాదు."

"మరేం వృత్తి, దానిది?"

"సంగీత సభలలో పాడి బహుమతి పొందుతూవుంటుంది."

"నేను నమ్మను; బోగందేమిటి, ఆవృత్తి కాకపోవడమేమిటి?"

"బోగంకో యెవకో బాగా తెలియదు. ఆమె వొక్కత్తే యెప్పుడూ ఇంట్లో వుంటుంది. ఆమె పరులకంటికి సాధారణంగా కనబడనే కనబడదు."

"అయితే మనింటికి వస్తుందా?"

"నేనూ, ఆమెతోట్లి ఒక్క గురువుదగ్గరే చదువుకున్నాము. ఆమె సభలుచేసేటప్పుడు నాకు కబురుపంపించి కూడా తీసుకువెడుతూ వుంటుంది."

"నువ్వు వెడితే దాన్ని తీసుకు రాగల వన్నమాట!"

(సంశయముతో) "తీసుకురాగలను గాని ఆట్టే రోజులుంటుందని తోచదు."

"అక్కడి దొరికే డబ్బు యిస్తే సరి, మహాచక్కాక్రంటుంది! తీసుకొద్దూ, తరువా తసంగతి నే చెపుతాను."

"ఇది ఎన్నో కేసు?" అనెను మంత్రసాని ప్రక్కగది నుండి నవ్వుచు.

"డబ్బుకోసం ఇప్పుడది చూడడం లేదు. డబ్బు కావలసినంతవుంది ఆమెకేం?"

"మరేమిటి దాని యిష్టం?"

"తగినవాణ్ని చూసి అతనితో యావజ్జీవము ఉండి పోదామని......"

"ఇదిగో ఈపది రూపాయిల నోటు తీసుకెళ్లి రేపు మోటారుమీద దాన్ని తప్పక తీసుకురా. త్వరగా వెళ్లు. ఇవాళ మోటారు తప్పి పోతుంది లేకపోతే."

వెంకటస్వామి నోటు తీసుకొని పదియడుగులు పోవగానే, డాక్టరు వెనుక వెళ్ళి యాతని కేకవేసి పిలిచి రహస్యముగ నెద్దియో మాట్లాడెను.

మంత్రసాని తనలో నిట్లు సణుగుకొనెను, "వీడెందరి నయినా మోసపుచ్చగలడు. మాటల డంబమేగాని మరేమీ లేదు. ఆశపెట్టడం బాగా తెలుసునువీడికి. నాకొంప తీసేడు ఈడాక్టరు. వీడికి తగినది నగరాజేగాని మరొకర్తె కాదు. ఈవృత్తాంతమంతా దానికి జేరేస్తే వీడికి తగిన ప్రాయశ్చిత్తం జరుగుతుంది."

పదిగంటలయినది. ఆసుపత్రి విడిచి డాక్టరుగారు వారియింటికి భోజనమునకేగిరి. మంత్రసాని నగరాజింటికి జనెను; ఉన్నవానితో లేనివానినికూడ చేర్చి డాక్టరుగారి మీద చాడీలను నూరిపోసెను. డాక్టరుకు నగరాజుమీద కంటె భార్యమీదనే యెక్కువప్రేమ యనియు, ఆమెకు సంగీతము నేర్పుటకు విద్వాంసురాలిని చెన్నపట్నం నుంచి నెలకేబది రూప్యముల జీతముపై తెప్పించుచున్నట్లునూ మంత్రసాని నొక్కినొక్కి చెప్పెను. నగరాజు

క్రోధోద్రేకముచే నుడులు మఱచెను. మంత్రసాని మంత్రముపారుట గ్రహించి నగరాజును విడిచి పోయెను.

డాక్టరు సుమారు పంద్రెండు గంటలకు యథావిధిగ నగరాజును దర్శింప బోయెను. ఎంత ప్రార్థించినను నగరాజు ప్రసన్నురాలు కాలేదు. "ఛా! యీపాడుముండను ప్రార్థించవలమేమి"టనుకొని లేచి వెళ్లిపో నుద్యుక్తుడై యుండ, నట్లుచేసిన తాను రసికుడనిపించుకొనడని సంశయించి తిరిగి తనచేతనయిన యెల్లవిధముల నామెను సమాధాన పరుప జూచెను. తుదకా వేశ్య ముసుగుదీసి మంచముపై నుండి లేచి గదితలుపు వైపు పోవుచు నెక్కువరమును ప్రసాదించెను. "నీ భార్యగారుంటే నేనులేను; నేనుంటే నీపెళ్లాం వుండరాద"నుచు చురుకుగ నడచుచు పొరుగింటికేగి కూర్చుండెను. డాక్టరు మూడు గంటలవరకు విచారించుచు శయ్యపై మేను జేర్చి యుండెను. నిట్టూర్పువిడచి తటాలున లేచెను; ఆతని ముఖమప్పట్టున మనోనిశ్చయమును ప్రకటించెను. వేగముగ ఆసుపత్రికిపోయి లోపలి గదిలో మూలనున్న బీరువానుండి చిన్నసీసా నొకదాని తీసి కోటులోపలి జేబులో వైచికొని తనకుర్చీనిజేరు సమయమున వెంకటస్వామి చిరునవ్వుతో నెదుటబడెను.

"ఇదేం! నువ్వు వెళ్లనే లేదా?"

"వెళ్లకుండానే పని జరిగింది!"

"ఎట్లా? యెట్లా?"

"నామాట తీసెయ్యదని నె నెరుగుదును. అందుచేత టెలిగ్రాము యిచ్చాను. అందిన తక్షణం ప్లెజర్ కారు (Pleasure car) చేసుకొని వచ్చేసింది."

"క్షేమయిన వాడవు!"

"ఇదంతా మీ సంకల్పం......"

"దాని నెక్కడుంచావు?"

"ప్రస్తుతం మాయింట్లోనే వుంది."

"అదిగో! మంత్రసానిముండ వస్తూవుంది. మనం ఇంటికి పోదాం రా!" అని వెంకటస్వామిని తోడ్కొని తనగృహము చేరెను. నాటి రేయికి వలయు యేర్పాట్లన్నియు చర్చింపబడినవి. తగిన యేర్పాటులు చేయుట కనుజ్ఞనిచ్చుటకు డాక్టరుగారు వెడలి పోవుచు వెంకటస్వామితో 'జాగ్రత సుమా' యని చెప్పెను. వెంకటస్వామి సుశీలను పిలిచి "అమ్మా! నామనవి చిత్తగించరా?" యనివినీతముగ నడిగెను.

"నామనస్సు కాస్త యిష్టంగాలేదు."

"అమ్మా! కులానికి నేను తక్కువవాడనయినా వయస్సులో తమకంటె పెద్దవాణ్ణి. మిమ్మల్ని చూస్తే నాకడుపు కరిగిపోతూవుంది. నేను చెప్పినదానిలో ప్రమాదం కలిగించేది ఏముంది?"

"భర్తనుమోసముచేయుటకు"నేనిష్టపడను.

"ఇందులో మోసమేముంది? మీరు పాడుతూవుంటే ఆయన వింటారు. వినకూడదా?"

చాటుననుండి యేలపాడవలెను? ముసుగువేసుకొని యేల ఆయన యెదుట పడవలెను?"

"తలచిన కార్యం జరగడానికి!"

"ఇంకొక మార్గములేదా?"

"నాకు కనబడదు. ఇంత శ్రమ పడి యింతవరకు సాగించాను. కొనసాగుతుందని నా నమ్మకం. తప్పదు! ముమ్మాటికి నిశ్చయం. రాత్రి నేను చెప్పినట్టు మీరు చేయకపోతే మోసముచేసానని నన్ను చంపుతారు, డాక్టరుగారు. నామాట విని నన్ను రక్షించండి." అనుచు సుశీల కాళ్లపై బడెను వెంకటస్వామి. సుశీల మోమునందించుక సమ్మతి స్పష్టపడెను. ఆతడు లేచి పదినిషము లామె కేదియో బోధించి వెడలిపోయెను.

డాక్టరుగారు ఆరుగంటలకే యిల్లుచేరిరి. ఏడుగంటలకే తొందరగా భుజించి యించుక విశ్రమించి గడియారమునుచూచి యింకను రాలేదేమని యనుకొని వెంకటస్వామి యింటికరిగెను.

"ఏమోయ్! భోజనమయిందా?"

"నాది అయింది. ఆమె వండుకుంటూ వుంది."

"హోటల్ నుంచి తెప్పించలేక పోయినావా?"

"అబ్బో! ఆవిడకు చాలానియమాలున్నాయి. స్వంతంగా వండుకుంటేనేగాని భోజనం చెయ్యదు!"

"తొందరగా కానియ్యమను, మరి..."

"ఏర్పాట్లు అన్నీ జరిగేసరికి ఆమె భోజనం అవుతుంది."

"ఇంకా నేను చెప్పినయేర్పాట్లుచెయ్యనే లేదా!"

"ఏదీ! మంచం సద్దుతూవుంటే ఈవిడ కబురు పంపింది. వచ్చేశాను. ఎంతలెండి, ఒక్క అరగంట పని. నేను మీయింటికి వెడతాను. మీరొక గంటసేపు ఆసుపత్రికేసి షికారు వెళ్ళిరండి. ఒకటిరెండు సంగతులు ఇంకా ఆమెతో చెప్పవలసి వున్నవి."

"సరే, నేను వెడతాను. నువ్వు అదేదో చూడు."

చావడి మీదనున్నగది శృంగారింపబడినది. అందు చక్కగ శయ్య యమర్చబడినది. ఆగదిలో క్రింద తివాచిపై వీణె యుంచబడెను. గదిగుమ్మమున కెదురుగ చావడిలో కుర్చీయుండెను. గదిలో సన్నని వత్తిగల దీప (Bedroom light) ముండెను. చావడిలో వ్రేలాడు దీపముండెను. సుశీల గదిలో ప్రవేశించి యుండెను.

డాక్టరుగారు గుమ్మములో నిలువబడి వెంకటస్వామిని పిలువ నాతడును గుమ్మములోనికి వచ్చెను.

"అదెక్కడుంది?"

"మీరు చెప్పిన చోటనే!"

"అది కాదు-నీశిష్యురాలు?"

"ఆవిడకు అప్పుడే అవుషధం పట్టిచ్చి గంటయింది. గాఢనిద్రలో వుంది. మీరిచ్చే ఔషధాలు అన్నీ బహుచక్కగా పని చేస్తాయండీ!"

"అది ఔషధం తాగదనుకొన్నాను."

నేను మెల్లగా బోధించి తాగించాను గాదూ!"

"బలే వాడవురా నువ్వు! దానిపేరెవరు? అది వచ్చిందా?"

"అన్నీ సిద్ధం చేశాను. మీరు రావడమే తరువాయి."

"అయితే, నేచెప్పిన సంగతి కదిపావా?"

"కదిపాను గాని అట్టే ఫలించలేదు. మీతో ఏకాంతంగా మాట్లాడడానికి మాత్రం వొప్పించేసరికి తాతలు దిగివచ్చారు."

"సరేలే; తరువాతి సంగతి నేచూసు కుంటాలే!" అనుచు డాక్టరుగారు చావడిలో కుర్చీపై సుఖాసీనులైరి. వెంకటస్వామి గదిలోనికి వెళ్ళి ఫిడేలు పుచ్చుకొని వాయించుట ప్రారంభించెను. సుశీల వీణను వాయించుచు గాత్రముతో పాడుచుండెను. ఆమె మోము చూడవలెనని వంగివంగి డాక్టరు చూచెను గాని యామె తలుపుచాటుననుండుటచే కనబడదాయెను. ఆయన కెదురుగ వెంకటస్వామి కూర్చుండెను; ఆతడు డాక్టరు మోమునందలి మార్పులనుబట్టి యాయన భావములు గమనించుచుండెను. "ఓహోహో! హాయ్ హాయ్" యనుచు మధ్య మధ్య తలవిసరుచుండెను డాక్టరుగారు. గానమింపుగనున్నను ముందాయన చేయవలసిన కార్య మున్నదిగనుక వెంకటస్వామిని పిలిచి ముగింపమని చెప్పి యాతని నీవలనుండుమనెను. తాను గదిలోని కేగి శయ్యపై కూర్చుండెను.

"ఇలా ఒక్కమారురా"

"ఎందుకు?"

"మాట్లాడాలి"

"ఇక్కడనుండే మాట్లాడవచ్చును."

"రహస్యం చెప్పాలి"

"కొత్తమనిషితో రహస్యమేముంటుంది"

"ఒక్కమాట వినివెళ్ళు….. "

"వెంకటస్వామీ!……"

"వొద్దు వొద్దు! వాణ్ణి పిలవకు" అనుచు తానామెచెంత జేరి తాకబోయెను.

"ఇలాచేస్తే నేవెళ్ళిపోతాను…"

"నిన్ను తాకనుగాని, నేనొక్క మాట చెప్తాను విను. నాస్థితి గతులు వెంకటస్వామివల్ల నీకు తెలిసేయుండును. నీసమాచారమునుకూడ అతడు నాతో చెప్పాడు. నీవు నాపాలిట రంభవలె చిక్కితివి. నిన్ను నా పంచప్రాణములకంటె యెక్కువగా చూచుకుంటాను. నన్ను కన్నెత్తిచూడవూ?"

"నేనుకూడా ఒక్కమాట చెపుతాను వినండి. నాకు ఒకనియమమున్నది. నన్ను తప్ప మిగిలిన స్త్రీలను తల్లులవలె చూస్తానని ఘోర ప్రమాణకము చేసినవాని తప్ప నేనన్యునివరింపను. అట్టివానిని నే దైవముగా చూసుకుంటాను. ఆయనే నాభర్త; ఆయనే నాసర్వము………"

"ఏ ప్రమాణకము చేయమంటే అది చేయడానికి సిద్ధంగానున్నాను……"

"ఎందుకొచ్చినమాటలండీ! భార్యయున్నవానికెట్లు ఇంత ఘోర ప్రమాణకం చేయుటకు వీలుపడును?"

"అదా నీసందేహం? ఇదివరకే ఆ అడ్డు తీర్చడానికి ప్రయత్నంచేశాను. (జేబులోనుండి సీసానుతీసి) ఇదిగో దీనితో ఒక్క నిమిషములో దాన్ని ఈలోకంలో లేకుండా చేస్తాను……"

సుశీలకు కాళ్ళాడకున్నవి. తల తిరుగు

చున్నది. తన భర్త యిట్టి కృత్యమునకు సాహసించునని ఎన్నడు ననుకొనలేదు. వెంకటస్వామి చెప్పియున్నట్లు ధైర్యమును తెచ్చుకొని ప్రవర్తింపవలెనని గుర్తెరిగి.

"ఆ పాపంకూడా నాకెందుకు?......"

"ఇదిగో! ఇలాచూడు" అనుచు నామెపై చేయి వేయబోయెను. సుశీల తప్పించుకొని గదివిడిచిపోవనున్నది.

"ఇదిగో! ఆఖరుమాట! నన్నువిడిచి వెళ్ళావంటే ఈసీసాలో విషము తాగుతాను. చూడు, చూడు!" అనుచు సీసామూతతీసి దాని నోటియొద్ద బెట్టుకొని త్రాగనుద్యుక్తుడయి యుండెను. తటాలున సీసానందుకొని, ఆపాదమస్తకము కప్పియున్న ఉల్లిపొరవంటి వస్త్రమును తొలగించి డాక్టరు మోముదగ్గర తన మోమును చేర్చుచుండ, "సీ నేనా" అని యొక్క యరపు నరచెను, డాక్టరుగారు కాలుచేతులు వణకుచుండెను; ఆయన నోట మాట లేదు. వెఱ్ఱిచూపు చూడసాగెను శయ్యపై మూర్ఛిల్లి పడియుండెను.



"ఇంత యెందుకు? నేనేగా" అనుచు నాతనిప్రక్కను చెమట తుడుచుచు విసరుచు కూర్చుండెను, సుశీల. కొంతసేపటికి తెప్పిరిల్లి "ఏమీ!" అని పిలిచెను.

"ఓయ్, నేనిక్కడే వున్నాను. ఇలా చూడండి"

"నన్ను క్షమించానంటేనేగాని నీమొగముచూడలేను. చక్కగా నాకుబుద్ధి నేర్పితివి. నీమేలు మరచిపోలేను."

"నే చేసిందేముంది; దైవమూ, వెంకటస్వామీ చేసారు నాకీ మహోపకారము!"

ఈరీతిగా వెంకటస్వామి డాక్టరుగారి ఋణముతీర్చివైచెను. నాటినుండి డాక్టరుగారు పరస్త్రీని కన్నతల్లివలె చూచెడివారు. భగవంతునియందు సుశీలమ్మకు భక్తి విశ్వాసములు మెండాయెను.



# ఆర్తిహరుడు

శ్రీ శివశంకర శాస్త్రి [సాహితీసమితి]

హృదయ శాంతికై నిర్జనభూమికి
నేగితి సంధ్యావేళన్
అలసభావమున నుపవేశించితి
నచ్చటిసేతువు మీదన్.

పార్శ్వమునం దశ్వత్థ మహీజము
భాసిలె పీవనపగిదిన్
మారుత చాలిత తత్పర్ణంబులు
మంజుస్వనితము చేసెన్.

ఆప్రదేశమున నిష్కంపంబుగ
నాసీనుడనై యుండన్
సమసిపోయినవి క్రమక్రమమ్ముగ
సంధ్యారాగపు దీప్తుల్

ఆవరించినవి పలుచని చీకటు
లవనీభాగం బెల్లన్
ఆకాశంబున నిలిపి వీక్షణము
లట్లే కదలక యుంటిన్.

అప్రయత్నముగ జ్ఞప్తికి వచ్చిన
నప్పుడు జీవితచర్యల్
బాల్యం బాదిగ నాటివరకును
బలవత్కార్యము లెల్లన్.

తోచిన వయ్యెడ నొక్కొక్కటిగా
దుర్నివార్యగతితోడన్
పడినకష్టములు పొందినబాధలు
భగ్నమనోరథ పంక్తుల్.

పొంగి పొరలినది దుఃఖతరంగిణి
భూరితరార్భటితోడన్
నిలుపంజాలక రోదించితి నే
నిశ్శబ్దంబుగ దేవా!

అంతకాలమును ఘనీభవించిన
యార్తిభరం బగుకతనన్
ధారాపాతముగా ప్రవహించెను
తెరుగక బాష్పకణంబుల్.

పవనాహతిచే బోధిమహీరుహ
పర్ణము లల్లల నాడెన్
సత్వరమ్ముగను దృష్టి వాలినది
పల దళమ్మునకు దేవా!

"అశ్వత్థమ్మును వృక్షములం దే"
నను గీతా వాక్కుల్
తోడనె స్ఫురణకు వచ్చిన, వంతట
దుఃఖ మ్మాగెను నాథా!

సుకృతి కవీంద్రుడు శ్రీమల్లా
శుకముఖ నిర్గళితంబౌ
శ్రీమత్కృష్ణామృత వాక్కుల నిను
చేసితి స్తోత్రము దేవా!

సమసిపోయినది దుఃఖం బంతయు
శాంతి చెందెను హృదిలో
చాలతడవు నిను భక్తిభరమ్మున
స్తవము చేసితిని నాథా!

సేతువ పోవుచు దుస్తరసంసృతి
సింధువు కీవే దేవా!
నిశ్చయంబుగా నార్తిహరుండవు
నీ వొక్కడవే నాథా!

నీసుధామధుర నామకీర్తనము
నిరతము సల్పెడివారల్
ఆర్తిహారా! దుఃఖార్ణవపారగు
లగు టబ్బురమే దేవా!

# హిందూదేశ వర్తక వ్యాపారము

మల్లంపల్లి సోమశేఖర శర్మ గారు

హిందూ దేశమునకు పడమటి దేశములకు వర్తక వ్యాపారము ఎప్పటినుండి సాగుచుండెనో కాలమునకు మాత్రమే తెలిసినరహస్యము. అత్యంత ప్రాచీన కాలమునకు పోయినకొలది దేశచరిత్రజ్ఞానమునకు మబ్బు క్రమ్మి యేమియు దోయరాకుండ పోవుచున్నది. కాని వర్తకము చాలప్రాచీనకాలమునుండి జరుగుచుండెనని తెలంపుటకుమాత్రము అవకాశము కలదు. వర్తక వ్యాపారమును సాగించుటకు అప్పటిసాధనములు వేఱు; అప్పటి మార్గములు వేఱు; అప్పటిపరిస్థితులు వేఱు; అప్పటి నాగరికత వేఱు; ఇప్పటివలె మానవుడు నీటిని, నిప్పును స్వాధీనపఱుచుకొని యుండలేదు. ఇప్పటి వలె మెఱుపు శక్తి మానవునికి దాసి కాలేదు. ఇప్పటివలె వాయుమండలము మానవునికి విహారభూమి కాలేదు. యంత్రయుగము యొక్క నూతనమైన మానవవ్యాపారమునకు గోచరము కాని పూర్వకాలమది.

ఆకాలమున వింధ్యపర్వతమునకు దక్షిణముననున్న దక్షిణాపథ నివాసులు ఓడలను గట్టి తెరచాపల నెత్తి వాయుప్రచారము నాధారముగ జేసికొని చుక్కాని నమ్ముకొని సూర్యచంద్రాదులను నక్షత్రములను తమకు మార్గదర్శకములగు సాధనములుగ జేసికొని వివిధములైన హిందూదేశపు సంపదసరుకులతో ఓడలను నింపి దరులు లేని భయంకరములైన మహాసముద్రములమీద తెగువతో నోడలను గడపుచు ప్రియమిత్రులను, ప్రియబంధువులను, మాతృదేశమును ఎడబాసి దూరభారములను లెక్కచేయక శీతవాతాతపక్లేశములనుసరకుగొనక దేశముకానిదేశమునకు ద్వీపముకానిద్వీపమునకు బోయి మహాసాహసికులై వ్యాపారము నడపినదినములవి. దక్షిణహిందూదేశమునకు మూడువైపుల సముద్రముండుటచేత దక్షిణాపథవాసులు సాహసికులైన సుప్రసిద్ధ నావికులుగ తయారగుటకు అవకాశము కలిగెను.

ఇది మూడువేలసంవత్సరములకు పైమాట. అప్పటికే మనహిందూదేశీయులు బట్టలనేతలో నేర్పుగడించియుండిరి. ప్రత్తిచెట్లనుండి ప్రత్తితీసి యేకి నూలువడికి బట్టలు నేసి హిందూదేశీయులు నేతబట్టలతో పెద్దవ్యాపారము నడుపుచుండిన దినములవి. అప్పటికే హిందూదేశమునకు చీనాదేశమునుండి పట్టుబట్టలు దిగుమతియగుచుండినను హిందూదేశీయులు కూడ పట్టుపురుగులను పెంచి పట్టుదారముతో మేలైన పట్టుసెల్లాలు తయారు చేయుచుండిరి. పారసీక సింధుశాఖ, యూఫ్రటీసు ఆస్సునదులు, కాస్పియనుసముద్రప్రాంతము, మధ్యధరాసముద్రము—ఈమొదలగు ప్రదేశములు హిందూదేశవర్తకలక్ష్మికి విహారమార్గములయ్యెను. ఫొయనీషియనులు, బాబిలోనియనులు, చాల్డియనులు, అస్సీరియనులు * ఈమొదలగు పశ్చిమదేశవాసులు హిందూదేశమునుండి బానపాలెత్తికొని తరంగపంక్తులను జీల్చుకొని వచ్చు ఓడలవైపు అత్యంతమగు ఆత్రముతో వేచియుండువారు. నెమళ్లు, బియ్యము, టేకు మొదలగుసరుకులు—ఇట్టివి దక్షిణహిందూదేశమునుండి, పశ్చిమదేశములకు ఎగుమతియగుచుండెడివి. ఈకారణముననే దక్షిణాపథమునుండి విదేశములకెగుమతియైనవాటిలో కొన్నిటి పేళ్లు తద్భవ

---

* ఫొయనీషియా, బాబిలోనియా, చాల్డియా, అస్సీరియా అనునవి పెర్షియా మధ్యధరాసముద్రములకు నడుమనున్న దేశములు. ఇవి పూర్వము ఉచ్ఛదశలోనుండి కొంతకాలము మహావైభవము ననుభవించినవి. ఆయా దేశీయులే ఫొయనీషియనులు, బాబిలోనియనులు, చాల్డియనులు, అస్సీరియనులును.

రూపములించుకమార్పుతో విదేశభాషలందును గాన్పించు చున్నవి.* బియ్య మను అర్థముగల అరిసియను ద్రవిడ పదము గ్రీకుభాషలో 'ఒరుజ' గను, లాటిన్ భాషలో 'ఒరిజ' గను, స్పెయిన్ దేశభాషలో 'అర్రాస్' గను, కన్పట్టుచున్నది. ఇట్లే మరికొన్ని పదములునుగలవు. ఏయిత రాధారములును లేని అంతటిప్రాచీనకాలమున ప్రాక్పశ్చి మదేశములకు వర్తకవ్యాపారసంబంధ ముండెనని దేశ, విదేశ భాషలందలి యిట్టి సమానపదములే రూఢిపఱుచు చున్నవి. అవియటుండ చాల్డియాకు రాజధానిగనుండిన ప్రాచీనమహానగరము 'ఉర్' అనునది ౧౯౧౯ లో త్రవ్వుమండ నందు పూడిపోయిన భవనములలో టేకు దూలములు కనిపించినవి. చాల్డియాకు ఈటేకు మలబారు తీరమునుండి హిందూదేశపు ఓడలలో అచ్చటికి వచ్చి యుండునని లజ్ఞులు నిర్ణయించియున్నారు.

దక్షిణహిందూదేశ మాదినమున సముద్రముమీద వర్తకవ్యాపారము నడుపుచుండ ఉత్తరహిందూదేశము పశ్చిమదేశములతో నాటి నవ్యాపారము జరుపుచుండెను. ఉత్తరహిందూదేశీయులు దక్షిణాపథ వాసులవలెగాక గుఱ్ఱములమీదను, ఒంటెలమీదను సరకులువేసికొని పశ్చిమహిందూదేశమునకు పెట్టనికోటగోడలవలెనున్న పర్వత పంక్తులలో సింహద్వారములవలెనున్న కనుమలగుండ అన్యభూమిని దాటి ఆఫ్ఘనిస్థానము, పారసీకము మున్నగు పడమటిదేశములకు చేరుచుండిరి. పశ్చిమపు రెండు ఎడారిమార్గములగుండ పోయి పశ్చిమదేశము లందలి గొప్పవర్తకనగరములను జేరుచుండువారు. ఉత్తర హిందూదేశమునుండి ఎగుమతియగుసరకులలో బట్టలు ప్రధానస్థాన మాక్రమించుచుండెను.

అత్యంత ప్రాచీనకాలమునందలి ప్రాక్పశ్చిమ వర్తకవ్యాపారమునకు దృష్టాంతమిచ్చుటకువాతి యాధా రములు యూదులచారిత్రములు. ఆచరిత్రల ననుసరించి యూదులకుప్రభువగు సొలోమనుకూడ ఈప్రాగ్దేశవర్తక మునకు ప్రోత్సాహమొసంగి తనప్రజలుకూడ ఈవర్తక వ్యాపారమున భాగ్గొని లాభముగడించుట కనువగునట్టి సౌకర్యములు చేసెనని తెలియవచ్చుచున్నది. అతడు సరకుతెచ్చికొనివచ్చు సార్థవాహులకు విశ్రాంతిస్థలములుగ నుండుటకై టాడ్మోర్ (పామిరా), బాల్ బెక్ (హెలి యోపోలిస్) హామత్ (ఎపిఫేనియా) అనుపట్టణములను గట్టించెననియు, అందువలననే మెసొపొటేమియాయం దలి ప్రాముఖ్యవర్తకస్థానములైన బేబిలోన్, టెసిఫాన్ సెలెన్షియా, ఆసిస్ పట్టణములు ఈప్రాగ్దేశవర్తకమువలన అమితలాభమునుపొంది చాలకాలము వర్ధిల్లెననియు దెలి యుచున్నది.

అప్పటికే హిందూదేశవర్తకమును నడుపువారిలో ఫొయనీషియనులు ముఖ్యులుగనుండిరి. వీరు అరాబియా లోను పారసీకసింధుశాఖమీదను నలుపులేర్పఱుచుకొని ఆశాపరిపూరితములైన నేత్రములతో హిందూదేశపు వర్తకనౌకల కెదురుచూచుచుండువారు. సన్నని మల్లు సెల్లాలు, సుగంధద్రవ్యములు, మంచిముత్యములు, పట్టు బట్టలు, రత్నములు మొదలగునవి వీరికి హిందూదేశము నుండి వచ్చు వర్తకపుసరకులుగ నుండెను. ఇవిగాక, ప్రకృతికి భాగ్యములసంపన్నమగు యీదేశమునుండి బంగా రము, వెండి, నంగము, మంచిగంధపుచెక్కలు, టేకు, నల్లచేవ (Ebony) మొదలగునవి, కోతులు, నెమళ్లు బియ్యము మొదలగునవికూడ నెగుమతియగు చుండె డివి. ఇవియన్నియు ఫొయనీషియనుల ప్రధానవర్తక స్థానమగు టైరుపట్టణమునకు జేరుచుండెను.

అస్సీరియనులు, బాబిలోనియనులు నడుపు నీవర్త కవ్యాపారముకాలమున హిందూదేశైశ్వర్య గాథలు పర్షియనులచెవి సోకెను. క్రీస్తుపూర్వము ౫౧౧—౪౮౫ వఱకు పర్షియాసామ్రాజ్యమును పరిపా లించిన డెరయస్ రాజు సైన్యములనుగూర్చుకొని హిం దూదేశైశ్వర్యమును హరియించుటకై పాంచాలముపై దాడివెడలెను. గ్రీకుచరిత్రకారుడగు హిరొడోటస్ లాఘవముతో పగరాజన్యకము అన్యభూమిని గతలాభముల కదిరేమొదటిమాలు. ఈదండయాత్ర వివరము లేవియు మనకు దెలియరావు. కాని డెరయస్ జయించినట్లు మాత్రము పెర్షియాదేశచరిత్రలు వక్కాణించుచున్నవి. జయించినప్రదేశమేదియో వివరముగ దెలియరాదు కాని యిప్పటి సింధుదేశమును, సింధునదికి తూర్పుననున్న పంజాబులోని కొంతభాగమును డెరయస్ విజయములలో

* J. M. S. Vol XII, P 13

చేరియుండునని చరిత్రకారులు నిర్ణయించుచున్నారు. ఈజయించినదేశమునుండి డెరయస్ రాజు పదిలక్షుల పౌనులవెలగల బంగారమును కప్పముగ గైకొనుచుండు వాడట. ఆరాజుయొక్క ఆసియాఖండరాష్ట్రములు చెల్లించుమొత్తపుకప్పములో నిదియూ డనవంతు ఉండె నట.*

డెరయస్ పంపిన సూక్రమొపలుకొని పెరిషియా, హిందూదేశములకు రాకపోకలును, వర్తకవ్యాపారమును అభివృద్ధియయ్యెను. డెరయస్ యొక్క వర్తకపునౌకలసి మహాసముద్రముకూడ పోయియొసగెను. నాడుమొదలు కొని ప్రాగ్దేశవర్తకము చాలలాభకరమైనదనియు, హిందూదేశము పాడి పంటలతోడను, సిరి సంపదలతోడను తులతూగు లక్ష్మీనివాసమనియు దేశదేశముల మ్రోగి పోయెను. ఈవార్త ఫొయనీషియనులవలనను బాబిలోని యనులవలనను, అస్సీరియనులవలనను హిందూదేశసౌభా గ్యమును గురించినగాథలు కట్టుకథలై ప్రాకిపోయి గ్రీసుమొదలగు దేశములు నిండియుండెను. అందులకు తా ర్కాణముగ అమూల్యములగు హిందూదేశపుసరకులు కూడ గ్రీషియనుపట్టణములను జేరుచుండెను. దీనికి తోడు డెరయస్ యొక్క హిందూదేశవిజయగాథలు గ్రీషియనుల సొంపుచెవులకు వినబడెను. గ్రీసుదేశీయు లప్పటికే హిందూదేశముతో వర్తకము నడిపి, అత్యంత లాభమును గడించుచుండిన అస్సీరియనులను, ఫొయనీషి యనులను, బాబిలోనియనులను జూచి అసూయపడుచు, హిందూదేశముతో స్వయముగ దాము వర్తకమునడుపుట కత్యంతము కుతూహలపడుచుండిరి. కాని అదివఱకే ఇత రుల స్వాధీనములోనున్న వర్తకమార్గములు తక్క వారికి స్వతంత్రముగ వర్తకము సాగించుటకు మార్గాంతరము లెవ్వియు గానరావయ్యెను. అదివఱకున్న మార్గములను పెరిషియనులు, ఫొయనీషియనులు, బాబిలోనియనులు ఆక్రమించుకొనియుండిరి. ప్రాగ్దేశవర్తకవ్యాపారమును తలంచుకొన్నకొలది వారికన్నులు గిర్రున తిరుగుచుం డెను. భారతవర్షైశ్వర్యగాథలు చెవినిపడినకొలది వారి కాత్రమెక్కుడగుచుండెను. గ్రీషియనువర్తకులు ప్రాగ్దే శపుసరకులు కొనుటకై టైరు మొదలగు పట్టణములకు వెళ్లుచుండినను అచ్చటివర్తకు లెక్కువలాభమును జూచు కొని హిందూదేశపుసరకులు ఎక్కువవెలకు దమకంట గట్టుచుండుటచేత ఈవిధమైన వ్యాపారము వారికి రుచి యింపదయ్యెను. అందువలన మహోత్కటమైన అభిలా షతోను, అత్యంతాతురముతోను గ్రీషియనులు తమకు హిందూదేశవర్తకమును స్వాధీనపఱచి యియ్యగల మహా నీయునికొఱకెదురుచూచు చుండిరి. దైవము వారియా వేదనను, ఆర్తమును పరికించెను. కాలము వారిమొఱ్ఱల నాలకించెను. అసమానపరాక్రమశాలియు, మహామేధా వియు, ఉదారహృదయుడు అయిన అలెగ్జాండరు గ్రీషి యనులకు ప్రభువయ్యెను. ప్రాచీనచారిత్రపాఠకులకు అలెగ్జాండరు సుపరిచితుడు. తండ్రిగారు పరదేశములను జయించెనని వార్తలురాగా తానుజయించుటకింక దేశ ములుండవు కాబోలునని ఖేదముచెందిన ధీమంతు డితడు. పరదేశవిజయాభిలాష ఆతనికి తీరని దాహ మయ్యెను. ఆతనివిక్రమఖడ్గమునకు ప్రాగ్దేశము లొక్క టొక్కటిగ తలలువంచెను. ఆతనివిజయసైన్యములు పర దేశములందు గ్రీషియనులకు రాచబాటలువైచెను. అలె గ్జాండరు ముట్టడించియు స్వాధీనపఱచుకొని దుర్గము లేదు కత్తిపట్టియు జయింపని యుద్ధము లేదు. తుదకాతడు తనదుర్జయసైన్యముతో బాంచాల మున నడుగుపెట్టెను. యవనసైంధవములు సింధునదిలో దప్పికదీర్చుకొనెను. మాననీయుడును, అభిమానధనుడును, మహాదేశాభిమానియునైన పురుషోత్తముడు అలెగ్జాండ రను బరగిన యవనప్రభునకు ఉజ్జీయై నిలిచెను. ఘోర యుద్ధమున ఆర్యపుత్రులను యవనవీరులు తేరిచూడ జాలకపోయిరి. భారతరాజ్యలక్ష్మికదుర్దశ సంప్రాప్తించిన దినము అది. యవనులకు భారతీయులకు జరిగిన ఆయుద్ధ మున విజయలక్ష్మి యుక్తిపరుడైన అలెగ్జాండరును వరిం చుట ఆశ్చర్యముకాదు. నాటినుండి హిందూదేశవర్తక మునకు గ్రీసుదేశమునుండి పంజాబుదేశమువఱకు నాటు నను, సముద్రముమీదను పెద్దరాజమార్గముపడెను. గ్రీషి యనుల భాగ్యరేఖ బయలుపడెను. ప్రాగ్దేశముతో వర్తకమునడుపువారిలో గ్రీషియనులు ప్రధానస్థానము నాక్రమించిరి. కాలచక్రము గిఱ్ఱున తిరిగిపోయెను. అది

* V. A. Smith's Early History of India, P 34.

వంశము ఉచ్చదశలోనున్న జాతులు పైకివచ్చినవి. వ్యక్తి యెట్టిదో జాతియునట్టిదేకదా! హిందూదేశమునకు వచ్చువారిలో అలెగ్జాండరు ఫొయనీషియనులకు ముఖ్యవర్తకస్థలముగనుండిన టైరుపట్టణమును జయించిన నాటినుండియు ఫొయనీషియనువర్తకము పడిపోయెను. వారిప్రాభవము యౌవనశోభవలె జారిపోయెను.

అలెగ్జాండరుపూర్వదేశ దండయాత్రనాటినుండి హిందూదేశవిషయములు గ్రీసుదేశమున కింకను పశ్చిమమునను ఉండిన రోమునగరవాసులకు బాగుగ దెలియవచ్చెను. రోమకులు (రోమునగరవాసులు) తలయెత్తి హిందూదేశముతో వర్తకముచేయు గ్రీషియనువర్తకులవైపు చూచి తలపంకించుచుండిరి. గ్రీషియనువర్తకమును కబళించివైచుటకై సమయము వేచుచుండిరి. కాని అలెగ్జాండరు యుద్ధతంత్రమున నెంతప్రవీణుడో రాజ్యతంత్రమున నంతనేర్పరి. అతడు తానుజయించిన దేశములన్నిటికి క్షాత్రపులను పేరగల స్వదేశీయులనే సామంతులుగ నియమించి, వారినుండి కప్పముగైకొనుచు పరిపాలనావిధానమును కట్టుదిట్టముచేసెను. ఈవిధమున అతనిపరిపాలనము ఉక్కుచట్రమువలె బిగిసియుండుటచేత అతడు జీవించియున్నంతకాలము రోమకులకుగాని మరెవ్వరికిగాని అతడేర్పరచినవిధానమును బ్రద్దలుకొట్టుటకుగాని, వర్తకవ్యాపారమును గ్రీషియనుహస్తములనుండి మరలించుటకుగాని సాధ్యముకాకపోయెను. హిందూదేశముతో నిరంతరాయముగ వర్తకముసాగుటకై సౌకర్యములను జేయ నెంచినవారిలో నీతడు ప్రథముడని చెప్పవచ్చును. ఈతడీయుద్దేశముతోనే మధ్యధరాసముద్రపు దక్షిణతీరమున నైలునదీముఖద్వారమున ఒక రేవుపట్టణమును గట్టించి దానికి తనపేరు పెట్టెను. ఇప్పటికిని అది అతని పేరనే అలెగ్జాండ్రియా అనబరగుచున్నది. ఇంకను ఈవర్తకవ్యాపారాభివృద్ధికై అతడు చేయనెంచిన యితరములను ఏర్పాటులును, పరిపాలనాసంబంధమైన మార్పులును కార్యరూపమును దాల్పకపూర్వమే అతడు పరలోకగతుడయ్యెను. కాని అతనితలంపులు రూపము దాల్పకపోయినను గ్రీసుమొదలగు పశ్చిమదేశములకు హిందూదేశమునకు రాకపోకలును వర్తకవ్యాపారమును హెచ్చెను. దేశమును జూడవలయునను తలంపునతో లేక వర్తకముచేయవలెనను అపేక్షతోనో గ్రీషియనులు హిందూదేశమునకు రాకపోకలు జరుపమొదలిడిరి. ఈగ్రీషియనులనే మనపూర్వులు యవనులని పేర్కొనుచువచ్చిరి. ఈయవనయాత్రికుల మూలముననే రోము మొదలగు నింకనుపడమటిదేశములకు హిందూదేశమునుగురించి బాగుగ దెలిసికొనుటకవకాశము కలిగెను. హెరొడోటస్, టెసియస్, మెగాస్తనీస్, ఏరియన్ మొదలగు యవనదేశీయులు అలెగ్జాండరు దండయాత్రను గురించియు హిందూదేశమునుగురించియు సవిస్తరముగ వ్రాసియున్నారు. మనప్రాచీనచరిత్ర తెలిసికొనుటకు ఈయవనులు వ్రాసిన గ్రంథములు మనకు జాలవఱకుపకరించుచున్నవి. వీరందఱిలో హెరొడోటస్ అనువాడు హిందూదేశమును గురించి వ్రాసినవారిలో ప్రప్రథముడు. అతడు హిందూదేశము అపరిమితమైన బంగారుగనులు కలదని వ్రాసినవాడు. హిందూదేశమునుగురించి విదేశీయులు వ్రాసిన వృత్తాంతములలో నీయవనులవే మొట్టమొదటివి. అంతకుముందు ఫొయనీషియనులు, బాబిలోనియనులు, అస్సీరియనులు మొదలగువారు హిందూదేశముతో చరిత్రకెక్కని ప్రాచీనకాలముననే వర్తకవ్యాపారమును జరుపుచుండినను వారిలో వర్తకులుగాని యాత్రికులుగాని హిందూదేశమునుగురించిన వృత్తాంతములు వ్రాసినట్లు మనకింతవఱకు తెలియదు. ఒకవేళ వ్రాసియుండవచ్చునని అనుకొన్నను అట్టిగ్రంథము లింతవఱకు మనకు దొరకలేదు. అందువలననే యవనులకు పూర్వము సాగుచుండిన వర్తకమునుగురించి తెలిసికొనుటకు మనకు వీలులేకపోవుచున్నది. పశ్చిమదేశములకు మనదేశమునుగురించి తెలుపుటకేగాక ఆనాటి మనదేశమును గురించి మనకు దెలుపుటకును ఆయవనవృత్తాంతములే యిప్పుడు ముఖ్యాధారములుగనున్నవి.

అలెగ్జాండరు నైలునదీముఖద్వారమున అలెగ్జాండ్రియాపట్టణమును కట్టించిన తరువాత మరల నింకొకమారు ఈజిప్టుదేశీయులీ హిందూదేశవర్తకవ్యాపారనాటకరంగమున కవతరించి ప్రధానపాత్రము చక్కగ ప్రయోగించిరికాని ఈజిప్టుదేశపు టాలెమీలకాలముననగాని వారి చాకచక్యము పూర్తిగ గనబడలేదు. యవనులకు హిందూదేశీయులకు జరిగిన వర్తకవ్యాపారము అనేకవిధముల

ప్రాముఖ్యమైనది. యవనబాలికలుకూడ హిందూదేశపశ్చిమతీరమునందలి బేరిగాజ్ అనబడు భరుకచ్ఛము రేవునకు ఓడలలో వచ్చుచుండువారు.* దక్షిణాపథపు ప్రసిద్ధరాజ్యాధిపతులకు యవనులు కవచధారులై అంగరక్షకులుగ నుండువారు.† భారతీయప్రభువుల కొలువుకూటములలో యవనులాసీనజన ముండినట్లు ప్రాచీనములైన హిందూనాటకములు తెలుపుచున్నవి.§ యవనభారతీయ నాగరికతావాహినులు సమ్మేళనము నొందినకాల మిదియే. ఈసమ్మేళనమున అటు యవననాగరికతయు, ఇటు భారతీయనాగరికతయుకూడ అనేకవిషయముల మార్పుచెంది నూతనశోభను వహించెను.

హిందూదేశమున కనాదికాలమునుండియు నైసర్గికదుర్గప్రాకారములవలెనుండిన పశ్చిమపర్వతములలోని కనుమలు తెరచిన సింహద్వారములై హిందూదేశమును జయించువారికిని, హిందూదేశైశ్వర్యమునపహరించువారికిని విదేశీయులకు దారియొసంగినవి. మొదట పెరిషియనులు, పిదప యవనులు నాదారిననే వచ్చి హిందూదేశపశ్చిమభాగమును జయించి, హిందూదేశధనప్రవాహము నామార్గమున పడమటి దిక్కునకు కాలువలువేసెను. నాటినుండి యుత్తరవిదేశీయులకు క్రొత్తనిష్కంటకమై ప్రాతదైగుడకు రాజమార్గమయ్యెను. కాలక్రమమున అలెగ్జాండరు తరువాత యవనరాజ్యములను పాలించుచుండిన క్షత్రపులు బలహీనులుకాగా కుషానులనబడు యక్షులు క్షత్రపులనోడించి వారిదేశమును స్వాధీనపరచుకొని తుదకు హిందూదేశమునుగూడ దమవశావర్తిగా నిలిపిరి. మధ్యధరాసముద్రతీరముల ఈజిప్టులో 'టాలెమీలు' అను పేరంబరగిన ప్రభువులు బలవంతులయి అప్పటి గ్రీషియను నాయకులనోడించి స్వతంత్రసామ్రాజ్యమును స్థాపించిరి. ఈకారణమున ప్రాగ్దేశవర్తకవ్యాపారము గ్రీషియనులచేతినుండి జారిపోయెను. గ్రీషియనులు తమకుపూర్వము వర్తకము జరుపుచుండిన పెరిషియనులవలెనే తామును కొంతకాలము ఈవ్యాపారమున గొంతకథ వినిపించి కాలక్రమమున వెనుకబడి పోయిరి. మొట్టమొదట అజ్ఞాతవాసమునుండి పరిస్థితులు అనుకూలించినంతనే పైకివచ్చి ఒక్కవెలుగు వెలిగి, తుదకధఃపతితమై మాయమాయమైన యట్టిజాతుల ప్రాచీనచారిత్రములు కాలస్వభావమును మానవలోకమునకు వర్ణించిచెప్పు గుణపాఠములు కదా!

ప్రాగ్దేశవర్తకవ్యాపారము టాలెమీల హస్తగతమైన నాటినుండియు నది వెనుకటికంటె బాగుగ వర్ధిల్లుటకు తగిన సౌకర్యము లేర్పడియెను. క్రొత్తరేవుపట్టణములు వెలసెను. దక్షిణహిందూదేశపు రేవులనుండి సరకులు పారసీకసింధుశాఖకును, అచ్చటినుండి అరాబియాతీరముననే ఏడెనుపట్టణమునకును, అంతటినుండి ఎఱ్ఱసముద్రముగుండబోయి సూయజుమీదుగ ఈజిప్టుదేశమునందలి ప్రసిద్ధనగరములకును బోవుచువచ్చెను. ఈవిధమైనవ్యాపారము నడపుటలో ఈజిప్టుదేశీయులకు హిందూదేశీయులకు నడుమ అరబ్బులు దళారులుగ నుండిరి. అటు పశ్చిమమున టాలెమీలయొక్కయు తూర్పుననిటు యక్షులయొక్కయు ప్రయత్నములమూలమున హిందూదేశవర్తకము చాల యభివృద్ధిగాంచెను. ఉత్తరహిందూదేశమునుండి విదేశీయులు హిందూదేశైశ్వర్యమును నానావిధముల విదేశములకు గొనిపోవుచుండ దక్షిణాపథవాసులు దానిని సముద్రములమీదుగ నోడలలో నెక్కించి మరల స్వదేశమునకు గొనివచ్చుచుండిరి. ఎప్పుడు విదేశీయులు కూడ హిందూదేశముననే స్థిరనివాసమేర్పరచుకొని హిందువులలో హిందువులై, దేశీయులలో దేశీయులై యిచ్చటికళలను ఇచ్చటి పరిశ్రమలను ఆదరించుట మొదలిడిరో నాటినుండి ఈదేశమునందలి ధనమిచ్చట నిలిచిపోవుటయేకాక విదేశములనుండి ధనముకూడ వర్తకవ్యాపారములమూలమున నిచ్చటికేవచ్చి యిచ్చటనే యిల్లు కట్టుకొని కాపురముసేయ మొదలిడెను. కాలక్రమమున నీయక్షులే హిందూదేశముతో వర్తకముచేయుటకు రోమకసామ్రాజ్యమునకు ద్వారము తెరచిరి.



* The Periplus of the Erythraean Sea, para 49.
† Smith's Early History of India P. 400.
§ Rawlinson, P. 47.

# కొన్ని కాకతీయ శాసనములు

మానవల్లి రామకృష్ణకవిగారు, యం. ఏ.

౧

నేను కొంతకాలము వనపర్తిసంస్థానములో నుంటిని. అప్పుడు నైజామునగవర్నమెంటువారికొఱకుఁ గొన్నిస్థలముల సంచరించి నాలుగు నూఱుల శాసనములను మసితోఁ గాగితములపై నచ్చువేయించి (Ink impressions) వానిలోఁ గొన్నిటిని జదివియుఁ గొన్నిటిఁ జదువకయు నట్టేయుంచి కార్యాంతర ప్రసక్తుఁడనై యుండుటచే వానిలోఁ గొన్ని శిథిలించుచుండుటంజేసి కొన్నిటినైనఁ బ్రకటింతు నను తలంపుతో నీక్రిందిశాసనముల నాంధ్రలోకమున కొసఁగుచున్నాఁడను. ప్రయత్నముచేయువానికి దోషములు కలుగుచున్నందున వీనిలో నానావిధదోషములు సంక్రమింపవచ్చు ననుట యాశ్చర్యము కాదు. ఏతత్పరిశ్రమవేదులు నాస్ఖాలిత్యముల కలుగకుందురుగాక!

ఈక్రిందిశాసనము కాకతీయ శిలాశాసనములలో నతిప్రాచీనమైనది. ఇంతవఱకుఁ బ్రకటితము కాదు. అనుమకొండలో నూరికుత్తరభాగమున పదిపొలములోఁ బెద్దగుండునకుఁ గొట్టఁబడిన యీశాసనము తత్సమీపమున నుండి యిప్పుడు నశించినయొకానొక శివాలయంబునకు సంబంధించినదని తోఁచుచున్నది. దీనిలో 16 పంక్తులు గలవు. 1001 శాలివాహనశక వత్సరములకు సరియగు 1079 క్రీ. శకములో-సిద్ధార్థి సంవత్సరమున సూర్యగ్రహణకాలమున కాకతీయబేతరాజు (తనపేర నిర్మింపఁబడిన?) బేతేశ్వరంబునఁ బ్రోలేశ్వరదేవునకు దీపనైవేద్యములకు భూమిదానము చేసినట్లు దీనిలోఁ జెప్పఁబడినది. దీనికి మూలమైన మసితోఁ దీసినకాగితమును గవర్నమెంటుశాసనపరిశోధకులకుఁ బంపియుంటిని.

(The oldest kakatiya Inscription of 1001. S. S. (1079 A. D)

1. శ్రీమాన్వి క్రమచక్రి శ్రీ బద్ధమ
2. ణ్డలికోత్తమః । ప్రాదాత్ప్రోలేశ్వ రేశాయ
3. దీప మాచంద్ర తారకం॥ స్వస్తిశకవర్షంబు
4. లు ౧౦౦౧ యగు సిద్ధార్థి సంవత్సర
5. సూర్య్యగ్రహణంబున శ్రీమన్మహామ
6. ణ్డలేశ్వర భేతమయ్యలు బేతేశ్వరంబున......త
7. ప్రోలేశ్వరదేవునకు నందదీవియకు నిత్యం
8. పండ్రెండుమానికలు నేయి యాచం
9. ద్రతారకంబుగఁ బోయునట్టు గాం దే -
10. ...నెప్పి ని......ర......వ్వ - స్వరమయ్యద్ద......మ (?)
11. నీరినేల యంబదిమఱుతులు
12. మోడజాళ సుఢనయల్లునుగాను సర్వబాధా (?)

13. పరిహర్త్రము దణ్డుగువెలిగా నడపువారు
14. దేవర కాపై సుఖంబుణ్డు వాణ్డు ॥ స్వదత్తం ప
15. రదత్తంవా యో హరేత వసుంధరాం । షష్టిర్వర్ష
16. సహస్రాణి విష్ఠాయాం జాయతే క్రిమిః

దీనిలో 10, 12, పంక్తుల నచ్చుకాగితములో మొదటఁ జదివినప్పుడు తోఁచకపోవుటచేఁ దోఁచినట్లు వ్రాసికొనియుంటిని. వానినిమాత్రము మరల నచ్చుకాగితమునుగాని శాసనమునుగాని చూడఁదటస్థించినవారు సవరించుకొనవలయును.

ఇందు విక్రమచక్రి యనఁగాఁ బాశ్చాత్యచాళుక్యచక్రవర్తియగు త్రిభువనమల్లుఁడు. కాకతీయరాజులు మొదట వారికి మండలికసామంతులై యుండిరి.

౨

కాకతీయుల ప్రాచీనరాజధానియగు ననుమకొండలో సిద్ధేశ్వరమను నొకకొండమీఁదఁ బెద్దబండపై సమగ్రముగ నొకశాసనము కలదు. దానియెదుట నొకచిన్నదేవాలయము కలదు. ఆశాసనమునఁ గాకతీయులప్రాభవోన్నతులఁ గావ్యరూపముగ వర్ణించి శాశ్వతముగ శిలాలిఖితము చేసి కవిలేఖకులు కీర్తిధ్వజమెత్తఁ బ్రయత్నించిరి. కాని దైవోపహతులై 26 పంక్తులు చెక్కించి కొన్ని శ్లోకములుమాత్రమే లోకమున కిచ్చినట్లు వ్యక్తమగుచున్నది. దీనిలో నాంధ్రదేశసౌభాగ్య ప్రశంసయు నేకశిలానగరవర్ణన ప్రారంభమును గలవు. కొన్ని సంవత్సరములక్రిందట నే నతిశ్రమమునఁ జాలసేపునుండి నీశాసనమును గాకితములపై నచ్చుతీసి 19 పంక్తులవఱకును వ్రాసికొని యప్పటికి నిలిపివేసి చెన్నపురికి వచ్చుటచే నాయచ్చుకాగితములు వనపర్తిసంస్థానములోనే చిక్కిపోయినందునఁ బైభాగమున సరిగా వ్రాసికొనఁజాలకుండఁగాఁ బ్రాచ్యలిఖిత పుస్తకభండారమున మెకంజీదొరవారి పండితులలో నొకఁ డీశాసనము నచ్చుటనే చదివి దాని వ్రాసికొనిన కాగాదర్శ మాభండారములోనే లోకల్ రికార్డులలో నుండఁగాఁ జూచి వ్రాసికొంటిని. అతఁడు శిలనుజూచి చదివినందున బహుదోషములపాలయ్యె. ఈక్రిందఁ బ్రకటింపఁబడిన శాసనములో 18 పంక్తులవఱకును సామాన్యముగా దోషములు లేవని గ్రహింపవలయు.

ఇందులోనిసంఖ్య పంక్తిసంఖ్య. అక్షరములు రుద్రదేవగణపతిదేవుల కాలము నాఁటివి.

1. శ్రీ॥ ఆంధ్రా స్సంతి గరీయాంసః కాంచనప్రాయశాలయః । యథా హాటకశైలస్య కట
కా రత్నశాలినః॥ కేదారా యత్ర
2. శాలీనాం తరంగితజలాంతరాః । కృష్ణాంగచ్ఛాయహరితా యథా జలనిధే
టాః । శాలికా రక్షిణీహ సతాళైః కంకణనాద
3. తః । త్రాసితాః కిల గచ్ఛంతి యద్దీత్యా సద్గిరాజితాః॥ రసాలసాలహింతా
లతాలకేతకకర్త్తనే । కాంతారే యత్ర కాంతానాం జా
4. తః శృంగారసంగరః । రసాలహాలాగంధేన హసనాంగీకృతాదృశః । అలీ
నాం యత్ర హాహంతా లుఠయంతి నగేహినీః॥
5. సంతానకాంతారలతా గంధగ్రంథిలచేతసః । యత్రాలయాః కర్ణికార
నిర్గంధేన నిరంతరాః॥ హాలిక స్త్రీకటాక్షాణాం కాంత్యా

6. గళితచేతనాః । న సీదంతి కృతిం యత్ర కేచి త్కుహకనందనాః॥ గతాని
హాలికస్త్రీణాం లక్షయంతి నిజై గణ్యైః । నేత్రాంతనేత్రై హర్ష
స్యంతి హారిణ్యశ్చ య

7. దంతరే॥ కేదారసస్యకాంతీనాం సంక్రాంతానాం తతః సరః । చలేన
నీర నిచయా యదీయా జాయతే శుకాః॥ శంఖకంకణజాలస్య లల

8 నాకరసంగినః । కళేన యత్ర నాదేన కలహంసాః శతం జితాః॥ లక్ష్యంతే
యత్ర నిచితా లక్షశః శాలిరాశయః । గేహాంగణే యథా కాలే నట (...)

9. ంతిధరా ఘనాః॥ ఖలాః శాలీనతాం యాంతి యత్ర కంటకరక్షితాః । కటంకి
య నికటనిరాఘాటకటస్థలాః॥ కదళీకాననే యత్ర హరితచ్ఛ

10. ద్మహారిణి । కీరా నిరంతరం యాంతి నిజజాతీయశంకయా॥ హాలాహలాత్యః
సతతం యత్రత్యోత్సాహకారతః । నిర్దిశంతి నిరాతంకం గర్జనాయ శిఖండి

11. నః॥ యత్ర కాంచనసంకాశా రసాలానాం రజఃకణాః । టంకఘృష్టస్య
తరణే యథా కేశా శ్చకాసతి । కర్షక స్త్రీకేశహస్తే హస్తనాళికసంయుతిః ।
సహారా (......)

12. యత్ర ధత్తే శంకాతంకం శిఖండిని॥ నగరాణి గరీయాంసి నారీరమ్యాణి లక్ష
శః॥ స్థానీయానాం సహస్రాణి యత్ర త్యాన్యతిశేరతే । సనందనం చైత్రరథం న

13. చ యత్ర నిరీక్ష్యతే॥ కాంతారం నందనం కృత్యం కృత్వా చైత్రరథాహ్వయాః ।
కరిణః కరిణీసక్తిం యత్ర సంశ్రితతారకాః॥ సకళత్రాః శంకయంతే గాత్ర

14. హీనా గజాననాః ॥ నిచయై రాసతాసీనైః శతశః స్యందనా ఘనాః । సదంతః
కింకిణీజాలై యథా కాంతై స్తడిద్గణైః॥ తటాకా యత్ర శతశః సాని

15. ణ్యశ్చ సహస్రశః । సరిన్నాథార్థ దర్శయంతి తేషాంచ కిల గేహినీః॥ ఆదిత్య
ఘృష్టిసంకాశా దృశ్యంతే యత్ర దృష్టయః । క్షీరం దదత్యః కృత్యా

16. నాం త్రిజగ త్యఘనాశికాః॥ ఏ కాఒ స్త్యేకశిలాఖ్యాత్ర నగరీ యా
గరీయసీ । సాగరాంతాం ధరాం కృత్వాఽఙ్గం కాంతా కాంతం నిరీక్ష్యతే॥ కళాగి
రః కృశాంగీణాం

17. రశనాః కింకిణీఘనాః । యత్రాంగదాని చాంఘ్రీణాం నిద్రాహాన్యై కిల స్త్రియః॥
చంద్రశాలాసంశ్రితానాం చంద్రాస్యానాం నిరంతరైః ।

18. యత్రాస్య చంద్రైర్గగనే చంద్రజ్ఞానం నశంక్యతే। యత్ర రథ్యాంగణగతా
ఘనసారస్య రాశయః। దృశ్యంతే చంద్రికాసంఘా యథా......

19. ణః॥ ఇంద్రనీలై శ్చంద్రకాంతై స్తథా యత్ర నిరంతరైః। అంధకారా శ్చంద్రికా
శ్చ దర్శయంతి కదా గృహాః॥ కాంతా ఈక్షంతి యత్కాంతాః కాంతానాం హృద
యం దృశా। కాంతాయా ఘాతి యత్కాంతా కాంతానాం హృదయం దృశా।
కళిందకన్యాలహరీ సంఘరింఘాణహారిణః। కటాక్షా యత్ర నారీణాం దృ
ష్టయతి నరింజనాః (?)। హారారమ్యేణ తరళా యత్రారాళదృశాదృశః।
బద్ధరేఖా దర్శయంతి రతినాథకరస్థితాః। అధరా యత్ర నారీణాం సక
లా నధరీకృతాః। ఆఖ్యాంతి నళినశ్రేణీః కటాక్షాశ్చ కటకుతాః (?)॥
తర్జయంతి యత్ర నార్య కరకంకణకింకణీః। ఆక్రీడదీర్ఘికాహంసీ
గతిశస్కారతాం గతాః। కణకారశ్రీకిరణసంకీర్ణా స్నహారిదంకణమ్ (?)। అంక
ణాయంతి సంగీతం కతశౌఘు యదంగణాః॥ కర్ణకహ్లారకణికా హేలాశశి
కరోహి నః। యత్రాళిన స్త్రాసయంతే కాంతాకటకఝుంకృతైః॥ కటాక్ష
కాంతికళయా హాసచంద్రైః కళంకితైః। సహాసయంతి నాదానాం
రూస్త్రాయణనేకణాః కసనికా కళంకిన్యా కాంతిచంద్రికయా స్త్రియః
ఉల్లోళయంతి యత్రత్యా శ్చంద్రికాహారిణః ఖగాః॥ లలాటినార్ధ
చంద్రేణ కృత్స్నచంద్రై స్తదాననైః। యదంగనాః కళాస్త్రాం కిం న జానంతి
నిజాజతాః (?)। నాసాలంకార కాంతి... నక్షత్ర....................

ఈశాసనము చదివిచూడఁగాఁ గాకతీయులసామ్రాజ్యసర్వమును గావ్యరూపముచేసి కల్పాంతస్థాయిగా శిలో
ట్టంకితము గావింపవలయునని స్థిరేశ్వరము కొండమీఁద మఠముకట్టుకొని నివసించిన యొకానొక శైవాచార్యుఁడు
ప్రయత్నించినట్లు తోఁచుచున్నది. ఇట్లు శిలోట్టంకనములను ప్రశస్త కావ్యనాటకములు పెక్కులు గలవు. ధారా
నగరమునఁ బ్రాకృతకావ్యము భోజరాజకీర్తినంద్రికో ల్లేఖమై రెండుశిలలపై లిఖింపంబడియున్నది. అచ్చటనే
మదనమహాకవికృతమగు పారిజాతమంజరియను నాటిక యర్జునవర్మప్రతాపమును వర్ణించునది శిలాలిఖితముగలదు. చేది
దేశావతంసమగు విగ్రహరాజు కీర్తిప్రతాపముల నెలకొల్పు హరికేళి యను నాటకము శిలోట్టంకితమై యున్నదిగదా!



డమే కాకుండా ఆసంచి పరిమాణము ౨,౦౦౦ లఘునపుటడుగులైతే బలిష్ఠుడైన ఒకమనుష్యునికూడా పైకి తీసుకొనివెళ్లగలదు. ఈసంచికి యంత్రసహాయము లేదు కాబట్టి గాలి ఎటువీస్తే అటుపోతుంది. యంత్రాలు లేక పోయినా, మనుష్యులు నడపకపోయినా సముద్రము మీద ఓడగతీ అంతేకదా! ఈపైదానిని 'బెలూన్' అంటారు. దీనిని కొద్దిసంవత్సరములక్రితము మదరాసుపార్కులో ప్రదర్శించినారు. దీనిలో ఉదజనివాయువే ఉండనక్కరలేదు. వేడిగాలిఅయినా, పొగఅయినా ఉంటేచాలు. ఇటువంటి 'బెలూను' కు యంత్రములు తగిలించి మనయిష్టమువచ్చినట్లు నడిపించేదాని పేరే గాలి ఓడ (Airship). నిర్మాణమునుబట్టి యీ గాలిఓడలు మూడువిధాలు (1) దూలపుచట్రాలోడలు (Rigid), (2) సంచిఓడలు (Non-rigid), (3) ఉభయములు (Semi-rigid). మొదటిరకము ఓడకు మధ్యభాగమంతా గుండ్రముగా అల్యూమినము దూలాలతో కట్టుదురు. ఆదూలాలపై గుడ్డలు, తోళ్లు కప్పుదురు. లోపల బోలుగా ఉండే ప్రదేశములో ఉదజని సంచులుంచుతారు. ఇవి సాధారణముగా ౧౯ ఉంటవి. మొత్తముమీద ఇన్ని సంచులలోనూ ౧౯ లక్షల ఘనపుటడుగులఉదజని ఉండును. ఓడ సుమారు ౭౦౦ల అడుగులపొడుగు, ౬౫ అడుగుల వెడల్పుకలిగి ఉంటుంది. దీనిఆకారము చేపవలె ఉంటుంది. ముందుభాగము ముద్దుగాను, వెనకభాగము మొనదేరి ఉంటుంది. ఇట్లా ఉంటె ఒక్కవిశేషము కలదు. చేప నీళ్లలో పోతూ ఉన్నప్పుడు నీటిప్రవాహానికేమీ ఆటంకం లేకుండా నీరు కోసుకుపోతూ ఉంటుంది. అట్లే గాలికూడా ఏమీ గజిబిజికాకుండా ఉండాలంటే గాలిలోపోయే ఏఆకారమైనా చేపలాగ ఉండాలి. అందుకనే ఇప్పుడిప్పుడు మోటారుబళ్లు అన్నిటినీ చేపవలె తయారుచేయాలని ప్రయత్నాలు చేస్తున్నారు. ఇందువల్ల మోటారుబళ్లు నడిపించడములోకూడా కొంత సులువుంది. ఎట్లంటే మోటారుబండి మత్స్యాకృతిలో ఉంటె దానిగమనానికి గాలి ఎదురొడ్డకుండా బండే దానిని కోసుకుపోతూ ఉంటుంది. ఇందువల్ల బండినడపడానికయ్యేఖర్చుకూడా తగ్గుతుంది. ఇందుకనే గాలిఓడనుకూడా మత్స్యాకారముగా చేయడము. గాలిఓడములాగ్గా ౬౮ టన్నుల బరువు ఎత్తివేస్తుంది. ఓడలోనియంత్రాలకు ౧౦౦ మోటారుబళ్లశక్తి (1600 H. P.) ఉంటుంది. ఓడకువెనుకభాగమున రెక్కలు రెండు అడ్డముగాను, రెండు నిలువుగాను ఉంటవి. అడ్డముగా ఉన్నవాటిని క్రిందికి పైకి ఎగిరేటందుకున్నూ నిలువుగాఉన్నవాటిని చుక్కానివలె ప్రక్కలకు నడిపేటందుకున్నూ ఉపయోగిస్తారు. గుండ్రనిఆకారముగల ఓడమధ్యభాగములో ఉండేదూలమునుంచి క్రిందికి రెండుబళ్లు వ్రేలాడుతూ ఉంటవి. ఇవి రెంటికన్న ఎక్కువగాకూడ ఉండవచ్చును. వీటిలో ముందుదానిలో యంత్రాలు, ఓడనడిపేనావికులు ఉంటారు. రెండవదానిలో ప్రయాణీకులు ఉంటారు. ఈబళ్లు మనయిళ్లలోని పెద్దవడవలంత పెద్దవిగ ఉంటవి. ఓడ భూమిమీదికి దిగినప్పుడుదానిలో దెబ్బతగలకుండా ఉండేటందుకు బళ్ల అడుగుభాగమున గాలిసంచులు తగిలిస్తారు. ఈఓడనే 'జప్లిను' అంటారు. ఇదిగంటకు ౬౦ మైళ్లువొప్పున పోతుంది. ఎకాయెకీని ౨,౦౦౦ మైళ్లుప్రయాణము చేయడమునకు తగిన సామగ్రి దానిలో ఉంటుంది. ఈఓడలలో ఉపయోగించే సంచుల నిమిత్తము ఒక్కొక్క ఓడకు ౫,౦౦,౦౦౦ల పశువులతోళ్లు కావాలి!

దూలపుచట్రాలోడను గురించి తెలుసుకొన్నట్టయితే మిగిలినవాటిని అర్థముచేసుకోవడము కష్టము కాదు. రెండవరకమైన సంచిఓడలో దూలపుచట్రాలోడలోవలె దూలాలుండవు. సంచులు దిట్టముగా ఉంటవి. వాటినుండే మనుష్యులెక్కేబళ్లు వేళ్లాడగట్టుదురు. ఈరకము ఓడలలో ఉన్న గొప్పనష్టం ఏమిటంటే సంచులు తోళ్లతో చేయబడ్డప్పటికీ లోహమంతగట్టిగా ఉండకపోబట్టి సంచి చిరిగిపోవచ్చు. దానితో బళ్లు నేలమీద పడిపోవలసినదే. కాని వీటినికట్టడము చాలాసులభము. అందువల్లనే బ్రిటిషువారు మొదలైనవారు వీటినే ఎక్కువగా తయారుచేస్తారు. జర్మనీవారికిమాత్రము జప్లినులు కట్టడములో ఆసక్తి ఎక్కువ.

సంచిఓడకు ఇంకొకకష్టము ఉంది. ఏవాయువునైనా సంచిలో ఉంచినట్టయితే కొన్నాళ్లకు చిల్లులు లేకపోయినా అది తగ్గుతుంది. సైకిలుబండిచక్రాలకు గాలికొట్టి వారమురోజులైనతరువాత చూస్తే అందులోగాలి తగ్గి



ఉదజని సంచి

నట్టు స్పష్టముగా కనబడుతుంది. దీనికికారణము ఏమిటంటే, ప్రతిపదార్థానికీ స్థూలస్పష్టికి కనబడని రంధ్రాలున్నవనీ, ఆరంధ్రాలగుండా వాయువు పోతుందనీ ఒక సిద్ధాంతము. అందులో ఇతరపదార్థాలకంటె సంచికి రంధ్రా లెక్కువ. దీనికితోడు ఉదజని గాలికంటె తేలికైనదగుటచేత ఎక్కువత్వరితముగా పోతుంది. ఇందువలన సంచిఓడలలో ఉదజనిగాలి తగ్గినకొద్ది సంచికి పటుత్వము తగ్గి ముడతలుపడిపోతుంది. అందువల్లకూడా బళ్లకి అపాయం కలుగుతుంది. దూలపుఓడలలో అట్లుకాదు. సంచిలో గాలితగ్గినా, బళ్లు దూలాలనుంచి వ్రేలాడదీయడముచేత పడిపోవు. సంచిఓడలలో ఉదజని తగ్గినప్పుడల్లా మళ్లీ దానిని తయారుచేసేటందుకు అవసరమైన యంత్రాలు వాటిలోనే ఉంటవి.

ఈఓడలు చేయడమునకు రెండుసంవత్సరాలైనా పట్టును. ఉదజని తయారుచేయడమునకు మధ్యదారిలో యంత్రశాల కట్టించవలెను. ఎంత నేర్పుతో ఓడలు కట్టినాఏదైనాఅపాయమువచ్చిందంటేఅంతానాశనమే.

కొద్ది సంవత్సరాలక్రిందట అమెరికా వారు బ్రిటిషువారిని ఒకఓడ కట్టియివ్వవలసినదని పురమాయించినారు. బ్రిటిషువారుకూడా చేతనైనంతవరకు కష్టపడి ఓడ కట్టినారు. బ్రిటిషువారు కట్టిన ఓడలలోనికల్లా అది చాలా పెద్దదని పేరుపడింది. అంతా తయారయిన తరువాత అది అమెరికాకు ప్రయాణమయింది. ఉదజనిగాలి నింపినారు. లంగరు త్రాళ్లు విడిచిపెట్టినారు. ప్రయాణీకులు కిటకిటలాడుతూ ఉండగా ఓడ మహావైభవముగా బయలుదేరింది. రివ్వున పక్షిలాగు ఎగిరిపోయింది. అమెరికాదగ్గర కింకారాకపూర్వమే తటాలున క్రిందపడింది. ప్రయాణీకులంతా మృత్యుగహ్వరమున పడ్డారు. ఏవిధామిగలలేదు. బూడిదైన దూలాలూ తక్కడపడిపోవడమునకు కారణం ఏమిటోఅని ఆలోచించారు. కొందరు ఉదజనిగాలి నిప్పంటుకొన్నదన్నారు (ఉదజనిగాలికి నిప్పంటించినట్లయితే అది పేలుతుంది). కొందరు బళ్లువ్రేలాడేదూలాలు విరిగినవన్నారు. ఎట్లయితేనేమి ఎంతోవ్యయప్రయాసలతో కట్టిన ఈఓడ (R38) మొట్టమొదటిప్రయాణములోనే మోసపుచ్చింది.

గాలి పడవలు

రెండవ తరగతి విమానము గాలిపడవ (Aeroplane). ఇది గాలికంటె బరువెక్కువ. పిల్లవాళ్లు గాలిపటము ఎగరవేస్తూఉంటే మనము చూస్తున్నాము. గాలి బాగా వీస్తున్నప్పుడు పిల్లవాడేమిచేస్తాడు? ఒకచోట నిలబడి దారమువిప్పి పటాన్ని ఎగరవేస్తాడు. గాలివేగముకొద్దీ పటముకూడా పైకెగురుతుంది. చివరకు

మేఘమండలాని కంటుతుంది. అప్పుడు పిల్లల కెంతో ఆనందము. గాలి ఏమాత్రమూ చలనము లేకుండా ఉంచ నుకొందాము. అప్పుడు చలనము కలిగించేటందుకు పిల్లవాడు గాలిపటముతో పరుగెత్తును. అతని వేగము కొద్దీ పటముపైకి పైకెగురును. కాబట్టి గాలిపటము పైకెగరవలెనంటే గాలి పటమైనా చలనావస్థలో ఉండాలి. లేకపోతే గాలియైనా రివ్వురివ్వుమని వీస్తూఉండాలి. ఇందులో ఏదైనా ఒకటే. కాని గాలి ఎప్పుడు వీస్తుందో ఎప్పుడు మానుతుందో ఎవ్వరికీ తెలియదు. చివరకు తోకచుక్కమార్గమైనా కనిపెట్టినాము కాని శాస్త్రజ్ఞులు గాలినిగురించి ఎక్కువలోతు తీయలేకపోయినారు. గాలిపటానికీ గాలిపడవకు ఒకటే సూత్రము. ఈపడవ గాలికంటె ఎంతబరువైనా పక్షులవలె తేలికగా పైకెగిరిపోతుంది.

రెక్కలు చదునుగా బల్లపరుపుగా ఉండక ఒకప్రక్కకు కొంచెము వంగి ఉండును. పడవ వెనుకభాగమున చుక్కాని ఉండును. ఈరెక్కల సహాయముతో నావికుడు యంత్రాలు పడిపోకుండా గాలియొక్క చాపల్యమునుబట్టి పడవను నడుపుతాడు. గాలి పడవనడపడము చాలా కష్టము. నావికుడు తెలివైనవాడైతే గాలిఓడ మాత్రముగ అపాయము లేకుండా ప్రయాణముచేయవచ్చును. పడవ క్రిందకిదిగినప్పుడు నేలరాసుకోకుండా సులభముగా దిగేటందుకు క్రింద చక్రాలు ఉండును. ఈపడవలు 3౦ అడుగులు పొడుగు, ౫ అడుగులు వెడల్పు ౬ అడుగులు ఎత్తు ఉండును. 3 మొదలు ౫ టన్నులబరువు ఇవి మోసుకుపోగలవు. గంటకు నూరుమొదలు రెండువందలమైళ్లవరకు ప్రయాణముచేయగలవు. భూమిమీద




రెండురెక్కల గాలిపడవ

గాలిపడవలో నిముఖ్యమైనభాగాలు పటమువాస్తే తెలుస్తుంది. మొదటిభాగములో యంత్రాలుండును. ఇవి మనము ప్రతిదినమూ చూచే మోటారుబండి యంత్రాలవంటివి. ఈయంత్రములతర్వాత ప్రయాణీకులు కూర్చుండేస్థలము, తరువాత పడవనడుపు నావికునిస్థలము ఉండును. ఈపడవముందరిభాగానికి రెండురెక్కలుండును. ఈరెక్కలు రెండు కలిసిపోకుండా కొయ్యదూలలు (Supports) నిలబెట్టి వాటిని తీగెతో బిగిస్తారు. ఈరెక్కలమూలముననే పడవ పైకెగురును. ఈ

నుంచి పైకిరెండుమూడుమైళ్లు పోతవి. వీటిని కట్టేటందుకు కొద్దివారాలుపట్టును. మొత్తం అంతా ౫౦,౦౦౦ ల రూపాయలతో వీటిని కట్టవచ్చును.

ఈగాలిపడవలలో అనేకవిధములైనవి ఉన్నవి. ఒకరెక్కఉంటే ఒంటిరెక్కపడవ (Mono-plane) రెండురెక్కలుంటే రెండురెక్కలపడవ (Bi-plane) మూడుంటే మూడురెక్కల పడవ (Tri-plane) అని అంటారు. ఎంత ఎక్కువబరువు తీసుకువెళ్లవలసివస్తే అన్నిరెక్కలు ఎక్కువఉండాలి. సాధారణ

ముగా రెండురెక్కలపడవలుఎక్కువ. ఇవికాక నీటిపడవలు (Hydroplanes) అని ఉన్నవి; అవిసముద్రములో కూడా ప్రయాణము చేస్తవి. అవి యుద్ధసమయములో చాలా ఉపయోగము. ఇప్పు డిప్పుడు మరొకరకము పడవలు వస్తున్నవి. వాటిపేరు 'గ్లైడర్సు' అంటారు. ఇవి కూడా గాలిపడవలేకాని నీటికియంత్రాలుండవు. కొక్కలమోస్తరుగా ఉండే కొన్నిభాగాలు నీటికి తగిలించగానే ఎగిరిపోతాము.

గాలిపడవలు - గాలిఓడలు:— ఈరెంటింటిలో ఉండే మంచిచెడ్డలు ఆలోచింతము.

పడవఎక్కువవేగముగా పోతుంది. గంటకు రెండు వందలమైళ్లు చులాగ్గా ప్రయాణము చేయగలదు. ఓడ గంటకు ౬౦ మైళ్లకంటె అధికముగా పోలేదు.

పడవలు కట్టడములో ప్రయాస తక్కువ. వ్యయముకూడ తక్కువే. ఓడల కట్టుకాదు. వ్యయప్రయాసలు మెండు. ఇంతవ్యయప్రయాసలకూ ఓర్చి ఓడకట్టితే దానికి అపాయమూ ఎక్కువ.

ఓడలలో సౌఖ్యమెక్కువ. ఆడు కొనేటందుకు స్థలాలుకూడ ఉంటవి. పడవలలో కూర్చుండడమేకష్టము. చిన్నపట్టణము 'మోటారు బస్సు' లలో కూర్చున్నట్లు కూర్చోవాలి.

ఓడలలో ఎక్కువబరువైన సామానులు తీసుకు పోవచ్చును. గాలిపెట్లూగున్నా ప్రమాదము సంభవించనంతసేపు, అపాయము రానంతసేపు ఓడలలో సుఖముగా ప్రయాణము చేయవచ్చును. యంత్రాలు చెడిపోయినా ఓడకు భంగము రాదు. పడవల కట్లు గాదు. గాలి చలనము లేకుండా ఉండి యంత్రాలు చెడిపోయినట్లయితే అపాయము సంభవించినట్లే.

ఈపైసంగతులనుబట్టి విమానశాస్త్రజ్ఞు లేమంటారంటే ఒకదేశమునుంచి ఇంకొకదేశానికి ప్రయాణము చేసేటప్పుడు ఓడలను, దేశములోనివేర్వేరుచోట్లకు వెళ్లేటందుకు పడవలను ఉపయోగించాలంటారు.

## విమాన యంత్రములు

పైనివ్రాసినసంగతులనుబట్టి మనము ముఖ్యముగా గ్రహింపవలసిన దేమిటంటే పడవలలోనియంత్రము రెండుపనులు చేస్తుంది. ౧. ఓడలమోస్తరుగ ప్రయాణము చేయడము. ౨. గాలిలో చలనములేనప్పుడు పైకెగరడము నకు సహాయము చేయడము. ఈరెండు పనులనూ ట్టి యంత్రాలు చాలా ముఖ్యమైనవని గొంచి స్పష్టముగా ఈదిగువ వివరిస్తాను.

స్థూలదృష్టిని ప్రతియంత్రమును రెండుభాగములుగ విభాగింపవచ్చును. అందొక భాగము చలనశక్తి కలిగించేటటువంటిది. రెండవది ఆశక్తిని ఉపయోగించేటటువంటిది. యంత్రము నడుచుటకు ప్రధానమైన చలనశక్తిని పుట్టించుటకు సాధనములు నాలుగు. వాటిలో మొదటిది నీటి ఆవిరి. క్రింది పటమును చూడుడు. నీటిని ఆవిరిగా మార్చినతరువాత దానిని ఒకపీపా (Cylinder) వంటి పాత్రలోనికి వదలుతారు.



నీటియావిరి యంత్రము

అక్కడ అది ఒకకాడిమాదిరిగఉన్న 'అ' అనేభాగాన్ని ముందుకు తోస్తుంది. అన్నము ఉడుకుతున్నప్పుడు కొంచెము ఎక్కువగా నీళ్లు పోసిఉన్నట్టయితే ఇత్తడిసిబ్బి మీద రాయిపెట్టిన ఆరాయికూడ పైకెగరడము చూస్తున్నాము. ఇట్లాగే 'అ' అనేకాడిని ముందుకుతోసి దానివల్ల 'ఇ' అనేచక్రాన్ని తిప్పుతుంది. ఈనీటిఆవిరికి బదులుగా కిరసనాయలునో లేక దానికన్న ఎక్కువత్వరగా ఆవిరిగా మారే పెట్రోలునో ఉపయోగింపవచ్చును. ఇదే ఇప్పుడు మోటారుబళ్లలోను, ఇంజనీరుదొరలెక్కే పడవలలోను ఉపయోగిస్తున్నారు. దీనివల్ల కలిగే మేలు ఆలోచింతము. నీటిని ఆవిరిగా మార్చడమునకు ఎంతో సామగ్రి కావాలి. మొట్టమొదట ఒకపెద్దకాగు(Boiler) ఉండాలి. పెళ్లిళ్లలో వేణ్ణీళ్లు కావాలంటేనే ఎంతో పెద్దకాగు ఉపయోగించేటప్పుడు యంత్రానికి నీటి ఆవిరి సప్లయి చెయ్యవలెనంటే సాధారణమైనకాగు పనికిరాదని తోచవచ్చును. ఇక ఇంతప్రయాసపడి సంపాదించిన ఆవిరి యంత్రముచేరేలోపలనే చల్లగాలి తగు

లుటవల్ల తీపుగా మారుతుంది. దీనికి ఇన్ని అవస్థ లుండ బట్టి దీనిని మోటారులలో ఉపయోగింపరు. పోనీ నూనె ఉపయోగింతమంటే మనదేశములో నూనె బావులు ఇంకా దొరకలేదు. నూనె అంతా మనకు అమెరికాదేశము నుండి రావాలి. వారి కేమాత్రము కోపమువచ్చినా ఈనూనెయంత్రాలే మన ముపయోగించేటట్టయితే మన కొంప మునిగింది! ఇట్టిసంగతిస్థితిలో ఉన్నప్పటికీ మోటారుబళ్లలోను విమానములలోను ఇదే యుపయోగిస్తున్నారు. ప్రతిరోజు మనము వినే విద్యుచ్ఛక్తి పనికిరాదా అని కొందరు ప్రశ్నింపవచ్చును. విద్యుచ్ఛక్తి చాలా తమాషాలు తయారుచేస్తుంది. తంతి లేకుండా వార్తలు నలుదెసలకు పంపించడము, వెలుతురు ప్రసారము—ఇవి, అవి అన్నమాటేమిటి—సృష్టికి ప్రతిసృష్టి చేస్తోంది. ఈవిద్యుచ్ఛక్తి ఏలావస్తుందో మనము తెలుసుకోవాలి. అయ



విద్యుచ్ఛక్తి పుట్టించువిధము

స్కాంతము ముక్కలు రెండు ఉన్నవనుకోండి. వాటి మధ్య ఒక ఇత్తడితీగె తిప్పినట్టయితే తీగెలో విద్యుచ్ఛక్తి పుట్టుతుంది. ఎట్లన, చలనము + అయస్కాంతము=విద్యుచ్ఛక్తి. ఈతీగెను తిప్పేటందుకు నూనెయంత్రాలైనాసరే లేదా ఆవిరియంత్రాలైనా సరే. ఇవిగాక చలనము పుట్టించడములో జలపాతము (Waterfalls)ను ముఖ్యముగా ఉపయోగిస్తారు. అనగా, నీరు ఎత్తుప్రదేశము నుంచి క్రిందికిపడేటప్పుడు కొంతఉరవడితో పడుతుంది. దానివల్ల తీగెచుట్టబడినచక్రము గిర్రునతిరుగుతుంది. ఈ విద్యుచ్ఛక్తివిమానాలలో ఉపయోగిస్తేవాటిని నడపడము చాలతేలిక అవుతుంది. కానిఒక్కచిక్కున్నది. విద్యుచ్ఛక్తిని తయారుచెయ్యవలెనంటే ఎంతోసామగ్రి కావలెను. పోనీ, క్రిందతయారుచేసి తీసుకొని వెళ్లుదామంటే విద్యుచ్ఛక్తిని దాచిఉంచేటందుకు శాస్త్రజ్ఞులు తేలికైనసదుపాయమును ఇంకా కనిపెట్టలేదు. దాచుటకు వీలులేనప్పుడు విద్యుచ్ఛక్తి తయారుచేసి ఏమిప్రయోజనము? కాబట్టి విమానాలలో ఇంతవరకు విద్యుచ్ఛక్తి ఉపయోగానికి రాకుండాఉంది కాని గాలిఓడలలోమాత్రము తగుమాత్రముగ దీనిని తయారుచేసి దీపాలుపెట్టుట కుపయోగిస్తున్నారు.

## ఉపయోగములు

గాలిఓడలు, గాలిపడవలు అంటే వినడమునకు అంత ఇంపుగాలేదు. వాటిని విమానాలుఅంటే చెవికి ఎంతో ఇంపుగాను, మనస్సుకు ఆనందముగాను ఉంటుంది. ఎందుకంటే మనకు విమానాలు పరిచయమైనవి. కథలలో పువ్వులవిమానాలు ఉండేవనిన్నీ, వాటిలో అంతరిక్షమార్గాన్ని ప్రయాణము చేసేవారనిన్నీ, గంధర్వులు విమానాలలో తిరుగుతారనిన్నీ చదివి ఉన్నాము. ప్రస్తుతమందుకూడా విమానాలలో సాయంకాలము విహారముసలుపవచ్చునని ఆనందతరంగ మొకటి బైలుదేరుతుంది. కాని విమానాలు కేవలము అట్టి విహారముకొరకే, వినోదక్రీడకోసమే కట్టబడేటట్టయితే వీటినిగురించి ఇంత వివరముగా వ్రాసి ఉండము.

విమానాల ఉపయోగాలు అనంతములు. వాటినన్నిటిని కొంచెము శ్రద్ధగా ఆలోచింతము.

విమానాలుముఖ్యముగా మొన్నటియూరోపుసంగ్రామములో ఉపయోగించినారనివింటాము. ఇవిశత్రువులశిబిరములకుపోయి అక్కడ వారితంత్రములన్నీ కనిపెట్టుతూఉండేవి. మేఘాలలోదాగి శత్రుస్కంధావారమంతా శాంతముగాఉన్నప్పుడు గల్లంతుపుట్టించేవి. పైనుంచితుపాకిగుళ్ల వర్షము కురిపించేవి. నష్టము కలిగించేఇట్టికార్యాలెన్నో చేసేవి. కాని, అట్టిపనులకవి పనికివస్తవా అని ఒకపెద్ద సంశయము. అమెరికావారు అవి అందుకు పనికి రావంటారు. వారిలెక్కలప్రకారము నూటికి ఏభైచోట్ల అవి గురికి నూటిగా గుళ్లువిడవలేక పోయినట్టు తేలుతుంది.

ఇదే నిజమైతే మనము బ్రదుకుతాము. క్రొత్తగా కనిపెట్టబడ్డ ఈచక్రనియంత్రము మానవకోటికి అరిష్టప్రదము కాకుండా ఉండడము దైవనిర్ణయమేమో! ఈవిమానాల ఉపయోగములలో ముఖ్యాంశమేమిటంటే- ఇవి దూరప్రయాణాలకుగాని, దగ్గరప్రయాణాలకుగాని పనికివస్తవా అని. జర్మనీదేశములో పదేళ్లక్రితమునుంచే మనమిప్పుడు మోటారుబళ్లు, జట్కాబళ్లు ఉపయోగించేట్టు విమానాలను ఉపయోగిస్తున్నారు. వారికి వాటిని కట్టడములో నేర్పు ఎక్కువ. సులభముగా, చౌకలో, కొద్దిరోజులలో వాటిని పూర్తిచేయడమునుబట్టి వారికి ఆవ్యాపారములో ఎక్కువ అనుభవముకలదని తెలుస్తుంది. ఇంగ్లీషువారూ, మిత్రమండలివారిలో తదితరులూ తలక్రిందుగ తపస్సుచేసినా నిర్మాణములో వారితో తులతూగలేకుండా ఉన్నారు. అందువల్లనే ఈదేశాలలో విమానాలు ఎక్కువబాహాటముగా సాధారణప్రయాణానికి ఉపయోగించే బళ్లలో చేరకుండా ఉన్నవి. అయినప్పటికీ విమానము అంటే వింతగా ఉన్న మనదేశానికి ఆదేశాలకూ పోలికే లేదు. ఒక ఆంగ్లేయశాస్త్రవేత్త వైమానికసభలో ఈవిధముగా వక్కాణించాడు "మనము ఎంతకష్టపడ్డా ఓడను రెండేళ్లలో నిర్మించలేకుండా ఉన్నాము. ఖర్చుకూడా కోటిరూపాయలదాకా అవుతుంది. కాని జర్మనీవారు యుద్ధానంతరము అధోగతిపాలయినప్పటికీ వాటిని కొద్దివారాలలో సగముఖర్చుతో తయారుచేయగలుగుతున్నారు."

ఈఓడలనిర్మాణములో ఇట్టివ్యత్యాసము ఉండడమువల్ల మనదేశములో ఒకచోటనుంచి ఇంకొకచోటికి పోవడమునకు ఎంతఖర్చు అవుతుందో అంచనా వేదామంటే కొంచెము కష్టమవుతుంది. జర్మనీవారిప్రకారం లెక్కవేసుకొని జర్మనీనుండే విమానాలు కొన్నట్టయితే వాటిలో పోవడమునకు రైలులోకంటె ఎక్కువఖర్చుకాదు. అప్పుడు హిందూదేశవాతావరణమంతా విమానాలతో వర్షముకుపూర్వము తూనీగలతో నిండినట్లు నిండియుండేది. కాని జర్మనీవారివ్యాపారము అంతనిలకడ అయినది కాదని చెప్పేరు. అంతేకాకుండా వారిదగ్గర కొందామంటే ఇంకా మరికొన్ని చిక్కులున్నవి. కాబట్టి మనము ఇతర యూరోపాదేశీయులదగ్గరే కొనవలసి ఉండును. అట్లాకొంటే రాజమహేంద్రవరము నుంచి చెన్నపట్టణమునకు ప్రయాణీకునికి ఒక్కొక్కనికి ఎంతవుతుందో క్రింద తెలుపుతున్నాను.

రాజమహేంద్రవరము నుంచి చెన్నపట్టణానికి దూరము 3[illegible] మైళ్లు. ప్రస్తుతము స్థితిలో కోట్లు ఖర్చుపెట్టి [illegible]. కాబట్టి పదిమందికలిసి ఏ దేశపు మిల్లునుంచైనా ఒక విమానప్రయాణసంఘమని పెట్టుకొంటామని లెక్కవేస్తాము అనుకోండి. ప్రయాణీకు లిబ్బందిపడకుండా తొమ్మిది పడవలు కొంటాము. తొమ్మిది పడవల ఖరీదు రు. ౩,౬౦,౦౦౦ లు (౯ × ౪౦,౦౦౦) ఇంకా నిర్వహణకు వేలరూపాయలు ఏవైనా ప్రమాద



నిర్మాణములో ఉన్న ఓడ

ములు సంభవించినప్పుడు ఉపయోగించుటకు బ్యాంకు లో వేస్తాము. అంతా మొత్తం అయిదు లక్షలరూపాయలు అయింది. దానిమీద నూటికి పదిరూపాయల వడ్డీ చొప్పున లెక్కకట్టితే మైలు ౧-కి అ ౬ లు తేలుతుంది. ఈపడవలుంచుటకు భవనాలనిమిత్తము ౨౫,౦౦౦ లు అవుతుంది. ఎందుకంటే, చెన్నపట్టణములోను, రాజమహేంద్రవరములోను, మధ్య ఇంకా మరి మూడుస్థలాలలోను ఉంటే మొత్తము అయిదుభవనాలు. ఒక్కొక భవనానికి రు ౫,౦౦౦ లు అయితే పై మొత్తం కావలసి ఉంటుంది. ఇందువల్ల మైలు ౧-కి రమారమి అ ౨ లు అవుతుంది.

మూడుపడవలు నిలవలోనుంచి ఆరు తిప్పుతూ ఉంటే ఆరుగురు నావికులు కావాలి. మనకు విమానాల గొడవ తెలియకపోబట్టి ఒక్కొక్కనావికునికి నెల ౧-కి వేయిరూపాయ లిస్తే దీనిక్రింద మైలు ౧-కి నాలుగణాలు అవుతుంది.

ఇక నూనె ఖర్చు. ఇది నూరుమైళ్ళకు ౧౦ గాలనుల చొప్పున మైలు ౧-కి అ ౪ ల నూనె అవుతుంది.

జీతగాళ్ళకు, మరమ్మత్తుకు మైలు ౧-కి ఏడణాలను, అసలురాబట్టుటకును-ఈ రెండురూపాయ లవుతుంది.

మొత్తం అంతాకలిసి మైలు ౧-కి నాలుగురూపాయలవుతుంది. మూడువందలమైళ్లకు పన్నెండువందలు. పడవలో పన్నెండుగురు జన మెక్కితే ఒక్కొక్కనికి రు ౧౦౦ లు ఛార్జి అవుతుంది. కాని ఇంతఛార్జి ఎవరు పెట్టుతారు? తేలికగా రు ౩౦ లు పెట్టినట్లయితే పంకాలక్రింద పరుపులమీద రైళ్లలో పొరలాడవచ్చును. కాని ఒక హంశము మనము మరచిపోయినాము. విమానము రాజమండ్రి చేరుటకు మూడుగంటలే పట్టుతుంది. రైలుమీద నయితే పదిహేనుగంటలైనా పట్టుతుంది. కాబట్టి కాలము కలిసిరావలెనంటేను, తొందరపనులుంటేను విమానాలే ఎక్కుతా-రనుకొందాము. మనదేశముయొక్క ప్రస్తుత స్థితినిబట్టి ప్రతివ్యాపారమూ మందముగా ఉన్నప్పుడు వీటిని ఉపయోగించేవారు ఇంతఛార్జి ఎక్కువపెట్టేవారు తక్కువ. అందుచేత వీటివల్ల అంతలాభము ఉండదు. ఇంగ్లీషువారిలెక్కలనుబట్టి చూచినాముగనుక ఇంత ఎక్కువఛార్జి అవుతుంది. కాని ఇవన్నీ వెనుకటిమాటలు. ఇప్పుడిప్పుడు ఇంగ్లాండులోనే పడవలు చాలాచౌకగా కట్టుతున్నారనీ, రైలుచార్జీకంటె రెండింతలకు మించవనీ అంచనాలు వేస్తున్నారు. ఈఅంచనాలప్రకారము చూస్తే రాజమహేంద్రవరమునకప్పుడు రు ౬౦ లు అవుతుంది. అప్పుడు కాలముకలిసివచ్చేవారు, గొప్పవర్తకవ్యాపారము చేసేకోటీశ్వరులు, లక్షాధికారులు విమానప్రయా



ఓడ మధ్యభాగములోని అల్యూమినము దూలముల చట్రము—అడ్డముగా ఉంచి చూపబడినది

కానికికూడా తయారవుతారంటే సందేహములేదు. అప్పుడు మనవిమానప్రయాణసంఘానికి దెబ్బఏమీతగలదు.

విమానముమీద ప్రయాణము చేయడమంటే కష్టాలంతటితో అంతరించలేదు. రాత్రిళ్లు మేఘాలడ్డము వచ్చి కుంభవర్షము కురుస్తూఉన్నప్పుడు నావికుడు పడవను ఎట్లానడుపుతాడు? విమానాలని రైళ్లతో పోల్చిచూచాము. ఇక సముద్రపుటోడలతో పోల్చిచూడవలసిఉంది. సముద్రముమీద ప్రయాణముచేస్తూ ఉన్నప్పుడు నాలుగువైపుల తరంగాలు నిశ్శబ్దముగా ఒకటి తరువాత ఒకటి పెళ్లికూతురుమోస్తరుగా తలవంచుకొని ఓడక్రిందకు పోతూఉంటవి. వీటినిచూస్తే కవికి ఆనందమేకాని పిరికివానికిమాత్రము ప్రాణసంకటము. నావికుడు ఓడను తిన్నగా గమ్యస్థానముచేరడమునకు కొన్నిగుర్తులు పెట్టుకొంటాడు. దిక్చక్రమును (Horizon) బట్టి, దోవతప్పుతామేమో అని భయములేదు. ఇట్టిగుర్తులు ఏవైనా వాయువిమానము చేసేటప్పుడు ఉంటవా అని ఆలోచించవలెను. విమానము భూమికి ఒకటిరెండుమైళ్ల ఎత్తుప్రదేశాలలో ప్రయాణముచేయడమువల్ల దిక్చక్రము (Horizon) యొక్క ఉపయోగములేదు. మేఘాలు లేనప్పుడు గాలిప్రయాణము ఏమాత్రము కష్టము లేదు. నావికుడు దూరదర్శిని (Telescope) యంత్రము పెట్టుకొని భూమివైపు చూచి తానేపట్టణములో ఉన్నాడో కనుక్కొంటాడు. దోవ తిన్నగా తీస్తాడు. రాత్రి వచ్చింది. చీకటిగుయ్యారము. ఎక్కడో రెండుమైళ్లు క్రింద ఉన్నవస్తువు ఎంతపెద్దదైనా చీకటిలో ఏమీకనబడదు గదా! అందులో పదిగంటలుదాటిందంటే దీపాలన్నీ ఆరిపోతవి. ఏదో ఒకమునిసిపలులాంతరు ముసలమ్మ ప్రాణములాగు గురగురలాడుతూ ఉంటుంది. విమానములో



దూలముల ఓడ (Rigid)

సూర్యచంద్రుల స్థానమునుబట్టి తానెచ్చట ఉన్నాడో, ఏత్రోవనుబట్టిపోయిన గమ్యస్థానము చేరగలడో తెలుసుకొంటాడు. రాత్రిపూట అతనిపని మరింతసులువు. వేలకొద్ది నక్షత్రాలు దోవచూపించడమునకు వచ్చినవా అన్నట్లు ఆకాశము అంతా నిండిఉంటవి. వాటిసహాయమున నావికుడు ఓడను కొంచెమైనా మార్గముతప్పకుండా నడిపిస్తాడు. అట్లాఉంటే బాగానేఉంటుంది. కాని ముప్పు పెద్దతుపాను ప్రారంభమైనదనుకొందాము. మిన్నూ మన్నూ ఏకమైనట్లు ఉంటుంది. సూర్యచంద్రాదులు మేఘాలలో పూడిపోయి కనబడరు. అప్పుడు నావికుడు ఏమిచేయగలడు? ఊరికే కూర్చోడు. వెంటనే తంతిలేనివిద్యుచ్ఛక్తిమూలముగా వార్తలు పంపి తానేస్థలంలో ఉన్నాడో, ఎట్లాపోతే అపాయము లేకుండా వెళ్లగలడో కనుక్కొంటాడు. కనుక సముద్రయానమంటే ఉన్నవారికి అది ఏమిప్రయోజనము? ఇట్టిసమయములో సారస్యముసాగించాలంటే కొన్నిసదుపాయాలు చేసుకోవాలి. అందుకనే ఆయిరోపాదేశములో గొప్పగొప్ప స్తంభాలు కట్టి, వాటిమీద జాజ్వల్యమానముగ ప్రకాశించుదీపాలు పెట్టెదరు. అవి అత్యంతతేజోవంతములై యుండుటవల్ల నావికుడదికనిపెట్టి అదియేప్రదేశపువలుగో తెలుసుకొనును. ఎప్పుడు అవసరమైతే అప్పుడు పైకివెళ్లి ఆదీపములు వెలిగించేటందుకు కొందరుమనుష్యులు ఎప్పుడూ సిద్ధముగా ఉండవలెను. అనుకోని తలంపుగా సూర్యుణ్ణి మేఘము కమ్మివేయడముచేత చీకటిపడవచ్చును. ఇంకా, ఇటువంటివెన్నో జరగవచ్చు. అట్టిసమయములో దీపము కావాలి. ఎప్పుడూ మనుష్యులు, కనిపెట్టుకొనిఉండడము, ఈవిధమైనగంద్రగోళము ఏమీలేకుండా ఇప్పుడు ఒకచిత్రము కనిపెట్టినారు. ఈక్రొత్త

గాక నిపెట్టిన విశేషమువల్ల మనుష్యులు ఉండవలసిన అవసరమే లేదు. ఎప్పుడు సూర్యుడు కనబడకపోతే అప్పుడే దీపములు వెలుగుతవి. విమానప్రయాణీకులకు ఇబ్బంది ఉండదు. ఇంతచిత్రముగా కనబడే యీ క్రొత్త విశే షముసూత్రముమాత్రము తెలుపుతాను.

ఎప్పుడూ గొప్ప ఆలోచనలు మనకు అందరికీ తట్టుతూనే ఉంటవి. కాని వాటినిగురించి మనము అంత శ్రద్ధతీసికొని వితర్కించము. శాస్త్రజ్ఞుడు అట్లాగాక దానిలోనుంచి ఏదో ఒక ఆశ్చర్యవిషయము బైలుపెట్ట వలెనని ప్రయత్నిస్తాడు. నల్లకోటు వేసుకొని ఎండలో పోతూఉంటే మనశరీరానికి వేడి ఎక్కినట్లు ఉంటుంది. అనగా నల్లవస్తువు వేడిని ఎక్కువత్వరగా ఆకర్షిస్తుంది. ఈనల్లవస్తువే లోహమైతే వేడివల్ల సాగి పెద్దదగును. ఇట్టినల్లవస్తువొకటి ఆదీపపుబల్బులో ఉండును. సూర్యరశ్మికి అదిబాగా వేడి ఎక్కినట్లయితే అది సాగి దీపము వెలుగుట కవసరమైన వాయువులను రానివ్వదు. అందువల్ల వెలుగు ఉండదు. వేడి ఎంత తక్కువ అయితే కాంతి అంత ఎక్కువగా ఉంటుంది. ఇట్లు విమానాలు రాత్రింబవళ్లు సునాయాసముగా ప్రయాణము చెయ్యడమునకు ఇంకా ఎన్నెన్నో ఉపాయాలు కనిపెట్టుతున్నారు. తంతిలేని విద్యుచ్ఛక్తి మూలమునకూడా నావికుడు తానెక్కడఉన్నాడో తెలుసుకొనుటకు క్రొత్తగా ఏర్పాటులు జరుగుతున్నవి. అయినప్పటికి ఒకటిమాత్రం తప్పించుకొనుటకు వీలులేదు. మేఘాలు కమ్మి భూమి కనబడకుండా పోయినపుడు ఆకష్టసమయములోనుంచి నావికుని తెలివితేటలవలన, అదృష్టమువలన బైలుపడవలెను.

విమానములను వైద్యులెక్కువగా ఆదరిస్తారు. ధనవంతుల కెవరికైనా ఆకస్మికముగా ప్రాణముమీదికి వస్తే, గొప్పవైద్యుడు ఎంతదూరాన్నిఉన్నా అతనిని పిలిపించాలంటే విమానాలకంటె మరొక సులభసాధనము లేదు. అల్లే ఇప్పుడు దక్షిణదేశములో వరదలవల్ల బాధపడుతూ ఆకలితో అల్లాడుతున్న ప్రజలకు సహాయము చేయాలంటే విమానాలు ఎక్కువ ఉపయోగపడుతవి. రైళ్లు తిరుగుతున్నా లేకపోయినా విమానాలవల్ల భోజనసామగ్రి వాళ్లకందజేసి వాళ్లని రక్షింపవచ్చును.

వార్తాపత్రికాపఠనము మనదేశములో అంతయెక్కువగాలేదు. పాశ్చాత్యదేశాలలో ఇది ఒకవల్లమందు వెర్రిగా పరిణమించింది. దక్షిణదేశీయులు ప్రొద్దున్నే కాఫీఎల్లాగు తాగుతారో అల్లాగే నిద్రలేవగనే గొప్పవాడిదగ్గరనుంచి కొద్దివాడిదగ్గరదాకా అందరికీ ఏలండను వైమ్సుపత్రికో ఏదో ఒకటి చేతులో ఉండాలి. లేకపోతే సుఖంలేదు. అట్టివారికి విమానా లుపయోగించి పత్రికలు అందజేస్తున్నారు. అల్లే ఇంగ్లాండులో ఉన్న మనస్నేహితులతో ఉత్తరప్రత్యుత్తరాలు జరుపుతూ ఉండవలెనంటే నెలరోజులకొకసారిగాని క్షేమసమాచారాలు తెలుస్తూవుండవు. విమానాలమూలముగా ప్రతివారము ఉత్తరాలు తెప్పించుకోవచ్చును.

ఇంజనీరింగుశాఖలో విమానాలెంతో ఉపయోగము. రైలుమార్గమొకటి నూతనముగ వేస్తున్నప్పుడు రెండువైపులనుంచి వెయ్యడము చాలసులువు. ఈరెండు ప్రదేశములమధ్య చాలపెట్టమైన అడవివుంటే సామానులు ఒకచోటనుండి ఇంకొకచోటికి చేర్చడము చాలకష్టము. ఇప్పుడు విమానాలు ఉన్నట్లయితే తేలికగా పనిసాగిపోతుంది. దక్షిణఅమెరికాలో బంగారముమొదలగు ఖనిజములుగల ప్రదేశము ఉన్నదట. దానిచుట్టూ ఘోరారణ్యము. అరణ్యాన్ని కొట్టివేయడము అసాధ్యమైనపని. వాటిలోనుంచి నడచిపోవడమునకు ప్రయత్నించడము సూటిగ సింహాములుమొదలగు క్రూరవన్యమృగముల నోట్లోకి జారిపడడమే. క్రొత్తగావచ్చిన ఈవిమానాలు ఆకష్టాలన్నిటినీ నివారిస్తవి. ఇప్పుడాగనులు త్రవ్వుటకు ప్రయత్నము చేస్తున్నారు. మనహిందూదేశములోకూడా హిమాలయపర్వతప్రాంతములలో ఎన్నోగనులను కనిపెట్టవచ్చును.

ఈమధ్య కనడావారు విమానానికి ఇంకొక ఉపయోగము కనిపెట్టినారు. మనము దవాగ్నిని గురించి విన్నాము. దవాగ్ని అంటే దట్టమైనఅడవిలో కొమ్మకొమ్మ రాసుకొని అగ్నిహోత్రము పుట్టును. ఈఅగ్ని అరణ్యమంతా పాకి త్రుటికాలములో అత్యంతోపయోగమైన ఆఅడవిని భస్మరాశిగా మార్చివేస్తుంది. దీనివల్ల దేశానికి ఎన్నికోట్లో నష్టము సంభవిస్తుంది. కెనడావారిప్పుడు ఏమి చేశారంటే ఈవిమానాలని అరణ్యప్రదేశమంతా తిరగవలసిందని పంపినారు. ఎక్కడనైనా ఇట్టి అగ్నిహోత్రము

పుట్టినట్టయితే దానినితీర్చి ఆవైమానికులు అపవులు కాపాడుతున్నారు.

చదువరులారా! మనం మోటారుబళ్లలో నెక్కినప్పుడు గాలి బాగా వీస్తున్నదనీ, మనము ఆలస్యముగా బయలుదేరినా గమ్యస్థానము త్వరగాచేరవచ్చుననీ సంతోషపడుదుమేకాని బండిని నడిపే యంత్రాన్ని గురించి కొంచమైనా ఆలోచించము. అస్లైరెలులో ప్రయాణము చేయనివాడు లేడు. మన మెక్కేబళ్లలో అపాయము లేని వ్రాయబడినగొలుసును చూడనివాడు లేడు. అయినప్పటికి రైలును గురించికాని, అపాయముతటస్థించినప్పుడు తీగ బండిని ఎట్లా ఆపుతుందనికాని ఆలోచనే చేయము. కొద్ది సంవత్సరాలలో విదేశాలు విమాన ప్రయాణసంఘాలు స్థాపించి మన దేశములో ఈక్రొత్తచిత్రమును ఉపయోగములోనికి తెచ్చినప్పుడు ఊరికే చూస్తుండి 'ఇది తెల్లవాళ్లమాయ' అని ప్రజలు భ్రమపడకుండా ఉండాలని ఈ వ్యాసముయొక్క ఉద్దేశము.






బండారు పిరరామేశ్వర రావుగారు బి. ఏ.

కరుణవిలీనరాగఫలితంబునె పాన సుఖంబిదేల? కే
దరములపొంత సస్యసముదాయముఁ గోయుచుఁ జన్నుచెమ్మటల్
చెఱఁగుల నొత్తుచున్ దనకృశింపులమే సరవాంచి, మంజుల
స్వరమున గీతరాగములు పాడెడు నాంధ్రకుమారిఁ జూడుమా!

చ. చలువదుమై, శ్రమం బుడుపఁజాలిన మెల్లనిపిల్లతెమ్మెరల్
చెలువహొరంగుముంగురులఁ జిందఱసేయఁగఁ గుప్పలేర్చుచున్
జిలిబిలిముద్దుపాటల పసిండిని నద్దిన కల్లరీలు దాం
గిలికొనిపోవ, శోకరసగీతము పాడెడు నాలకింపుమా!

చ. ఉడిగి యడంగి మైమఱచి యున్నజనంబులకున్న రేబియా
మొదరులలోని పచ్చికబయిళ్ల వసించుశకుంతజాల మె
ప్పుడు లలితంబులైనపదము ల్పచరించుచు, నింతకన్న నె
క్కుడయిన సంతసంబిడునొకో! నిజువర్ణ తఱిఁ గోలుపోదువో?



గీ. కరము దవ్వుల నున్నయుత్తరపుఁగడలి, నెమ్మదిఁ గలంచుచు, వసంతనియతు లలమ
మృదులముగఁ బాడుచిలుతకోయిలలునింత, కన్న నెక్కుడు సుఖమీయఁగల వె సఖుఁడ?

సీ. కాఁబోలు నాపె చొక్కఁపుఁబాట లెడపుప, ల్లెలజాలి నిదు దుస్థితులఁగుఱించి
కాఁబోలు నాయిచ్చకాలరాగము భక్త,వత్సలుండైన యీశ్వరునిగూర్చి
కాఁబోలు నాగీతికారాగములు పురా,తనమహా హావభూములను గుఱించి
కాఁబోలు నాకన్యకాగానగీతసా,రము నేఁటిరాచ కార్యములఁ గూర్చి

గీ. సలలితంబయి, కర్ణరసాయనమయి, మృదులమగు కలకంఠంబు నెత్తి ముగుద
పాటఁ బాడుచునున్న దస్పష్టముగను, దేనిఁగూర్చియొ యిటనిల్చి దీని వినుము.



చెన్నరాజధానియందు 1923-వ సంవత్సరము జూలై మొదలు డిసంబరు నెలవఱకు

ముద్రితములై ప్రకటింపబడిన

# ఆంధ్ర గ్రంథముల పట్టిక

## పద్యకావ్యము—౧. ఇతిహాసము

### పురాణము

శ్రీ వాల్మీకిరామాయణమునందలి యుద్ధకాండము, మొదటి సంపుటము, తాత్పర్యసహితము

శ్రీమత్కన్యకాపురాణము భాగము 3,4,5

భాస్కరరామాయణము

సంక్షేపరామాయణము—కె. వెంకటరమణకవి

## పద్యకావ్యము—౨. మాహాత్మ్యము

ఆంధ్రకార్తీకమాహాత్మ్యము—అనిపెద్ది జగన్నాథశాస్త్రి

కార్తీకమాహాత్మ్యము—పి. అప్పలనరసింహకవి

నారాయణాచలమాహాత్మ్యము — అల్లంరాజు రంగశాయికవి

నైమిశారణ్యమాహాత్మ్యము

శివరాత్రిమాహాత్మ్యము — శ్రీనాథ

శ్రీశైలమాహాత్మ్యము—నాగంటి వీరమల్లికార్జునలింగం అయ్యవార్లు

సత్యనారాయణవ్రతమాహాత్మ్యము — పంగులూరి వీరరాఘవకవి

## పద్యకావ్యము—౩. శతకము

ఆంగ్లేయశతకము—మల్లెల దావీదు

కుమారశతకము కల్లూరు అహోబలరావు

కుమారీశతకము—బక్క వేంకటనరసింహకవి

కృష్ణశతకము

కొత్తపల్లిరాఘవశతకము—సరికొండ రామరాజకవి

కొప్పులింగేశ్వరశతకము—కూచిమంచి సోమసుందరుడు

గోవిందశతకము—అల్లంరాజు రంగశాయికవి

జానకీరామశతకము—యం. కామకవి

దాశరథిశతకము—కంచెర్ల గోపన్న

నృసింహశతకము—శేషప్పకవి

పట్టాభిరామశతకము—ఎ. గోపాలరావు

భక్తచింతామణిశతకము, మహేశ్వరవిగణాస్వవతారావళి—కూచిమంచి సోమసుందరుడు

భద్రాద్రిరామశతకము

భైరవకోన లింగినారాయణశతకము—సంగం నరసదాసు

మధుసూదనశతకము—తోలేటి వెంకటరత్నం

రాఘవేంద్రశతకము—చిప్పగిల శ్రీరాములు

రాయునందనశతకము—చిన్నంరాజు వెంకటసుబ్రహ్మణ్యశర్మ

వ్యభిచారచరితాపహాస్యార్థశతకము — సదుగు దేవబ్రహ్మం

శతకముల ద్వితీయసంపుటము

శ్రీ చెన్నమల్లేశ్వరశతకము—బూస మల్లయ్య

శ్రీతల్పగిరిరంగనాయకశతకము—నావికికొలను సుబ్బారావు

శ్రీపార్థివలింగశతకము—భోగరాజు నారాయణమూర్తి

శ్రీరామశతకము—ఏనుగు తిమ్మరాజు

శ్రీవాసుదేవశతకము—పి. వెంకటనరసయ్య, జె. వెంకటసుబ్బయ్య

శ్రీ సాకేత కోదండరామశతకము — ములుకుట్ల వెంకటకృష్ణశాస్త్రి

సుజనశతకము—శృంగారం అయ్యమాచార్య.

సుమతిశతకము

## పద్యకావ్యము—౪. ఇతరములు

అంబరీషోపాఖ్యానము:—ఎ. రామారావు, కె. రామకృష్ణయ్య

అవజ్ఞ—పంద్యారం వెంకటసుబ్బయ్యశర్మ

అష్టమూర్తి గురుస్తవము—తంగెడ లక్ష్మీకాంతకవి

ఆంజనేయదండకము

ఆంజనేయదండకము—వడ్డిపర్తి వెంగయ్య

కుమారాభ్యుదయము—వడ్డెపాటి నిరంజనశాస్త్రి
కృష్ణలీల—సంపన్మూడుంబ సింగరార్యులు
గులేబకావలి అను పుష్పలీలావతి—వినాపురపు సుందర రామయ్య
చినరంగరాయ నాటకము—చెలికాని వెంకట సూర్యారావు
జేబున్నీసా—పింగళి నాగేంద్రరావు
తారాచంద్రీయము—గూడూరి వెంకటశివకవి
తులసీదేవి—ముత్తినేని వెంకటచెన్నకేశవులు
ద్రౌపదీవస్త్రాపహరణము—సీతారామకవి
నలచక్రవర్తి నాటకము
పద్మరాణి—గుడిపాటి వెంకటాచలం
పాంచాలి మానసంరక్షణము — వేదవరపు రామకృష్ణశాస్త్రి
ప్రహ్లాద—బొమ్మరాజు సీతారామకవి
బభ్రువాహన నాటకము—కోలాచలం శ్రీనివాసరావు
బుద్ధిసాగరవిజయము—కి. వెంకటసుబ్బారావు
భక్తరామదాసు—పండిత, కేతవరపు శివరామశాస్త్రి
మార్కండేయ నాటకము—పింగళి వెంకటనరసయ్య
మార్కండేయవిజయము—కొండి శ్రీపతిశాస్త్రి
మాలతీమధుకరము—బల్లా స్వామి
ముక్తధార
రుక్మిణీకల్యాణము—సి. జాషువ
లంకాదహనము—ద్రోణంరాజు సీతారామారావు
వనవాసి—హరి నరసింహం
విచిత్ర సారంగధర నాటకము—కె. వెంకటనరసప్ప
వినోదిని — శ్రీరాం వీరబ్రహ్మం
విషాద కనకతారీయము—ములుగు వరహనరసింహశాస్త్రి
విషాద సారంగధర నాటకము—డి. కృష్ణమాచార్లు
వైరాగ్యచింతామణి—బద్దిరెడ్డి కోటీశ్వరరావు
శ్రీకృష్ణతులాభారము—పోతుకూచి సుబ్బయ్య
సనేమిరా అను విజయపాలీయము—టి. వెంకటశాస్త్రి
సహకారి నాటకము—పి. యస్. రామకృష్ణశర్మ
సావిత్రినాటకము—ద్రోణంరాజు సీతారామయ్య
సావిత్రినాటకము
సావిత్రీనాటకము—వి. యల్. నారాయణరావు
సావిత్రీనాటకము—నందిరాజు చలపతిరావు
సుభద్రావిజయము—భాగవతుల చెన్నకృష్ణమూర్తి
సంగీత కనకతార—ద్రోణంరాజు సీతారామరావు
సంపూర్ణ భారతము—రామనారాయణకవులు
సంపూర్ణమహాభారతము—చక్రావధానుల మాణిక్యశర్మ
సాంబవిజయము—కె. యం. కృష్ణద్వైపాయనాచార్యులు
హరిశ్చంద్రోదయము — పండిత యడవల్లి వెంకటకృష్ణ శాస్త్రి.

## ప్ర హ స న ము

అంతాగమ్మత్తు—మల్లాది అచ్యుతరామశాస్త్రి
అంతాడబ్బు—లక్ష్మణ
ఇద్దరు పెండ్లాల ఇబ్బంది—మల్లాది అచ్యుతరామశాస్త్రి
ఇద్దరుభార్యల ఇబ్బంది—బద్దిరెడ్డి కోటీశ్వరరావు
ఎలెక్షను ప్రహసనము—కపిస్థలం కృష్ణమాచార్యులు
గడుసుపిల్ల్యపురాలు
గర్భాదానము
గోంగూర ఎలెక్షన్—పట్టమట్ట మార్తాండరామమూర్తి
గొంతుకోత—దంటు వీరరాఘవయ్య
దీపావళి ఫార్సు
నవజీవనము — టి. విశ్వనాథ
నిరుద్యోగి ఫార్సు
నువ్వొస్తావా లేక నేవెళ్ళనా—శిష్ట్లా రాధాకృష్ణయ్య
పీడనుపిలునా—కె. ఆర్. శాస్త్రి
ప్రహసనమంజరి—చిలకమర్తి లక్ష్మీనరసింహం
ప్రహసనములు—ద్రోణంరాజు సీతారామయ్య
బలేనావ ఫార్సు—కె. రామకృష్ణరావు
భీమశంకరం ఫార్సు—నాగుమల్లి అప్పలనరసయ్యశెట్టి
ముసలిమగడు, పడుచు పెండ్లాము
మ్యారేజిప్రహసనము—గుండు రాఘవదీక్షితులు
విచిత్రనారీమణులు—లొల్ల భగవానులు
విస్కీ అడ్డాట—కె. వెంకటసుబ్బారావు
సురాజుదౌలా లేక అసామాన్య—జమ్ములమడక లక్ష్మీనృసింహం
హరిదాసు—బద్దిరెడ్డి కోటేశ్వరరావు

## భాష - నిఘంటు వ్యాకరణాదులు

అభినవలింగానుశాసనము—యస్. స్వామినాథశాస్త్రి
అభినవశబ్దరూపావళి : మొదటిభాగము [రాయణరాజు
అర్ధానుస్వార శకటరేఫచంద్రిక — పెనుమచ్చ సూర్యనా

ఆంధ్రగద్యవాఙ్మయచరిత్ర—జి. వి. రాఘవరావు
ఆంధ్రశబ్దచింతామణి — నన్నయభట్టు
ఆంధ్రసారస్వతతత్త్వము—డి. జగన్నాథరావు
కాళిదాస భవభూతులు
తెలుగు ప్రైమరు—రెవరెండు. జె. స్ట్యూవర్టు
తెలుగు వ్యాకరణము—పి. అబ్బాయినాయుడు
పాఠశాలలోని తెలుగు—కూచి నరసింహం
బాలబోధిని-ప్రథమభాగము—కాశీ కృష్ణాచార్య

## జ్యోతిషము

అనుభూతజాతకతరంగిణి—ఇవటూరి అయ్యన్నమూర్తి, రాజశర్మ
సిద్ధాంతనరకంఠీరము

## గణితము

అంకగణితము—వల్లా లక్ష్మయ్య
చమత్కార గణితము—పి. ఆర్. జనార్దనంనాయుడు
బాలగణితబోధని.
లీలావతిగణిత సంగ్రహము

## వైద్యము

అనుభవయోగానాని వైద్యామృతము
ఆయుర్వేదసారసంగ్రహము — యస్. ఏ. టి. యం. శ్రీనివాసాచార్లు అయ్యవార్లు
ఆరోగ్యమునకు మార్గము
ఆరోగ్యరహస్యము, రెండవభాగము— మంత్రిప్రగడ సాంబశివరావు
ఆరోగ్యరహస్యము, మూడవభాగము— మంత్రిప్రగడ సాంబశివరావు
ఆరోగ్యరహస్యము—యం. సాంబశివరావు
ఔషధగుణదీపిక — వైద్యరాజ యల్లా సీతారామయ్య వైద్యరాజ యల్లా వెంకటస్వామి
త్రిదోషబోధిని—దుగ్గిరాల శివరామమూర్తి
నాడీపరిజ్ఞానము—యస్. ఎ. టి. యం శ్రీనివాసాచార్లుఅయ్యవార్లు
నేత్రదర్పణము—తాడేపల్లి పానకాలరాయుడు
పానీయకల్పవల్లి—యస్. ఎ. టి. యం. శ్రీనివాసాచార్యులు అయ్యవార్లు
వైరాగిచిటికలు
విషప్రతివిషయములు—తోట సుబ్బయ్యశెట్టి
వైద్యమాలిని గ్రంథము—కె. మందమరాజకవి
శరీరోపాయ్యపాకప్రకాశిక
సుఖరోగచికిత్సారత్నాకరము—యస్. ఎ. టి. యం. శ్రీనివాసాచార్లు అయ్యవార్లు
క్షీరవస్థని—నోరి రామశాస్త్రి

## మతము

ఆచార్యహృదయం—పిళ్లై లోకాచార్య
ఆర్యధర్మ ప్రత్యక్ష ఫలబోధిని—ముదిగొండ నాగలింగ శాస్త్రి
ఉత్తరసర్కారుల బాప్టిస్టు 10-వ సంవత్సర సంచిక
క్రీస్తుసభయొక్క చరిత్రము
జ్ఞానామృతము
పరమసంజీవి
పాతనిబంధన గ్రంథములోని పాఠములగూర్చి ప్రారంభకులకు సబ్బాతుబడి పాఠములు
ప్రసంగసారము, మొదటిభాగము—మల్లెలదావీదు
పూండిపెద్ది సాంబశివరావుగారి స్వానుభవనీయ యుపదేశవాక్యములు — పూండిపెద్ది సాంబశివరావు
భక్తాంజలి—గొల్లపూడి లక్ష్మీనరసింహారావు
బృహస్పతివారపుద్యోతములు— —జె. అయిలెస్
మణిమంజరి
మాతృత్రయ హితబోధిని—పూండిపెద్ది సాంబశివరావు
మహాద్వైతోపన్యాసము—పూండిపెద్ది సాంబశివరావు
మహాకైవల్యామృతసారము—పూండిపెద్ది సాంబశివరావు
వేదవాక్యపాఠములు—తరగతివారిగానియమించబడినవి, మూడవ పుస్తకము
శైవసూత్రభాష్యనిర్ణయము—చాగంటి సీతయ్యశాస్త్రి
శ్రీపురాతనశంకరవచనములు—చాగంటి సీతయ్యశాస్త్రి
శ్రీమద్దేవతార్చన
శ్రీమన్మహత్త్వవిజయము
శ్రీరామ దశావతార నక్షత్రమాలిక తేవారము—కరణం అప్పాసామిపిళ్లై
శ్రీవైఖానసపుణ్యాహమ్
శ్రీవైఖానసోపాఖ్యానము

శ్రీ శివప్రసన్నము—కోనూరు కాశీపత్యవధాని
శ్రీ సీతారామ ఐకమత్యసంఘము జ్ఞానబోధ—సూర్య దేవర సంజీవరాయణం
సత్యవేదసారసంగ్రహము—రివరెండు జె. ఓ. మార్లోరిక్
సర్వమతసాహిత్యబోధిని—ప్రూడిపెద్ది సాంబశివరావు
స్తోత్రమంజరి—కందుల లక్ష్మీపతి
సంఘచరిత్రసారసంగ్రహము—డబ్లియు. బి. బాక్సు

## వే దా ం త ము

అద్వైతానంద ఆత్మజ్ఞాన అమృతసాగరము—బొమ్మన రంగస్వామిరెడ్డి
ఆంధ్రపంచీకరణము—రామకృష్ణానందేంద్రస్వామి
ఆంధ్ర భగవద్గీత—గుండాల వీరాస్వామినాయుడు
ఆత్మ బోధామృత తత్వములు మొదటిభాగము
కర్మయోగము
గణితాద్వైతము—కె. శ్రీనివాసరావు
గీతావాక్యము—కే. యస్. పద్మనాభరాజు
చతుశ్లోకి—ఆళవందారు
జ్ఞానామృతము
తత్వగోపాలీయము—అయారి గోపాలరావు
తారకామృతసారము—బి. నారాయణదాసు
దుఃఖనివారణోపాయము—కె. వీరభద్రదాసాన్వయులు
నేనను వాడెక్కడనుండి పుట్టినాడు—ప్రూడిపెద్ది సాంబ శివరావు
బ్రహ్మవిద్యావిలాసము—ఇంగువ వెంకటకృష్ణశాస్త్రులు
బ్రహ్మవిద్యాసారము—అల్లాడి మహాదేవశాస్త్రి
భగవద్గీతాంశపుష్పమాల—కి. తిరుమలరంగాచార్య
మనోల్లాసిని
రామతీర్థస్వామి గ్రంథములు, రెండవభాగము
లఘుప్రస్థానత్రయము—ఆళవందార్
వజ్రసూచ్యుపనిషదర్థము, వైరాగ్యసూచనము—మండ బాలకృష్ణమూర్తి
విద్యావిద్యాతత్వబోధిని
విశిష్టాద్వైతము—భాగవతుల లక్ష్మీపతిశాస్త్రి
శ్రీరామదండకము-తత్వజ్ఞానము—గంగుల ఆంజనేయ
సుజ్ఞానదీపిక—వల్లభాపురపు కామదాసు
సునాశనబోధిని
సీతారామాంజనేయసంవాదము

## క ల్ప ము

ఉద్బంధనాదిదుర్మరణనారాయణబలిప్రయోగం
పురాణోక్త అపరచంద్రిక
పురాణోక్త ఆబ్దికమంత్రము
పురాణోక్త కర్మప్రకాశిక
వినాయకవ్రతకల్పము—కె. వీరరాజు
వినాయకవ్రతకల్పము
వినాయకవ్రతము
శ్రీవైఖానస సంధ్యావందనం
శ్రీశంకర జయంతి పూజాకల్పము, శివసహస్రనామసహితము
క్షీరాబ్ధి ద్వాదశీవ్రతము

## సంగీతము—౧. హరికథ

భస్మాసురచరిత్రము—ముక్కామల వెంకట్రామయ్య
శ్రీరామజననము-హరికథ—టి. వెంకటాచలదాసు
శ్రీసత్యప్రస్థానిచరిత్ర-హరికథ—గంగుల నారాయణదాసు

## సంగీతము—౨. గేయము

ఆత్మబోధామృతతత్వములు 1, 2, భాగములు
ఊర్మిళాదేవినిద్ర
ఎరుకమ్మ పేరంటాలు కథ
కదళోపాఖ్యాన కీర్తనలు—బి. సుబ్బన్నదాసు
గాంధారికథ-ప్రథమభాగము
చిలుకరాయబారము
జావళీలు
జ్ఞానతత్వామృతసారము—రంగస్వామిరెడ్డి
త్రిపురసంహారకీర్తన—లంకా వెంకటలక్ష్మీనరసింహకవి
దసరాపదములు—నేమూరు శేషాచలకవి
ధ్రువచరిత్రపాట
దేశింగురాజుకథ—రావూరు వెంకటసుబ్బారావు
నవీనకీర్తనలు-స్త్రీలపాటలు—సత్యసుందరకవులు
నమశ్శివాయపాట—ములుగు శాంభవమ్మ
నిట్టల ప్రకాశదాసుగారి కీర్తనలు
నీలకంఠకృతులు—చాగంటి వీరభద్రకవి
నూతన రామాయణ భజనకీర్తనలు
నూతన వేడుకపాటలు
నవావతార పదము

పెద్దబొబ్బిలిరాజుకథ
బసవశంకరదాసు కీర్తనలు—సి. బసవశంకరయ్య
బుద్ధ్యుపదేశిని—కొళకం నరసింహశెట్టి
భగవద్భజనకీర్తనలు—భీమరాజు రుక్మిణమ్మ
భక్తమందారం—వి. భీమశంకరదాసు
భజనకీర్తనలు
మహాత్మా గాంధి భజనగీతములు—గ్రంథం సీతాపతిశర్మ
మంగళగిరి క్షేత్ర దేవతాస్తోత్రము — ముక్కాముల జగన్నాథరావు
మంగళహారతులు
లంకాయాగము
శ్రీకృష్ణకళాగీతములు
శ్రీనివాస సుసంస్మృతులు
శ్రీరామకల్యాణము, అంబరీషోపాఖ్యానము
శ్రీరాములవారి అలకపాట, విష్ణునామములు
శ్రావణమంగళగౌరీవ్రతకథ—కొల్లపర్తి రంగనాయకమ్మ
సరస్వతీవిలాసము—పి. సత్యవతమ్మ
సత్రాజిత్తుచరిత్ర-హరికథ—మహాశిష్ట్లు రంగరాజు
సీతాసముద్ర
సీతాకల్యాణం-హరికథ—జి. వెంకటరామరాజు
సంక్షిప్తరామనామగానము—లక్ష్మణాచారి
స్త్రీలపాటలు 1,2 భాగములు—వెంకటరంగనాయకమ్మ
హరిభజనానందం—పెదగాది చిదంబరకవి
హనుమద్విజయము—దంటు వీరరాఘవయ్య
హాస్యపుపాట—వల్లూరి జగన్నాథరావు పంతులు

## ఇతర కళలు

అగ్నిబాణవిద్య—వి. కృష్ణమాచారి.
కౌటిల్యార్థశాస్త్రము—మామిడిపూడి వెంకటరంగయ్య, ఆకెళ్ల వెంకటశాస్త్రి
జలార్గళశాస్త్రసంగ్రహము
నల్లబల్ల చిత్రలేఖనము—ఎ. సుబ్రమణ్యఅయ్యర్
పరిమళద్రవ్యములను జేయుట—వి. కృష్ణమాచారి
ప్రాథమిక ప్రకృతివిద్య—టి. సాలమన్ రాజు
బాలవిజ్ఞానశాస్త్రము—కే. వీరభద్రయ్య
మనశ్శరీరములపై పరిసరముల ప్రభావము — పారనంది జగన్నాథస్వామి
సమ్మోహనము—ప్రొఫెసర్ శేఖర్
హిప్నాటిసమ్ అను మనోవశ్యతత్త్వశాస్త్రము—యస్. బి. దావుద్ షా సాహెబు

## ఇతర గ్రంథములు

అష్టమవార్షికోత్సవము
ఆసంగులు—కే. ఆర్. యల్. శర్మ
ఆత్మనిర్వేదపంచవింశతి—ఆర్. హనుమంతరెడ్డి
ఆంధ్రజాతీయకళాశాలావిజ్ఞప్తి
ఆంధ్రరాష్ట్రజాతీయోపసంఘము
ఆరవ ఆంధ్రసారస్వతమహాసభ, ఆహ్వానసంఘాధ్యక్షుని యుపన్యాసము
ఆరోగ్యబోధిని—న్యాపతి బాలకృష్ణరావు
ఊర్మిళాదేవినిద్ర
ఎ. గ్రామపు కక్షిదారులకు నోటీసు
కన్నీరు—దేవులపల్లి వెంకటకృష్ణశాస్త్రి
కలువరింతలు—టి. విశ్వనాథ
కారకిల్లి—మంచికంటి రాజారావు
కైకేయి దుస్తంత్రము—రామవరపుల రామశాస్త్రి
క్రొత్త నాల్గుసరిహద్దుల నవీన గోదావరిజిల్లా భూగోళము—పి. అప్పారావు
కందుల కామకథ, మినుముల మానకథ, 1,2 భాగములు—వి. దుర్గయ్యశర్మ
పాపకొండరామాయణము, సుందరకాండము, గానము
కృష్ణజననము, కంససంహారము
గుంటూరుజిల్లా భూగోళము—ప్రయాగ ప్రకాశరావు
చిలుకరాయబారము
గంగపాటి గోవిందయ్య వృత్తకంద గీత సీసపద్యములు, శ్రీరామమూర్తి తారావళి సీసపద్యములు — ప్రాస పాటి గంగరాజకవి
గాంధిమహాత్ముని ఉపదేశములు
గ్రంథాలయోద్యమము—యాతగిరి లక్ష్మివెంకటరమణ
గ్రామమునసబుల పరీక్షాప్రవర్తిని, మొదటి భాగము—బి. లక్ష్మినరసింహం
జాతీయవిద్య—కే. నారాయణమూర్తి
జారచోరశిఖామణి—బద్దరెడ్డి కోటేశ్వరరావు
తులసిదళము
త్రిశంకువిజయము, దక్షిణదేశయాత్రలు — దుడ్డు సర్వేశ్వరరావు
దాసశబ్దార్థచంద్రికావిమర్శన పరిశోధనఖండనము—బి. కోటిరెడ్డి, క. సత్యనారాయణరెడ్డి
నవీన కృష్ణాజిల్లా భూగోళము—పి. అప్పారావు
నాట్యాంబుజము—పురాణం సూరిశాస్త్రి
నారదగర్వభంగము—గుండాల వీరాస్వామి
నిశ్చయ తాంబూలప్రకరణము
పతివ్రతామాహాత్మ్యము—దేవినేని సూరయ్య
పెండ్లిదొంగ— వి. జోగీశ్వరశర్మ

శాసనసభలు—చెరుకువాడ వెంకటనరసింహం
శాస్త్రవాచకపాఠములు, మూడవభాగము—యం. సాంబశివరావు
శిగరెట్టు దండకము—లక్ష్మీనరసయ్యశర్మ
శ్రీ వేదమూర్త్యకామహాసామ్రాజ్యలక్ష్మీవిజ్ఞప్తి
శ్రీశతీవృత్తరత్నమాల్యము—యు. సుబ్రహ్మణ్యశాస్త్రి
శ్రీశారదాసమాజము, అనంతపురము, చతుర్థవార్షిక నివేదిక—యస్. వి. మీనాక్షీసుందరమ్మ
శ్రీకుశలవవిజయము-హరికథ:—బి. బాలాజీదాసు
శ్రీకృష్ణుని చల్దులు
శ్రీరామపట్టాభిషేక మహోత్సవ పద్యములు—చిలుకూరి నారాయణరావు [మూర్తి
శృంగారచాటుపద్యరత్నావళి—అల్లంరాజు నారాయణ
ప్రణయవిజయము—మైనంపాటి హనుమంతరావు
పోలేరమ్మదండకము
బాలగ్రహదోష చికిత్స
భావనామునిచరిత్రము—బి. గోకర్ణం
భీమలింగసానిహాస్యము
మద్రాసు రాజధాని భూగోళము
మల్లుతానుల మహాసభ
మహాత్మ గాంధిగారికేసు విచారణ
మహార్ణవమి పద్యములు
ములుకొలుపులు
యోగాభ్యాసదర్పణము—పరమహంస పరివ్రాజకాచార్య బ్రహ్మానంద సరస్వతిస్వామి
రంభారావణ సంవాదము, యక్షగానము—బి. బ్రహ్మచారి
లాడబిత్తిరి—ఎ. వి. సుబ్రహ్మణ్యశాస్త్రి
విశాఖపట్టణము జాతీయోపసంఘము—నిబంధనలు, తీర్మానములు
వీరమహిమ
వేశ్యామధురము—(మూడవ భాగము)
వైదికసభ్యత, ప్రథమతరంగము — పాలకులు శేషాచార్యులు
వోటు—గాడిచెర్ల హరిసర్వోత్తమరావు
శశిరేఖాపరిణయము—బి. బాలాజీదాసు [మూర్తి
శాసనసభలు, శేషగిరిరావు పంతులు గారు—కే. కృష్ణ

సద్గురుపూజావిధానము
సరస్వతీవాచకము, గద్యపద్యములటిప్పణి—యస్. వెంకట్రామయ్య
సర్వమానవ సోదరభావ ప్రచారము — కరపత్రము 1. మతములు-సోదరభావము
సర్వమానవ సోదరభావ ప్రచారము — కరపత్రము 2. సోదరభావము-విద్యాభ్యాసము
సర్వమానవ సోదరభావ ప్రచారము — కరపత్రము 3. నేగస్థులయెడ సోదరభావము
సర్వమానవసోదరభావప్రచారము — 4. జనాంగసోదరభావము
సర్వమానవసోదరభావప్రచారము—5. ఆంగ్ల భారతీయ సమ్మేళనము
సర్వమానవ సోదరభావప్రచారము—6. విద్యార్థులయందు సోదరభావము
సర్వమానవ సోదరభావప్రచారము—7. సోదరభావము రాజకీయవ్యవహారములు
సర్వమానవసోదరభావప్రచారము—8. అల్పజీవులయెడ సోదరభావము
సర్వమానవ సోదరభావ ప్రచారము—9. హిందూమహమ్మదీయ మైత్రి
సర్వమానవసోదరభావప్రచారము—10. సంఘశాస్త్రము
సర్వమానవ సోదరభావప్రచారము—11. భిన్నజాతుల యెడ సోదరభావము
సర్వమానవ సోదరభావ ప్రచారము—12. సోదరభావము-నూతనయుగధర్మము
సర్వార్థసారసంగ్రహము—చింతా సుందరరామశాస్త్రి
సహదేవ ప్రశ్నశాస్త్రము
సావిత్రీచరిత్రము—ఎ. నారాయణదాసు
సిద్ధాంతిగారి కోడలు
స్కూల్ ఫైనల్ తెలుగు టెక్స్టుబుక్కుల నోట్సు—జి. యస్. గోదావరిశర్మ, వై. వెంకటరామశాస్త్రి, ఎ. యస్. వెంకటేశ్వర్లు
స్వర్గీయమహాసభ—ఆర్య నారాయణమూర్తి
స్వరాజ్యతత్త్వము—కంభంపాటి లక్ష్మీనరసింహ సోమయాజులు
స్వరాజ్యసంవాదము—కొండపల్లి జగన్నాథదాసు.



# అభినవాంధ్ర నటశేఖరులు

ఆంధ్రదేశమున ఆంధ్రనాటక ప్రదర్శనములు ప్రారంభమై సుమారు నలుబదేబదేండ్లు కావచ్చును. 25-30 ఏండ్లనుండియే ప్రదర్శనములు బాగుగా వృద్ధినొందెనని చెప్పవలసియుండును. ఈస్వల్పకాలమున నెందరో నటశేఖరు లధికవిఖ్యాతిని బడసిరి. వారిలో కొందరు కీర్తిశేషులైరి. అట్టివారిలో ఆంధ్రనాటకపితామహ బిరుదాంకితులగు ధర్మవరం రామకృష్ణమాచార్యులవారును (బళ్లారి), ఈవని లక్ష్మణస్వామి గారును (బందరు), ఆంగ్లమున హరిశ్చంద్రనాటకమును వ్రాసినవారును విజయనగరమున శ్రీ ఆనందగజపతిమహారాజావారిఆదరమునుబడసి వారినాటకసంఘమునకు నియంతగా నుండినవారును యిటీవల గులేబకావలీనాటకమును కమలాపహరణమను పేరుతో ఆంధ్రమున వ్రాసినవారు నగు శ్రీనివాసాచార్యులుగారును (వీరిటీవలనే చెన్నపురిలో పరమపదించిరి) అగ్రగణ్యులు. ఇపుడున్నవారిలో ఆంధ్రనాటకరంగమున విఖ్యాతులై పిమ్మట దానిని త్యజించి రాజకీయాదులందు పనిచేయుచున్న ప్రముఖులు పలువురున్నారు. బ్రహ్మశ్రీ వడ్డాది సుబ్బారాయకవి, టంగుటూరి ప్రకాశంపంతులు, దేశభక్త కొండా వెంకటప్పయ్యపంతులు, కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు, చాగంటి వీరభద్రయ్యపంతులు, రావుసాహెబు గాడు మాధవరావు, ధర్మవరం గోపాలాచారి, వేంకట కృష్ణమాచారి, గిరాచారిగార్లు మున్నగువారీ వర్గమునకు చేరినవారు. చాలవిఖ్యాతిని గడించి నలుబదవపడిలో ప్రవేశించి వృద్ధనటులనబడుచున్నను యిప్పటికిని రంగస్థలమును పూర్తిగావదలక తమకుగల కళాభిమానముచే పనిచేయుచున్నవారు మరికొందరు గలరు. శ్రీయుత హరిప్రసాదరావుగారు, కోపల్లి హనుమంతరావుగారు, వెదురుమూడి శేషగిరిరావుగారు, ముప్పిడి జగ్గరాజుగారు, బళ్లిజేపల్లి లక్ష్మీకాంతంగారు మున్నగువారీతరగతికి చేరెదరు. ప్రస్తుతము ప్రధానపాత్రలను ధరించుచు అత్యధికముగు ప్రశంసకు పాత్రులగుచున్న నటశేఖరులు శతాధిక సంఖ్యాకులుగా నున్నారు. పత్రికలలో వారి నామములను మనము తరుచుగా చదువుచునేయుందుము. వారిలో తారతమ్యముల నెంచబూనుట పరమసాహసము. శ్రీయుత టి. రాఘవాచారి (బళ్లారి), కె. శ్రీనివాసన్ (దొరస్వామయ్యంగారు-కాంగ్రెసునాయకుడు) నెల్లూరు నాగరాజురావు, పర్వతరెడ్డి రామచంద్రారెడ్డి, ఎడవల్లి సూర్యనారాయణరావు, ఉప్పలూరి సంజీవరావు, పారేపల్లి సుబ్బారావు, కడియాల రత్తయ్య, స్థానం నరసింహారావు, అద్దంకి శ్రీరామమూర్తి, డి. వి. సుబ్బారావు, పెద్దిభొట్ల చలపతిరావు, గోవిందరాజుల సుబ్బారావు, దైతా గోపాలం, గూడపాటి నరసింహారావు, మద్దాలి శేషగిరిరావు, ముంజులూరి కృష్ణారావు, వగదా రాధాకృష్ణమూర్తి, కె. శ్రీనివాసాచారి (నెల్లూరు, స్త్రీపాత్రధారి) జి. వెంకటకృష్ణయ్య, ఎస్. కామాక్షి సుందరశాస్త్రి, జి. రామచంద్రయ్య, కె. నరసింగరావు, రామచంద్రరావు (బళ్లారి), ఎం. దేశికాచారిగార్లు మున్నగువారి పేరులు మనకు తరుచుగా వినబడుచుండును.

వీరిలో కొందరు చెన్నపురమున రంగస్థలము నలంకరించి చాల మెప్పునడసియున్నారు. వారిలో శ్రీయుతులు రాఘవాచారి, రామచంద్రారెడ్డి, సూర్యనారాయణరావు, శ్రీరామమూర్తి, సంజీవరావు, రత్తయ్య, సుబ్బారావుగార్లిటీవల నాటకప్రదర్శనములందు పాల్గొనిరి. వారిపటముల నీసంచికలో చూడగల అవకాశము లభించినందులకు చాల సంతసింపదగినది.

## శ్రీమాన్ రాఘవాచార్యులు గారు

వీరు ఆంధ్రాంగ్ల నాటకప్రదర్శనములందు నిరుపమానులనుటయం దెట్టి అతిశయోక్తియును లేదు. సుప్రసిద్ధనటులు పలువురు కోరియు కోరకయు వారి ననుకరించుచుండుటయే యిందులకు ప్రబల నిదర్శనము. చెన్నపురిలో ముఖ్యముగా ఆంధ్రనాటక ప్రదర్శన ప్రకటన పత్రమున వీరి పేరు కనబడినచో ఆనాడు సభాభవనమున నడుగిడుటకైన తావుండదు. వీరి అభినయము విస్తారముగ ముఖమునందును నేత్రములందును గోచరించుచుండును. వీరు పద్యములను పాటలను పూర్తిగా వదలివేయలేదుగాని సంగీతప్రజ్ఞకు వీరి నెవ్వరును మెచ్చుకొనరని మాత్రము చెప్పవచ్చును. నిండైన విగ్రహము, విశాలనేత్రములు, మంచి ఉచ్చారణ, వాగ్ధాటి, క్షణక్షణము ముఖమునందును దృష్టియందును కలుగుచుండు మార్పు, మున్నగు వానిని జూచియే వీరి నత్యధికముగ

ప్రశంసించుచుందురు. సంగీతము పాడలేనివారు గీపాట్లు పడవలెనుగాని పాడనేర్చినవారు కీలుబొమ్మవలె కాలు చేయి కదల్పకుండ టంగునిలచి బరాబాలుకొట్టిరేని మెప్పింపగలరని కొందరు రసాభినయాదులను నిరసించువారును, రసప్రకటనమునందు తమకుగల అసమర్థతను కప్పిపుచ్చుట కిట్టుల సమర్థించువారునుకలరుగాని పండితులు మాత్రము వారివాదము నంగీకరింపరు. రసాభినయ చతురుడగు నటుడే శ్రేష్ఠుడని పండితులు ప్రశంసింతురు గాన నట్టి నటశ్రేష్ఠులలో రాఘవాచారిగా రగ్రగణ్యులని నిర్ణయముగ చెప్పనగును. వీరు శ్రీ॥ శ్రీ॥ కృష్ణమాచార్యులగారికి మేనల్లుడు. బళ్ళారిలో హైకోర్టు వకీలుగానున్నారు. నాటకకళాభివృద్ధికి తోడ్పడుటకు వీరు నడుముగట్టిన నటశేఖరులు. ఇటీవల వీరు చెన్నపురి ఆంధ్రసభాధిపత్యమునను ప్రదర్శితములైన రామదాసు చిత్రనళీయము నాటకములందు రామదాసు బాహుకపాత్రలను హృద్యముగ ప్రదర్శించి ప్రేక్షకులకపారమైన యానందమును గలుగజేసిరి.

## శ్రీ ఎడవల్లి సూర్యనారాయణరావుగారు

వీరు మైలవరం, ఏలూరు నాటకసమాజములలో ప్రధాననాయకపాత్రను ధరించినవారు. నిండైన విగ్రహమును స్పష్టమగు స్వరమునుగల యువకులు. సంగీతమునందును రసాభినయమునందునుగూడ సామర్థ్యముగలవారు.

## శ్రీయుత అద్దంకి శ్రీరామమూర్తిగారు

వీరిప్పుడు ఏలూరు నాటకసమాజమున ప్రధాననాయకపాత్రలను ధరించుచున్నారు. వీరికి మంచిగాత్రమాధుర్యముగలదు. సంగీతమునందు చాలప్రజ్ఞగలదు. భావప్రకటనమునందు గూడ కొంతవరకు నైపుణ్యము గలదు.

## శ్రీయుత పర్వతరెడ్డి రామచంద్రారెడ్డిగారు:

వీరు ఆజానుబాహులు, దీర్ఘకాయులు. గంభీరవాగ్ధాటికలవారు. బాగుగా సంగీతమును పాడగలరు. స్వతంత్రముగ నొక నాటకసంఘమును నెల్లూరునద్దమున్న అల్లూరులో నేర్పరచిరి. ప్రధాననాయకపాత్రల నన్నిటిని వీరె ధరించుచుందురు. గొప్పభూస్వాములు. వీరు ధరించెడు పాత్రలలో కబీరుపాత్రమును వీరతిశ్లాఘనీయముగ ప్రదర్శించెదరు. ఇటీవల చెన్నపురి ఆంధ్రసభాధిపత్యమునను ప్రదర్శితమైన రామదాసునాటకప్రదర్శనమునందు రామచంద్రారెడ్డిగారి కబీరుపాత్రప్రదర్శనము ప్రేక్షకుల మెప్పును బడసినది.

## శ్రీయుత ఉప్పులూరి సంజీవరావుగారు:

వీరు ఏలూరు, మైలవరం, అల్లూరు నాటకసమాజములలో ప్రధాననాయికపాత్రలను ధరించుచుందురు. వీరు పద్యమును వచనమును నుడువునపుడు అపురూపమగు మాధుర్యము గోచరించుచుండును. రంగస్థలము వీరికి స్వేచ్ఛావిహారభూమి. రసప్రకటనమునందు వీరిప్రజ్ఞ అసమానము. సహజస్త్రీలక్షణములు వీరియందు పూర్తిగా నొప్పును. స్త్రీపాత్రలనుధరించు వారందరును వీరి ననుకరించుటకే ప్రయత్నించుచుందురు. వీరి కిప్పుడు ముఖమునందలి సోయగము తగ్గుచున్నదనియు, వీరు తక్కువ తాగుడు సభ్యుల సమ్మోహితులచేసి మెప్పుపడయుదురేకాని సహజమగు ప్రజ్ఞ వీరియందు లేదనియు కొందరు వీరి నాక్షేపించుచు పత్రికలలో వ్రాసియున్నారుగాని అట్టివారి అభిప్రాయములు నిరాధారములు. స్త్రీపాత్రను ప్రదర్శించుటలో వీరసమానులనుట కెట్టి సంశయమును లేదు. వీరి గానము కిన్నరగానముగ నుండును. ఆంధ్రదేశమునందు సావిత్రినాటకప్రదర్శనము సంజీవరావుగారివలననే ప్రసిద్ధిని బడసినది. సంజీవరావుగారికి విజయనగరము పండితులు రంగరత్న యను బిరుదము నొసంగి సత్కరించిరి. ఇటీవల ఆంధ్రసభాధిపత్యమునను ప్రదర్శింపబడిన చిత్రనళీయమునందు వీరు దమయంతిపాత్రను హృద్యముగను ప్రదర్శించిరి.

## శ్రీయుత పారేపల్లి సుబ్బారావుగారు

వీరు మైలవరం నాటకసమాజమున రాధ, కైక, దమయంతి మున్నగు ప్రధాననాయికపాత్రలను ధరించెదరు. బాగుగా పాడగలరు. ఉచ్చారణ స్పష్టముగ నుండును. అభినయ నైపుణ్యముగూడ గలదు. శరీరము స్థూలోన్నతముగాన వీరు నాయికపాత్రలకుగాక నాయకపాత్రలకే అర్హులని కొందరిమతము. వీరి రాధాపాత్రధారణము మెప్పుగబడసినది. వీరు 'నటరత్న' బిరుదాంకితులు.

## శ్రీయుత కడియాల రత్తయ్యగారు

వీరు ఏలూరు నాటక సమాజమున ప్రధాననాయికపాత్రలను ధరించుచుందురు. పొడుగునుగాక పొట్టియునుగాక లావునుగాక సన్నమునుగాక స్త్రీపాత్రకు తగిన శరీరసౌష్ఠవము వీరికికలదు. శాంతివినయసౌశీల్యాదులను ప్రకటించుటలో వీరసమానులు. సంగీతజ్ఞానమును అభినయ నైపుణ్యమునుగూడగలదు. వీరి స్త్రీవేషము ముద్దులమూటగట్టుచు చాల నాకర్షకముగానుండును. సుబ్బారావు, సంజీవరావు, రత్తయ్యగార్లలో తారతమ్యము లెంచబూనుట కేవలము అసమంజసముగాన వీరు ముగ్గురును నాయికాపాత్రధారులలో చాల ప్రశంసనీయులని చెప్పదగును. — (నాటకకళాభిమాని)

# విమర్శనలు

## భక్తియోగము : (వచనము)

శ్రీవివేకానందస్వామిగారి భక్తియోగోపన్యాసములకుఁ దెలుఁగుసేఁత.

### గ్రంథకర్త

### శ్రీయుత కూచి నరసింహముగారు, బి. ఏ.

భక్తియనఁగా నేమి? శంకర రామానుజాచార్యులు దాని నెట్లు నిర్వచించిరి? దానిసాధించుమార్గము లెవ్వి? సాధింపబడిన భక్తియెట్లు పరిపక్వమై మోక్షహేతువు గాఁగలదు? ఈవిషయములును, మఱియు, మానవులు జాతిమతభేదములకు లోనయి భగవంతుని నామరూపభేదములు గలవానినిగాఁ దలఁచి యుపాసించినను గమ్యస్థాన మందఱకు నొక్కటే యనియు, ఆస్థానమే సర్వభూతాంతర్వర్తియగు పరమాత్మ (భగవంతుఁడు) యనియుఁ, బ్రతిమానవుఁడు స్వజాతిమతావిరోధముగ నాయాదిదేవు నారాధించి తరించుటకు వలసిన ప్రథమసాధనము భక్తియే యనియు అట్టి భక్తిని బడయుటకు గురూపదేశము, ఆరాధనము, నియతాహారము, ద్వేషరాహిత్యము మొదలయిన యత్యంతావశ్యకములనియు, నిట్టి విషయము లెన్నియో, వలసినన్ని ప్రమాణములు, దృష్టాంతములతోఁ జక్కఁగాఁ జర్చింపఁబడినవి. శ్రీస్వామిగా రమెరికాదేశమునఁ బ్రసంగించిన యుపన్యాసములలో నుత్తమము లీభక్తియోగమును గూర్చినవియేయని ప్రసిద్ధిగాంచినవి. ఆంగ్లభాషాపరిచయములేనివారికి ధారావాహినిగాఁ బ్రవహించు వీరిసరళశైలి యందలి మాధుర్యము దెలియరాదు. వీరు ప్రసంగించుచుండ శ్రోతలు తన్మయులై శిలారూపములవలె నిశ్చేష్టులై యుందురు.

ఈ యాంధ్రీకరణము మూలమున కేమాత్రమును వెనుదీసినది కాదు. ఇందలి రచనము ప్రసన్నమధురమై లలితపదబంధురమై భావగర్భితమై యమృతము జాలువార్చుచుండును. ఎట్టి నీరసవిషయ మయినను జక్కని శైలిచే మిగులరసవంతమై మెచ్చుటలు గూర్చుచుండును. ఆధునికాంధ్ర వచనరచయితలలో మేటి యనఁదగు నీగ్రంథకర్తగా రరఁటిపం డొలిచి చేతఁ బెట్టినట్లు చదువరులకు సుబోధ్యముగా దీనిని రచియించి వారి కృతజ్ఞతకుఁ బాత్రులయిరి. ఎట్టిమూఢున కయిన నీగ్రంథమును జదివినమాత్రమున భగవంతుని యెడ సంపూర్ణభక్తివిశ్వాసములు గుదురు ననుటయం దించుకైన నతిశయోక్తి లేదు. ఇట్లే వీరు ముగ్ధమధురమగు శైలి నింకను పెక్కుగ్రంథములు రచించి యాంధ్రులకును, నాంధ్రభాషకును మహోపకారమును గావింతురు గాక!

దీని వెల రు 0-10-0

గ్రంథము వలయువారు "కూచి నరసింహము గారు, బి. ఏ. పిఠాపురము" అని వ్రాసికొనవలెను.

* * *

## ఉన్మాదసహస్రము

## అను వెఱ్ఱికి వేయివిధములు : (పద్యములు)

### గ్రంథకర్త :— శ్రీయుత క్రొత్తపల్లి సూర్యారావుగారు, మేనేజరు, ఆంధ్రసాహిత్యపరిషత్తు, పుదుపేట, మదరాసు.

ఈగ్రంథమున లౌకికములు సాంఘికములు నగు కొన్ని వెఱ్ఱి యాచారములను వెఱ్ఱులుగాఁ బరిగణించి వానితో వైద్యశాస్త్రమున నిరూపింపఁబడిన వెఱ్ఱులను జేర్చి, యొక్కొక్క వెఱ్ఱి నొక్కొక్క పద్యమున, వేయింటిని వివరించిరి. ఒక్కొక్కదాని వరుసలెక్క నావెఱ్ఱిని వివరించుపద్యము మొదటఁ జేర్చిరి. ఇది యొకవిచిత్రవిమర్శనగ్రంథ మనఁదగును. విమర్శనాసక్తి యనువెఱ్ఱియే గ్రంథకర్తగారి నీగ్రంథమును రచింపఁ బురికొల్పినట్లు తోఁచుచున్నది. కాని యిది కేవలము గ్రంథమున నుడివిన వెఱ్ఱులలో నొకటిగా నెన్నఁదగినది కాదు. ఈవెఱ్ఱి పుస్తకమును జదివినఁ దలతిరుగునేమో యని యాంధ్రసోదరులు దీనిని నిరసింపరాదు. తప్పక చదువఁదగినది.

ఇది లోకమునఁ గల దురాచారములను, దుస్తంత్రములను, గపటములను దెలుపును. చక్కని నీతులను బోధించును. మంచిలోకజ్ఞానమును గలిగించును. చదువఁ బ్రారంభించిన పిదపఁ దుదదనుకఁ జదువఁ గుతూహలము పుట్టించును.

గ్రంథకర్తగారిదివఱకుఁ బెక్కు (చిన్నవి-పెద్దవి) గ్రంథములు రచించి భాషాసేవ గావించినవారగుట యాంధ్రలోకమునకు విదితమే. వీ రితరగ్రంథములవలె దీనిని నిర్దుష్టముగనే సంతరించిరి. కాని సంఖ్యతోఁ బద్యము మొదలుపెట్టవలెనన్న నియమము పాటించిన కారణమునఁ గొన్నిచోటులఁ బద్యముల నడక కుంటువడినది. చూడుఁడు:

గీ. నూటయేఁబదిరెండగును ధరనొక్క
పత్ని కలిగియుఁ దినక ప్రేవేట్టిరొట్టె
నేతిగిన్నెకుఁ జూపుమ నీరసిల్లు
లోభివాగలసా ముక్కలు గొనిపోవ.

గీ. నూటయేఁబదిలొమ్మి దన్మిత్ర సఖు యిట్టి
పత్నిని పనది కూడును బెఱలదైనఁ...

క. మున్నూటనలువదెనిమిది
మున్నీతఁడు నాజనకు ప్రభుత్వమునం ద
వున్న న్నెత్తుకొనెడువాఁ
డిన్నాఁటికిఁ బెద్దయయ్యె నే యన నిలుచున్.

ఆదియందుఁగాక పద్యములయం దక్కడనేని సంఖ్యల నిమిడ్చియుండిన నిట్లు కాకుండెడి దేమో!

కొన్నియెడల విరళప్రయోగములగల మాటలుగాల పదములునుగలవు. చూడుఁడు:

క. ముప్పదిరెండవ పత్నిని
దప్పకొన నాన్గమొుండు పలు సద్యాతిన్...

క. డెబ్బదియాఱవ పత్నియు
దబ్బాటుననచ్చు నాముదపు జిట్టులు నా
ముచ్చట జొన్నయిలకలం
గబ్బినచెయి కడిగికొనక గీటునఁబుచ్చున్.

శా. ఇన్నాళ్ళెన్నదిమూఁడగు న్సతికిఁ బ్రాఘ్యేయక్రియన్
వృద్ధయై, మగాన్నాళ్ళటుడికించినట్లు స్నుష బా
ముల్వెట్టి పోనత్తదాఁ, జిన్నసే విధవాత్వమంది
సహాజం జేరి న్సదాకాలమును, బన్నంబు ల్వాటిపన్న
నాంచ యువతీన్వప్రాభవం బొప్పఁగన్;

ఈసహస్రము పదిశతకములుగ విభాగింపఁబడినది. గ్రంథకర్తగారు గ్రంథాంతమునఁ గూర్చిన,

"చ. నవలలు వ్రాయువారలకు
నాటకము లదియించువారికి
న్వివిధవిశేషము ల్దెలియ
విశ్వనిఘంటుగ నుండునంచు నే
వివరముగా వచించితిని
పెల్లుల క్రిందను... .. ....."

అను పద్యమునందలి యభిప్రాయము సత్యేతరము కానఁదగును.— వెల రు 1-0-0

* * *

జనరంజని:—(సంపుటము ౧-సంచిక ౧) సంపాదకుడు-శ్రీయుత ఆర్. వెంకటరంగరావుగారు; తపాలు పెట్టె నెం146. మదరాసు. చందా. సం.౧ కి రు3-0-0

ఇది క్రొత్తగా వెలువడినయొక సచిత్రాంధ్ర మాసపత్రిక. దీని తొలిసంచిక మా కార్యాలయము నలంకరించినది. రాయల్ 8 పేజీల సైజున 64 పుటలుగల్గి ముచ్చటలు మూటగట్టుచున్నది. ఇందు రసవంతములు భావగర్భితములు, నీతిబోధకములు, హాస్యరసభరితములు సాంఘిక దురాచార నిరాసకములునగు గద్యపద్యవ్యాసములు ప్రకటింపఁబడును. ఈపత్రికయొక్క ప్రధానోద్దేశ్యమిదియే. ఇందున్న గద్యవ్యాసములలో: 'ఆర్యుల అర్థశాస్త్రకథలు-భరతసిలకథ' జైనవేదాంతగ్రంథము దేవవాచకాచార్యుల నందిసూత్రము లనబడిది. జైనవేదాంతరీతిని బుద్ధి 'ఔత్పత్తికము, వైనయికము, కర్మజనితము, పారిణామికము' అని నాల్గువిధములు. అందౌత్పత్తికమను బుద్ధిని నిరూపించునది యీ కథ. సశేషము. పై నాల్గు తెఱఁగుల బుద్ధిని నిరూపించు నిట్టికథలెనుబదిగలవు. వాని నన్నిటి నీవ్యాసరచయితగారు క్రమముగఁ బ్రాకృతిమూలమునుండి యాంధ్రీకరింతుమందురట. అన్నియు మిగులఁ జమత్కారముగ నుండును. "పితృద్రోహము" పరశుల్కరూపకము సాంఘికదురాచారమును ఖండించి చక్కని నీతిని బోధించుచున్నది. 'ప్రేమపాశము' వేశ్యాలంపటుల దుర్గతిని వర్ణించుచున్నది. 'తిరుపతియాత్ర' యందుఁదిరుపతియందుఁగల యెల్ల పుణ్యస్థలముల మహిమయు, యాత్రికులసౌకర్యార్థమైన కొన్నిసూచనలు సంగ్రహముగఁ గలవు. ఇది సచిత్రము. 'లంబోదరుని ఉపన్యాసములు' "సాక్షి" కనుకరణముగాఁ దోఁచుచున్నది. కాని ఎంతవఱకు నిర్వహింపఁబడునో ముందుముందు దగయనగును. శైలి మిగులఁ జేలవముగనున్నది. ఇతర గద్యవ్యాసములు కథలు గొన్ని

గలవు. కొన్ని యంతరసవంతములుగాఁ దోఁచవు. పద్యవ్యాసములలో "నిరీక్షణము" రసవంతముగానున్నది. "సురలు - నరులు" భావపరిపూరితమై యున్నది. 'చతుర్మణికటకము,' 'ఒంటరికావు కన్నె' 'ఇంగ్లాండు' మొదలగు నాంధ్రీకరణములును గలవు. గేయములును గలవు. ఇందలి గద్యవ్యాసములు వాడుకభాష నున్నవి. ఇందు 'నిరీక్షణ' మనుచిత్రము సుందరముగా నున్నది. 'వేణుగోపాలుఁడు' మొదలగు నితర చిత్రములును గలవు.

తెలుఁగునాట నిప్పుడిప్పుడు వెలువడుచున్న పెక్కు మాసపత్రిక లాంధ్రులయొక్కయు, నాంధ్ర భాషయొక్కయు భావ్యభ్యుదయమును సూచించుచున్నవి వ్యయప్రయాసముల కోర్చి భాషాసేవఁ గావింప నడుముకట్టిన శ్రీ. వెంకటరంగారావు గారి కాంధ్రపండిత మహాశయులందఱు నమూల్యవ్యాసముల నొసఁగియు, బత్రికనుబఠించియు యథాశక్తిని జేయూఁత నొసఁగి తమకృతజ్ఞతను వెల్లడిచేయుదురని యూహించుచున్నాము. ఈ 'జనరంజని' సకలాంధ్రజనరంజనియై క్రమముగ నభివృద్ధినొంద నుంగళాశాసకుఁడగు పరమేశ్వరుఁ డనుగ్రహించును గాక !

* * *

సాహితి. [మాసపత్రిక] : సంపుటము ౫-సంచిక ౧. సం॥ నందా. రు ౩. సంపాదకుడు. శ్రీ. కో. సూరయ్యగారు, శారదాభాండారము, బెజవాడ.

పైమాసపత్రికయొక్క సంచికను మేము కృతజ్ఞతతో స్వీకరించినాము. స్వాభిప్రాయానురూపమై యిది విలసిల్లియున్నది. కథలలో 'నాగాలిబుట్ట' యందు రచయితగారు సవ్వినట్లు పాఠకులు నవ్వుదురనితోఁచదు. 'వృద్ధావివాహ'లో వెంకట్రావుగారికిఁ గాంతమ్మ చక్కని నీతిపాఠమును నేర్పినది. రవీంద్రనాథ టాగూరుగారి 'అమాదేవి' కనువాదము గలదు. అమాదేవి భర్తృగౌరవము శ్లాఘ్యము. 'క్రొత్తయెత్తు'న హేమసుందరముగా కత్తినది చక్కని క్రొత్తయేత్తే. ఇంకను గొన్నికథలు గలవు. 'వేణుగానము' 'ప్రకృతి గీతములు' 'సముద్రగానము' మొదలగు పద్యవ్యాసములు గలవు, 'నూర్జహాన్' నాటకమునందలి భాగముగలదు. ఇందుఁ గొన్నివిచిత్ర శబ్దరూపములు గాన్పించుచున్నవి. 'ఒంటెన' 'ఒదిలివేయుఁడు' మొదలగునవి. ఈనాటకము గ్రాంథికభాషయందు రచియింపఁబడినదే యనఁదగును. కాని, నియమములు పూర్తిగాఁ బాటించినట్లు కాన్పింపదు ఇది ముద్రాపకుల లోపమేమో? గ్రంథకర్తగారించుక శ్రద్ధ వహించియుండిన బాగుండెడిది.

* * *

శారద:—(1924 సం॥ జూలై సంచిక)

సంపాదకుఁడు; శ్రీ కవుతా శ్రీరామశాస్త్రిగారు, మచిలీపట్టణము.

ఈసంచిక మా కార్యాలయము నలంకరించినది. ఇందలి గద్యవ్యాసములలో 'నన్నెచోడ కవిరాజ శిఖామణి' యందు నన్నెచోడని కాలనిర్ణయమున నిదివఱకు వెలువడియున్న ప్రమాణసిద్ధాంతములను జర్చించి, యాకవిని నన్నయభట్టుకంటెఁ మిగులఁబ్రాచీనుఁగా వ్యాసరచయితగా రూహించుచున్నారు. 'శ్రీమద్రామాయణ మందలి వానరులు' అను వ్యాసమిప్పటి వానరులు హీన నాగరికతగల యొకజాతిమానవులని సప్రమాణముగాఁ జాటుచున్నది. వారి వేషభాషా వ్యవహారాదులను గూడఁ దెలుపుచున్నది! 'ప్రేమ' నిక్కమయిన ప్రేమ స్వరూపమును నిరూపించుచున్నది. 'ఏమీ లేదు' లో రాముఁడు ధీమంతుఁడై మ యజమానునకుఁ దుదకేమియును లేకుండఁ జేసెరి. 'సుందరమ్మ' యనుకథయందుఁ బునర్వివాహావశ్యకతయును కులదుండగములమూలమున నేర్పడుచున్నది. సుందరమ్మ పడినకష్టములు జాలిగొల్పుచున్నవి. మఱియు 'విజయలక్ష్మి,' 'తోకచుక్కలు,' 'ఆస్ట్రేలియా' మొదలయినవియు, 'హిమబిందు' వను నవలలోని ఏకదేశమునుగలవు. పద్య వ్యాసములలోఁ 'బ్రేమసంగీతము' 'తరులతా వర్ణనము' మొదలయినవి రసవంతములుగానున్నవి. 'సత్యము' సత్యప్రాశస్త్యమును జాటుచున్నది. 'ఏకత్వము' భావగర్భితమైన గ్రామ్యభాషాగేయము. "పురుష—ప్రకృతి" యను రమణీయవర్ణ చిత్రమొక్కటి యిందుఁగలదు— ఇట్టిచిత్రములకు వివరణ ముండఁదగును. ఇతరచిత్రములు ననేకములుగలవు. 'శారద' క్రమముగ నభివృద్ధినిగాంచి శారద కలంకార మగుచున్నది. కాని ముద్రణాదికముల పట్ల సంపాదకు లించుక శ్రద్ధవహింపవలసియున్నారు.

శారద తరువాతి సంచికయు వెలువడి మా కార్యాలయము నలంకరించినది. ఇందు సరసములగు గద్య పద్య వ్యాసములు గలవు — 'సంగీతవికాస' మను త్రివర్ణచిత్రమును, ఇతర చిత్రములును గలవు.

౧/౧

# సాభిప్రాయ విశేషములు

ప్రపంచపరిస్థితుల నిదమిత్థమని సంభావించుట వర్తమానసంధిసమయమునందు దుర్లభముగ నున్నది. సకలరాజ్యములందును రాజ్యాంగవాతావరణము స్తిమితముగనున్నది. చీనాయందు దంతఃకలహములు ఘోరమైన సంగ్రామరూపమును దాల్చుచున్నవి. ఆఫ్రికాయందు జాతిద్వేషము వర్ధిలుచున్నది. తెల్లజాతులు నల్లజాతులకు స్వస్థలవాసులకు సముచితము శుభస్థితి కాధారములేకపడజేయ సమకట్టుచున్నవి. ఉష్ణప్రదేశములు తెల్లజాతులకు నివాసయోగ్యములుగాకపోయినను భూమితృష్ణమాత్రము మితిమేరలు లేకను వారిని బాధించుచున్నది. జీవనసంరంభమునందు శ్వేతజాతుల పస మారణసాధనములందు ప్రద్యోతమగుచున్నదిగాని ధర్మసాధనరక్షణములందు ప్రత్యక్షమగుటలేదు. నల్లజాతులభారవహనము ప్రతిబంధకములందును నిర్బంధనములందును గోచరంబగుచున్నదిగాని వికాసమునందును విమోచనమునందును త్యాగమునందును గోచరంబగుటలేదు. ఆఫ్రికాఖండ మంతయును తెల్లరాజ్యములకు పాదాక్రాంత మైనది. సంగ్రామఫల మీదాస్యబంధమును బలపరచినను నల్లజాతులయందు ప్రబోధము దయించుచున్న విధము నాఫ్రికాదేశచరిత్రము విశదముచేయుచున్నది. ఈజిప్టు స్వాతంత్ర్యమార్గము నధిష్ఠించుచున్నది. శ్వేతజాత్యభిమానులు విఘ్నపరంపరలను స్వాతంత్ర్యయాత్రకు గల్పించుచున్నారు. సుదాను బ్రిటీషు ప్రభుత్వముతో ప్రతిఘటనమునకు బూనుకొనుచున్నది. ఆఫ్రికాజాతులణాగద్రొక్కబడుచున్నను సహజసత్వము వికసించుచు ప్రబోధమును బొందుచున్నవి. కొన్ని లక్షలుగల తెల్లవారు కోట్లకొలదినల్లజాతులను దాసానుదాసులనుజేసి వారి దేశములందు నిలువ నీడలేకుండ జేసి పీడించుట దుర్విపాకమునకు గారణభూతముగదా? పాశ్చాత్యజాతులకు మహాసంగ్రామమునం దగ్నిసంస్కారము గలిగినను జ్ఞానోదయము గలుగలేదు. మహాసంగ్రామము బ్రిటీషుసామ్రాజ్యమును సకలవిధములను ప్రబలముచేసినది. సామ్రాజ్యాభిమానులకు పరపీడనమున కవకాశములు పెరిగినవి. సామ్రాజ్యవ్యాపనము బలయోగము దురభిమానమును ప్రజ్వలింపజేసినవి. కర్జనులు డయరులు ఓడ్వాయరులు మెకార్డ్లులు నిర్భయముగను నిర్బంధములను విధించుచున్నారు. టైమ్సు మొదలగు వార్తాపత్రికలు నిప్పులను గ్రక్కుచున్నవి. కార్మికప్రభుత్వము కర్తవ్యమును నిర్ణయింపలేకను వెనుకముందాడుచున్నది. కార్మికపక్షము వెనుకను జేసిన ప్రతిజ్ఞలు బ్రిటిషుసామ్రా

జ్యాంతర్భాగములపట్లను మృతాంకురప్రాయములుగనున్నవి. కార్మికప్రభుత్వస్థితి దుర్భరముగనున్నవిధమును సామ్రాజ్య వ్యవహారములు విశదముచేయుచున్నవి.

*  *  *

## బ్రిటీషు ప్రభుత్వము

కార్మిక ప్రభుత్వము సామ్రాజ్యాంతర్భాగముల వ్యవహారములపట్లను సంశయభావమును ప్రకటించుచున్నను యూరపు రాజకీయపరిస్థితులపట్లను జూపుచున్న పరిజ్ఞానము ప్రశంసనీయముగనున్నది. వర్సేలుసంధితరువాతను ప్రపంచమునందు శాంతిస్థాపనమునకు జరిగిన ప్రయత్నములలో కార్మికమంత్రి రామ్సెమాక్డొనాల్డుగారుచేసిన ప్రయత్నములు ప్రశంసనీయములుగనున్నవి. పాయిన్కారెగారి చిత్తవృత్తినిమార్చుట దుస్తరముగనుండినను హెర్రియటుగారి చిత్తవృత్తిని మాక్డొనాల్డుగారుమార్చగలిగెను. లండను సంధిసభ యథార్థస్వభావమును వహించినది. రాజకీయస్వభావము గలిగియున్నను సహజమైన యార్థికస్వరూపమును నీసభయందు నష్టపూరణసమస్య దాల్చినది. ఇదివరలో డావెసుగారు నిర్ణయించినవిధమునను నష్టపూరణసమస్యను నాచరణయందు బెట్టుటకు పరాసులును వారి మిత్రులును సంగీకరించిరి. పరాసులు ఆక్రమించిన ప్రదేశమును క్రమముగను ఒకసంవత్సరములో ఖాళీచేయుట కంగీకరించిరి. జర్మనులు పరాసులు చేసిన యేర్పాటుల నామోదించిరి. యూరపుఖండమునందు శాంతిబీజములు నాటబడినవి. ఈ మహాప్రయత్నమునందు కార్మిక ప్రభుత్వము ముఖ్యముగను రామ్సె మాక్డొనాల్డు చూపిన రాజ్యాంగపరిజ్ఞానము ప్రశంసనీయముగనున్నది. కన్సర్వేటివు పక్షమునకు కార్మిక పక్ష చర్యలు భయభ్రాంతులను గలుగజేయుచున్నవి. అయిర్లాండు సరిహద్దు సమస్య విషయమునందు కన్సర్వేటివులు ప్రతిఘటించుటకు దలపడుచున్నారు. భారత రాజ్యాంగ విషయమై కన్సర్వేటివులు చేయుచున్న కోలాహలము బీభత్సముగ నున్నది. కార్మిక పక్షము యూరపురాజ్యాంగముల విషయమై యెంత యౌదార్యమును చూపినను భారత రాజ్యాంగములవిషయమై నిరసనభావమును జూపిన విధమును గతించిన యారుమాసముల చరిత్రము విశదము చేయుచున్నది.

ఆలివియరు ప్రభువు సంకల్పమునం దేమి గలిగియున్నను క్రియయందుమాత్రము పీలు వింటరుటను ప్రభువర్గమువారి యామోదమును బడయుచున్నాడు. మంత్రిచర్య యంతయును గోప్యముగనున్నది. ఫలమును నిట్టిదే కలుగుట సహజము. ఆలివియరు ప్రభువునకును నాయకులకును సంప్రతింపులు జరిగినవి. శ్రీమతి బెజంటమ్మ శ్రీనివాసశాస్త్రి రంగాచార్యులుగారలు ప్రభృతులు స్వదేశమును జేరినారు. వారి యాసలందు పసయున్నట్టులు గనుపించదు. బెజంటమ్మగారు కార్మిక పక్షమున కధికారమున్నను బలములేకుండుటచే నిస్సహాయస్థితియందున్నదని వ్యక్తము చేసినది. గంపెడాశతో బోయిన శ్రీనివాస శాస్త్రిగారు నిరాశనుజెంది యేతెంచిరి. వలస దేశముల సమస్యను విచారించుటకు బోయిన

వారును నిరాశను జెంది యేతెంచినటులు రంగాచార్యులుగారి ప్రసంగములు విశదము చేయుచున్నవి. ఏవిధమునను జూచినను భారతసమస్యలకు బ్రిటిషు రాజకీయజీవనమునందు స్థానము లేదని విశదమైనది. బ్రిటీషుద్వీపములందు రాజ్యాధికారము నేపక్షమువారు వహించుచున్నను భారత భూమికి సమానఫలమే గలుగుచుండును. బ్రిటీషు రాజ్యాధికారమును శిథిలము చేయుట కేపక్షమువారును సంగీకరింపరు. భారతీయులు రెండు మూడు పురుషాంతరములైనను బ్రిటీషు అధికారులకు శిష్యత్వమును జేయవలయునని కన్సర్వేటివు పక్షాధికారులు పలికెడి ఈ చిలుకపలుకులనే కార్మిక పక్షాధికారులును బలుకుచున్నారు. భారతీయులు పార్లమెంటును బ్రిటీషు ప్రజలను నమ్మునంతవరకును భారత భూమికి తరణోపాయముదుర్లభమని అన్నిపక్షములవారికిని విశదమైనది. సత్వరస్వరాజ్యస్థాపనము దేశక్షేమమున కవసరమని యన్నిపక్షములవారును సంగీకరించుచున్నారు. కార్యవిధానముమాత్ర మేపక్షమువారికిని పరిస్ఫుటము గాకున్నది.

* * *

### మోంటుఫర్డుసంస్కరణముల విమర్శనము

మోంటుఫర్డు సంస్కరణముల విమర్శనము వాని నిరుపయోగతను విశదముచేసినది. అన్నిపక్షములవారును ద్వంద్వప్రభుత్వము నేకగ్రీవముగను నిరసించిరి. చింతామణిగారు మొదలగువారి ద్వంద్వప్రభుత్వఖండన మసందిగ్ధముగ నున్నది. చెన్నరాష్ట్ర శాసన సభాదిసభలును – ద్వంద్వప్రభుత్వమును నిరసించుచు - రాష్ట్రీయ స్వాతంత్ర్యమును నేకగ్రీవముగను ప్రతిపాదించినవి. వంగరాష్ట్ర శాసనసభ మంత్రుల వేతనమును నిరాకరించి ద్వంద్వప్రభుత్వమును నిర్మూలము చేసినది. లిట్టనుప్రభువు మంత్రుల రాజీనామా నంగీకరించి ప్రజాయత్తశాఖలనుస్వాయత్తము చేసికొని సంస్కరణముల మాయాస్వరూపమును విశదముచేసెను. స్వరాజ్యసిద్ధికి బ్రిటీషు ద్వీపములందు కన్వెన్షనుపక్షమువారు చేసిన ప్రయత్నములు నిష్ఫలములైనవి. స్వదేశమునందు సహకారపక్షమువారు చేసిన ప్రయత్నములు నిరర్థకములైనవి. స్వరాజ్యపక్షమువారు చేసిన ప్రతిష్ఠంభన ప్రయత్నములు నిరుపయోగములైనవి. కాంగ్రెసుపక్షమునందు గలిగిన యంతర్భేదములు ప్రజాహృదయమునందును ప్రచారకుల కార్యదీక్షయందును నిశ్చేష్టతను గలుగజేసినవి. కాంగ్రెసు సంఘము లంతఃకలహములకును నిందలకును స్వాభిమానమునకును నిలయములై స్వరాజ్యదీక్షకు నిరుపయోగములుగ నున్నవి. ఈవిభేదములు ప్రతికక్షుల కానందమును బలమును గలుగజేయుచు దేశారాధకజీవనమును నిరర్థకము చేయుచున్నవి. స్వరాజ్యసంపాదనమున కన్నిపక్షముల సంయోగ మవసరమైనను పత్రికలయందును సభలయందును వ్యవహారకాండయందును భేదాభిప్రాయములె ప్రబలుచు కలవరమునకు గారణంబగుచున్నవి. స్వాయముగను చేసినను చేయకపోయినను నితరుల నాక్షేపించుట సులభము. దేశమంతయును

దైన్యస్థితియందున్న సమయమునం దీవ్యవహారక్రమము సులభతమమైనను దేశప్రయోజనములకుమాత్రము నిరుపయోగముగ నున్నది. దేశారాధకులం దారంభమునం దుదయించిన సేవాదీక్ష త్యాగశీలము ఇపుడు క్షీణించి అధికారాభిమానము స్వాభిమానము ప్రబలినవి. ఇపు డన్ని పక్షములవారును సంరంభమునకు వారి వారి బలముల నాయత్తము చేయుచున్నను నాయకులయందును అనుచరులయందును కొంతజ్ఞానోదయము గలుగుచున్నదని నమ్ముటకుసూచనలు గనుపించుచున్నవి.

గాంధిమహాత్ముడు దేశమునందంతటను శాంతిసందేశమును ప్రతిధ్వనింప జేయుచున్నాడు. ఇటీవల బొంబయియందు జేసిన ప్రసంగములందంతః కలహములను గర్హించుచు సంయోగము నభ్యర్థించుచున్నాడు. మహాత్ముడు స్వీయనాయకత్వమును విసర్జించి దాసానుదాసుడుగను పాటుపడుటకు సమ్మతించుచున్నాడు. దేశమునందు ప్రబలిన విభేదముల వలనను కాంగ్రెసు సభాధిపత్యమును సయితము స్వీకరించుటకు సంశయించుచున్నాడు. దేశమునందు ప్రబలిన భేదాభిప్రాయములను విసర్జించి అన్నిపక్షములవారును గాంధిమహాత్ముని నాయకత్వముక్రిందనుగాని ఇతరుల నాయకత్వముక్రిందనుగాని కలిసి స్వరాజ్యప్రాప్తికి పనిచేయుట శ్రేయస్కరముగదా! శ్రీమతి బెజంటమ్మగారు సయితము పునరాగమనానంతరము సంయోగాచరణమును బోధించుచున్నది. బొంబయి కార్పొరేషను మహాత్మునకు సన్మానపత్రమును సమర్పించిన సందర్భమునందు బెజంటమ్మగారు సయితము హాజరయి సంయోగాభిలాషను విశదముచేసినది. గతవారమునందు గోకలె మందిరమునందు గూడిన మహాసభయందును బెజంటమ్మగారీ భావము నసందిగ్ధముగను విస్పష్టముచేసిరి. స్వరాజ్యపక్షమువారును మహాత్ముని నాయకత్వము నంగీకరించియును ప్రత్యేకమైన కార్యప్రణాళికను నిర్ణయించుచున్నారు. స్వరాజ్యపక్షమువారికి రాటఫు సందేశమునందు గాంధిమహాత్మునకుగల గాఢమైన విశ్వాసములేదని వారి ప్రసంగములు విశదముచేసినవి. చింతామణి కెల్కారుగారి ఖద్దరు నిరసన ప్రతిజ్ఞ సామాన్యులకు సయితము విచిత్రముగను దోచుట సహజము. ఖద్దరునందు విశ్వాసము లేకపోయినను ప్రతిషేధ ప్రతిజ్ఞను జేయవలసిన యవసరము గనుపింపదు. ఇట్టి ప్రతిఘటన సామర్థ్యమే కదా నాయక లక్షణముగ పొగడ్తను బడయుచున్నది! సామాన్య వ్యవహారక్రమమును నిర్లక్ష్యముచేసి భీభత్సముచేయగల మహానుభావులేకదా మహానాయక పదమునకర్హులు. గాంధిమహాత్మునివిషాదమునకుమూలమైన విభేదముల నాంధ్రప్రపంచము విసర్జించి పరస్పరదూషణలనుత్యజించి మహాత్ముడు కోరునటులు కలిసి పనిచేయుట కాంధ్రప్రపంచము పాటుపడి స్వరాజ్యసంపాదనమునందు స్వధర్మనిర్వహణమును జేయుగాక! ఇపుడు నాయకులను ప్రచారకులను మమకారాహంకారములు సంపూర్ణముగ నావహించినవి. ఎవరికి వారె పెద్దలుగనుండుట యుగధర్మము. దేశబంధు చిత్తరంజనుదాసుగారీ రెండేండ్లయం

దును నిరోజకవర్గమునకు ప్రబోధమును గలుగ జేయవలయునని తెలుపుచున్నారు. నిరోజకవర్గమునందు గలిగిన ప్రబోధమునకును దానిఫలమునకును గతించిన మూడేండ్ల యనుభవమును నిదర్శనము గ నున్నది. ఉద్రేకము క్రమశిక్షణములేక కార్యసిద్ధికి దోడ్పడజాలదు. సకలజనులకును గల యీ అనుభవమునే గాంధిమహాత్ముడు తిరిగి ప్రతిపాదించుచున్నాడు. ఈ ప్రతిపాదనము నయి తము పరిహాసములకు పాత్రమగుచున్నపుడు భావి కర్తవ్యము నెవరు నిర్ణయింపగలరు. గాంధిమహాత్ముడు దూరదృష్టిని గలిగి దేశ దృష్టిని నిర్మాణకార్య విధానమునందు లగ్నము చేయగోరుచున్నాడు. మహాత్ముని యుపదేశములు నిరాదరణమును బడయుచు మహాత్మునకు సంక్షోభమును గలుగ జేయుచున్నవి. ఎవరు నిందించినను దూషించినను గాంధిమహాత్ముడు మాత్రము దాసానుదాసుడై దేశసేవ కాత్మసమర్పణమును జేయుటకు సంసిద్ధుడుగ నున్నవిధమును వారియుపదేశములు తెలుపుచున్నవి. ప్రజలును మహాత్మునిమార్గము ననలంబించుచు సేవాపరాయణులై స్వధర్మనిర్వాహణమును జేయుచు మహాత్ముని నాయకత్వమును సార్థకముచేయుదురుగాత!



# ముక్తావళి

శతావధాని, వేదుల సత్యనారాయణశాస్త్రి (సాహితీసమితి)

౧

వేనవవేణుదండ మిటు! లేటికి చెక్కాద వేల చిల్లులై
పో నొగిలించె దం చడలి పోయితి, వ్యర్థపు టూర్పుగాడ్పులన్
గానముగాగ మార్చుట కెగా యని యిప్పుడు నేగ్రహించితిన్
గాని, విశీర్ణ మీ హృదయనాళ మెటుల్ పలికింతువో ప్రభూ!

నీవెడయూర్పుతావుల జనించిన కమ్మదనంబు వ్యర్థమై
పోవకమున్నె, యీ సుషిరముల్ గొనిపోయి వియోగరాగపూర్ణ
జీవనగీతముల్, విపినసీమలనైన సరే! ధ్వనింపు మీ
శ్రావణ కృష్ణపక్షపు నిశల్ పులకింపులకో విన౯, ప్రభూ!

Edited and Published by K. NAGESWARA RAO, at the Andhra Patrika Press, No. 7 Thambu Chetty Street, G. T. Madras


విషయానుక్రమణిక

# చిత్రములు

వర్ణచిత్రములు:—శ్రీకృష్ణలీల, మాలిని.

సాధారణ చిత్రములు:—శ్రీ రాజా రామమోహనరాయలు; యుగంధరుఁడు. తాన్‌రుస్తుం, విషయ-దుష్టబుద్ధి; (నాటకపాత్రలు)—ఇతర చిత్రములును.

## శ్రీకృష్ణలీల



చిత్రకారుడు:— శ్రీయుత, [illegible] లుగారు